ఓమ్

శ్రీ సద్గురు శ్శరణమ్.



# శ్రీ జయరామ విద్యావిలాసము



గ్రంథకర్త

“బాలావధూత,” “పండిత”

## శ్రీ మ్యాడిగొండ జయరామశర్మ.

ఓమ్

శ్రీసద్గురు శ్శరణమ్.

# శ్రీ జయరామవిద్యావిలాసము

(శ్రీమదోంకార భారతీనిలయ ప్రథమ భూమికాత్మకము)

సప్తఖండపరిమితప్రథమభాగము

'బాలావధూత' 'పండిత'

శ్రీ జయరామశర్మ విరచితము.





ముద్రణద్రవ్యప్రదాతలు, వరంగల్లు వాస్తవ్యులు,

'త్యాగశీల' 'దానకర్ణ' 'ధర్మాభిమాన్యా'ది బిరుదవిరాజమానులు

శ్రీ వందా కాంతయ్య శ్రేష్ఠిగారు

★

సంగ్రాహకుడు, పరిశోధకుడు,

"తర్క-వేదాంత విశారద"

ముదిగొండ వేంకటరామశాస్త్రి

1947

ప్రథమ ముద్రణము
౧౦౦౦ ప్రతులు.



అమూల్యము

గ్రంథకర్త యొక్కయుఁ బ్రకాశకుని యొక్కయుఁ బరిధానోద్దేశ సాఫల్యమునకై యామూలాగ్ర మీగ్రంథరాజమును దాము పఠించి, స్వపుత్త్రమిత్రాదులచేఁ బఠింపఁజేసి, యావజ్జీవ మవిస్మరణీయము లగునేతదుక్త ధర్మముల ననుష్ఠించి, యనుష్ఠింపఁజేయుటే

దీని మూల్యము. 2-0-0

అందుచనే యిది యమూల్యము

ప్రకాశకుని విలాసము :
ఓంకార మందిరము,
బెల్లంకొండ పోస్టు, గుంటూరు జిల్లా. (M. S. M. R.)

卐

శివాజీ ముద్రాక్షరశాల
సికింద్రాబాద్ - దక్కన్




ఓమ్

శ్రీసద్గురు శ్శరణమ్.

# ఆశీర్వాదము

శ్రీసద్గురుసేవాసమధిగతవివేకవిజ్ఞానవైరాగ్యస్వభావ
పురస్సర మగు ననన్యసామాన్యభక్తిభావముతో

బాలావధూత - పండిత శ్రీజయరామశర్మవిరచిత

శ్రీజయరామవిద్యావిలాసము గ్రంథమునకు

అయాచిత ద్రవ్యప్రదాతలు

(1) శ్రీగోకర్ణశాంకరపీఠాధీశ్వర, (2) శ్రీకాశీవిద్వత్పరిషదధీశ్వర (3) శ్రీమదహోబిలనారసింహపీఠాధీశ్వర, (4) ప్రకృతస్వప్రజానీక, (5) విద్వద్బ్రహ్మచారి, (6) భాగ్యనగరాధీశ్వరాదిప్రకాశిత - (1) త్యాగశీల, (2) దానకర్ణ, (3) ధర్మాభిమాని, (4) ఆంధ్రాభ్యుదయపరాయణ, (5) అతిథిపరిగ్రహ, (6) స్వప్రజాప్రధానకీర్తిశాల్యాద్యనితరసాధారణానేక సార్థకబిరుదవిరాజితులును వరంగల్లునగరాలంకారభూత శ్రీచందావంశ రత్నాకరరత్నాయమాన శ్రీసత్శ్రేష్ఠి జగ్గమాంబాగర్భశుక్తిముక్తారత్న భూతులును; శ్రీమదోంకారదేవ, శ్రీశంకరవిద్యానాథాత్మకనిఖిలమునిమనో మనోహరాపత్యాలంకృతయు, నిరంతరస్వాధికధార్మికస్వభావవిభూషితయు నగు శ్రీరోహిణీసతీవిశేషితార్ధాంగకాంతికాంతులు నగు

## శ్రీ చందా కాంతయ్య శ్రేష్ఠిగారికి

శ్రీసద్గుర్వనుగ్రహమున

సాత్త్విక, ధార్మిక నిఖిలలోకోపకారకానేకధనకనకవస్తువాహనపుత్రపౌత్రా
దీతోధకసకలాభ్యుదయపురస్సరనిర్విశేషాఖండాద్వితీయపరిపూర్ణ
చిదాత్మస్వరూపమగు .

నిరంతరనిరర్గళబ్రహ్మానందానుభూతి

సామ్రాజ్యసౌభాగ్యము ఘటించుఁగాత !

—ప్రకాశకుఁడు.




ఓమ్

శ్రీసద్గురు శ్శరణమ్

శ్రీజయరామో విజయ తే తరామ్.

బాలావధూత, పణ్డిత,

# శ్రీజయరామపఞ్చకమ్

*

శ్లో. నిదానం విద్యానాం విబుధవినుతానా మభినవం
నిధానం పుణ్యానా మవితథఫలానాం య దమలమ్
ప్రమాణం ధర్మాణాం నిగమగదితానాం నిరుపమం
ప్రశాంతం కాంతం త జ్జయతు జయరామామృతమహః ౧

శ్లో. క్షమాయా శ్చాచారే ర్నిఖిలహితవృత్తే రుపకృతే
రహింసాయా శ్శాంతే ర్మృదుసమగతే స్సాధువినతేః
అభీతే శ్శ్రద్ధాయా గురుజనసపర్యాక్రమవిధే
ర్య దేకం లక్ష్యం త జ్జయతు జయరామామృతమహః ౨

శ్లో. సదావాస్యే దేశే, ప్రణవసదనే చాశ్రమపదే,
పితుః పాదక్షేత్రే, సదసి సుధియాం చాపి మహతామ్
విలాసార్థం ధృత్వా వపు రనుపమం యేన విధివత్
కృతం కర్తవ్యం త జ్జయతు జయరామామృతమహః ౩

శ్లో. తప స్సాంఖ్యం యోగం యజన ముపవాసం జపవిధిం
వ్రతం వా స్వాధ్యాయం భజన మథవా ద్వైత మపరమ్
య దిచ్ఛంత స్సంత స్సతత ముపతిష్ఠంతి కవయో
వరేణ్యం గణ్యం త జ్జయతు జయరామామృతమహః ౪

శ్లో. క్షణా ద్దూరీకర్తుం చిరనిబిడ మజ్ఞానతిమిరం
స్ఫుటం సాక్షాత్కర్తుం నిధి మనుపదం చౌపనిషదమ్
పరబ్రహ్మానందం నిరతిశయ మాధాతు మపి య
త్సమర్థం శుద్ధం త జ్జయతు జయరామామృతమహః ౫

*

ఓంకారమందిరమ్
4-12-44

చతుర్వేదీ అమరేశ్వరశాస్త్రీ

శ్రీసద్గురు శ్శరణమ్.



ప్రకాశకుని

# పీఠిక

శ్లో. గురు ర్బ్రహ్మ గురు ర్విష్ణు । ర్గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షా త్పరం బ్రహ్మ । తస్మై శ్రీగురవే నమః॥

శ్లో. నారాయణసమారమ్భాం । శఙ్కరాచార్యమధ్యమామ్
అస్మదాచార్యపర్యన్తాం । వన్దే గురుపరమ్పరామ్॥

శ్లో. శ్రీమద్రామబ్రహ్మ, విశ్వ । నాథాభిధగురూ భజే
కాణాదబ్రహ్మవిజ్ఞాన । కారకౌ భవతారకౌ॥

శ్రీ జయరామశర్మ నా గ్రంథములకు ప్రకాశకుడై పీఠికల వ్రాయదగియుండ, నా కట్టిభాగ్యము లేక, నే డాతనిగ్రంథమునకు నేనే ప్రకాశకుడనై పీఠిక వ్రాయుటకు కలము బట్టవలసివచ్చిననాయభాగ్యమే యీ గ్రంథమున కుపపీఠిక యగుచున్నది.

—♦ అభాగ్యము ♦—

"శ్రీరామాపూర్వవృత్తసంగ్రహము" నను జయరామశర్మ "రాజాఽసహిష్ణురపి పుత్రవియోగఖేద । మంగీచకార కుశికాత్మజ శాపభీత్యా" యని సృష్టికి ప్రతిసృష్టి చేయునర్హుడైనమహాతపస్వి యగు విశ్వామిత్రుని వెంట యాగరక్షకై శ్రీరాముని బంపుటలోగూడ గలిగినపుత్రవియోగఖేదమే దుస్సహమయ్యెనని వ్రాసియుండెను. ఔను; అది సత్యము. సుగుణాకరు డగుజ్యేష్ఠపుత్రుని వియోగ మట్టిదిగాదా? అయిన నల్పకాలికము, మహర్షిసమాలంబనమున ననుమేయశుభాంతము నగుటచే నాటిపుత్రవియోగము నట్లో సహింపగలిగెనేగాని శ్రీరామపట్టాభిషేకసమకాలికము, నిరాలంబనము నగుచతుర్దశవార్షికవియోగవార్త వినినంతనే దశరథుడు దురదృష్టదశలోగూడ సద్యస్త

శాలి యగుటచే జిరకాలము తద్వియోగానలసంతప్యమానమానసుడు గాకయానాడే సద్యోవిదేహకైవల్యభాగ్యము నొందగలిగె. ఇక నేనో అట్టిభాగ్యశాలినిగాను దాశరథివంటిసకలసద్గుణమూర్తి యగుశ్రీజయ రామమూర్తితో జతుర్దశవార్షికమే గాదు, శాశ్వత మగువియో గము తటస్థించి"కుతశ్చాద్వలతా తస్య, యస్యాగ్నిః కోటరే తరోః?" (తొరటలో జిచ్చుపుట్టినమాను చిగుర్చుటెట్లు?)అన్నట్లు నిరంతరము తద్వియోగదావాగ్నిదందహ్యమానమానసుడ నగుచు నేటికిగూడ సజీవుడనై యుండుటేగాక, "ఆత్మా వై పుత్రనామాసి" యనున్యాయ మునకు విరుద్ధముగ తద్దివ్యదేహచరమసంస్కారములగూడ నేక్రూరహ స్తములతో గావించితినో, ఆహతహస్తములతోడనే నే డీపీఠిక వ్రాయు చుంటిని. ఇంతకంటె నభాగ్య మేముండును?

## — మహాభాగ్యము —

కాదు-కాదు-ఇది యభాగ్యము గాదు. ఇది యంతయు సత్య దూరము. ఈవచనము లన్నియు నౌపాధిక మగులౌకికదృష్టిలోనివిపరో భాగివచనములే. సత్య మగుసమ్యగ్దర్శనముననో, శ్రీసద్గురువనుగ్రహము శ్రీజయరామశర్మరూపముగ మాదంపతుల (ముదిగొండ వేంకటరామశాస్త్రి-సీతమాంబల గర్భమున (9-4-1922) నావిర్భ వించి, శ్రీమదోంకారమందిరమున నేకవింశతి వర్షములుగూడ నేక వింశతిక్షణములుగ గర్భాష్టమోపనీతిప్రభృతి యథావిధి ద్వాదశ వార్షికబ్రహ్మచర్య యథాశాస్త్రగార్హస్థ్యాది వైదికకర్మానుష్ఠాన నిష్ఠ లతో, వివిధధార్మిక విద్యావిలాసములతో, గురుజనవిధేయతాది సకలకల్యాణగుణములతో, నిఖిలధార్మికలోకాదర్శముగ ప్రకాశించి, బుద్బుదము జలమందువలె, భ్రాంతిసర్పము రజ్జువునందువలె, గ్రాహ్య గ్రాహకనిఖిలస్వప్నప్రపంచ మాత్మయందువలె నిర్విశేషాద్వితీయా ఖండచిదాత్మస్వరూప మగుశ్రీసద్గురుస్వరూపముననే (16-12-1943) పర్యవసన్నమై వెలుంగుచుండె.

ఇట్లాద్యంతశూన్యమై యఖిలాత్మకముగ గోచరించియు నిరంతరమేకాకృతి వెలుంగు శ్రీసద్గురురూపమే "యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్" "స్యాత్పరమేశ్వరస్యా పీచ్ఛావశా న్మాయామయం రూపం సాధకానుగ్రహార్థమ్". ఈవిధముగ శ్రీహరిహరావతారరూపులును, పరమగురుస్వరూపులు నగుశ్రీభగవద్భగవత్పాదులు వచించినట్లును, చరించినట్లును, లోకకల్యాణమునకే యావిర్భావతిరోభావభావములతో లోకదృష్టిని తోచుచుండును. కావున సాక్షాద్భగవదవతారస్వరూపు లగుబాదరాయణాదులకుగూడ నిట్టి పవిత్రచరిత్రు లగుబాదరాయణ్యాదివృత్తముల వ్రాయుటకంటె కర్తవ్యాంతరము గానుపించనిస్థితిలో నస్మదాదులకుమాత్ర మీ జయరామ విద్యావిలాస పీఠిక వ్రాయుటకంటె భాగ్య మేముండును? అందుచే నిది యభాగ్య మనుట సత్యదూరము; గాన, మహాభాగ్యమే యని నానిశ్చయము.

## —♦ శ్రీజయరామవిద్యావిలాసము. ♦—

ఇంతవరకు పీఠికకు పీఠిక వ్రాయుట యైనది. ఇకముందు గ్రంథములో బ్రవేశింతము.

ఈగ్రంథమునకు శ్రీజయరామవిద్యావిలాసనామ మేర్పడుటకు (1) శ్రీమదోంకారమందిరమున బ్రాహ్మణగురుకులాశ్రమోత్తమాంగస్థానీయముగ శ్రీజయరామస్మారకముగ స్థాపితమైనట్టిశ్రీమదోంకారభారతీనిలయప్రథమభూమికాత్మకముగ గ్రహింపబడుట, (౨) శ్రీ సంనిధానం లక్ష్మీనారాయణమూర్తి సంపాదకత్వములో (౭-6-1936 మొదలు, 10-10-40 వరకు) నడచినట్టి లిఖిత "విద్యా" పత్రికలో ప్రధానముగ మనజయరామమూర్తి యతన్నిరసనపూర్వక వైదిక విద్యాప్రాభవమును విలాసమాత్రముగ వివిధరచనలలో జూపియుండుట, (౩) అత్యంతబాల్యముననే 'చక్రహస్తునిబ్రకటించుచదువు చదువు' అనెడిప్రహ్లాదోక్తిలో పర్యవసన్నముగ వ్రాయబడినట్టి "విద్యాస్వ

రూప" మను (7 ప్రకరణములోని 14) వ్యాసములోనే అవిద్యానివర్తక మైనదే విద్య తక్కినవి విద్యాభాసము లనెడి వేదాంతసిద్ధాంత మును వ్యక్తీకరించుటకు తార్కాణముగ తనజీవితసర్వస్వము నకామ హత యథావిధిశ్రోత్రియత్వానుబద్ధ బ్రహ్మవిద్యాపర్యవసాయిగ సర్వలోకసంవేద్య మగుట మున్నగునవి నిమిత్తములు.

ఈవిద్యావిలాసము శ్రీజయరామశర్మచే నొకయానుపూర్విత్వో సాద్యంతముగ వ్రాయబడినగ్రంథము గాదు. ఆతని 18 సం॥ మొదలు ధర్మానుష్ఠానతత్పరత్వముతోడను, తత్తద్దేవతాసన్నిధులలో భక్తి జ్ఞానవైరాగ్యపారవశ్యముతోడను, స్వానుభూతిప్రధానముగ త్యాగ రాజుగారి కృతులవలె నప్పుడప్పుడు వ్రాసి, కల్పవల్లి దివ్యవాణీ పాంచజన్యాది పత్రికలలో ప్రకటింపబడినట్టి సంస్కృతాంధ్రగద్య పద్యాత్మకమగు వివిధరచనలసంపుటి. ఇతని వివిధములగురచన లచ్చ టచట శోధించగా 164 గానుపించినవి. వీనిలో నీప్రథమభాగమున గ్రంథవిస్తరభీతిచే 82 శీర్షికలతో 100 రచనలు ప్రకటితము లైనవి. వీనిని విషయసాజాత్యమునుబట్టి పాఠక సౌకర్యమునకై తొమ్మిది ప్రకరణ (ఖండ) ములుగ విభజించితిమి. కాని ప్రకరణము లెన్ని యైనను ప్రకృతియొక్కటియే. భాషాప్రక్రియాశైల్యాదులుభేదించినను శర్కరావినిర్మితశుకపికహంసగజాశ్వాదివివిధాకృతులలోగూడ నేకవిధ మగుమధురరస ముట్టిపడునట్లును, వాఙ్మయలోపములు కొన్ని గోచ రించినను చెఱకుగడ వంకపోయియు మాధుర్య మెడలనట్లును భావ ప్రధానము లగునీతనివివిధరచనలలోగూడ సర్వత్ర యతన్నిరసన పూర్వకముగ నాద్యంతపురుషార్థ (ధర్మ, మోక్ష) పారమ్యమే పర్య వసన్న మగుచుండును.

కావున నీరచనలు కేవలకవితానైపుణిప్రధానదృష్టితో నేత ద్గ్రంథరూపముగ ప్రకాశితములు గాలేదు. "శతం వద,ఏకం మాలిఖ; శతం లిఖ, ఏకం మాకురు-" అన్నట్లు నీతులు, ధర్మములు చెప్పు వారు వ్రాయువారు పలువు రుందురుగాని 16 వన్నెబంగారము . తన

ప్రాముఖ్యమును జెప్పుకొనకపోయినను నికషపరీక్షకు నిలిచినపుడు తజ్జిజ్ఞాసువులచే నాదృతమైనట్లు ధర్మాచరణ, బ్రహ్మాధిగమప్రధాన దృష్టితో విద్వదనుభూతినికషపరీక్షలో నిలిచి "స్వయం తీర్ణః పరాం స్తారయతి" యన్నట్లు దిఙ్మాత్రముగ లోకోపకృతికై స్వానుభూతిని వచించి లిఖించువార లరుదుగ నుందురు. కావున నీరచన లట్టిశ్రేణిలో జేరిన వగుటచే జిజ్ఞాసుజనతోపకారకము లగు ననుదృష్టితో ప్రకాశితము లగుచున్నవి.

కావున నీగ్రంథములోనియాధ్యాత్మికరసాస్వాదవిశేషముల జిజ్ఞాసువు లగుపాఠకమహాశయులే యధిగమింతురుగావున "తినబోవుచు రుచుల నెన్న నేల?"యన్నట్లావిషయముల వదలి యొకింత గ్రంథకర్తృప్రతిభాస్వరూపస్వభావాదివిశేషముల నెఱిగించెదను.

## —♦ ప్రతిభావిశేషములు ♦—

తనతర్కసంగ్రహాధ్యయనకాలముననే యాయాలక్షణములలో నాధేయత్వప్రతియోగిత్వాదులయందు "స్వనిరూపితసంసర్గతావచ్ఛేదకతాత్వావచ్ఛిన్నప్రతియోగితాక పర్యాప్త్యనుయోగితావచ్ఛేదకరూపావచ్ఛిన్నానుయోగితాక పర్యాప్తిప్రతియోగికే" త్యాదిరూపముగ దండాయమానన్యూనేతరవారకపర్యాప్తినివేశాదులలో సత్కృదుక్తిమాత్రముననే గల్గునిరాఘాటప్రవేశము గని నాకే విస్మయమగుచుండెడిది.

తనమాధురిపంచలక్షణీపరిశీలనసమయమున సాధ్యాభావనిష్ఠాధేయతయందు సాధ్యాభావవృత్తిసాధ్యసామాన్యీయప్రతియోగితావచ్ఛేదకసంబంధావచ్ఛిన్నత్వశాస్త్రార్థమును ముగించి, యచట నెపుడో ప్రసంగవశమున నేను సూచించినట్టి గదాధరోక్తమగు 'స్వప్రతియోగిమత్త్వాగ్రహావిరోధితాఘటక సంబంధావచ్ఛిన్నత్వ' దలమును వేసికూడ వివిధదోషముల పరిహరించుట గాంచి, 'ఉక్తాధికగ్రాహి' యనియు, 'దానితరులకుగూడ నిట్లు ప్రవచనము చేయ సమర్థు' డని

యు, పరీక్షాధికారుల మెప్పులకు పాత్రుడయ్యె. (ఈపీఠికాంతమున నున్నయశోనివార్తను జూడుడు.)

ఒకప్పుడు కారకార్థవాదములో కొంతవరకు శాబ్దబోధప్రణాళికపై విచారించి, పిదప వైయాకరణప్రక్రియాభాగములోనికి ప్రవేశించి 'పెదనాన్నా! మీకీప్రక్రియ లగోచరములు లెం' డని, మనజయరామశర్మ చిఱునవ్వుతో నేకాంతమున బల్కుటగాంచి, బాల్యమునుండియు నేటివరకు విద్యాబుద్ధులలో నెల్ల నా కన్నివిధముల సహాధ్యాయులు జ్యేష్ఠులు నగు బ్ర. ముదిగొండ పిచ్చయ్యశాస్త్రిసోదర మహోదయు లమందానందముతో నాకడకు వచ్చి "అరే! 'పుత్రాదిచ్ఛే త్పరాజయ' మనున్యాయమును వినుటేగాని యనుభవానందము నొందుభాగ్య మెన్నడైన ఘటించునా? యని యనుకొనుచుండువాడ; కాని నే డట్టియానందమును మనవానివలన నొందితి" నని సోత్సాహముగ వచించిరి.

ఈవిధముగ తర్కవ్యాకరణ మీమాంసా జ్యోతిర్ధర్మశాస్త్రాదులలో నేగాక అష్టావధానాదులు విక్రమవిజయదశమి విద్యాపత్రికాముఖవ్రతలిఖితప్రత్యేకప్రశంసాపాత్రమయూరలతాచిత్రాది చిత్రలేఖనప్రభృతివివిధకలలలోగూడ నీతనివిలక్షణప్రజ్ఞాప్రతిభల వివరింపబూనినచో నొకపెద్దగ్రంథ మగునుగావునను, ఈపీఠికలోని తత్తల్లేఖావళిలో ముందవి కొన్నివ్యక్తములగునుగావునను వానినిట నుపేక్షించి, ధర్మప్రబోధాత్మకప్రస్తుతగ్రంథభూమికలో గ్రంథకర్తృధర్మానుష్ఠాన, బ్రహ్మానుభూతి, గురుజనవిధేయతాది విమృతియె విశేషించి ముముక్షువుల కపేక్షిత మగుగాని తద్రహిత మగు కేవల వేదశాస్త్రప్రజ్ఞాప్రతిభాదికముగూడ నిష్ప్రయోజనమె యగు గావున ప్రకృతమునకు వచ్చెద—

## —♦ ధర్మానుష్ఠానప్రాధాన్యము ♦—

అనుష్ఠాత లగువారిమాటలే జిజ్ఞాసువుల కుపదేశరూపములై యనుష్ఠాపకము లగును. అన్యులమాటలో సర్వాంగసుందరము లయ్యు

నాటకపురీహార్సలు, గ్రామఫోనుపాటలు, స్వైరిణీపాతివ్రత్యోపన్యాసముల భంగి తాత్కాలికచమత్కారకారణములు, వినోదకరములే యగుగాని సార్థకములు గానేరవు. మరొకవిశేష మిచట ప్రసంగవశమున జెప్పవలసివచ్చినది. ధర్మప్రచారమునకై తదనుష్ఠానము నంగముగ సేకరించినను ప్రయోజనము సున్నయే. "సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే" "జ్ఞానాదేవ తు కైవల్యమ్" "ఆమ్రఫలార్థినా చూతే నిమితే ఛాయాగన్ధా వనూత్పద్యేతే. ఏవంధర్మం చర్యమాణస్యార్థకామా వనూత్పద్యేతే" ఇత్యాదిపరశ్శతప్రమాణములచే ధర్మానుష్ఠితి జ్ఞానద్వారమున బ్రహ్మాధిగమరూపమోక్షసామ్రాజ్యపర్యవసాయియే యగుచు నవాంతరఫలములుగ నర్థకామములనువలె ననుష్ఠాపకవక్తృత్వమునుగూడ గలిగించునేగాని యది వక్తృత్వాంగము గాదని తెలియుచున్నది. మరియు మనవైదికప్రణాళిలో, నిఖిలవేదవేదాంగాద్యధ్యయనము లనుష్ఠానాధ్యాపనపురాణప్రవచనాదులకేగాని యితరప్రచారములకు గాదు. అందు ననేకసహస్రములలో పక్వావస్థ నొందినయొకానొకనికే పైజెప్పిన ట్లధికార ముండును. ఇట్లే ప్రమాణధారణపటుత్వాదులు తర్కవ్యాకరణాదులకు, వేదాధ్యయనాదులు పూర్వమీమాంసాదులకు నధికారసంపాదకము లగుగాని; తావన్మాత్రమున నుత్తరమీమాంసా (వేదాంతా) ధిగమమున కధికార మేర్పడదు. అందుకు నైకభవకృతసుకృతపరిపాకరూపమగు గురుజనవిధేయతాదిపురస్సర మగుసాధనచతుష్టయసంపత్తియే యధికారప్రదమని "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను వేదాంతదర్శనమహాసౌధప్రథమభూమికలోనే యొక యథ శబ్దమును బెద్దయినుపకవాటముగా శ్రీవ్యాసభగవానులు పెట్టియుండిరి. శ్రీజగద్గురు శంకరభగవత్పాదులవారు చతుర్దిశల నందుకై ధర్మస్థాపనాచార్యవర్యులగు బ్రహ్మణ్యుల వైదికసామ్రాజ్యపట్టభద్రుల జేసి తత్కవాటముల కప్రధృష్యము లగుమహత్తరార్గళములగూడ ఘటింపజేసియుండిరి. కాని సర్వులకు సర్వత్ర స్వతంత్రేచ్ఛ గలనేటికాలములో ధర్మప్రచారములలోవలెనే బ్రహ్మవిచారములలోగూడ నిట్టిసార్గళబృహదయఃకవాట

ములుగూడ నడ్డగించుట లేదుకాని యిట్టివ్యక్తిస్వాతంత్ర్యమువలన "ఫలంచ తదూ్రపక మేవ తస్య" అన్నట్లు యథోక్తఫలములు మృగ్యములై తదనురూపము లగునైహికఫలములు మాత్రమే ఘటించుచున్నవి.

కావున నిచట నపేక్షితము లగుభగవద్భక్తి, నిష్కామత్వ గురుజనవిధేయత్వాదిముముక్షులక్షణవిశేషములనే కొన్నిటిని స్థాళీపులాకన్యాయముగ వివరించెద.

—• బాల్యముననే భగవద్భక్త్యాద్యంకురములు. •—

పిన్ననాటినుండియే మనజయరామమూర్తికి గురుదేవతాభక్తి జ్ఞానవైరాగ్యాద్యంకురములు గానుపించుచుండి, క్రమముగ పల్లవితములై కుసుమితములై ఫలితములై సర్వజనమనోహరములుగ విస్మయావహములుగ జూపట్టె.

ఒకప్పుడు 3-4 సం॥ వయస్సులో నతిబాల్యములోనే తనతల్లి యెవరో పిల్లవాడు చక్కగ నున్నా డనగా "అమ్మా! పైకి ఎట్లాగా నుంటే సరియా? వాడిలోపల అంతా కుళ్ళే" అనెనట. ఈవసికూన కీయీాడులోనే వానిలో నుండెడిచెడుగుణము లేమి తెలిసినవో? అని తల్లి సంతోషాశ్చర్యముల నొందుచు పలుమార్లు పలువురతో చెప్పుచుండెడిది.

ఐదేండ్లవయస్సులోనే "పెదనాన్నా! భజనచెక్కల జేయింతువంటివే" యని బ్ర. వ్యాకరణం వేంకటేశ్వరసిద్ధాంతియన్నగారి నడిగి చిఱుతాళపుభజనచెక్కలను తెప్పించుకొని గజ్జెలుకట్టుకొని నృత్యము చేయుచు రామభజన చేయుచుండెడివాడు. (ఆభజనచెక్కలు నేడు శ్రీమదోంకారమందిరమున సంగృహీతములై యున్నవి.) ఇట్లతిబాల్యముననే సురూపులైనను సద్గుణులు కానివారి జేరకుండుటకును, ఆటపాటలలోగూడ దేవతాభక్త్యంకురము లుదయించుటకును, నైకభవాంతరసుకృతములే గదా నిదానములు.

7 సం॥ వయస్సున దాశరథిశతకములో మన మడిగినవరుస సంఖ్యకు వెంటనె పద్యమును జదువుట, పద్యమునకు వరుససంఖ్యను జెప్పుటనుబట్టి యత డత్యంతక్షుణ్ణముగ వల్లించు రీతినిమాత్రమే నా డెరిగి యుంటిమి. నే డాతడు వల్లించినగ్రంథమును జూడగా 16. ముప్పునఁగాలకింకరులు; 17. పరమదయానిధే; 25. చక్కెరమాని; 27. రామహరే; 30. చిక్కనిపాలపై; 37. జుఱ్ఱెద మీకథామృతము; 38. ఘోరకృతాంత; 49. చేసితి ఘోరకృత్యములు; 50. పరులధనంబుఁ జూచి; 65. చరణము సోకినట్టిశిల; 91. ఎక్కడితల్లిదండ్రులు 93. సిరిగలనాడు మైమఱచి; ఈ 12 పద్యములకు ప్రత్యేకపుగుర్తులు పెట్టబడి యుండుటనుబట్టి యీవ్యక్తికి నాటినుండియే యెట్టి యాధ్యాత్మిక భక్తి జ్ఞాన వైరాగ్యాది సాత్త్వికభావము లుండెడివో విజ్ఞు లెరుంగగలరు.

శ్రీజయరామవిద్యావిలాస మనునామ మీగ్రంథమున కేర్పడుటలో 3 వ నిమిత్తముగ నేతత్ప్రతికారంభములో బేర్కొనబడినట్టి "విద్యాస్వరూప" మను (౭–14) వ్యాసము నిత డత్యంతబాల్యమున (లిపినిబట్టి 10-12 సం॥ వయస్సున) నే వ్రాసియుండె. ఆవ్యాసము "చక్రిహస్తుని బ్రకటించుచదువు చదువు।కుంభినీధవుఁ దెల్పెడిగురుఁడు గురుఁడు।తండ్రి హరిఁ జేరు మనియెడుతండ్రి తండ్రి"యను ప్రహ్లాదోక్తిలో పర్యవసన్న మగుటచే నీతని గురుదేవతాభక్తి బాల్యముననే యెట్లు వికాసమందెనో తత్త్వజ్ఞులకు వ్యక్తమగును.

—♦ యౌవనమున నిష్కామత ♦—

షోడశవర్షాధికయౌవనవయస్సమయమున స్వగురుపత్న్యాదుల కభివాదనము మన్వాపస్తంబాద్యుక్తరీతి పాదస్పర్శము చేయకయే చేయుచుండువాడు. ఈవిషయము మాతృస్థానీయమహిళామతల్లుల కెల్ల విదితమే. గర్భాష్టమావనీతి ప్రభృతి ద్వాదశవార్షికబ్రహ్మచర్యదీక్ష నధశ్శాయిగనుండుటేగాక తనశయనాస్తరణమును సోదరీబాలికల గూడ స్పృశింపనిచ్చువాడు కాడు. ఇత్యాద్యనేకస్థానములలోని స్త్రీగ

వైముఖ్యముచే సీతనిని ఋశ్యశృంగుడని బంధుమిత్రాదులెల్ల భావించుచుండెడివారు.

ఈతనికి నిష్కామత కేవలస్త్రీవిషయముననే గాదు. ఒకప్పుడెవరో బంధువులలో నొకనికి గొప్పసౌధము దానిచుట్టు పరిక్కలనే గొప్పమాగాణిభూవసతియు కలదని నాతో తనతల్లి చెప్పుట విని, ఆతనికి స్నానసంధ్యాదులుగూడ లేవనెడియసహ్యభావముతో 'అమ్మా! ఆయన గొఱ్ఱెలను మేకలనుగూడ కాయుచుండునట నిజమేనా?' యనెను. నాకీగొడవయే తెలియదు. ఇంతలో తనతల్లి "ఔనురా! ఏదో యింత తినా కుడువాయున్నది వారికి" అనెను. అంతట "అమ్మా! తినుటకేనా మానవజన్మ?" అనెను. అంత మే ముభయుల మాతని యర్థకామవిముఖధర్మారూఢవచనముల కెంతో విస్మయానందముల నొందితిమి.

ఇట్టి యర్థకామ వైముఖ్యము పరకీయవిచారములలోనే కాదు; స్వీయము లగు ఫలితక్షేత్రములకడగాని, ధాన్యపుకళ్ళములు, మూలచణక (వేరుసెనగ) క్షేత్రములు, కళ్లములకడగాని కావలికై యీతనిని గూర్చుండబెట్టినపుడు తనకంటె నత్యంతాల్పవయస్కులగు చెల్లెండ్రమాత్రపు ప్రయోజనముగూడ నుండెడిది కాదు. బాలురు శునకాదులు-ఎవ్వరెట్లు ప్రత్యక్షముగ భక్షించుచు నపహరించుచుండినను వినోదముగ చూచుచు, సస్మితవదనుడై మిన్నకుండునే గాని వారిని వారింపకుండెడివాడు గాన స్వకీయార్థవైముఖ్యముగూడ సర్వత్ర గోచరించుచుండెడిది. ఇది బుద్ధిజాడ్యమో జడభరతస్థితియో యేతద్గ్రంథస్థము లగునాతని సదసద్విషయ వివేకమునుబట్టి వివేకు లెరుంగగలరు.

కుఱ్ఱవాండ్ర తరుణబుద్ధులు చెడులోవల బోవు ననుభీతిచే నర్థకామప్రధానము లగు వార్తాపత్రికల జూడ వలదని నే ననుట విని మనధర్మమూర్తి తా నట్లు స్ఖలితుడ నగుదునా? యను భావము స్ఫురించునట్లు సవినయస్మితవదనముతో మిన్నకుండెడివాడు.

నే డందుకు తార్కాణముగ నొక హిందుబాలిక తన 5 సం॥ లోనే తండ్రిచే కన్యావిక్రయరూపముగ వివాహితయైన రెండవ మాసమున నే విధవయైనసంగతిని 17 సం॥ లో గుర్తెరిగి గులాబ్ అను వానిని జేపట్టి దేశాంతరముల కేగి, ఎన్నో యిక్కట్టుల నొంది, తిరిగి బచ్చు అనువాని నగతికముగ ననుసరించి, లతీఫ్ అను మహమ్మదీయునిబారినుండి "హిందూధర్మసంరక్షణీసభ" వారి సాహాయ్యముచే తప్పింపబడి 31—12-34 తేదీన హెచ్. సి. బటేయా యను హిందువుని వివాహమాడె ననెడి వృత్తముగల 1935 సం॥ మార్చి "గృహలక్ష్మి" లోని "ఆత్మకథ" యను వ్యాసముక్రింద మన శర్మ లిఖించిన పంక్తు లీక్రిందివిధముగ గానుపించినవి. 'లజ్జా మేకాం పరిత్యజ్య త్రిలోకీవిజయీ భవేత్' -సిగ్గు లేక ముగ్గురుభర్తల మార్చుకొంటినని సిగ్గు విడిచి చెప్పుకొనెడి యిట్టిభ్రష్టల సంరక్షించుటకు బద్ధకంకణు లగు ఈ నపుంసకుల నేమనిన లాభము కలదు?" (లేఖన కాలము స్ఫుటము కాలేదు.) దీనిచే నీతనికి స్వైరిణీస్వైరచారివిహారస్థానము లగుకొన్ని సినీమాలు, డైవోర్సు శాసనాదులు మున్నగు ధర్మదూరములగు కామవృత్తములయం దెంతటి వైముఖ్య మున్నదియు వ్యక్తమగును. (ఉన్నదున్న ట్లనెడి యీగ్రంథపుతుదిని ప్రకరణమును గాంచనగును.)

ఇట్టే మచ్చునకుగూడ కామకలావర్ణనము లెరుగని మనజయరామమూర్తి స్వభావమును పరీక్షించుటకో యనునట్లొకవిద్వాసమయమున "వయ స్సన్యం దత్వా సుఖయతి పతిం కేళిసమయే॥" అను సమస్య నొక రొసంగగా; కామకలాకౌశలము, తత్ప్రతివైషయికానందస్థాయీభావాదులు స్వైరిణీ స్వైరచారులకే ప్రధానముగ లభించుననెడికొందరియూహలు భాణాది గ్రంథానుభూతికృతములేగాని "ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ" అనెడి సాక్షాత్కామజనకుడయ్యు నకామహతత్వాదర్శభూతుడగు శ్రీభగవానునిగీతామృతానుభూతికృతములు కావనుభావమును స్ఫురింపజేయుచు, త్రిమూర్తిధర్మపత్నులు, సీతానసూయారుంధతీసావిత్రీ

దమయంత్యాది వీరపత్నీమాతలు మున్నగు భారతావనీపవిత్రాలంకారభూత లగుసతీమతల్లులనే స్మరించుచు "సతీ కాచిత్" అని ప్రారంభించి సతీపతికామకలాకౌశలమునే సద్యస్సమస్యాపూరణములోగూడ వర్ణించెను. (ఆ ప్రకరణమున సమస్యలలో చూడుడు.) దీనిచే సీతని ధార్మికత కామమునుగూడ నెట్లు పవిత్రీకరించెనో గోచరించును.

నన్నొకప్పుడు "నాన్నా! మన కొకవ్యావహారికవ్యు కొందర తటస్థించినపుడు నిత్యాహ్నికములో కొంత సంకోచము చేసికొనుటుచితమా? వ్యావహారికసంకోచకృతనష్టిని భరించు టుచితమా?" యని తన విషయములో నెద్దియో సందేహము కల్గిన ట్లడిగెను. నేను బాగుగ నాలోచించుకొనగా నా డెద్దియో తొందరపనితో కొంత యాహ్నికమును క్లుప్తపరచుకొంటినని గుర్తువచ్చినది. ఇంత సూక్ష్మముగ నాకుగూడ నన్యాపదేశముగ ధర్మప్రబోధకు డయ్యెగదా! యని నాలో నే నత్యానందము నొందితిని.

ఇంతియేకాదు, నే నొకపర్యాయము కంచుకము (చొక్కా) లేకుండ విజయవాటిక కేగివచ్చుట తా గాంచి "నాన్న యికనుండి చొక్కాను మానునులే" యని స్మితవదనముతో మాత్రాదులకడ నుడివెను. తాను యావనుడయ్యును సనాతనవైదికవేషభాషాచారాదులలో మాకంటె నెన్నో మడుంగు లనుభవశాలి యగుటేగాక యస్మదాదులకుగూడ నన్యాపదేశముగ నధ్యాపకు డయ్యెగదా యని యాతని సహజధార్మికత కుప్పొంగుచు నాటినుండియే కంచుకమును వదలితిని.

పెద్దలుగూడ పెద్దగ నాత్మలో భావించదగినయోగ్యత సీతని కడ నిట్లెన్నియో గోచరించు చుండుటచేతను, నిత్యాగ్నిగురుపరిచర్యాదులు నిరంతరవేదవేదాంగాదివ్యాసంగములతో బ్రహ్మతేజమున ఋషివలె వెలుంగుచుండుటచేతను సీతనిపార్శ్వమున దేవపూజాభోజనాది సమయములలో సన్నిహిత బంధుమిత్రాదులుగూడ

నగ్నిని జూచి భయపడినట్లు తత్సన్నిహితాసనములపై గూర్చుండుటకు జంకి కొంత యెడముగ గూరుచుండెడివారు. "అగ్ని ర్బ్రాహ్మణవత్" అనునూక్తి నా కత్తఱి గుర్తువచ్చెడిది.

ఐతే, పైని పేర్కొనిన విషయము లత్యల్పములని యాపాత దృష్టిలో కొందరికి తోచవచ్చునుగాని సహజముగనర్థకామవిముఖమై ధర్మమోక్షప్రధాన మగునిట్టి నిష్కృష్టదృష్టి గల్గి, శిఖామాత్రమైన చలించక తత్తదనురూపవర్తనులగుచు వెలుంగునదృష్టశాలు లెన్ని శతములలో నొక్క రుందురో యాలోచించుడు. "మనుష్యాణాం సహస్రేషు" అని భగవానుడే యిట్టివ్యక్తు లతిదుర్లభులని చెప్పె గదా? "శ్రోత్రియస్య చాకామహతస్య" కామహతి లేని శ్రోత్రియునిదే కైవల్యభాగ్యమని శ్రుతిమాతయు "జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్" (మోక్షార్థివైనచో దుర్జయుడగు కాము నొక్కని జయించిన చాలు) అని భగవానుడును చెప్పలేదా? అంతవర కెందుకు? అభావే వైరాగ్య మన్నట్లుగాక "హస్తం గతోపి కనకాది రుపేక్షితోఽభూత్" అని యాతడు విశ్వేశాష్టకములో విరోధాభాసలతో చెప్పినట్లు అర్థసమృద్ధులయ్యు భోగపరాయణత్వము లేనందున తన్నిరపేక్షతో నుండుటేగాక తదపేక్ష గల వివిధధార్మికక్షేత్రములలో వేనవేలు వెదబెట్టుచున్నట్టి యంతర్ముఖులగు మన "ధర్మవీర" బ్ర. శ్రీ లంకా వేంకటనారాయణగారు మంచములు, రూప్యములు, దేహములు, వస్త్రములు — వీనిని క్రమముగ కుక్కలు, పిక్కలు, దబ్బములు, పేలికలు, – అని వాడుటలో నెంతటియర్థ ముండునో చూడుడు. ఆమాటలనే యట్టి నిష్కామస్వభావము లేనివారు వాడినచో ఛలోక్తు లగునేగాని సార్థకము లగునా? ఐహికాముష్మికఫలభోగ వైరాగ్యముల సాధనచతుష్టయోపన్యాసములలోను, భాష్యప్రవచనములలోను, అస్మదాదుల మెంత చెప్పినను లం. వేం. నా. గారి పై మాటలవిలువ యుండునా? ఆవిషయములో వారిని బోలగలమా? ఇట్లె "స్రక్చందనవధూవస్త్ర సువర్ణాదిషు పామరః । అప్రమత్తో యథా తద్వ న్న ప్రమాద్యతి

భోక్తరి॥- స్రక్చందనవధూవస్త్రాదుల నెంతగ పామరుడు సంభావించుచుండునో అంతర్ముఖుడు తత్తదధిష్ఠాన మగుటచే తత్తత్సాక్షి స్వరూప మగునిర్విశేషాద్వితీయాఖండ చిదాత్మతత్త్వముననే నిరంతర మపరిమత్తుడై యుండు నని శ్రీవిద్యారణ్యాచరణులు సెలవిచ్చినట్లు చేతిలో నొకకొమ్మ గట్టిగ చిక్కినవాడే కాలిక్రింది కొమ్మను వదల గలడు గావున నీతని యౌవనములోనియర్థకామవైముఖ్య మట్టి యనుభవార్థ్యాఘు లగునంతర్ముఖులే గ్రహించి సంతసించుచుండిరి, ఈతనిరచన లిట్టియనుభవ పూర్వకము లగుటచేతనే పైజెప్పినట్టి లం, వేం. నా. గారి వచనములవలె పెద్ద లాదరించుచుండిరి.

## — సర్వదా గురుజనవిధేయత. —

మఱియు వ్యక్తిగలిగినట్టి తన 20 సం. వయస్సులో "మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ" అను శ్రుతిమూలకమగు "తేష్వేవ త్రిషు తృప్తేషు తవ స్సర్వం సమాప్యతే" అను మనూక్తిని తన ధర్మశాస్త్రపుడైరీలో నెట్లు ప్రత్యేకపు గుర్తుతో వ్రాసికొనియెనో, 15 సం॥ వయస్సులోని నె. కి రు. ఫైలు అట్టమీద గూడ "నేను పెద్దవాండ్రమాటను విందును" అని పెద్దక్షరములతో ప్రత్యేకపు గుర్తుతో నట్లు వ్రాసికొనియుండెను. దీనినిబట్టి విద్యాతిశయములకంటె తత్ఫలీభూత మగు వినయవిధేయతాదులే కష్టసాధ్యములనియు, తరణోపాయము లనియు, ప్రత్యేకదృష్టితో సాధింపదగినవనియు నెన్నుధర్మరహస్యమును గ్రహించెనని తెలియుచున్నది. గ్రహించుటలు లిఖించుటలుమాత్రమే గాదు; ఆచరించుటేయీవ్యక్తిలోని గొప్పతనము. చూడుడు - నాఫోటోకు వెనుకవైపున "దీనిని రహస్యముగ దాచుకొని ప్రతిరోజు నమస్కరించుచుండవలెను;" అని వ్రాసికొని ప్రియభివాదనమునకై తన వేదపుస్తకపుటట్టలో దాచి పెట్టుకొనియుండెను.

నాయుపాధి శుష్కోపవాసబాహుళ్యమున కాగలేదనియు తాను పవసించిన నేనుగూడ నుపవసింతుననియు నాలోచించిగాబోలు నే

నింటికడ లేనపుడు ధర్మపత్నీయుక్తుడై యొక కార్తికపూర్ణిమనా డుపవసించి శ్రీవిశ్వేశాభిషేకాది కైంకర్యముల నొనర్చె. నాడు భక్తి పారవశ్యముతో తన్మయత్వముతో నభిషేకకాలమున నాశుపఠితమైనట్టి "స్వత శ్శితః కాలః" అను శ్లోక మిందలి ౧. స్తోత్రములలో కలదు. వీనిచే "యథా దేవే తథా గురౌ" అను సూక్తియు నీతని కన్వయించెనని నేడు గ్రహించి హర్షించితిమి.

మఱియు, "ఓమ్. శ్రీసద్గురు శ్శరణమ్." అను మకుటమండిత మగు నాగురుకులాశ్రమాది పత్రివ్యవహారముల జూచినదాదియు నుపనయనమునాటి "గురు ర్బ్రహ్మ..." యనుశ్లోకార్థమే ప్రతివర్షమోంకారమందిర చాతుర్మాస్యావసరమున పరమహంస ప్రవర్షణిగ ప్రవచనము చేయబడుచుండు మాండూక్యసప్రణవార్థ మనియు. నిఖిల జగజ్జీవాత్మకముగ వెలుంగుపాదత్రియాధిష్ఠాన మగు నిర్విశేషాద్వితీయాఖండనిరావరణచైతన్యాత్మక నిజాత్మతత్వమే శ్రీసద్గురు రూపమనియు. అందే నిఖిలవర్ణాశ్రమములలో వివిధభంగుల భిన్నాత్మభావసంసేవ్యము లగు సర్వదేవతారూపములు "యావా నర్థ ఉదపానే" యన్నట్లు పర్యవసన్నము లగు గాని యన్యములలో నిగురుతత్వ మంతర్భూతము కాదనియు, అనగా—'వశీకృతే మన స్యేషాం సగుణబ్రహ్మశీలనాత్ । తదేవావిర్భవే త్సాక్షా దపేతోపాధికల్పనమ్' అన్నట్లే దైవతమైన నాత్యంతిక పరమ పురుషార్థఫల మొసగుతఱి పాలు వెన్న యైనట్లు, భ్రాంతిసర్పము రజ్జువైనట్లు శ్రీసద్గురురూపమై జీవేశజగద్భావరహితాఖండానంద స్వరూపముగ. "గురు స్సాక్షాత్పరం బ్రహ్మ" యను నుపనయన శబ్దార్థముగ నావిర్భవించుననియు, అట్టి నిఖిలజగన్మంగళమూర్తి, పరశివమూర్తి యగు శ్రీసద్గురుమూర్తికంటె ముముక్షుజనశరణ్య మన్యము త్రైలోక్యమున లేదని గ్రహించి గాబోలు గణపతి,వాణీ,శ్రీరామ,దత్తాది పదములతో తత్పూర్వము తనలేఖిని నారంభించువాడు తదాదిగ నేవి వ్రాసినను పైశీర్షిక నాటివిరాంతము మఱవలేదు. దీనివలన "యథా తే తత్ర

వర్తేరన్, తథా తత్ వర్తేథాః” అను గురుజనానుయాయిత్వపుర స్సరగురుతరగురుభక్తిమార్గ మలవడెగదా యని యానందించితిని.

మఱియు ధార్మికములుగ గానవచ్చుకొన్ని సంస్థలలో దాను బ్రవేశించి సన్మానితుడయ్యు 'నీయాచితి కనురూపము కానందున నందు పెద్దల కానుకూల్య మంతగ లే' దని తెలిపినంత నే గురుజనేష్ట మునే తనయిష్టముగ మార్చుకొని తక్షణమే నిర్విచారముగ నచట తనసంబంధము నుపసంహరించుకొనెనే గాని పెద్ద లనగ నెవ్వ రని ప్రశ్నింపలేదు. శ్రీరామచంద్రుడు పట్టాభిషేకమునకు సన్నద్ధుడయ్యు పెద్దలభావ మన్యథాయున్న ట్లెరిగినంత నే తనభావమును మార్చుకొని నిర్విచారముగ కాననముల కేగుటలోనేగదా యతడు గురుజనవిధే యతలో లోకాదర్శకపురుషు డైనది! ఈఘట్టములో కైకేయీవరము రామునిపట్టాభిషేకము – వీనిబలాబలవిచారము మున్నగునంశముల లోనికి దిగినచో నెంతైన శాస్త్రార్థముచేయవచ్చు. ఇందావాదము లకు తావు లేదు, ఇదియే సూక్ష్మధర్మజ్ఞత. ఒకరహస్యము గలదు. ఏపురుషార్థియైనను సాధకుడై యున్నంతవరకు తన కేదియో జిజ్ఞాస్య మొకటి యున్నట్లేగదా? పరిపూర్ణస్థితి వచ్చువరకు తనపూర్వస్థితి మారవలెనని తలంచవలెనేగాని తనసాధనబలవిద్యాబలయౌవనబలా దులబట్టి తనకు పైమెట్టులో నున్నపెద్దలమాటల పెడచెవిని బెట్టినచో నవిధేయతవలన స్థిరో భవ యన్నట్లు తనపూర్వస్థితియె గట్టిపడును. అపుడు సాధకలక్షణమే చెడును. కావున నిట్టిఘట్టములలో తట్టుకొ నుటే చిత్తపరిపాకఫలము.

చూడుడు. ఒకప్పు డోంకారమందిరములో నాధర్మశాస్త్ర ప్రవచనానంతరము పండిత బ్ర. ఆత్రేయ (కాశీ లక్ష్మణశాస్త్రి)లు గారు మనజయరాము నేకాంతమునకు బిలిచి “ప్రవచనములో మీా జనకునిసమాధానమునకన్న నీప్రశ్నమే సమీాచీనమని వా రంగీకరిం చినవిషయము నెరిగిగూడ సభయందే ‘మనలో నెవరిమాట న్యాయ్య' మని యడుగుట పెద్దల నవమానించుట కాదా” యనగా ‘నిజమే

నాది పొరపాటే; ఇకముందెన్నడి ట్లే పెద్దలయొద్దగూడ ప్రవర్తించు నని పల్కుచు కంట నీరు తుడుచుకొనుచు పశ్చాత్తాపముతో తన గురుజనవిధేయతామూర్తిని జూపెట్టినని శాస్త్రిగారెన్నో పర్యాయము లీవిషయము నాశ్చర్యానందానుభవములతో చెప్పియుండిరి. దీనివలన నీతనివట్ల 'విద్యా వివాదాయ' యనువచనము వర్తించక 'విద్యా దదాతి వినయ' మనువచనము సార్థక మయ్యెగదా! యని సంతసించితిమి.

## సర్వసలీభూతతత్త్వజ్ఞత

ఇట్లనేకము లగుముముక్షులక్షణము లుండుటేగాక దిఙ్మాత్రముగ మనజయరామశర్మకు వేదాంతదర్శనమార్గమును జూపెట్టినంతనే వివర్తవాదారూఢప్రజ్ఞుడై తత్పరాకాష్ఠ యగునజాతవాదసిద్ధాంతమునే సర్వదా యనుభవించుచుండెడివాడు. ఇందు కనేకనిదర్శనములు కలవు.

నే నొకప్పుడు బ్రహ్మసూత్రభాష్యప్రవచనసమయములో "యుష్మదస్మత్ప్రత్యయగోచరయోః" ఇత్యాదిశ్రీమద్భగవత్పాదపంక్తిలో నారంభముననున్న యుష్మదస్మత్పదసామానాధికరణ్యము వలన యుష్మదర్థము= నిఖిలగ్రాహ్యగ్రాహకరూపము, అనగా తత్త్వం పదవాచ్యార్థరూపమును నిఖిలనిగమాంతమూర్ధన్యమూండూక్య ప్రణవపాదత్రయాత్మకము నగునిదమర్థాత్మక కల్పితవ్యక్తావ్యక్తనిఖిలదృశ్యజాత మంతయు, అస్మదర్థమే=నిఖిలగ్రాహ్యగ్రాహకాధిష్ఠానరూపము, అనగా తత్త్వంపదలక్ష్యార్థభూతమును, ప్రణవమాత్రాత్రయాత్మక (వాచారంభణాత్మక) పాదత్రయాధిష్ఠానభూత పాదత్రయసాక్షిభూత తురీయపాదాత్మక నిర్విశేషాఖండాద్వితీయప్రత్యగ్బ్రహ్మాత్మకమునగు దృఙ్మాత్రమే యని వ్యక్తమగుచున్నదనియు; దీనిచే నిఖిలమహావాక్యార్థస్వరూపము, ప్రణవార్థస్వరూపము నగు సర్వవేదాంత (దర్శన) పరిధానపరిమేయాత్మకము, నిఖిలజగన్మంగళాత్మకపరశివస్వరూపము నగుశ్రీసద్గురుతత్త్వము గ్రంథారంభమున ననుబంధిం

చుచు "యుష్మదస్మ" త్ప్రభృతి "సుతరా మితరేతరభావానుపపత్తిః" అను పర్యంతము పూర్వపక్షభాష్యము భగవత్పాదులచే నారంభింపబడినదని ప్రతిపాదించుచుంటిని. ఇంతలో "నాన్నా! నాకొకవిశేష మిచట స్ఫురించుచున్న" దనెను. ఏమది యనగా, "ఎవరైన తనగ్రంథారంభముననే పూర్వపక్షము నుపక్రమింతురా? కావున 'యుష్మదస్మద్' మొదలు 'సుతరా మితరేతరభావానుపపత్తిః' అనువరకుగూడ భాష్యకారులు పూర్వపక్షమిషతో 'న నిరోధో నచోత్పత్తి' అనెడితమపరమార్థసిద్ధాంతమునే వెలువరించిరనియు; పిదప 'తథాప్యన్యోన్యస్మిన్' మొదలు అట్లు పరమార్థముననధ్యాస సర్వదా సర్వథా యనుపపన్నమేయైనను వ్యవహారదృష్టిలోనది మందాధికారికముగ ప్రతిపాదిత మయ్యెనని—ఈవిధముగ దోచుచున్న" దనెను. దీనిచే నీత డెట్టిదృష్టిలోనివాడో బ్రహ్మజ్ఞు లగు పాఠకమహాశయు లెరుంగగలరు.

ఐతే యిట్టి యూహాలు పైభాష్యప్రవచన సమయములో సామాన్యముగ తాత్కాలికముగ బలువురకు స్ఫురించు ననవచ్చును గాని అట్లుగాదు. శ్రీకాళీశాస్త్రిలుగారు, నేను మాగృహాంగణములో నొకప్పుడు సహజనిర్వికల్పసమాధినిగురించి ముచ్చటించుకొనుచుండు సమయములో మనబాలావధూత సిద్ధాంత కౌముదిని చేతబుచ్చుకొని తద్విషయముల నాందోళించుచు గురుకులాశ్రమమునుండి యింటికి వచ్చుచుండె. అపుడు నేను జయరామా! యని పిలిచి "నిరస్తాధ్యాసులగు సమ్యగ్దర్శులకు చిత్తవిక్షేప తత్సమాధి స్థితులలోగూడ సహజనిరంతర నిర్వికల్పస్థితి యుండుననియు; చిత్తసమాధి లేనపుడు సమ్యగ్దర్శన భంగము (గాని సహజనిర్వికల్ప స్థితిభంగముగాని) లేదనియు, పంచదశిలో నెచటనో యున్నట్లున్నది, నీకు గుర్తున్నదా?" యని నే నడుగగా సస్మితవదనుడై "లేకేమి ఒకచోటనే గాదు" అనుచు, పంచదశిగ్రంథమును దెచ్చి, (1) 7–9...20, (2) 6–249...288, (3) 7–169...191, (4) 9–87...888, (5) 18–46...61, (6) 13–93...104, (7) 6–13, 14, (8) 6–265...288

ఈవిధము లగుస్థలములను పైభాగమున కువక్రంభకములుగ క్షణము లోవెంటవెంట జూపెట్టెను. నేనప్పటికి 10, 15, మందికి 7, 8 పర్యాయములైనను పంచదశీ పాఠము చెప్పియుందును. తత్రత్యులగు శ్రీసచ్చిదానందశాస్త్రులుగారనేకపర్యాయములామ్నాయము చేసియుందురు. ఇట్టి మాకు స్ఫురణములేకున్నను 1 నెల 18 రోజులలో నొక్కమారు పఠించినజయరాముని కీతురీయవిషయములలో స్ఫురణ ముండుట మాకెల్లర కచ్చెరువు గలిగించెను. "మామమేధాశక్తి వేయి లెండి" యనియనుచు సంతసమున నుప్పొంగుచు శ్రీ. స. శా. బావగారు స్థలములనెల్ల సంగ్రహించిరి. కాశీశాస్త్రులుగారుకూడ విస్మయానందముల నొందిరి. ఇట్లనేకపర్యాయములు ప్రసంగాంతరములలో నున్నపుడు ప్రసంగించిన నీతురీయాత్మానుభూతిలో నాలోచనగాని పొరపాటుగాని లేకయే యధ్యాత్మసిద్ధాంతపరాకాష్ఠలోనే విహరించుచుండెడివాడు.

ఎట్టిప్రసంగాంతరములలో నున్నను, ఆత్మవిచారప్రసంగము ప్రసక్తమైనపుడీతనికి సహజాపరోక్షానుభూతిస్థితి వ్యక్తమగుచుండెడిదనుటకు మరొక తార్కాణము. వెదుళ్లపల్లిలో జరిగినట్టి బ్ర. అవ్వారి శ్రీరామసోమయాజులుగారియజ్ఞమునకు శ్రీజయరామమూర్తి యేగినపుడచట నధ్వర్యశ్రోత్రియులగు బ్ర. చన్నావఝ్ఝల సుబ్రహ్మణ్యచయనులు గారిచెంత జేరి వారికి ఫలరసాదుల నొసంగుట మున్నగుసేవల నతివిధేయతతో చేయుచు తాను బ్ర. కప్పలవాయి అగ్నిహోత్రశాస్త్రులు గారియొద్ద ఆధానపంచకమును వల్లించునపుడు వినినతత్తత్క్రియాసంప్రదాయముల గుర్తులతో ననేకయజ్ఞమహాగ్నిచయనాదులలో నిరంతరానుభవము గలతమకే విస్మయ మగునట్లుగ నెంతో శ్రౌతానుభూతితో ననేకవిషయముల సంప్రదించెననియు, ఆతనిముఖమున నున్న బాలభాస్కరునివంటి దివ్యకాంతి మనబంధువులలోనె కాదు, నే నెరిగినంతలో నెచటగూడ గానుపించలేదనియు; అట్టిదివ్యతేజశ్శాలి యగు మహాశ్రోత్రి కాదగినవానిని గోల్పోయితిమిగదా యని పరితపించుచు బ్ర. చయనులుగారు మాగృహమున శ్రీజయరామనిర్యాణానంతరము

వచ్చి చెప్పిరి. అట్లా శ్రౌతవిచారసందర్భములలో దత్తచిత్తు డయ్యె నెవరో వేదాంతశిరోమణిగారితో పరోక్షాపరోక్షబ్రహ్మాత్మప్రతిపత్తిభేదమునుగురించినవిచారము రాగా తత్ప్రసంగ మొనర్చునపుడు వారి కగోచరములు తమ కపేక్షితములు నగుమనజయరామోక్తుల విని బ్ర. లంకా సాంబశివశాస్త్రిలుగారు వారితో మన కెందుకు (లేవోయి) నా కావిషయమును జెప్పుమని యడుగగా ఆవరణాభిభావకబుద్ధివృత్తికృతపరిమాతృభిన్నత్వరూపాపరోక్ష్యము ఘటాదులకు కాదాచిత్క మగుగాని, చిన్మాత్రాత్మకు తన్మాత్రావగాహిమహావాక్యోత్థపరోక్షవృత్తిసమయమునగూడనాపరోక్ష్యాపత్తి రాదా? యని తానె యాశంకించి మహావాక్యవాచ్యార్థలక్ష్యార్థభూతములగు చిన్మాత్రపరిమాత్రాత్మలకు వ్యావహారికపారమార్థికదృష్టిమాత్రకృతమగునంతఃకరణాదిసాహిత్యరాహిత్యోపాధులు నియతముగవ్యాద్దేశస్థము లేవైనను, అట్లు చిన్మాత్రాలోచన చేయునపుడు చిత్తము నేయాత్మగ నవలంబించియుండుటచే చిత్తు తనకంటె నన్యముగ దోచుచుండు గావున దశమునికివలె భిన్నదేశస్థత్వానుసంధి యుండును. తద్రాహిత్యవివక్షచే నాపత్తి రా దనువిషయము నెంతో పొందికగా నాపరోక్ష్యానుభూతిపారవశ్యములో, విస్మయకరముగ సిద్ధాంతీకరించె ననియు. నిట్టిమార్గములో మనజయరామమూర్తి యింతలోతుపాతు లెరుగునని నే నదివర కెరుగననియు, నాతనిస్మరణస్మరణీయతలవలన శాస్త్రిగారు ఖేదమోదాశ్రువులతో నెంతో వింతగా జెప్పిరి.

ఇట్లు సుఖజీవనకాలముననే గాదు; దుఃఖపరాకాష్ఠ యగు నిర్యాణసన్నిహితసమయములోగూడ 'అకనివార్త'లో దెల్పినట్లు ప్రసన్నవదనముతో నితడు 'నాన్నా! మన మెవ్వరము? ఒకేవస్తువు; సర్వాధిష్ఠానకేవలాత్మస్వరూపము' - అని తనతుదివాక్యములలో గూడ ప్రమాదము లేక యట్లే పల్కెను. కావున నితడు నిఖిలసుఖదుఃఖతరంగములలోగూడ నిస్తరంగసహజానందావబోధాంబుధి నోలలాడుచుండెడియోగియై సమ్యగ్దర్శనస్థాయీభావమునకు ప్రత్య

లక్ష్యమై యొప్పెను. ఇదియే నిఖలసాధనవిద్యాఫలీభూత మగుపార మార్థిక శ్రీజయరామవిద్యావిలాసము.

సంతుష్టోపి న సంతుష్టః ఖిన్నోపి నచ ఖిద్యతే
తస్యాశ్చర్యదశాంతాం తాం తాదృశా ఏవ జానతే.

అని యష్టావక్రగీతలో జెప్పిన ట్లీతనినిరంతరనిగమాంతవిశ్రాంత మగునంతరంగము నంతర్ముఖులే గ్రహించి యానందింతురుగాక.

## —♦ సంశయనివృత్తి ♦—

తుద కొకటి రెండు సందేహములు సాధారణపాఠకులకు పొడ మునని తోచి పీఠికాబాహుళ్యభయముచే క్లుప్తముగా వ్రాయు చున్నాడ.

(1) ఇన్నిసద్గుణములు గలయీపుణ్యోపాధికి తుదకు దారపరి గ్రహమున ఆమెను, స్వమాతాపితరులను నాజీవితాంతదుఃఖముపాలు చేయుట యొకకలంక మైనదే యనియు;

2 అనేకుల ననేకవిధముల నుద్ధరించదగినధర్మమూర్తి యయ్యు నతిబాల్యముననే యంతరించు టొకకలంకము గాదా? యని యు సందేహము లాపాతదృష్టిలో కలుగవచ్చును. వాని నొకింత నివారించుట యుచితమకదా.

1 బాగుగ విచారించినచో పురుషునియ ర్ధాయుష్యము నైన మార్చునుగాని, స్త్రీవైధవ్యమును మార్చలేనని బ్రహ్మ చెప్పినట్లు పెద్దలు చెప్పెదరు. ఆమాతులనుత యగుకన్యక కెచట పరిణయమైన నామె కీయుపాధిలో నీవిధి తప్పనిదే. అట్టిస్థితిలో నిట్టిసుగుణాకరు డగు పుణ్యమూర్తిని భర్తగా చేపట్టినంతనే తనజన్మము కృతార్థ మైనది; ఆతనిసాహచర్యముతో 9 మాసములు గావించినట్టి యద్వితనకాలా పేక్షిత యథావిధి నిఖలవైదికలోకాదర్శభూత స్మార్తకర్మానుష్ఠాన పూర్వక గురుపితృదేవతారాధనములే యావజ్జీవకర్తవ్య తుల్యము లై

నవి. ఆపవిత్రమూర్తి యగుజయరామమూర్తికి పరమ పేరిమస్థానము, పరివృత్తినివృత్త్యాత్మక వేదవేదాంతధర్మకార్యస్థానము నగుశ్రీమదోంకారమందిరమున తదనన్యాత్మభూతుడుగ వెలుంగుధర్మస్థాపనాచార్య వర్యశ్రీమజ్జగద్గురు శంకరభగవత్పూజ్యపాదసపర్యాదికైంకర్యములే ఆ యావజ్జీవబ్రహ్మచారిణికి యావజ్జీవకర్తవ్యము లైనవి. తదుపదేశాత్మకమగు శ్రీజయరామవిద్యావిలాసమే పఠనీయ మైనది. ఇందు కలంకమేమి కలదు? సంసారము పొడిగించలే దనియేగదా! ఇందుకు "కిం ప్రజయా కరిష్యామో యేషాం నోయ మాత్మా యం లోకః" అనెడి నాగమాధానముకంటె ముం దీపీఠికలో ప్రకాశితమగు మన శ్రీసుబ్బమాంబతండ్రియగు శ్రీ. చి. చెరుకుపల్లి నరసింహశాస్త్రి లేఖయే విపుల సమాధానము నొసంగును. జయరామునితల్లికిని, నాకునుగూడ నందే చిత్తోపశాంతిమార్గము కలదు. 'కులం పవిత్రం జననీ కృతార్థా' యనుశ్రీవిద్యారణ్యోక్తియు మాదంపతులకు చిరస్మరణీయము. మఱచితిని; అన్యాన్యోక్తు లెందుకు? అశనివార్తలో మనధర్మబ్రహ్మమూర్తి తుదివాక్యములే కలవు—"అమ్మా!దుఃఖమనవసరము" "నాన్నా!మనము సర్వాధిష్ఠానకేవలాత్మస్వరూపమే."ఇంకేమి కావలెను! ఆత్యంతికేష్టానిష్టప్రాప్తిపరిహారములఁ దా నధిగమించి మనకు సూచించుటకన్న కావలసిన దేమున్నది? ఇంతకంటె సుపుత్రునివలన తలిదండ్రులకును సద్భర్తవలన ధర్మపత్నికిని కాదగిన దేముండును?

(2) ఐతే అతిబాల్యముననే మరణించెనే యనిగదా చివరచింత. ఎందుల కీచింత?"పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః" అనుట విదితమేగదా? అధీతిబోధాచరణప్రచారణములలో నస్ఖలితప్రతిమధార్మికసేనాని యనబడినవా డెంతకాలము జీవించినను పరిపూర్ణజీవనుడే. అట్లుగానివానిచిరంజీవిత్వమున కర్థము లేదు; చిరజీవిత్వమే చూడుడు. మన మేదైన నొకవ్యాపారము చేయునపుడు గొప్ప లాభము రావలెనని చూచెదమా? లేక చాలరోజులు వ్యాపారము చేయుటే చాలు ననుకొనెదమా? విచారింపుడు. "పునరపి జననం పునరపి మరణం" అనెడివ్యాపారమునకు అనగా మానవజన్మకు ఫల

మేమి? గుహ్యోదరపరాయణత్వముతో పశ్వాద్యవిశేషముగ చాల
రోజులు బ్రతికియుండుటేనా? కాదు. జన్మజరామరణాదిదుఃఖములు
లేకుండ నిత్యాఖండానందస్థితి నొందుటే ఫలము. అట్లుగానిచో "భూశ
యన మైనతరువాత 90 యేండ్లముదుసలి తిరిగి జీవించినపుడు 'ఆహా!
భూమిమీద గడ్డిగింజ లున్నవి, తిరిగి బ్రతికెను' అనెదరు. దాని కర్థ
మేమి? గడ్డిని తినునవి నాల్గుకాళ్ళజీవులు. గడ్డిగింజలు తినునవి రెండు
కాళ్ళజీవులు. అంతకంటె వారిజీవితప్రయోజన మొండు లే"దని మాపెద్ద
బావమరది శ్రీ చెరుకుపల్లి వెంకటశివయ్యగారు చెప్పినట్లు 120 సం॥
బ్రతికినను జీవితకర్తవ్యమును సాధించలేక గంతవ్యార్థము నొందలేక
పోయినచో పదివేలరూప్యముల మోటారుశకటముపై కుళ్ళుమన్ను
వేసి దున్నలతో లాగించినట్లే వ్యర్థజీవనుడే యగును. మానవోపాధి
యిట్టివ్యర్థజీవనమున కేర్పడినది కాదు. "యస్మిన్ జీవతి జీవంతి
బహవ స్సతు జీవతు" అనిగదా పెద్దలు చెప్పెదరు. ఐతే యీవాక్య
మునకుగూడ ఒకఫ్యాక్టరీనో, స్కూలునో, మరొకవ్యాపారమునో,
పెట్టుమనియు, దానిచే కొందరు జీవింతురనియు, నట్లాచరించువాడే
ధన్యుడనియు కొందరిభావము. యజ్ఞాదుల చేయుమనియు, దానివలన
పర్జన్యవృష్టిసస్యాదులద్వారమున పలువురు జీవింతురనియు, నట్లాచ
రించువాడే ధన్యు డనియు మఱికొందరిభావము. ఇట్లనేకవిధముల
నైహికాముష్మికలోకాకాంక్షులు చెప్పెదరు. కాని శ్రీసద్గుర్వను
గ్రహమున తత్సర్వ మాత్మలోకమాత్రమై యున్నమాభావమో-
సర్వాధిష్ఠాననిర్విశేషాఖండచిదాత్మానందానుభూతిని శ్రీసద్గుర్వనుగ్ర
హమున నధిగమించినచో "భగవత్యఖిలే జగత్త్రయే న మమాస్యం
నచ కార్య మస్తి మే" యని మనవాడు మానసికపూజలో చెప్పి
నట్లు కృతకృత్యుడే గావున "ఐతదాత్మ్య మిదగ్ం సర్వమ్" అనుత్రై
కాలికానుభూతిలో తనకంటె విశ్వమే వేరుగనిలువదు. వాసుదేవు డగు
తనవాసన (సత్త) వలననే జగత్త్రియము (గ్రాహ్యగ్రాహకాత్మక)
స్థూలసూక్ష్మకారణస్వరూపజగజ్జాల మంతయు, రజ్జుస్థితిచే భ్రాంతి
సర్పమువలె జీవించిన ట్లుండును. కావున నట్లు సార్వాత్మ్యస్థితిచే

సర్వదా యఖండానందాత్మస్వరూప మగుశ్రీసద్గురురూపముగ సర్వజీవనజీవనుడై వెలుంగువాడే సత్యజీవనుడు. అట్టివాడే మనబాలావధూత. ఇట్టివస్తువు మరణించు టెట్లో విచారింపుడు. "అథ మర్త్యోఽమృతో భవతి" యని యనావరణాత్మానుభూతిసమకాలముక్తు డగువానికి అమృతస్థితియేగాని తిరిగి దేహాత్మభావులకువలె మృత్యు వెట్లు పొసగును? బుద్బుదములెల్ల జలమే సర్వదా జలమే. భ్రాంతిసర్పము రజ్జువే సర్వదా రజ్జువే. గ్రాహ్యగ్రాహకాఖిలస్వప్నప్రపంచ మాత్మమాత్రమే సర్వదా ఆత్మమాత్రమే. అట్లే నిఖిలదృశ్యము దృగాత్మమాత్రమే. సర్వదా దృగాత్మమాత్రమే. ఇట్టిస్థితిలో "అజాయమానో బహుధా విజాయతే" "సబాహ్యాభ్యంతరో హ్యజః" అన్నట్లు పుట్టుట గిట్టుటలకు భ్రాంతికంటె వేరుగ నర్థములు గలవా? లేవు. కావున నేసంశయములు లేవు.

## —♦ సంకోచము ♦—

ఈపీఠికలో నింతవిపులముగ స్వపుత్రిచరిత్రను నేను వ్రాయుటలో నన్నృతము లేకున్నను ఆపాతదృష్టితో లోకసామాన్య మీలేఖనము మమకారప్రయుక్తమని భావించుదుగావున సంకోచింపనగు నని అస్మచ్ఛ్రేయోభిలాషులు కొందరు సలహాలనొసంగుచుండినను "గుణినిష్ఠగుణాభిధానం న దోషాయ ప్రత్యుత ధర్మాయాపి" "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చి దేనమ్" ఇత్యాదిసూక్తిన్యాయము సకలవిబుధసంభావితమగుటచేతను, వస్తుతః మాకుగల పితృపుత్రిభావము ద్వాదశైకాదశస్థానస్థితికేతుజాతకత్వప్రాధాన్యమేగాని కేవలమమకారమూలకము కా దనురహస్యమును "ఉత్పత్స్యతే మమతు కోపి సమానధర్మా కాలోహ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ" యన్నట్లు మత్సమానస్వభావు డొక్కడైన గ్రహించి సంతసించిన జాలునని తలంచి, యన్నృత మగునన్యలోకము ననుసరించి యబాధిత మగు నాత్మలోకసంకోచన మన్యాయ్యము, నసంభవమునగుటచే స్థాలీపులాకన్యాయసంగృహీత మగునీపీఠిక నింతకంటె సంకోచింపజాలనందుకు మచ్ఛ్రేయోభిలాషులు మన్నింపబ్రార్థితులు.

ఈవ్యక్తినిగురించి నేనే యిట్లు వ్రాయుట గాదు "జగ మెరిగిన బ్రాహ్మణునకు జంధ్యం బేలా?" అన్నట్లు శ్రీశ్రీశ్రీ జగద్గురువులు మొదలీవ్యక్తి నెరిగినట్టిధార్మికపండితులోక మెల్ల నెట్లు లేఖల వ్రాసిరో దిగువ తిలకింపుడు.

(1) శ్రీశ్రీశ్రీమత్ (1008) జగద్గురు పుష్పగిరి శాంకరపీఠాధీశ్వర
శ్రీమత్పరమహంసాదిసకలబిరుదావళీ విరాజమాన
శ్రీమదభినవోద్దండ విద్యాశంకరభారతీస్వామివారు.
(18-3-44. రెంటపాళ్ల)

"మీకు సర్వవిధముల అనురూపు డగునట్టికుమారరత్నము. మాకు, మాసంస్థానమునకు భావిధర్మసంరక్షణకొరకై సహాయకారి కాగలడని భావింపబడిన శిష్యావతంస మగు 'జయరామమూర్తి' అకాలమృత్యువున కెర యగుట కలిపురుషుని వజ్రప్రహారములలోను వికటతాండవములలోను ఒకటి యని భావించుమాసంతాపమునకు మేరయే లేదు. అయినను 'జాతస్యహి ధ్రువో మృత్యుః' 'నాయం హంతి న హన్యతే' 'సంసారోయ మతీవ విచిత్రః' ఇత్యాది పరశ్శతప్రమాణజ్ఞానావబోధ పవిత్రాంతరంగులగు మీ దుఃఖము నపనయించుకొనుశక్తి లేకపోలే దనియే మాదృఢవిశ్వాసము."

(2) శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య
శ్రీదక్షిణామూర్త్యాశ్రమిస్వామివారు
(24-12-43 కాశీ)

"లోకాతీత మైనవివేకవిజ్ఞానవంతుడగు బ్రహ్మశ్రీ జయరామశర్మ మనలను విడిచి తనసహజానందప్రాప్తి బొందినని వినుటచే మనస్సు పలువిధములుగా తల్లడిల్లినది. కాని.......... ఇది యంతయు భగవన్మాయ. ఇక నకరికొంటిని చెప్పుటకు లేదు. గనుక నీవివేకవిజ్ఞానమువల్ల శాంతిసమాధానముల తెచ్చుకొనేది.......... వాని చరిత్ర విచిత్రమైనది. అంతకు మించి వ్రాయుటకు శబ్దములు అక్షరములు బుద్ధిబలవు"

(3) శ్రీ రామడుగు కోటయ్యగారు (రిటైర్డు తహశీల్దారు)
(20-12-43 గుంటూరు)

"తమ దనేకజన్మపుణ్యఫలముగా పొందిన పుత్రరత్నము, అపరశుకుడని పేరు పొందినవాడు, సకలసద్గుణముల కాటపట్టు, అనేకశాస్త్రప్రవీణుడు, ఆజన్మబ్రహ్మచారి

కలంకారప్రాయుడు, 'మావాడు' అని మే మెల్లరము చెప్పుకొని గర్వింపదగినవాడు. భారతభూమియొక్క ప్రస్తుత దౌర్భాగ్యమున కనుగుణముగా భౌతికదేహమును వదలినాడన్న పిడుగువార్త వినవలసిన అయోగ్యతమాదృశులకు కలిగినందుకు మిక్కిలి పరితపించుచున్నాము. ఈదుఃఖసముద్రమును తరించుట తమ కెట్టికష్టమో ఊహింపజాలకున్నాము. వసిష్ఠునంతటివాడుకూడ మాయను దుఃఖరహితముగా తరించలేకపోయినాడు. భగవంతుడు యిట్టి పరిస్థితిలో కావలసినధైర్యము సంపాదించుటకు కావలసిన సాధన సామగ్రినిచ్చియున్నను ఒకప్పుడైనను ధైర్యము చలించకపోదు."

4 అవధానిశిరోమణి, మహోపాధ్యాయ

## శ్రీ. కాశీ కృష్ణాచార్యులుగారు

(23-12-43 గుంటూరు)

"మహాశయా!... మీకు గల్గినమహావిపత్తు మిమ్ము నెరిగినమానవలోకమున కెల్లనతర్కితవజ్రపాత మైనది. మీయెడల జెప్ప నక్కరలేదు. 'తాం స్త్రితిక్షస్వ భారత' 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' ఇత్యాది శ్రీకృష్ణోపదేశములవల్లనే మీదుఃఖమహాసముద్రము శాంతించుగాక. అయినను శ్లో. 'పూష్ణైధతే తదమల ప్రతిభా చకాస్తి।సర్వత్ర పద్మవసతిశ్చ విభాతి లక్ష్మీః।ఇత్థం విచింతయతి పంకజగే ద్విరేఫే। తం తత్క్షణా ద్రవి మభక్ష దహో ద్యుభానుః' అనురీతి జరిగినది. ఇది మిమ్మును పరీక్షించుటకే భగవంతుని పన్నుగడ. క్షరశరీరమును వీడి యక్షరశరీరమును దాల్చిన మీపుత్రరత్నమునకు అఖండస్వరూపానందానుభవమును శ్రీకృష్ణుడు కటాక్షించుగాత."

(5) " దివ్యవాణి " పత్రికాసంపాదకులు,

## మహాకవి శ్రీ. చిదుకుల అప్పయ్యశాస్త్రిలుగారు

(31-12-43 సికింద్రాబాద్)

"సత్తెనపల్లితాలూకా చాటపాయపాలెమునందు వేదపాఠశాలను విశిష్టపద్ధతితో నడుపుచున్న బ్రి॥ ముదిగొండ వేంకట రామశాస్త్రిలుంవారి కుమారుడు 'జయరామశర్మ' ఈనెల 16వ తేదీ రాత్రి 8 గంటలకు పరమపదించినాడని తెలుపుటకు దురపిల్లుచున్నాము. ఇతడు, శ్రుతి, స్మృతి, ధర్మశాస్త్ర, తర్క, వ్యాకరణ, జ్యోతిష, కవిత్వాది విద్యలందు మిక్కిలి మేధావియై బ్రహ్మచర్యము గడపి గతవత్సరమే వివాహితుడై వైశ్వదేవ దీక్షగైకొన్న ధార్మికశిరోమణి. ఇట్టి సుగుణఖని ఇంతచిన్నతనముననే 'సుకృతి ర్గతాయుః' అన్నట్లు దివి కేగి సనాతనలోకమునకు తీరనికొరత కలిగించినాడు. అతనిమృతి కెంతయు వగచుచున్నబంధువులకు మా

హృదయపూర్వక సానుభూతిని దెల్పుచున్నాము. వేంకటరామశాస్త్రులవారికి వారి ప్రాజ్ఞతయే యూరట కల్గింపవలసియున్నది.

### 6 "కల్పవల్లి" పత్రికలో వ్యధితహృదయుడు

శ్రీ. సన్నిధానం బాలకృష్ణమూర్తిగారు

1–1–34

### — మాకర్మ మిట్లు కాలినది —

" స్వభానుమార్గశిర బ౹౹ గురువారము (16–12–43 నాడు రాత్రి షుమారు తొమ్మిదిగంటలవేళ మాజయరామమూర్తి (ముదిగొండ వేంకటరామశాస్త్రులుమామ గారిపుత్రరత్నము) బ్రహ్మీభావము నందినాడు.

ఇతడు అష్టవర్షోపనీతుడై నియతనిష్కల్మషబ్రహ్మచర్యవ్రతదీక్షతో వేదాధ్యయన మొనర్చి అధ్యాపకకోటిలో చేరందినవాడు, తర్కవ్యాకరణవేదాంతాదివివిధ శాస్త్రజ్ఞానసంపన్నుడు, సునిశితధర్మతత్త్వవేత్త, నిశ్చలధర్మానుష్ఠాత, వైశ్వదేవపరుడు, నిరుపమానగురుభక్తితత్పరుడు, కవి, మహామేధావి—ఇట్లెన్నియని వ్రాయగలము? సూత్రప్రాయముగనైన వానిసుగుణవిశేషముల నన్నింటిని పేర్కొనగల్గుట అసంభవము. ఒక్కమాటలో మాజయరాముడు సుగుణరత్నాకరుడు. కాని వీని అన్నింటను నాయకమణివంటిదై సకలలోకారాధ్యమైనసుగుణవిశేషము వానికి గలతత్త్వనిరూఢియే. ఇయ్యది అనన్యసాధారణమని వానితుదివాక్యములను బట్టియే గుర్తింపగల్గితిమి.

ఇంతకు వీనివయస్సు ఇరువదిరెండువత్సరములుమాత్రమే. వీనిజీవిత మంతయు పరిశీలింపగా గీతలలోని "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభిజాయతే" ప్రభృతిభగవద్వాక్యములే స్ఫురించుచున్నవి. ఇట్టిమాజయరాముని అకాలమరణ వార్తను విని విచారింపనిపరిచితు లెవరు? కంట తడిపెట్టనిమిత్రు లెవరు? దుఃఖింపని బంధువు లెవరు? విలపింపని ఆప్తు లెవరు? శివ! శివ! వీనిభార్య ముక్కుపచ్చ లారని బాలిక. అత్యంతదురదృష్టవంతురాలు. ఇక దానిఆయుశ్శేష మెట్లు గడుపవలయు నోగదా! తత్త్వజ్ఞులైనధీరుడుగనుక మామామగారు సుగుణరాశి యగుపుత్రునివియోగ దుఃఖమును శివుడు హాలాహలమునువలె మ్రింగగల్గుచున్నారు, కాని, శివ శివ ఆతల్లిగర్భశోకము అనివార్యము, దురూహ్యము గదా! దినదినాభివృద్ధి నొందుచున్న గురుకులాశ్రమోద్యమునకు వీనినిర్యాణము తీవ్రాఘాతమే యైనది. దానిభవిష్యత్తు ఎట్లున్నదోగదా! ధర్మారాధనోత్సుకులై యున్నయువకులకు మాజయరాముడు సంపూర్ణాదర్శకుడు. వీనివియోగమున మాకుతీరనికొరంతయే గల్గినదిగద! మైత్రి, ఆప్తత, బాంధవ్యము మమ్మిరువుర ముప్పిరిగ పెనవైచుకొనియున్నవి ఇంతియే కాదు. ఇతడు వయసున కడుచిన్నయయ్యు నా కన్నివిధముల ఆదర్శప్రాయుడు, గురుతుల్యుడు.

ఇట్టిమా జయరామమూర్తిని కోల్పోయి “బ్రతికియున్నాడ జీవచ్ఛవంబ నగుచు” పరమేశ్వరా! ఎంతవిపరీతచర్య కొడిగట్టుకొంటివయ్యా! దుష్టగణశిష్టశిక్షణలు చేయుచున్నావే! ఇదేమి? నీవును కలిభూతావిష్టుడ వైతివా? కాకున్న ఈస్వశాఖాచ్ఛేదనమున కర్థమేమి? మాజయరాముడు సకలగుణాభిరాముడే! ధర్మజ్ఞుడే! ధర్మానుష్ఠాతయే! ధర్మప్రబోధనోత్సుకుడే! పరమేశ్వరా! ఇట్టివానినే రూపుమాపుటయా! తత్వజ్ఞుడై, ధర్మారాధనతత్పరుడై, ధర్మోద్ధరణదీక్షాబద్ధకంకణుడై, కార్యశూరుడైన ఆతండ్రికా ఇట్టిపుత్రవియోగదుఃఖమును గల్గించుట? ఘోరా! ఏమి న్యాయమూర్తివయ్యా! ఏమిధర్మపక్షపాతివయ్యా!

...ఔను, ఔనులే, నీవుమాత్ర మేమి చేయగలవు? మాకర్మ యిట్లు కాలినది.

శివ. శివ. శివ.

## (7) శ్రీ. చందా కాంతయ్యశ్రేష్ఠిగారు

త్యాగశీల దానకర్ణాది బిరుదాంకితులు.

29_12_43. వరంగల్

“అత్యంతదుఃఖకర మైనవార్త విని దుఃఖాక్రాంతుల మైతిమి. విద్యావిశారదు డగుపుత్రుని గోల్పోయినతమపుణ్యదంపతులకు తీరనిదుఃఖము కలిగెను. అయినను సకలవిషయములయందు ఆరూఢి చెందినవిజ్ఞానసంపన్ను లయిన తమకు మన విచేయవలసిన దెద్దియు లేదు ......... సర్వవ్యాపకస్వరూపము పొందినపుణ్యమూర్తి తమపై సర్వభారము విడచి వెళ్ళినారు .................. సర్వవ్యాపకరూపమును ధరించిన ఉత్తమోత్తముడైన పుణ్యమూర్తి యగుజయరామమూర్తిగారి ఆత్మశాంతినిగురించి నేటిదినమున బ్రాహ్మణసమారాధన, దైవప్రార్థన జరుపుట మాకర్తవ్య మని భావించి జరిపించితిమి ......... అఖండబ్రహ్మజ్ఞానవిజ్ఞానసంపన్ను లగు తమకు ప్రకృతము ప్రాప్తించినదుఃఖము పరమేశ్వరానుగ్రహమువలన వైరాగ్యముగా మారి వీరోచితధీరలక్షణములచే తారుమారగుచుండు ప్రకృతిలక్షణములను ధిక్కరించి మాబోటిపుత్రలోకము నుద్ధరించగలరని మరిమరి ప్రార్థించుచున్నాను............”

## (8) శ్రీ. వేమూరి రామబ్రహ్మశాస్త్రులుగారు.

న్యాయవేదాంతాచార్యులు

31_12_43. ఒంగోలు

“జయరాముడు కీర్తిశేషు డయ్యె ననెడివార్త నాహృదయమును మిక్కిలి క్షోభపెట్టెను. లోకమున కాదర్శప్రాయుడు ధర్మస్వరూపు డగునాబాలుడు మృతి

జెందుటవలన లోకమునకు తీరనిలోటు ప్రాప్తమయ్యెను. వివేకమార్గములో నుండు నీవు ఈదుఃఖమును మనస్సులో పెట్టుకొనక స్థిరుడవయి యథాపూర్వముననే సత్కాలక్షేపము చేయుచుండగలవని కోరుచున్నాను. భగవంతుడు వచించినగీతార్థసారము ననుభవములో నుంచుకొనిన నీకు నిత్యోత్సాహకముగ వ్రాయుట చ్యుతచర్వణము”

## 9) శ్రీ. గరికెపాటి లక్ష్మీకాంతశాస్త్రిగారు.

(26-12-43. పండిట్. జాగీర్దార్సు కాలేజి, బేగంపేట)

“ఘోరవార్త విని దుఃఖసముద్రమున మునిగినాము. మనబంధుజాలమునకే గాక దేశమునకే గొప్పనష్టము సంభవించినది – ఏమి వ్రాయవలెనో తోచకున్నది. పరమేశ్వరుడు మీకుకుటుంబమునకు సంపూర్ణమనశ్శాంతిని ప్రసాదించుగాక.”

## (10) శ్రీ. భువనగిరి కోదండపాణిగారు.

(రిటైర్డు సబ్ రిజిస్ట్రారు)

(5-1-44 గుంటూరు)

“గుండెలవియజేయు బాంబువలెనుగున వచ్చిన యత్యంత విషాదవార్తను మేమెల్లరము నిస్త్రాణులమైతిమి...... కానవచ్చుమాత్రమునకే ప్రేక్షకుల యానందాశ్రువులకు బుగ్గలువ్వె ఆకోమలసౌందర్యమూర్తిరాజము, ఈడునకు మించి పరిపక్వత నొందిన అయ్యపూర్వవ్యక్తితేజము; వాతావరణము దాటి వెలింగిన యానాటి విద్యార్థిప్రతిభావిశేషము, అతనివినయాదిగుణసంపత్తి, ఆబాలునివాదపటిష్ఠత, ఆ కుమారునిముఖవర్చస్సు, ...అన్నియు నొక్కమ్మడి అంతరించెనే!......ఎంతఘోరము ......ఆమహాతేజము తమకడుపున జనించి నాండి సాకి విద్యాబుద్ధులు గరపిన తలిదండ్రుల కెంతటియాశాభంగమో...... ఈశాసనసభాసమునకు, యువకశృంగమునకు, వేదమూర్తికి, కావ్యశాస్త్రవ్యాసంగమునకు, వ్యక్తిత్వవికాసమునకు, బాలబాలునకు,... శిష్టశిష్టునకు ...... ఈపాపకృత్యమువాతావరణముచే తెనుగునులోకము దుఃఖపూర్ణమయ్యెనే?......”

## (11) శ్రీ. గరికెపాటి సీతారామశాస్త్రులుగారు

(అగ్రికల్చరల్ డిమాన్స్ట్రేటరు)

(1-1-44 కాకినాడ)

“అతనిమరణము మీకున్నూ మాకున్నూ మాత్రమేగాక ఆంధ్రిలోకమునకు,హిందుమతమునకు, ఆంధ్రదేశపండితులకుకూడతీరనిలోటు కలుగజేసినది. అతనినిచూ

చిన నేను శ్రీశంకరావతారమా? శ్రీశుకావతారమా? యని సంతోషమును ఆశ్చర్యమును పొందుచుంటిని. గాని యాసంతోషము దుఃఖముగా మారెను. ఇది చూడ యాజ్ఞవల్క్యులవారు జనకమహారాజును, ఋషులను పరీక్షించుటకు జేసినట్టివిధి మిమ్ములను మమ్ములను పరీక్షించుటయా? యనునట్లున్నది. మీరుగూడ జననునివాదిరి పరీక్ష కాగగలరుగాని మే మెట్లు నిలవగలము? ...... పాఠశాలకొరత దీర్చుటకు మార్గము గనుపించదు......"

## (12) శ్రీ. వంగపల్లి నీలకంఠశాస్త్రిగారు.

(ధర్మప్రచారకసంఘ కార్యకర్త)

(5-1-44. షికింద్రాబాద్)

"మహాత్మా! అపరశంకరు డనదగినతమకుమారరత్నం బగు శ్రీజయరామమూర్తిగారియొక్క పరలోకప్రాప్తిదుఃఖసమస్యను కల్పవల్లియందు జూచినపుడు నా మనస్సున కెంతటిదుఃఖము కలిగినదో వ్రాయజాలకున్నాను. తత్వజ్ఞు లయినతమసత్యధీరత్వమున కిది శివపరీక్షగాని వేరు గాదు.....,"

## (13) శ్రీ. ఇంగువ శ్రీకృష్ణయ్యగారు. (హైకోర్టువకీలు)

(4-1-44 నెల్లూరు)

"సకలసద్గుణరాశియు, సనాతనలోకమునకు ఆదర్శప్రాయుడును అగుమీ పుత్రుడు అత్యల్పవయస్సునందే మరణించెనని ...... కల్పవల్లివలన తెలిసి...... హృదయము చాల పరితపించుచున్నది. ఈవియోగము బంధువర్గమునకు మిత్రవర్గమునకుమాత్రమే గాక ధార్మికలోకమున కంతకును దుఃఖజనక మగుచున్నది......"

## (14) శ్రీ. వినపాముల లక్ష్మీనరసింహముగారు.

(అఖిలభారతవర్షీయవర్ణాశ్రమస్వరాజ్యసంఘ కార్యదర్శి)

(4-1-44. గుంటూరు.)

"పరమేశ్వరుడు మీకు కలుగజేసినకష్టములనుగూర్చి మీకు వ్రాయుటకు కలమాడుట లేదు......యెవరు పరితపించి యేమిసార్థకము?......మార్కండేయునివలె ప్రయత్నించి దీర్ఘాయువును సంపాదించ శక్తిగలజయరామశాస్త్రికి ఆప్రయత్నమును గురించి స్పృహ గలుగకపోవుటగూడా దేశదౌర్భాగ్యమే. వేదాంతగ్రంథము లన్ని

యు సమగ్రముగా పరిశీలించి వీలయినంతవరకు ఆచరణలో నుంచుకొనినతమవంటి బుద్ధిశాలులకు నావంటిమందమతి చెప్పగలశాంతివచనము లేమి యుండును?......"

## (15 శ్రీ. నేతి సీతారామయ్యగారు, బి. ఏ.

(గుంటూరుమండలవేదపరివర్థకవిద్వత్పరీక్షాసభా కార్యదర్శి

12-1-44 తెనాలి

"శ్రీజయరామశర్మ కాలము లేదని కాబోలు అతివేగముగా వేదగ్రంథము పూర్తిచేయుటయేగాక శాస్త్రములలోగూడ చక్కనిప్రావీణ్యము సంపాదించెను. విద్యావంతులు ఇంతకు మించినవారు లోకములో అనేకమంది యుండవచ్చును, గాని జయరామశర్మయొక్క యోగ్యత, తలిదండ్రులయందు పెద్దలయందు గలభక్తిశ్రద్ధలు, స్వధర్మానుష్ఠానదీక్ష మొదలగుసద్గుణములు అతనికే చెల్లును. నేను ప్రతిసభలోను ఆతని చూచినపుడు, మాట్లాడినపుడు, మనసులో యెంతో పొంగియుండెడివాడను, ఇటువంటియోగ్యుని కన్న భాగ్యము యెంతదో? యని నాలో నేను అనుకొనెడివాడను. ఎందుకు యీవ్యర్థమైనమాటలు? ఏమి చెప్పినా వ్రాసినా వెంకట్రామశాస్త్రిగారిని దుఃఖసముద్రములోనుంచి తప్పించుట యెవరికి చేతకాగలదు? వారు పెద్దలసేవ చేసి ఆధ్యాత్మికవిషయము చక్కగ తెలిసికొనినవారు. సర్వేశ్వరునికటాక్షముచేత వారు యీదుఃఖమును మరుపున దెచ్చుకొనవలయును."

## (16 శ్రీ. చెరుకుపల్లి నరసింహశాస్త్రిగారు.

(శ్రీజయరామశర్మ మేనమామగారు, మామగారును)

(15-1-44. సెకరికల్లు)

"బ్ర. వే. వెంకటరామశాస్త్రులు బావగారిపాదపద్మములకు నమస్కారములు- 'దురధిగమాత్మతత్వనిగమాయ తవాత్తతనో: చరితమహామృతాబ్ధి మవగాహ్య తపాంసి జహు:' అనునటుల మహనీయులపుట్టుకయు, వారిచరిత్రానుసంధానమును తాపత్రయాపనోదకమేగాని తాపహేతువు కాదు. ఈశ్వరవిభూతిరూపమైన అమహనీయవ్యక్తి మనహృదయములయందు నిరంతరము వెలుగుచుండగా మన కేవిధమో కొన్ని ఐహిక సంపత్తులు కొరతపడ్డవని విచారపడుట అవిచారకృతము. మహనీయులయుత్పత్తి సంసారనివృత్తికేగాని, సంసారమును పొడిగించుటకు కాదు-ఇది మమత్వపురస్సరమైన అభినివేశమని భావించవద్దు. ల॥ సీతక్కయ్యనుగూడా పుత్రత్వభ్రాంతిని విడిచి పరమగురువునుగా ధ్యానించుచు ధైర్య మవలంబించుమని చెప్పండి. మహావాక్యశ్రవణీయము లైనశతాధికశ్లోకముల మనకు పఠనీయములుగా ప్రసాదించినందుకు మన మెంతయో కృతజ్ఞులము,........"

## (17) శ్రీ. ఆత్రేయలక్ష్మణశాస్త్రిణః.

## తామ్రపర్ణీతీరవాసిన షడ్దర్శనకుశలాః.

'18-1-44 ఓంకారమందిరమ్'

శ్రీమహాగణాధిపతయే నమః

అథ "గుణినిష్ఠగుణాభిధానం న దోషాయ, ప్రత్యుతధర్మాయూపితత్కల్పతే" ఇతి న్యాయ మవలంబ్య కించిదివ ప్రస్తూయతే విస్తరభీరుభి రస్మాభిః.

"బ్రాహ్మణగురుకులాశ్రమచరితే విషాదవృత్తాంతః"

ఇహాఖిలం భువి జని మాపన్నానాం సమేషా మద్యశ్వోవా మరణ మవశ్యం భావి. తత్రహి పామరాః ఖిద్యంతః ఖేదయంతిచ పరాన్. పండితాస్తు "జాతస్యహి ధ్రువో మృత్యు" రిత్యాదిగీతావచనై రనుభవారూఢై ర్మన స్సమాధాయా న్యావపి శ్రుతియుక్త్యనుభవప్రదర్శనేన త్యక్తశోకా న్కుర్వతే. తస్మాదృశపండితానామపి చేతఃకమలముకులీభావకారిషు వృత్తాంతేషు సుకృతినాం పరలోకగమనవృత్తాంత స్సర్వేభ్యో ముఖ్యతర ఇత్యత్ర స ప్రమాణాంతరాన్వేషణస్యా వశ్యకతానుభవినాం విదుషాం కృతేస్తి. అతఏవ మహానుభావధౌరేయాణామపి వ్యాసవసిష్ఠాదీనాం శుకాదిస్వపుత్రమిత్రగురుశిష్యాదివియోగే చిత్తసంతాపానలః ప్రజ్వలితోభవదితీతిహాసపురాణసత్కావ్యాదిషు సహస్రశ ఉపలభమానం వృత్తాంతజాత ముపపద్యత ఇతి నతిరోహితం కృతదృష్టీనామ్. తత్ర వ్యాసాదీనామపి సాక్షాత్కృతస్వమహిమ్నాం కథం చిత్తోద్వేగ ఇత్యత్రేద మేకం కారణం సిద్ధాంతతో నిర్గలితం జ్ఞాయేత. యత్తే లోకానుగ్రహార్థం సర్వేశ్వరేణ సంస్థాపితే ధర్మపథాత్మికే మహాప్రస్థానే సామ్రాజ్యాధిపత్య మధికృత్య లోకకల్యాణప్రదధర్మజ్ఞానవైరాగ్యాదిరూపపీయూషధారాసంపాతేన జనా న్సంతర్పయంత స్స్వకీయే పరోపకారాత్మకే మహాయజ్ఞే సర్వతోముఖోచితసాహాయ్యప్రదానాలంకర్మీణా న్తాన్ స్వయం స్వకార్యం సర్వలోకోద్ధరణాత్మకం నిర్వర్తితవతశ్శుకాదీన్ లోకాంతరగతా ననుస్మృత్య లోకోద్ధారకతత్తాదృశపురుషధౌరేయాణాం స్థానే వ్యక్త్యంతరానుపలంభేన భవిష్యంతం సర్వలోకజనతాశోకానలసంతాప మాకలయ్య కరుణయా బాష్పాక్తలోచనద్వయా అభవన్నితి. ఇతో నాన్యత్కారణం సూక్ష్మేక్షికయా విచారయంతోపి జ్ఞాతు మీశ్మహే.

ఏవమేవ ప్రకృతే. బ్రహ్మశ్రీము దిగొండ వేంకటరామశాస్త్రిచరణానాం జ్యేష్ఠపుత్రస్య పండిత జయరామశర్మణో వింశతివర్షదేశీయస్యాపి సంప్రాప్తానేకపురుషాయుషప్రాప్యగుణగణస్య కృతకృత్యస్య భౌతికదేహపరిత్యాగ మాకాలికం శ్రుత్వా విస్మృతస్వస్వకార్యేతికర్తవ్యతాకాః కిరాతపరిత్యాజితస్వయూథ్యా మృగ్య

ఇవ బాష్పపూరపూరితనయనయుగలా స్తదీయాం విమలాం కీర్తికన్యామేవ వాచా లేఖైశ్చ వర్ధయంతః కించిదివ చిత్తప్రసాద మాపన్నా దృశ్యంతే శేషా ఆంధ్రదేశీయపండితవరేణ్యా ఇదానీమేవ. ఇహ స పామరాణాం విషయేతు వక్తవ్యమేవ నాస్తి. తదీయబంధుతాయాస్తు స్వరూపం న వాచాంగోచరమ్ః. సర్వేపి స్వనేత్రబాష్పాణ్యేవ పరేతస్య నిర్వాపాంజలితయా తోషాయ ముంచతి అస్మద్గురుకులస్యైషా విషమా తరస్థితిశ్చ అభూతపూర్వాం శోకరసస్య పరాం కాష్ఠాం పరిచిన్వంతీ స్వం మహాశ్రమాన్నరూపం ఫలం దృష్టనష్టమేవ చింతయంతీ ప్రకాశరహితా తిష్ఠతి. యో గురుకులాశ్రమస్యోద్దేశో మాహాన్ ధర్మసంస్థాపనరూపో స్తి తత్సిద్ధౌ సర్వథా యోగ్యస్య శ్రద్ధాలోశ్చ స్వయ మనుష్ఠాయ పరా ననుష్ఠాపయతో మహానుభావస్యాశ్రమసచివ స్యాథవా ధార్మికసేనాధ్యక్షస్య వియోగే (జయరామశర్మణః) కథం ధార్మికపటగృహేషు దీపో దీప్యేత? నూనం దుర్దైవహతకస్య కలిమిత్రస్య దుశ్చేష్టావిపాక ఏవాస్మదాశ్రమోత్థితిమూలకారణనికృంతననిదానం భవేత్ కథమన్యథా పుణ్యశ్లోకస్యాపి విసమయమృత్యు స్సంభావ్యేత?

అస్తునామ యత్కిమపి ఇదంతు సర్వాపేక్షయా త్యాశ్చర్యకర మనన్యసాధారణం మహానుభావపురుషమాత్రవిషయం యత్ మరణకాలేపి స్వపితు స్సకాశాత్తత్త్వోపదేశగ్రహణపూర్వకతద్ధ్యానం, ప్రాణవియోగకాలేంతతో గాయత్రీశబ్దోచ్చారణం, నిశ్చింతత యోపరతిశ్చేతి పండితజయరామశర్మవిషయే దృష్టమపి సర్వాన ప్యస్మాన్ ప్రమోదభరభాజః కరోతి. ఏతాదృశస్య మహానుభావస్య చరితేన ధర్మబుద్ధి ర్నాస్తికానామపి ప్రాదుర్భవేదితి మత్వా తిసంగ్రహేణ తత్ప్రోచ్యతే.

పండిత జయరామశర్మా 9-4-22 సమయే స్వమాతామహగృహే మానుషతను మధిజగామ తత ఆరభ్య క్రమేణ పిత్రో రతులితానందం జనయ న్నుపనయనాత్పూర్వమేవ వర్షద్వయమధ్యే స్వదేశీయభాషాలిపిగణితవ్యవహారే ష్వనన్యబాలదృష్టం విజ్ఞానం సంపాద్య వృద్ధానుచారకారీ కృత్రిమదేవపూజాదినా ఆత్మనో భావినీం సన్మార్గపక్షపాతితాం స్ఫుటం సూచయామాస. అథ యథావిధి గర్భాష్టమే వయసి 7-8-29 తమదినే పిత్రోపనీతః సంస్కారాంతరగ్రహణపూర్వకం తత ఆరభ్య అవిచ్ఛిన్నతయా సంధ్యాస్నానజపసమిదాధానాదినిత్యకృత్యజాతం యథాశాస్త్ర మనుతిష్ఠన్నేవ ప్రాయః పంచసు వర్షేషు నైషధాంతసంస్కృతకావ్యభాషావ్యుత్పత్తిం సంపాద్య పిత్రా ప్రేరితో వేదాధ్యయనం గుంటూరునగరం గత్వా 5-4-34 తమవాసరే ప్రారభ్య పంచభి ర్వర్షై ర్వేదాధ్యయనం కించిన్న్యూనం పరిసమాప్య, 30-1-39 తమవాసరే అస్మద్గురుకులాశ్రమం ప్రవిశ్య క్రమేణ స్వకీయావశిష్టవేదభాగ మధీయాయ. [illegible] శేషే తైత్తిరీయే క్రియాంతస్వాధ్యాయినా మివాధ్యాపనేపి స్వకీయాం శక్తిం ప్రదర్శ్య బ్రాహ్మణగురుకులాశ్రమవిద్యార్థినః కతిపయాన్ మంత్రా న్పాఠయామాస. ఏతత్కాల ఏవ స్వపితు స్సకాశాత్ న్యాయవేదాంతమీమాంసాశాస్త్రకరణా న్యక్షరాధికం స్వమనీషయా సూక్ష్మా త్సూక్ష్మతరమపి విషయ

జాతంచ గృహ్ణన్ ధారణాశక్తిసంపన్నః సర్వేషాం ద్రష్టౄణాం మనాంసి వశీచకార. బ్రాహ్మముహూర్తా దారభ్య రాత్రేర్నవఘంటాపర్యంతం భోజనాదిశారీరకార్య వ్యతిరిక్తసమయే సమగ్రేపి ధర్మానుష్ఠాన, తజ్జ్ఞాన, తత్ప్రమాణభూతగ్రంథపర్యాలోచన, ఛాత్రాధ్యాపనాదిసత్కార్యేష్వేవ బుద్ధిం పరివర్తయన్ అద్యంతయోః పురుషార్థయో ర్వాంఛాం మధ్యమయో రుపేక్షాంచ వహన్ ప్రాగ్భవీయయోగభ్రంశాన్మానుషదేహం ప్రాప్తో యోగీవచ పర్యటన్ శాంతిమూర్తిః స్వనామానుగుణం మాతాపితృబంధుమిత్రశిష్యాదిషు భక్తిం పరాం స్నేహంచ బధ్నన్ సాక్షా ద్రామచంద్ర ఇవ భృశం బభౌ. 26-4-39 దినే, రజతపాత్రాద్యుత్తమసంభావనాపురస్కారేణ సాకం గుంటూరుమండలవేదప్రవర్ధకసభాతః 3-5-41 కాలే వేదేఖలే, యోగ్యతాపత్ర మవాప్య ద్విగుణితోత్సాహాగ్నికార్యాది వ్యాప్రమత్తో విద్యావినయసంపన్నో భూత్వా వ్యాకరణసిద్ధాంతకౌముదీం సార్ధవర్షమధ్య ఏవ కృదంతపర్యంతాం తద్ధితప్రకరణేన సాక మక్షరశోర్థతశ్చ సుష్ఠ్వధీత్యస్వకీయం ప్రతిభాప్రాకట్యం విశదీచకార. వత్సరేస్మిన్ గుంటూరువేదప్రవర్ధకసభాతోధ్యాపకకోటౌ గార్హస్త్యేపిస్వధర్మే ద్విగుణితసంభావనాం లబ్ధ్వా సదాచారాచరణప్రయుక్తాం సద్భిః ప్రశంసితో న మనాగపి గర్వం బబంధ॥

బహోః కాలా దారభ్య "కల్పవల్లీ" ప్రముఖాసు భాషాపత్రికాసు లేఖాన్ కవితాశ్చ ధార్మికజనచిత్తసంతోషకారిణ్యో లిఖన్నాసీదితి దానీమే వావగమ్యతేస్మాభిః. స్వభావసిద్ధకవితాచాతురీ సంస్కృతే తస్య మనోరమశైలీయుతా స్వభావ్యేవా స్మాభి రపరోక్షం బహువారమ్. శ్రౌతస్మార్తవిజ్ఞానం, విశేషతస్సౌత్రార్తే విభిన్నశాఖీయనానాసూత్రపర్యాలోచనంచ తస్యపరమప్రియం అపృథక్స్వస్వరూపమే వాసీత్. స్వయ మాంగ్లభాషా మజానన్నపి ప్రౌఢాంగ్లేయ రచితగ్రంథచయగతా నధునాతనసభ్యతాసంబంధినో విషయాన్ తద్జ్ఞేభ్యోధిగత్య జ్ఞాత్వా పూర్వపక్షత్వేన వైదేశికసిద్ధాంతస్య తత్త్వం నిశ్చికాయ. శిల్పనైపుణ్యం సరససాహిత్యరసానుభావశ్చ తస్య జన్మాంతరీయ సంస్కారోపస్థిత ఆస్తామ్- సర్వథా యం ప్రాచీనజన్మని యోగభ్రష్ట భవ దిత్యస్య ఏతాదృశాని బహూని కారణాని మయోపలబ్ధాని. తత్ర తావ దేకదా మయా సాకం సంభాషమాణ ఏవ మయోక్తాం సాంఖ్యశాస్త్రప్రక్రియాం శృత్వా పరిశీలనసిద్ధాంతవిశేషా న్వ్యాయ మావిశ్చకార. ఏవం సర్వత్రాపి కించిదేవ శ్రుత్వా స్వప్రతిభ యాపరిశీలనసిద్ధాంతానయనే స కృతహస్తో భవత్. జ్యోతిశ్శాస్త్రే పరిశ్రామ్యతాం ఛాత్రాణా ముపకారాయ లక్ష్మీం కాంచి ద్గణితపద్ధతి మన్విష్య శ్లోకరూపేణ గ్రథయితుం కృతసన్నాహో యావతాభవ త్తావతా మృత్యునా కబలీకృతో స్మద్దురదృష్టపరంపరయా. ఏవం తదీయగుణగణస్య వైదుష్య స్యాచారస్యే యత్తాకరణం న శక్యసంభవమ్. అష్టభి రాత్మగుణై రుపనయనాంతసంస్కారైః శాస్త్రజన్యతత్త్వజ్ఞానేనచ నిరస్తాశేషచిత్తకల్మషస్యార్థకామవిముఖస్య వేదాభ్యాసపటో ర్వటో స్తస్య పితా గతసంవత్సరాంతే ఏవ '19-3-43' పాణిపీడనమహోత్సవం సంపాదయామాస. తత ఆరభ్యైవ వైశ్వాదే

వాదిగృహ్యధర్మా నస్య సుతిష్ఠన్ అధీతిబోధాచరణై ర్లోకోపకారం సంపిపాదయిషుయి
ర్గురుకులాశ్రమస్య లక్ష్యం చ సంపూరయితుం బద్ధకంకణో బభూవ "బ్రాహ్మస్య
జన్మనః కర్తా స్వధర్మస్య చ శాసితా బాలోఽపి విప్రో వృద్ధస్య పితా భవతి ధర్మతః"
ఇతి మానవస్య వచనస్య పరమలక్ష్యభూతోఽయం సాంగవేదాధీతీ, ప్రవచనసమర్థో,
ద్యత్వే ప్రవర్ధమానచార్వాకసభ్యతాయాః ప్రతిస్పర్ధీ, అవహితధార్మికజనపక్షపాతః
శిష్టాచారాణాంమూర్తిరివ పాంచభౌతికీ లసతితరాం స్మ. సర్వేఽపి ద్రష్టారో ధార్మి
కాః పరమానందతుందిలహృదయాః అస్య దీర్ఘాయుష్ట్వం సర్వథా కామయామాసుః
కింతు భవితవ్యానాం భవితవ్యతా దురత్యయా ఖలు! సర్వదేశీయధార్మికజనతాయా
దురదృష్టవశేన గతమాసే జ్వరగ్రస్తతలేబగో మాతాపిత్రో ర్గృహే కేవల మపితు సర్వే
షాం పండితపామరసాధారణానామపి జనానాంచింతాసంతతి ముత్పాదయన్ అయం
జయరామశర్మా అత్యల్పదివసేష్వేవ క్రమశః క్షీణగాత్రో ప్యలుప్తప్రజ్ఞాశక్తిరేవ
సన్ నానావిధాన్ శ్లోకాన్ కవయన్ మాతాపిత్రో ర్ధైర్యేణమనస్సమాధానం చతు
రోక్తిభిః కారయన్ సర్వేషాం స్వవిషయకస్నేహాతిశయంప్రవర్ధయామాస. అథైకదా
బహుభిః కృతప్రశ్నప్రతివాక్యపరంపరాణాం మధ్యే మయాపి "జయరామశర్మన్
త్వ మవశ్యం స్వస్థదేహో భవిష్యసి మాస్మచింతాం భయంవాగమః" ఇతి ప్రతిబో
ధిత స్సుధీర మిదం వచనం వ్యాజహార! యత్ "యద్యహం జీవనం ప్రాప్నుయాం
తర్హి నూనం లోకోపకారాయైవ జీవితు మిచ్ఛామి" ఇతి, ముమూర్షావస్థాయామపి
ప్రోచ్ఛ్వసితానిలేన మర్మ సూత్కృత్యమానేష్వపి లోకోపకారచింతనం స్వస్వరూప
ధ్యానం. సశాంతిచ సముకృతిభ్యోఽన్యత్రకుత్రచి ల్లక్ష్యేయాతామ్. అహో పుణ్యపరి
పాకస్య పరమా కాష్ఠానుభూతానేన, యజ్జితేంద్రియచర్యై ర్మహాపురుషైః ప్రాప్తవ్యేతి
పురాణేతిహాసేషు సంశ్రూయతే. ఏవం మహాపురుషయోగ్యయా చర్యయా
బాల్యే తనుత్యాగకాలజీవన యాత్రాం సమర్థితవత స్తస్యాశోచ నీయస్యాపి
లౌకిక వాసనయా బంధుమిత్ర శిష్యవర్గేషు శోకరసభరితమానసేషు రుదత్సు
ప్రేమాతిశయేన ప్రౌఢప్రజ్ఞైః కైశ్చిదీశ్వర నామ సూక్తై రుచ్చార్యమాణేషు
సత్సు సర్వేభ్యః ప్రతివచనతయా గాయత్రీశబ్దోచ్చారణం య త్తస్యతత్సర్వేభ్య
ఉపదేశరూపతాం ప్రాప. గాయత్ర్యా ఋతే గత్యంతరం నాస్తి ద్విజన్మనాం
శ్రేయఃప్రాప్త్యయ ఇతి నికటవర్తినాం సమేషా మస్మాకం కరతలామలకవత్
స్ఫుటం ప్రత్యాయయత. గాయత్రీశబ్దోచ్చారణా దనంతరం క్రమేణ శాంతవాగాదికరణః
మహతీం వేదనా మననుభవన్నేవ తద్రాత్రౌ 16-12-43 ప్రథమప్రహరే భౌతికకళే
ర మిదం పరిత్యజ్య స్వపుణ్యార్జితం పరమం ధామాధవా తత్త్వజ్ఞానదీపే నావిద్యాతి
మిర మతిక్రామ న్నిత్యశుద్ధబుద్ధముక్తం స్వారాజ్యచైతన్య మభజత్.

అత స్తద్విషయే శోక స్యానవసరతయా "అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞా
వాదాం శ్చభాషసే గతాసూనగతాసూంశ్చ నానుశోచంతిపండితాః" "తస్మా దపరి
హార్యేర్థే నత్వం శోచితు మర్హసి" ఇత్యాదిభగవద్వచనై స్సర్వథా సుకృతినోఽస్య జయ

రామశర్మణో విషయే వసానే తదుక్తం గాయత్రీజపస్య సర్వార్థసాధకత్వసూచకం జ్ఞాతచరమపి పునస్సమయే ప్రతిస్మారితం వచనం మత్వా కృతజ్ఞతాం ధర్మబద్ధాః శ్రద్ధాకాస్సత్పురుషాః ధర్మోద్ధారణద్వారాలోకోపకారార్థం గాయత్రీజపస్య సర్వశ్రేష్ఠత్వమన్యామహే ఇతిశమ్.

## 18 శ్రీ. మల్లాది హరిశంకరశాస్త్రిలుగారు

వేదార్థాభిజ్ఞులు

18-1-44 పినపాడు.

"జయరామశర్మ ...... వేదార్థవేత్తయై లోకమునకు కీర్తి తెచ్చునని బహు సంతోషపడుచుండువాడను .........అతను ఋషితుల్యమైనవర్చస్సు కలిగి విస్పష్టకర్మాచరణము కలవాడు. అటువంటివానికిగూడా యీమృత్యుదేవత యెచ్చటి నుండి వచ్చినదా? యని బహువిచారపడుచున్నాను......జ్ఞానైకఘను లగునతనకు నే నేమి వ్రాయజాలను.........."

## 19) శ్రీ. కొలచిన కృష్ణసోమయాజులుగారు.

హైస్కూల్ హెడ్ మాష్టర్ గారు

14-1-44- గుంటూరు

"మీయింటికి వచ్చినపుడు అన్నిటిమధ్య జయరామశాస్త్రి నాకత్యంత ప్రియమైనవస్తువుగ నుండెను......నాపిల్లలను ధర్మపుత్రులుగ జేయవలయునని నాయాశయముగ నుండెను. కాని నా కాభాగ్యము లేదు. జయరామశాస్త్రియందు మీ కట్టిభాగ్యము కలుగుట చూచితిని..............యథార్థముగ నావాత్సల్యము నాపుత్రులయందుకన్న నతనియందు లగ్నమైయుండెను ......... జయరామశాస్త్రి లేడనువార్త మా కందరకు వజ్రిహతి యైనది........."

## (20) రాళ్ళభండి వెంకటసీతారామశాస్త్రిలు (అడ్వకేటు) గారు

సాంగవేదవిద్యాలయ కార్యదర్శిగారు

27-1-44 బందరు

"తమకు కలిగిన ఆపత్తును........వార్తాపత్రికలద్వారా తెలిసికొని అత్యంతవిచారములో మునిగిపోతిని. నే నాపిల్లవానిని స్వయముగా చూచియుండుటచేత కూడ విచారమునకు ఎక్కువకారణము కలిగినది. వేదవేదాంగముల పూర్తిజేసి దేశ

మున కంతకు అలంకారభూతము కాదగిన రత్నము ఈవిధముగా కీర్తిశేషు డగుట తమ కే కాక దేశమున కంతకు గొప్పలోటు కలిగినది. నిజమైన ఆస్తిగోత్తములు విద్యాజ్ఞానసంపన్నులునగు తమకు పరామర్శపూర్వకముగ నేను చెప్పదగిన దేమియు లేదు ........ వేదవేదాంగవేత్తలు మన దేశములో ఏ కారణముచేనో కఱవు అగుచున్నారు. కుప్పా వెంకటప్పయ్యశాస్త్రి, చిఱ్ఱేలుగారికుమారుడు కూడ గతసంవత్సర మకాలమృత్యువువాతపడిరికదా? ఈ సంవత్సరము తమపుత్రరత్నమువంతు వచ్చినది. దేశముయొక్క దౌర్భాగ్యదశకాక వే రేమిచెప్పగలము?......"

## (21) "అభినవసరస్వతి" పత్రికాధిపతి

## శ్రీజానపాటి పట్టాభిరామశాస్త్రులుగారు,

(1944. సం॥ జనవరి. అభినవసరస్వతి, 1-2-44 కల్పవల్లి)

### —♦ జయరామశాస్త్రిస్వర్యానము ♦—

తే॥ రామముదిగొంద వేంకటరామశాస్త్రి గారికొడుక! అయ్యో! స్మృతింగనెన్నాళ్ళొ హ
తవిధి జీవత్పితలఫాలతలములందు ఎట్టిపరుసాక్షరాల్ వ్రాసిపెట్టినాడు? ॥1॥

సీ॥ ఏకవింశత్యబ్ద మేగునేతద్విద్వ దగ్ర్యసుతునిలబ్ధయశునినోసట
పదునెన్మిదేడులబాలయౌ లక్ష్మమ్మ సింగుతనూజపుష్పాంగినోసట
పదునేడువర్షంబు బాగుగా వెళ్ళని మామకీనాగ్రకుమారునోసట
అలభోనగిరి వేంకటప్పయ్యశాస్త్రుల దౌనిమిదేయేడులతనయునోసట
గీ॥ మఱియు నిట్టి దుర్భాగ్యు లెందఱో మొఱో యనం దదాత్మజస్మృతులాసనములవీడ
బాల్యమరణంబుజెంద స్వభానుసమును ఎట్టివ్రాసిక్ చేసె వేధ చే జెట్టపుట్ట ॥2॥

తే॥ అందఱిదిపుత్రశోకంబె యగును గాని చూడ వేంకటరామశాస్త్రులది మఱియు
అగ్గలం బని పలుఁచెద నక్కటకట! శుద్ధచరితుఁడు సుతుఁడు సుశ్లోకుఁ డతఁడు ॥3॥

క॥ దుఃఖ మపుత్రత మఱియును దుఃఖంబు కుపుత్రత ఆలదుఃఖముకంటెన్
దుఃఖము సత్పుత్రకమృతి దుఃఖం బద్దాని మించుదుఃఖము గలదే? ॥4॥

క॥ క్రమముగ సాంగోపాంగము శ్రీమద్యజుశ్శక సహితముగాత్మ స్వాధ్యాయం బా
శ్రీమధర్మము నడపంబడె తను వేంకటరామశాస్త్రిసత్పుత్రుని చేన్ ॥5॥

సీ॥ కావ్యచంపూనాటకంబులు పఠితముల్ సాహిత్యములనదృం జాలినంత
తర్కమొక్కట నొక్కలతిని వ్యాకరణంబు పాపత్యమానముల్ బహుళవేద
ధర్మశాస్త్రగ్రంథమర్మంబులుం జాలవఱకు గ్రహింపంగబడెడి నోజ
విద్వజ్జనులపట్ల వినయవిధేయతల్ వాణి గైర్వాణికే వాడెడు గదు

గీ॥ సాత్త్వికుండు క్షమానిధి సత్యవంతుఁ డకట వేంకటరామశాస్త్రి కోవిదుండు
అతడె జయరామశాస్త్రి యింకట్టిపుత్త్రుఁ డిటులగుటఁ గుంపుపలివండ్రు లెటులో
మనుట? ॥6॥

క॥ మొన్నటిఫాల్గునమున గా కున్నను బాగుండె నకట యుద్వాహం బా
కన్నియగతి యతిశోచ్యం బన్నా! సైరించు టెటులొ యయ్యయ యనుకొనుయొక్క

క॥ ఈవిపదంబుధి దాటుట కేవారికినే నశక్యమే యగుఁ గానీ
ఆవెంకటరామబుధుం డా విజ్ఞుఁడు జ్ఞానమునను నది దాటవలెన్ ॥౭॥

క॥ నిజకర్మగ్రథితం బీ త్రిజగం బని తెలిసికూడ దేహవ చెపఁగా
అజితేంద్రియు లగుమాదృక్ ద్విజసాధారణులు కారు ధీరులు వారల్ ॥9॥

ఆ॥ స్వకృతకర్మములకు ఫలములై సుఖదుఃఖ ములు శరీరధరులఁ దొలగకుండు
కలదె వానిమీఁదికర్తృత్వ మొకరి కహంకృతిని వహింతు రంతెగాని ॥10॥

ఆ॥ కొడుకుచావుకంటె గొప్పదై కనుపట్టె తావకీనమైనచావు నాకు
నాకెగాదు శిష్టలోకానకును జయ రామశాస్త్రి! ఇంక నేమనందు? ॥11॥

## (22) శ్రీ. చెరుకువల్లి వేంకటశివయ్యగారు. (ఆయుర్వేదవిశారదులు)

(శ్రీజయరామశర్మ పెద్దమేనమామగారు

2-2-44 చేబ్రోలు)

"దుఃఖసముద్రమున మునిగియు విధ్యుక్తములు నెరవేర్చక తప్పనివగుటచే బుద్ధి దుఃఖమోహితమై నన్ను చాల కలవరపెట్టుచున్నది.........మనవాని పద్యములు, శ్లోకములు— రామచంద్ర, కాళీ, శ్వర, భారతీ, స్తుతులు, తత్తద్దేవతాసన్నిధులయందు నివేదింపబడినవి. శుకుడు వ్యాసునకువలె సర్వభూతాత్మకుడై జయరామశర్మ "ఆత్మా వై పుత్రనామాసి" నీస్వరూపభూతుడే యైయుండె విజ్ఞాద వగునీవిషయమై నా కటువంటి నిశ్చయము కలదు........"

## (23 శ్రీ ధర్మపురి శేషగిరిశర్మగారు. సాహిత్యశిరోమణి

6-2-44 బెజవాడ

"మిత్రవియోగమువలన నాకు గలిగినపరితాపమునుబట్టి తమకు జాబు వ్రాయుటకైనను మనస్కరించలేదు. దృష్టాంతమునకైనను ఆదర్శపురుషుడు దక్క ఁక "సుకృతీ గతాయుః" అనుటకు దృష్టాంతముగ జేసినవిధివిలసితము విపరీతముగ నున్నది. కర్మలన్నియు జన్మాంతరఫలములకుమాత్రమే ఉపయోగమా? యనెడిసందియమునకుగూడ కారణ మగుచున్నది. అత్యల్పుడ నగునేను గురుసన్నిధికి వ్రాయగలసాంత్వవచనములు లేవు ........"

## (24) శ్రీ పుల్య ఉమామహేశ్వర శాస్త్రులుగారు

(వైయాకరణ ధర్మోపన్యాసకేసర్యాది బిరుదాంచితులు)

(25-2-44 ముంగండ) బెజవాడనుండి

"మిత్రమహోదయా! మహాశనిపాతమువంటి పుత్రరత్నవియోగమహావిపత్తు తమకు ఘటించినట్లు ఇట వినినంతనే దుర్గాంతశోకాంబునిధినిమగ్నమై నాచిత్త మెట బోయినదో నాలేఖిని వ్రాయలేకున్నది. అయ్యయో యీదుష్కలిలో నార్షవిద్యల జదివి యార్షధర్మముల యథాయథముగ నాచరించుటయే రాజద్రోహమై యధః పాతము నాపాదించునుగాబోలు. "కలౌ కార్తయుగం ధర్మం యో నరః కర్తు మిచ్ఛతి । స్వామిద్రోహీతి మత్వా త మధఃపాతయతే కలిః", అను నార్షవచనమునకు తమ పుత్రరత్నమే లక్ష్యము కావలెనా? ఆహా! ఎంతటియవిస్మరణీయ మప్రతీకార మాజీవితదాహక మగువిపత్తు!......సకలసుగుణచన్ద్రికానన్దద మగు సుపుత్రచన్ద్రుడు శుక్లపంచమినే యస్తమించెను......మీ వేదాంతవిజ్ఞానాగ్ని కూడ నీప్రారబ్ధకర్మను క్షయింపజేయలేనందున నాగామిసంచితకర్మరాశిమాత్రమే జ్ఞానాగ్ని దహింపజేయ గలదనుట కింతకన్న దృష్టాంతము కలదా? ......"

## (25) శ్రీ గం. చెరుకుపల్లి రాజమ్మగారు.

(బ్రాహ్మణ గురుకులాశ్రమాంతేవాసి ప్రధానఛాత్రిమతల్లి)

(31-3-44 గరికపాడు)

"ఎక్కడ యున్నను మనజయరామ మూర్తి విషయమే. అందరికి ఇదే స్మరణ అయిపోయినది. సర్వులకు ఆత్మస్వరూపుడే కాబట్టి ప్రతివాడు తనను తాను మరచి పోవు టెట్లు? ఒకసూర్యుడు ఘటశరావాదులలో ప్రతిబింబించినట్లు సర్వహృదయాంతర్యామిగా నున్నవస్తువును విడచిపెట్టి మనస్సు పోవుటకు స్థలము లేదుగదా? బుద్ధి యెక్కడికి పోయినను అక్కడ బుద్ధిసాక్షిగా నిండియున్న చైతన్యస్వరూపు డగుటచే ఆపురుషుని గురించి దుఃఖపడవలసినయవసరము లేదని మీరు శలవిచ్చినవిషయమే... శతవర్షములు జీవించినను మనుష్యోపాధి వచ్చినందుకు సాధించవలసిన పరమార్థము సాధించకపోయినతరువాత వ్యర్థమే కదా? కాబట్టి 22. సంవత్సరములలో నడువవలసినధర్మము చక్కగా నడపి లోకమునకు చూపించి, యీకర్మల కన్నిటికి పరిసమాప్తి ఏతత్త్వమందు చెప్పబడెనో ఆతత్త్వస్వరూపుడై పరమగురుస్థానముగా నిలచినాడు. యోగులు వేలసంవత్సరములు శరీరధారణ చేసినను యీపరమార్థమును సాధించుటకే గదా?...... "గుంజాపుంజాది దహ్యేత నాన్యారోపితవహ్నినా । నాన్యారోపితసంసారధర్మా నేవ మహం భజే" అజ్ఞులదృష్టిలో కష్టమని సుఖమని తోచును. మీ బోటివారు కష్టసుఖములను రెంటిని సమానముగానే చూచుచు కాలము గడుపుచు

న్నారని యనుకొనెద. యింతకంటే వ్రాయుటకు శక్తి చాలదు......తప్పులను క్షమింపుడు......"

## (26) శ్రీ. మద్దులపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రులుగారు.

(వైదికధర్మపరిషత్కార్యదర్శి)

(25-7-44 నంద్యాల)

కం॥ కంటి నివేదిక, నందుఁ గంటిఁ జయరామశర్మ కాలగతియు, ని
ప్పంటించినట్లు పొగులుచుఁగంటికిఁ గడినెఁడుగ నేఁడ్వఁగంటిఁ మిగులన్॥ 1

శ్లో॥ ప్రత్యక్షతస్త్వాం జయరామశర్మన్ । ద్రష్టుః కదాచి న్నను చిన్తయిష్యామ్ ।
ధర్మధ్వజో వర్తత ఇత్యుపాత్తో । హా! హన్త! భావో హత ఏవ మాసీత్॥ 2

శ్లో॥ లోకాతిశాయి ప్రతిభా తు నోచేత్ । ధర్మే నిజే నో యది నైష్ఠికత్వమ్ ।
జీవే చ్చిరం కిం? జయరామశర్మన్ । పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః॥ 3

శ్లో॥ జగదుద్ధరణాయ దత్తచిత్తా । న్నిజసర్వస్వనివేదనే రతాన్ ।
కియతో నయతో నిజోదరం । భవతః కాల! కదాను తర్పణమ్॥ 4

చ॥ ఋణపడినారమైతి మొకరీతిగ శ్రీజయరామశర్మ కా
గుణఖనిఁ గోలుపోయి యిదిగో యిటు లోపినయంత యేడ్చి గూ
ఋణమునఁ గొంత యీగితిమి. యెన్నటికో తుది? యీతఁ డింతస
ద్గుణములవాఁడు కానియెడఁ గొన్నిదినా ల్మనియుండునే మొకో॥ 5

## (27) శ్రీ. శ్రీపాద లక్ష్మీనరసింహసోమయాజులుగారు.

(అమ్నాయతర్క—వేదాంతపండితులు)

## శ్రీ. కొంపెల్ల సుబ్బరాయశాస్త్రిలుగారు (వ్యాకరణపండితులు)

(26-8-44—నరేంద్రపురము)

"శ్రీమతాం పుత్రత్వే నావతీర్ణస్య మూర్త్యేవ ధర్మస్యజయరామ శర్మణో భౌతిక దేహత్యాగం శ్రుత్వాఽతీవఖిన్నా స్సర్వేవయమ్ । న కేవలం భవతామేవేయ మాపత్, అపితు భరతఖండస్యైవ యతోయం జయరామశర్మా పాంచభౌతికం నా త్యక్ష్యత్తదా జ్ఞానసిద్ధ స్స్వయం బ్రహ్మచర్యాద్యాశ్రమధర్మా ననుతిష్ఠ న్నాదర్శ భూతో లోకస్య సర్వథోపాకరిష్యత్......ఏతాదృశమపి పుత్రముద్దిశ్య నశోచ నీయమితి నిరస్తదేహా ద్యభ్యాసానాం సర్వత్ర బ్రహ్మధియాంభవాదృశాం న విశిష్యో ల్లేఖనీయమ్......"

## (28) శ్రీ. ప్రతాపగిరి రంగయ్యశాస్త్రిగారు.

(ఆంతరంగికభక్తలేఖినీలేఖనులు)

(14-9-44 నందివెలుగు)

"భావత్క పుత్రరత్నప్రవిలాపవార్తా సమయ ఏవ శ్రుతా. సత్స్వరూపం పరమార్థనిత్యమపి తం ప్రతి తత్త్వానభిజ్ఞా వయం నితరాం మనుశోచితవంత ఏవ. యథాత్మాత్మీయాస్స్వతి. శ్రీమంతస్తు మహాన్తస్తత్త్వాపరోక్షవిద స్స్వాత్మన్యేవ పరమే బ్రహ్మణ్యఖిలం దృశ్యజాతం "సత్త్వా చ్చావరస్యేతి" న్యాయానుసారేణ నిరీక్షమాణా స్స్వనుతం స్వాత్మరూపం "దహ్రంవిపాపం" జ్ఞాత్వా విశోకా వర్తేయు రిత్యనుశుశ్రుమ......"

## (29) శ్రీ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రులు, గారు.

(సావిత్రీగ్రంథ మండలీ సంపాదకులు)

(4-12-44. ఓంకారమందిరము)

సీ|| చిఱుతనవ్వు లొలయఁగఁ జెలఁగెడునీమూర్తి వెలసి కన్నులఁ దాండవించుచుండ.
ఎలమి గూర్చెడునీదు మృదుమధురోక్తులు కర్ణాంతరంబుల గ్రాలుచుండ
"మామమామయ" యంచు మలయుకైదండల పులకలు నెమ్మేన వెలయుచుండ
పంచదశీగ్రంథపఠనవేళ జనించు నానందవీచిక లలరుచుండ

గీ|| బాలురకుఁ బాఠముం జెప్పుసరణిని, గురుని జేరి తత్త్వంబుఁ జర్చించుసారగరిమ
మెఱయుచుండఁగ నీ వెట్లు? మరుగువడుదు పరిణతగుణమూర్తి! శ్రీజయరామమూర్తి.

ఉ|| పూతచరిత్రుఁడై సుగుణభూషణుఁడై నిగమాగమంబులన్
ఖ్యాతిని దత్త్వసంపదను గాంచినశ్రీజయరామమూర్తి తా
భౌతికముం ద్యజించి యొకవత్సరమే మిఁకఁ గాల మెంతగా
నీ తతచిన్మయాత్ముఁ డయి యున్నెడఁ దా నయి యెట్లుండు నే? ||2||

సీ|| విదితమై వెల్గొందు ముదిగొండవంశాబ్ధి నుదయంబునందిన యురుఫలంబు
తత్త్వవేత్త యనంగఁ దనరు వేంకటరామబుధుని పుత్రుఁడైన పుణ్యఫలము
గర్భాష్టమంబునఁ గలచి గాయత్రిని అమలభక్తి భజించినట్టిఫలము
నిజధర్మదీక్షతో నొగడి వేదంబున వివిధశాస్త్రంబుల వెలయుఫలము

గీ|| ఒక్కటిగఁ గూడి నిన్నొకయోజ్జఁ జేసి సరసకవిఁ జేసి సత్కృపాకలితుఁ జేసి
తత్త్వమూర్తిని గాఁ జేసి ధన్యుఁ జేసి రమ్యగుణధామ! శ్రీజయరామ! నామ ||3||

సీ|| అష్టమవర్షంబునందుఁ గైకొనినట్టి కర్మదీక్ష యదెంతగణన గనునో?
పదియు రెండవయేటఁ బదను దేలినవ్యాస రచన యింకెంతటిరాణ గనునో?
కలముఁ బట్టినయంత లలితాకృతింగొన్న కవితారసం బెంతఘనత గనునో?
యుక్తిప్రమాణసంయుక్తశాస్త్రవిచార సరణి యదెంతటిగరిమ గనునో?
గీ|| తండ్రి గురురూపమునఁ గొల్చి ధన్యుడవయి యందికొనినట్టియుపనిషదమృతరసము
శ్రితజనావళి కెంతగా శ్రేయ మిడునొ? ఎఱుఁగలేనైతి మప్పుడే మఱుఁగుపడితె
చ|| జనకుని మించి తన్నిటను శ్లాఘ్యతమంబులు నీగుణంబులం
జనుకొని చాల మెచ్చితిమి యాత్మరతిన్ విలసిల్లి తత్త్వముం
దనఁ బరినిష్ఠనొందితని తుష్టి నెసంగితి మెంతొ ధర్మవ
ర్ధన! జయరామ! యిట్టుల విధాత యొనర్చె దయావిహీనుఁడై ||5||
గీ|| కలరు మేధావు లెందరో కలరు బుధులు కలరు నిజధర్మతత్పరుల్ కలరు తత్త్వ
వేత్త లింకెందఱో గాని విమలమూర్తి బోలజాలరు జయరామమూర్తి నెవరు ||6||
గీ|| ప్రీతిమైఁ బుత్రి మత్సుతుచేత నునుపఁ దలఁచి యట్టు లొనర్చె మీతండ్రిగారు.
సతము నిన్నెంచు మత్పుత్రు సర్వభార మంచ్చలేనైతి నీచేత నూర్చుచుంటి ||7||
గీ|| ఆత్మ నిత్యం బతీంద్రియం బౌనుకాక అట్టియాత్మస్వరూప మీ వగుదుగాక.
కన్ను లున్నప్డు నీరూపుగానలేని భాగ్యహీనత కెంతయు వగపు గల్గు ||8||
చ|| అతులితశాస్త్రసంపదకు, నాత్మవిభూతికిఁ, గార్యదీక్షకున్
బ్రతినిధివైచు నీవు పితృభారము సర్వము దాల్తువంచు లోఁ
గుతుకమునందియుంటి మొనగూడదు కోరిక తండ్రియాత్మ కే
కత గని యాశ్రమంబున కఖండము హొన్నతి గూర్పవే కృపన్ ||9||

## 36. శ్రీ. పుడిగొండ విశ్వయ్యశాస్త్రులుగారు

న్యాయవేదాంతాచార్యులు

13-1-47—చీరాల బ్రహ్మసభ-

"ఇట్టిలోకోత్తరవ్యక్తి మనవంశమునం దుదయించి పూర్వోత్తరతరముల పవిత్రీకరించి యుపశమింప నావ్యక్తికి చేయగలిగినయుపకృతి లేకున్నను అవ్యక్తిచే ప్రకటింపబడి, అనేకుల కుపయోగింపదగిన ఆదేశముల ప్రకటించుటలోగూడ సహాయపడలేకపోయితినని విచారముగా నున్నది......"

## 37. — [illegible] —

గుంటూరుజిల్లా పల్నాడు-[illegible]పల్లి [illegible] బ్రాహ్మణగురుకులాశ్రమ ద్వితీయ తృతీయ చతుర్థవార్షిక కార్యదర్శి [illegible]

సం........

కార్యదర్శి-శ్రీ. గరికెపాటి ల[...]సోమయాజిగారు.

కార్యస్థానము–ఓంకారమందిరము. 31–12–1943

# పండిత శ్రీజయరామశర్మ

## పవిత్రచరిత్రలోని నిర్యాణఘట్టము.

ఇయ్యది తత్కుటుంబమునకు, మనయాశ్రమమునకుమాత్రమే గాక ధార్మిక లోకమునకెల్ల మున్ముందు ఘోరవిషాదయోగముగ జూపట్టియు, కొంచెము దూరదృష్టితో విచారించినచో నెల్లరకుగూడ విజ్ఞానప్రదమై దుఃఖాంధకారవిధ్వంసకమై నిఖిలశ్రేయోమార్గ ప్రదర్శకమగుచు, మనగురులాశ్రమ ప్రధానోద్దేశసర్వస్వచరిత్ర మగుటయే యిందలి లోకాతీతవిశేషము.

ఈచిరస్మరణీయమూర్తి "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభిజాయతే" అని భగవానుడు చెప్పినట్లు శ్రీశంకరసద్గురునిరంతరసేవాఫలముగ, శ్రీముదిగొండ వేంకటరామశాస్త్రిమహోదయ శ్రీసీతాంబాసతీమతల్లులకు పుత్రరత్నముగ (9-4-22 దివసమున నుదయించి తనబాల్యముననే స్వపితరులతో 5-12-24 మొదలు, 27-2-25 వఱకు ఘటించినట్టి కాశీరామేశ్వరప్రభృతి వివిధక్షేత్రయాత్రలచే పవిత్రగాత్రుడై, యథావిధి 7-3-29 దినమున గర్భాష్టమోపనీతుడై, తత్ప్రభృతి యవిచ్ఛిన్నాగ్ని కార్యాదిబ్రహ్మచర్యవ్రతదీక్షతో వేదాధ్యయనము నచ్చటచ్చట గావించుచు, పైత్రుకలోకమునకు శ్రీశుకశంకర వామనాదిచరిత్రల స్మరింపజేయుచు వచ్చి, మనగురుకులాశ్రమమునం దీబ్రహ్మతేజోమూర్తిగ వెలుంగు జయరామమూర్తి 30-1-39దివసమున ప్రథమవిద్యార్థిగ బ్రవేశించి క్రమముగ ప్రధానవిద్యార్థియై మనయాశ్రమమున నీక్రిందివిధముగ విద్యావిశేషాదుల గడించె.

వేదము : గుంటూరుమండల వేదప్రవర్ధకవిద్వత్పరీక్షాసభలో స్వధర్మపరదగునుత్తమవిద్యార్థిగ 26-4-39 రజతపాత్రను బారితోషికముగ బడయుటేగాక, కృష్ణయజుర్వేదము 82 పన్నములలో 3-5-41 జయపత్రము నొంది యాసభలోని యధ్యాపకమండలిలో నీత డొక్కడే గృహస్థయిగూడ స్వధర్మపరదగునధ్యాపకుడని రొక్కబడి ద్విగుణసన్మానము నొందెను. ఈవిధముగ "ధర్మేణ వేదానామేకాం శాఖామధీత్య శ్రోత్రియో భవతి" యని యాపస్తంబులుపదేశించిన రీతిగ శ్రోత్రియాధ్యాపకుడై మనసంస్థలోని కొందరు వేదవిద్యార్థులకై తాను గౌరవాధ్యాపకపదము నలంకరించి గతవార్షికసభలో మనసంస్థ వారికృతజ్ఞతావచనములకు బాత్రుడయ్యెను. తదుపరి తైత్తిరీయప్రాతిశాఖ్యము వల్లించి, అరణ్యకశిక్ష, భరద్వాజశిక్ష, సేనత్ర్యాపాదిలక్షణగ్రంథములను నిరుక్తాది వేదాంగగ్రంథములనుబరిశోధించుచుండె.

ఇందు వేదములో వాక్యగ్రంథమును కీ. శే. బ్ర॥ కొలచలము వీరన్నశాస్త్రి గారియొద్ద ప్రారంభించి, ఆకిరిపల్లి బాపట్లపాఠశాలలలో కొంతవరకు పఠించి, అవశిష్టమును, సస్వరహితను మనయాశ్రమాధ్యాపకుల యొద్ద పూర్తిచేసెను పైలక్షణగ్రంథములను వక్ష్యమాణస్మార్తగ్రంథమును బ్ర॥ వే॥ యీావని కోటావధానులవారియొద్ద నధిగమించెను.

స్మార్తము : సప్రమాణప్రయోగసప్తపాకయజ్ఞాస్తాపస్తంబసూత్రీయస్మార్తగ్రంథము సమగ్రముగ పఠించి ద్వితీయవార్షికపరీక్షలో నుత్తమకక్ష్యలోను త్తీర్ణుడై ద్వాదశవర్ష బ్రహ్మచర్యానంతరము యథావిధి వేదవ్రతసమావర్తనపూర్వకముగ (19-1-43 సాద్భు) వివాహితుడై యవ్యవహితముగ నౌపాసనాద్యారంభణీయపార్వణవైశ్వదేవాది గృహస్థోచితస్మార్తధర్మముల ననుష్ఠించుచు కొన్ని స్మార్తకర్మలకు యాజకత్వమునుగూడ వహించె. ఇంతియేగాక హరదత్తసుదర్శనాదివ్యాఖ్యలను, చంద్రచూడ, స్మార్తపద్ధతివివేచనికా, స్మార్తకపర్దికారికా, స్మార్తనృసింహకారికావృత్తి, లింగాభట్టీయాద్యాపస్తంబసూత్రసంబంధి నిబంధన గ్రంథములనేగాక, బోధాయనాశ్వలాయనకాత్యాయన పారస్కర సాంఖ్యాయన శాంఖాయన మానవవారాహఖాదిరగోభిల హిరణ్యకేశీయాదివివిధగృహ్యసూత్రాంతరములగూడ పరిశోధించుచు పితృచరణులు గురుచరణులు నైతదాశ్రమసర్వోపదృష్టలు నగు శ్రీ శాస్త్రిచరణుల స్మార్తధర్మోద్ధరణరూపమగు బ్రాహ్మణధర్మ స్థాపనసంకల్పము మూర్తీభవించినవిధముగా సర్వతోముఖప్రజ్ఞలోనభివృద్ధిపడయుచుండెను.

శ్రౌతము : గతచిత్రభానుచాతుర్మాస్యసందర్భములో నేతెంచిన బ్ర॥ వే॥ కవ్వలవాయి అగ్నిహోత్రశాస్త్రి (యజ్ఞేశ్వరశర్మ) గారిసన్నిధినిపైస్మార్తగ్రంథో పష్టంభకముగ దార్శపౌర్ణమాసిక ప్రశ్న దర్శపూర్ణమాసప్రశ్న దికమును ఆపస్తంబ పరిభాషాసూత్రమును వల్లించెను.

తర్కము, మీమాంస, వేదాంతము : తర్కసంగ్రహన్యాయ బోధినీ దీపికా పంచలక్షణీసర్వస్వములను; మీమాంసాపరిభాషను; ఉత్తరమీమాంసాదర్పణము అద్వైతవేదాంతపరిభాషా, శిఖామణీ, వేదాంతపంచదశీ, సిద్ధాంతలేశ సంగ్రహములను; వైన్యాయమీమాంసావేదాంతప్రకరణములను బిత్మచరణు లగు బ్ర॥ వేంకటరామశాస్త్రి గారికడనే యధ్యయనముచేసి పూర్వమీమాంసాధికరణకౌముదీ, వైయాసికన్యాయమాలాదిగ్రంథముల పరిశోధించుచు వార్షికసభలలో పరీక్షాధికారు లగు పండితులవలన నీక్రిందివిధముగ ప్రశంసింపఁబడెను.

"అయ మంతేవాసన్యాధీతే షూపరితనగ్రంథేషు మహాన్తం పరిశ్రమ కావ రోత్. తేషుచ తలస్పర్శినఏవ ప్రశ్నాన్ కృతాః. సర్వేషామపి హ్యుదమంగమయా శైల్యాశాస్త్రసిద్ధాంతసరణి మనుసృత్య సదుత్తరా ణ్యదదాత్. వృకృష్ణశేషపరేషితా.

ప్రతిభాధారణాదికమపి సుష్ఠు శోభతే. ఏవ్వం శేష్వయ ముత్తమకక్ష్యాయా ముత్తీర్ణ ఇతినివేదయామః."

31—1—42

ముదిగొండ విచ్చయ్యశాస్త్రి
లంకా నరసింహశాస్త్రి

"మధురానాథపంచలక్షణ్యాం విద్యార్థినేసమాధేయతయా దత్తేషు ప్రశ్నేషు యథోక్త (జయరామశర్మ) నామధేయస్య విద్యార్థినః న్యాయశాస్త్రీయప్రక్రియాయాం నిరర్గలప్రవేశం స్వాతంత్ర్యేణపరిష్కారశైల్యాం పాటవం చోపలభ్య నితాంత సంతుష్టమనా ఏవంపత్రం పారయామి—యత్ యథోక్తనామధేయో విద్యార్థీ స్వయ మన్యానపి పరీక్షయితుం ప్రభవతీతి — మాథురీపంచలక్షణ్యాం యోాయ మభిప్రాయ ఉక్తస్సమీమాంసాపరిభాషావిషయే ప్యతిదేష్టవ్య ఇతిచనివేదయామి."

చిత్రభాను మాఘశుక్ల చతుర్దశ్యామ్.

ఆత్రేయ లక్ష్మణశాస్త్రి

ఇట్లు ప్రశంసితు డగుటకు తార్కాణముగ తనగురువర్యులు మహాభాష్యాం తవైయాకరణు లగు శ్రీపాద లక్ష్మీనారాయణశాస్త్రి గారికిగూడ తా బఠించినతర్క ప్రకరణములలోనే బిత్పచరణులఖండ గ్రంథక్రోడపత్రవిశేషముల స్వయముగ సం గ్రహించుకొని సవిశేషముగ చింతన చెప్పచుండుట కడు విస్మయావహము.

<u>వ్యాకరణము</u> : వైయాకరణసిద్ధాంతకౌముది తద్ధితాదులతో సహా కృదంతాంతము, ధాతుపాఠాదికము కంఠస్థము గావించి, బాలమనోరమాకారకార్థవాదపూర్వ పక్షావళ్యాదిగ్రంథముల బరిశోధించుచుండెను. ఇందుపై గతవార్షికపరీక్షావసరమున నొసంగబడిన పండితాభిప్రాయము.

"కౌముద్యాం కారకాంతం సమ్యక్ పరీక్షితమ్. తత్రాతీవ మూలం కంఠస్థం భవతి. ప్రక్రియాభాగే విచారణాశక్తిశ్చ భృశం విద్యతే. అతీవ శేముషీమానితి నాతిశయోక్తిః. పరమేశ్వరకృపయా వర్ధిష్ణురితు. ఉత్తమకక్ష్యాయాం కృతార్థః"

చిత్రభాను మాఘశుక్ల చతుర్దశీ భృగువాసరే

ఇతి, విద్వజ్జనవిధేయః
పొణుకుమాటి వెంకటసుబ్బయ్యశాస్త్రి

ఇంతియగాక పాణినిసూత్రములకు దర్కప్రక్రియతో శాబ్దబోధలను లక్షణములను గుదిర్చి లక్ష్యసమన్వయము జేసెడియనన్యసామాన్యప్రతిభను సేనప్పడప్పడు గాంచుచుంటినని చతుశ్శాస్త్రవేత్తలగు కాశీ లక్ష్మణశాస్త్రిమహోదయులు చెప్పిరి.

జ్యోతిషము : జ్యోతిర్నిఘంటువులు, కాలామృతము, కరణకుతూహలము జాతకచంద్రికాదుల జ్యోతిర్విద్యావిశారద బ్ర॥ వే॥ ముదిగొండ వేంకటరామసిద్ధాంతి గారియొద్ద పఠించెను. పిదప గణకానంద వాసిష్ఠసూర్యబ్రహ్మసిద్ధాంతగ్రంథముల బరిశోధించి, గణకానందాదిపద్ధతులకంటె నతిసులభపద్ధతిని బంచాంగసిద్ధాంతము నెల్లను 15 దినములలో పూర్తిచేయదగినట్టియొక నూతనసూత్రమును తనగురువర్యులగుసిద్ధాంతిగారిసాహాయ్యముచే గనిపెట్టి వారితో సంప్రదించెననియు, కొలదిదినములలో నాపద్ధతి ఛందోరూపముగ వ్రాసెదనని వారితో చెప్పెననియు వినుట కెంతయో విస్మయము గలుగుచున్నది.

ధర్మశాస్త్రము : మనుస్మృతి, ఆపస్తంబధర్మసూత్రములను, మన్వర్థముక్తావళి, హారదత్తవ్యాఖ్యలతో బిత్రుచరణులకడనే పఠించి పరాశరమాధవీయధర్మనిర్ణయసింధ్వాదినిబంధనగ్రంథముల బరిశీలించుచుండెను.

సాహిత్యాదికము : బాల్యమునుండియు నైషధాంతకావ్యముల పితృచరణుల కడ బఠించి, కాదంబరీదశకుమారచరితహితోపదేశశంకరవిజయాదిగ్రంథములను, చాణక్యసూత్రాదినీతిగ్రంథములను, ధనంజయవిజయ ప్రబోధచంద్రోదయాది నాటకగ్రంథములను, శ్రుతబోధాదికవిత్వలక్షణగ్రంథములను, 3479 లక్షణసంగ్రహాదిపరిష్కారగ్రంథములను, మనుచరిత్ర, ప్రాచీనదేశచరిత్రాద్యాంధ్ర గ్రంథములనుగూడ తత్తత్పండితసాహాయ్యముతోను స్వయముగను, స్వాధీనపరచుకొనెను. ఇంతియెగాక యితని కప్రియత్నముగనే కవితాశిల్పనైపుణి యలపడెను. గంభీరభావబంధురమై సరసపదగుంభితమై, ధర్మప్రబోధకము, ఆధ్యాత్మికతత్త్వప్రతిపాదకమునై భక్తిరసభరితమై యీతనికవిత శ్రవణామృతమై యుండును. గజాస్యవిజయమను చిన్నినాటకము, శ్రీరామచంద్రపంచరత్నము, భారతీనుతి, దేవీమానసపూజాస్తోత్రము, విశ్వేశ్వరస్తుతి మున్నగుపెక్కురచన లీతనివికలవు. సంస్కృతాంధ్రభాషలలో సప్రమాణోపపత్తికములు, విమర్శనాపూర్ణములు, సర్వాంగసుందరములు నగుపెక్కు వ్యాసముల నీతడు రచించించెను. అందుకొన్నిమాత్రము కల్పవల్లి మున్నగుపత్రికలలో స్వనామముతోను, శ్రీవత్సశర్మనామముతోను బ్రకటింపబడినవి. ఉన్నతవిద్యాభ్యాసమునకీకవితారచనావ్యాపార మంతరాయకర మను పితృచరణాభిప్రాయ మవరోధకముగ నుండుటచే నీతనియంతరంగమునుండి తనంతతానై యుప్పొంగివచ్చుకవితాధుని యంతర్వాహినిగ బ్రవహించుచుండి నేటికి బహిర్గత యయ్యె. ఇది యది యననేల ప్రతివిషయమునను ఆతనిబుద్ధి యకుంఠితమై ప్రవర్తించెడిది. ఈవిధముగ వివిధవిద్యావిశేషములలోనపారమేధానిధియయ్యు గర్వలేశము నెఱుంగనివినయఘనుడై పితృమాత్రాచార్యచిత్తానువర్తనస్వభావుడై యిన్నిసద్గుణరత్నముల కనురూప మగుస్వర్ణపేటికగా విధినిర్మితమైన నవయౌవన స్వర్ణదేహచ్ఛాయ వెలుంగుచుండియు, నర్థకామవిముఖతచే నపరఋశ్యశృంగుడని పేరుగాంచి యజాతశత్రువునై యలరారుచుండె. మఱియు

నీపుణ్యమూర్తి "అధ్యాత్మవిద్యా విద్యానామ్" అని భగవానుడు చెప్పినట్లు బ్రహ్మణ్యు లగుపితృచరణులకడ నిమిత్తమాత్రముగ వేదాంతశ్రవణము గావించినంతనే జన్మాంతరానేకసుకృతవశమున సమధిగతబ్రహ్మాత్మతత్త్వుడై శ్రీశాస్త్రులుగారికి కృతకృత్యత్వానంద సంధాయకుడుగూడ నగుటచే సువర్ణమునకు సుగంధమబ్బిన ట్లితరవివిధ విద్యలకు నధ్యాత్మవిద్య పరిమళప్రాయమై వెలుంగుచుండుటచే, మన గురుకులాశ్రమ ప్రధానోద్దేశ్యములనెల్ల నీధర్మమూర్తి యగుజయరామమూర్తి సఫలత నొందించెను.

కాని. అహా, దైవదుర్విపాకమున నింతలో నెంతటియశనివార్త వినవయ్యె మహర్షికల్పు డగునీతనిముఖమునం దెల్లపుడు నొకవిధమగు బ్రహ్మతేజము తాండవించుచు, సజ్జనమనోహరమై, దుర్జనదుర్నిరీక్ష్యమై వెలుంగుచుండెనే ! ఇట్టిసుకృతి యింతటియల్పాయుష్కుడై యుండునని యేకారణమునను శంకింపనైతిమి. కలికాల మగుటచే మృత్యుంజయు నాశ్రయించి మృకండుపుత్రునివలె స్థిరాయువు గాకున్నను బాదరాయణునియాశీస్సునొందినభగవత్పాదులభంగి ననేకదివ్యాశీస్సంపన్ను డగునీపుణ్యమూర్తి నింకొకపది కాలముల (32 వత్సరముల) పాటైన హతవిధి బ్రతుకనీయకపోయెనే! — లేదు; ఇట్టివివిధవైదికవిద్యలకును ధర్మములకును లక్ష్యభూతు డగునీపురుషధౌరేయునిపవిత్రచరిత్రల కాలవాలమై క్రమత నీతనిసర్వోపద్రష్టృత్వమున నితోధికశోభాభిరామమై నిఖిలదిగ్దిగంతవిశ్రాంతయశోవిశాలమై ధర్మోద్ధరణాగ్రణము లగునెల్ల సంస్థలకు శిరోమాణిక్యమై విరాజిల్లదగినభాగ్యరేఖ మనగురుకులాశ్రమమునకు లేదుగాబోలు! అయ్యయో! ఈపవిత్రమూర్తియం దాధారపడి యెందరెందరెన్నోరీతుల నల్లుచున్న బహుళాశావల్లరుల నెల్ల నొక్కపెట్టున సమూలచ్ఛేద మొనర్చుప్రళయఝంఝామారుతముభంగి పంచషదివసములనుండి సామాన్యరూపమున పొడుకొని యున్న జ్వరాతిసారము సారతరౌషధముల నెల్ల నిస్సారపఱచితుట్టతుదకు (16-12-43 దివసమున) కంఠావరోధక కఠోరవాతకఫాకృతి ధరించి ప్రచండహిక్కాపరీవృతమై విజృంభించెను. ఇదియేగదా సర్వులకును ఘోరవిషాదయోగము! ఐన నది యెట్టితితిక్షయో, నిరూఢప్రజ్ఞయో గాని, ఆహా! యట్టికష్టాతికష్టకాలమున సింహపరిపాలనాదిహాలాహలముల సేవించుచుగూడ నాధీరోదాత్తమూర్తి గాద్గద్యవైవర్ణ్యాశ్రుపాతాదులైనలేశసార్థకవిదేహలక్షణుడైనిఖిలలోకదుఃఖాంధకారవిధ్వంసనసమర్థములుగ నుచ్చరించినట్టి కొన్నితుదివాక్యములు గలవు. అవి యన్నియు "యస్మిన్‌స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే" అనెడిభగవదుక్తిని సార్థకపఱచు నగ్నిపరీక్షాసమయములోని యనుభూతిమహావాక్యములుగాని విలాసార్థముగ బలుకువేదాంతవచనములు గావు. పామరప్రలాపములును గావు. వినుడు—నవప్రసూతయగుటచే నసమ్పృశ్యయై వియుక్తవత్స యగుధేనువుభంగి వాత్సల్యమున విలపించుచున్న తల్లిని జూచి "అమ్మా! యేడ్వకుము, వద్దు దుఃఖము వద్దు అనవసరముగదా" యనెను. ఆశ్రమధర్మసంస్థాపనదీక్షా నిర్వహణమునెడ కృష్ణార్జునులవలె భావైక్యమున మెలగినతమలో నంశమూర్తియు, తన మేనత్తకుమారుడును, ప్రియతరుడును, సతీర్థుడుమాత్రమేగాక వేదాధ్యాపనగురువునైన బ్రి. శ్రీలక్ష్మీనారాయణావధానులుగారిని, వ్యాకరణాధ్యాపనగురువులగు

బ్ర. శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారిని లక్షించి "నేనుగురుకులాశ్రమమునకు ప్రథమ విద్యార్థిని; లోపము లున్న క్షమింపు" డనియె. ఇంకను వైద్యము చేయుచున్న పెద్ద మేనమామగారిని జూచి "మీశక్తిని వినియోగించవలసినసమయ మిదే గాని నాకీయుపాధిసంబంధము లేదు. మీయిష్టము" అనెను. అంత నాత్మగురుచరణు లగుపితృచరణులనుద్దేశించి "మన మెవ్వరము? ఒకే వస్తువు, సర్వాధిష్ఠాన కేవలాత్మస్వరూపము" అనుచు నిమీలితనేత్రు డయ్యెను. అంతలో శ్రీకాశీశాస్త్రులుగారు "జయరామ శర్మన్ ! మాభైషీః, త్వం జీవిష్యసి" యనగనే మరల కనుల నెత్తి చూచి "జీవిష్యామివా! చేత్తర్హి ఏతదుపాధిద్వారా కశ్చన లోకోపకారో భవేత్" అని ముకుళితనేత్రు డయ్యె. ఇటుల నాక్లిష్టసమయములో ప్రశాంతగంభీరవ్యాహా రములతో వ్యావహారికదుఃఖముల నెల్లవర్జించి దేహాత్మభ్రాంతిని నిర్జించి కేవలాత్మభావము నధిగమించి, తిరిగి జీవితశేషమున్నను లోకసంగ్రహార్థమని వ్యక్తీకరించి యుత్క్రమించు సమయమున గూడ నిట్లుత్తమమానవజీవితోద్దేశముల బోధించినట్టి యీమహనీయమూర్తిపై పుత్రభ్రాంతినొందక యనన్యాత్మభూతులై యున్న పితృచరణులు మాత్రముగంగాపాయనదర్భశయనకల్పనభగవన్నామోచ్చారణాదితత్కాలోచితకార్యక్రమవ్యగ్రులై యుండిరి. తక్కుంగలబంధుమిత్రచ్ఛాత్రాదులెల్లతమకేమేని చెప్పనేమోయనివిలపించుచునిరీక్షించుచుండ తత్సమాధానార్థము గాబోలుఉత్తానముగ దర్భశయ్యాశయానుడై యుండిక్షణమాత్రము ప్రోన్మీలితనేత్రుడై తనఫాలభాగమునుదిలకించుచుసన్నిహితులకే గాక వివిధవైదికలోకేష్టానిష్టప్రాప్తిపరిహారసాధనోప దేశముగ "గాయత్రి!" యని తురీయవచనము నుచ్చైస్స్వరమున నుచ్చరించి, నిమీలితాక్షు డయ్యె. అదియే యాతని చరమోపదేశము, చరమస్మృతి. ఏమియాతనిభాగ్యము! గర్భాష్టమోపనీతు డైనదిమొదలు కర్మబ్రహ్మకాండద్వయరహస్యసర్వస్వము పితృచరణోపదిష్టుడై యావజ్జీవము నిత్యసహస్రజపానుష్ఠానపరుడై ప్రత్యహము త్రిమూర్త్యాత్మకముగ సత్యజ్ఞానాత్మకముగ సర్వాత్మకముగనంగన్యాసకరన్యాసములచే నానఖశిఖము తనసప్తధాతువులలో నైతమనన్యసామాన్యమగు నధిష్ఠానదృష్టితో గాయత్రీతత్త్వమును జీర్ణింపజేసికొని చరమక్షణపర్యంత మప్రమత్తుడుగ నున్న యీమహనీయునికడ గాయత్రీ (గాయంతం త్రాయతే) పదముసార్థక్యమునొందకపోవుటెట్లు? "ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి" యని సనత్సుజాతులు వచించినట్లఖండాత్మ తేజస్స్వరూపుడైనయీతనికి మృత్యువెక్కడ? అట్లుగమనించుట ప్రాకృతదృష్టియే. తత్త్వజ్ఞులగుటచే పుత్రశోకహాలాహలమును దిగమ్రింగి యాతనిగాయత్రీతత్త్వాత్మస్వరూపముతో ననన్యాత్ము లైయున్న శాస్త్రిమహోదయులుమాత్ర మణుమాత్రమును జలించక నిరంతరభగవన్నామోచ్చారణము నామహనీయుని దక్షిణకర్ణవివరమున నావించుచునే యుండిరి. ఇంతలో మనదురదృష్టదృష్టులకు తనదృష్టదేహమును వదలి, నిజాభీష్టమును సర్వాధిష్ఠానపరిపూర్ణానంద చిన్మాత్రజ్యోతిస్స్వరూపమై వెలుఁగుగాయత్రీతత్త్వాత్మక మగుభగవత్స్వరూపమునను మనజయరామశర్మ యేకీభవించెను. ఇదియే మనగురుకులాశ్రమ పీఠికావసానవిరూపితమగు "అథ పరబ్రహ్మాత్మ నాస్తీయతా" మనెడి శాంకరాద్వైతసిద్ధాం

తపరాకాష్ఠ. ఇట్టియీపవిత్రచరిత్రుని నిర్యాణఘట్టములో ననేకసహస్రసంఖ్యాకు లలో నొక్కనికైననలభ్యమును మహాయోగిజనదుర్లభమునగునట్టినిరుపాధికకైవల్యాత్మస్థితినిబట్టి తురీయదృష్టిలో విస్మయానందము లుదయించుచున్నను ప్రాకృతోపాధి దృష్టితో మననెల్లరను, ముఖ్యముగ నిట్టిపుత్రరత్నమును గోల్పోయినమాతాపిత్రాదులను, భర్తృచింతామణిని గోల్పోయిన కళత్రాదులను చుట్టుముట్టినయపారఘోర దుఃఖదావానల మెల్లెడల జాజ్వల్యమాన మగుచునే యున్నది. దాని నీక్రిందివిజ్ఞానపై రాగ్యోపరతిముఖరితచిరస్మరణీయ జయరామగీతామృతవియద్గంగాధారాసంపాతముచే తనే భగవానుడు ప్రశాంతి నొందించుగాత.

శ్రీభద్రాద్రిరామచన్ద్ర పఞ్చరత్నతః (౨. ౭. శ్లో 12. పే.) దేవీమానసిక పూజాతః (౧. ౨. శ్లో 6 పే) దేవీస్తవతః (౭. శ్లో 6 పే) గాయత్రీతత్వానుసంధానతః. (౧. 3. ౫. ౯. ౧౦ శ్లో 8. 9 పే) ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఇకముందు మనకర్తవ్య మేమి? ఇపుడు మన మెల్లరము నిర్విణ్ణ చిత్తులమై నడుమువిఱిగి కుప్పగూలి నిరుత్సాహులమై యుంటిమిగదా! గురుకులాశ్రమమున కిది యొకయగ్నిపరీక్ష. అయిన నిట్టితరుణమున నే 'విపది ధైర్య' మనునార్యోక్తి ననుసరించవలసినది. జయరామశర్మయాజీవితాంత మీగురుకులాశ్రమోద్యమమున కండయై నిలచెను. సమధికభక్తివిశ్వాసములతో నిందలికార్యక్రమమున బాల్గొనెను. ఆసుబుద్ధి కీయాశ్రమ మత్యంతాభిమానస్థానము. ఇందు కనేకనిదర్శనములు గలవు. అందు నొకానొక యనధ్యయనదివసమున నేతదాశ్రమపండితులకడ విలాసమాత్రముగ నొనర్చిన యష్టావధానములో "శ్రమఏవ సుసాధన" మ్మనెడి యనుష్టుప్పాదసమస్యను వృత్తాంతరములో బూరింపగోరగా సాధారణముగ నెవరికిని నెట్టిసమయమునను స్ఫురింప వీలుగానట్టి మనయాశ్రమప్రధానోద్దేశమును సద్యస్స్ఫురణమెయి ననుసంధానపఱచుకొనుచు, ఈవిద్వాదవధాని

శ్లో. సపది సంస్థిత ఏవహి విప్లవ స్సురవిరోధిభి రాచరితో మహాన్
అథకి మాశ్రయణీయమితిస్థితే 'గురుకులాశ్రమ ఏవ సుసాధనమ్' (27 - పేజీ)

అని పూరించుటచే నీపుణ్యమూర్తి కీయాశ్రమము నెడ నెంత యభిమాన మున్నదియు సువ్యక్త మగుచున్నది. ఇట్టినిదర్శనము లనేకములుగలవు. కావున పండితజయరామశర్మను ప్రేమించువా రెల్లరు నాతనియాదర్శముల గమనించి యాతనిచరమోపదేశరూప గాయత్రీ తత్వపర్యవసితశాంకరపీఠికతో నడచునేత ద్గురుకులాశ్రమకార్యక్రమమును సంచలింపని ధైర్యోత్సాహములతో ననుసరించుటే ముఖ్య కర్తవ్య మని విన్నవించుచున్నాడ.

****************

## — కృతజ్ఞత —

**ఈవిధముగ "యథా వృక్షస్య సంపుష్పితస్య దూరా ద్గంధో వాతి" యన్నట్లు తనసార్వాత్మ్యభావముచే నీబాలావధూత సన్నిహి**

తాసన్నిహితు లగుసాధుస్వభావుల కెల్లర కపరిమితప్రేమాస్పదు డై వెలుంగుచుండెనని స్థాలీపులాకాన్యాయ సంగృహీతనిరుక్తలేఖావళిచే వ్యక్తమగుచున్నది గావున నిట్టిప్రియలేఖకుల కెల్లరకును;

కల్పవల్లికార్యాలయమున నున్నజయరామహస్తలిఖితవ్యాసావళినెల్ల తెచ్చియిచ్చి కించిదూనజయరామసందర్శనానందసంధాయకు డైనట్టియు, విద్యాపత్రికలోని జయరామలిఖితవ్యాసావళినెల్ల ముద్రణోచితముగ లిఖించినట్టి శ్రీ. ధర్మపురి శేషగిరిశర్మకును;

అచ్చటచట గోచరించినట్టి శ్రీజయరామశ్లోకావళిని, ఇతరవ్యాసావళినెల్లముద్రణోచితముగ లిఖించినట్టి శ్రీ. సన్నిధానంలక్ష్మీనారాయణమూర్త్యవధానులకును, శ్రీ. రామరాజుప్లీశేశ్వరరావుగారు, శ్రీ.ముదిగొండ విశ్వనాధశాస్త్రి. శ్రీ, సన్నిధానం బాలకృష్ణమూర్తి ప్రభృతులకును;

ఏతద్రచనలనెల్ల నాద్యంతపర్యాలోచనము చేసి, నవఖండ విభాగము గావించి, యఖండగ్రంథరూపము నొనరించి ముద్రణమునకు గావలసిన సర్వవిషయములలోను నాకు కుడిభుజముగ నుండుటే గాక, తమకు గలయనన్యసామాన్యముద్రాపణనైపుణ్యమునుపూర్తిగ వినియోగించి, వ్యయప్రయాసములలోగూడ మత్సమానయోగక్షేమ భాక్కులైనట్టి పండిత శ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రిలుగారికిని;

శ్రీజయరామనిర్యాణప్రభృతి యీ గ్రంథముద్రణకార్యము స్వకర్తవ్యములలో ముఖ్యతమము గదలంచి, నూతనగ్రంథముద్రణదార్ఢ్యవ్యాపారణసంకుచితచిత్తుడనగు నన్నుగూడపలుమారులుప్రోత్సహించి,స్వీయవివిధవ్యావహారికవిశేషములగూడతృణీకరించి స్వయముగ నన్ను భాగ్యనగరమున కాకర్షించి, యనన్యసామాన్య గురుభక్తిభావముతో నీగ్రంథముద్రణమును పర్యాప్తద్రవ్యముతో నిర్వహించినట్టి శ్రీ. చందా కాంతయ్యశ్రేష్ఠిగారికిని.

స్వకార్యములనెల్ల సంకోచపఱచుకొని యేతన్ముద్రణకార్యక్రమమందుసంభవించినవివిధవిఘ్నపరంపరలనుమహాధీరతతోనిగ్రహించి

యస్మదాతిథ్యాదివివిధసౌకర్యములను సహజౌదార్యముతో సమకూర్చి శ్రీ. చందా కాంతయ్య శ్రేష్ఠిగారిముద్రాపణసంకల్పమును సార్థకపఱచినట్టియు; తత్సంకల్పాగతులు శ్రేష్ఠిగారి ప్రధానకార్యకర్తలు తద్భావానురూపదేవబ్రాహ్మణభక్తిభరితులునగు శ్రీ ఆగయ్య శ్రేష్ఠి శ్రీ. రాజుగార్ల యత్నములకెల్ల చేయూత నొసగినట్టి శ్రీనూరి వేంకటకృష్ణయ్య, బుచ్చిరామయ్య సోదరమహాశయులకును;

దైవిక విఘ్నకాలములలోఁగూడ మహోదారసాత్త్వికస్వభావముతో నేతన్ముద్రాపణకార్యములోఁ గొంతతోడ్పడిన శ్రీసాహిత్యశిరోమణి అనుముల రాఘవశర్మగారికిని మే మెంతయు కృతజ్ఞులము.

వీరిలోనస్మత్పూజ్యపాదులకెల్ల కృతజ్ఞతాపూర్వకనతిశతముల నొనర్చుచు మదాశీఃపాత్రులకు నిట్టిసత్కార్యధురంధరత్వముచే శ్రీసద్గుర్వనుగ్రహమున నితోధికసకలాభ్యుదయనిశ్శ్రేయసములు ఘటించుగాత యనియాశీర్వదించుచున్నాఁడ.

ఈగ్రంథరూప మగుకృతిని సమర్పించుటకు కాబోలు శ్రీమదాద్యశంకరభగవత్పాదవృత్తానువాదిశ్లోకత్రయముమాత్రము శ్రీజయరామరచితము గోచరించుటచే తదనంతరకాలికకృతిసమర్పణమునకై తదనన్యాత్మజుడనై జీవించియున్ననా కవశ్యకర్తవ్య మగుటచే మఱి రెండుశ్లోకములతో తదర్థపూరణము గావించి యీక్రిందివిధముగ శ్రీజయరామవిద్యావిలాసకృతిసమర్పణమును గావించితిని.

ఓంకారసుందిరము.

సర్వజి జ్జ్యేష్ఠశుక్లద్వితీయా
శుక్రవారము
20-6-1947.

ఇట్లు
ప్రకాశకుడు
శ్రీసద్గురుచరణైకశరణ్యుడు
ముదిగొండ వెంకటరామశాస్త్రి

ఓమ్

శ్రీసద్గురు శ్శరణమ్.

# శ్రీశంకరజగద్గురు కృతిసమర్పణమ్.

శ్లో॥ య శ్శ్రుత్యన్తపయోధినిర్మథనమన్థాద్రి స్సముద్భావయాం
చక్రేద్వైతరసామృతం శివగురుశ్చార్యాంబికా యం సుతమ్
లేభాతే స్వతపఃఫలేన మహతా యేనావనీమణ్డలే
చత్వార శ్శ్రుతయో యథాప్రతిదిశం శిష్యైః ప్రతిష్ఠాపితాః ॥౧॥

శ్లో॥ యస్మై ధారయతేఖిలం జగ దిదం సర్వం స్వకం జీవితం
యస్మా త్కేసరిణః పరాజయ మవాపు ర్భేదవాదిద్విపాః
యస్యాత్యద్భుతదృష్టిపాతవశత స్సర్వజ్ఞ ఆసీ జ్జడః
యస్మి న్కుణ్ఠితనైజశక్తివిభవాః పాషణ్డినో లజ్జితాః ॥౨॥

శ్లో॥ తత్తచ్ఛాస్త్రవిచారధీరమతయః ప్రేక్షావతా మగ్రగాః
నిత్యానిత్యవివేకశాలిన ఇహాముత్రార్థభోగద్విషః
శాన్త్యాద్యై స్సహితా ముముక్షుసుజనా యద్గ్రన్థసంశీలనా
దాత్మానన్దరసామృతం గళసమం పీత్వామృతత్వం గతాః ॥౩॥



శ్లో॥ ఇత్థం శ్రీజయరామశర్మరచితాం శ్లోకత్రయాత్మస్రజం।
ధృత్వా తుష్టి ముపేత్య శఙ్కరగురు ర్య స్స్వాత్మభావం దదౌ
నైజశ్రీగురుదేవభక్తిమహితాం భాషాద్వయోద్భాసితాం
ధర్మద్వేషిజనప్రశాసకలసద్ధర్మప్రబోధోజ్జ్వలామ్ ॥౪॥

శ్లో॥ విద్వద్ధార్మికహృద్యభావభరితాం సద్గద్యపద్యాత్మికాం
తత్తాదృగ్జయరామనిర్మితకృతిం విద్యావిలాసాభిధామ్
పుత్రోసౌ మమ నైజరూప మగమ త్సార్వాత్మ్యభావా ద్యతః
స్వాత్మానన్యతయా జగత్త్రియగురో స్తస్యాఙ్ఘ్రిపద్మేర్పయే ॥౫॥

ఇత్థం,

ఓఙ్కారమన్దిరమ్
4-12-1944

సత్పుత్రకృతి సమర్పకః, పితా
ము. వేం. శాస్త్రి.

ఓం

# శ్రీమజ్జగద్గురు శంకరభగవత్పూజ్యపాదాః



శ్రీ తోటకాచార్యాః　　శ్రీ హస్తామలకాచార్యాః

శ్రీ పద్మపాదాచార్యాః　　శ్రీ సురేశ్వరాచార్యాః

"పురస్తా చ్ఛ్రుత్యాద్యః శ్రీ ముఖ నిగమా ఽప్యుక్తిప్రభృతయః,
పరిషేవా వా ముక్తే ర్విమలత సాయావ్యముఖరాః,
మహా న్యాహో దాతుః శ్చిర మితి విమృశ్యాతి పటుదా
విమ శ్శిష్యాః, హస్తామలక ముఖరాః శంకరగురోః"

ఓమ్

శ్రీసద్గురుశ్శరణమ్.

## —: శ్రీజయరామవిద్యావిలాసవిషయానుక్రమణిక :—

సంఖ్య విషయములు. పేజీ

### —: ౧. స్తోత్రములు :—



### —: ౨. వివిధకవితా కౌశలము :—



### —: 3. ఆర్షవిద్యా విధానము :—



సంఖ్య విషయములు పేజీ

### —: ౪. ధర్మవిచారము :—



### —: ౫. వైదికగోష్ఠి :—



### —: ౬. ధర్మప్రచారము :—

☞ పై విషయానుక్రమణికలో ♦ ఈగుర్తుగల -4- అంకెలను గ్రంథములో చేర్చుకొనుడు. ౬. ఖండములో -4-5-6-7- శీర్షికాస్థానములలో -5-6-7-8 అంకెలు, ౭. ఖండములో. 7-శీర్షికా స్థానములలో -11- అంకెయు పొరపడియున్నవి. దిద్దుకొనుడు.



శ్రీసద్గురు శ్శరణమ్

# శ్రీ జయరామ విద్యా విలాసము

(ప్రథమ భాగము)

## ౧ స్తోత్రములు

---

### —: 1. ఇష్టదేవతానుతయః :—

శ్లో॥ శ్రీసద్గురుచరణ మహం । నిఖిలాఘహరం భజే సతాం శరణమ్
అజ్ఞానధ్వాన్తరవిం । విజ్ఞానానన్ద మమృత మజ మాద్యా॥ ౧

శ్లో॥ శ్రీగజవదనం ధ్యాయే । విఘ్నోపశమం శివం శివాత్మభువమ్
కటమదపిపాసుమధుకర । కోలాహలముఖరితాఖిలాశాన్తమ్॥ ౨

శ్లో॥ వాణీం స్మరామి సతతం । మోహాన్ధధ్వాన్తభానువిజ్ఞానామ్
కామితఫలప్రదాత్రీం । కమలజపత్నీం కృపాయుతాం దేవీమ్॥ 3

శ్లో॥ శ్రీరామచన్ద్రచరణస్మరణప్రభావా
ద్వారాన్నిధే స్తరణ మాచరితం సలీలమ్
ధీరేణ మారుతకుమారవరేణ యస్మా
త్పారం స మాం నయతు సంసృతిసాగరస్య॥ ౪

శ్లో॥ జగదుత్పత్తిస్థితిలయ । హేతుబ్రహ్మా హ మేక మేవాస్మి
ఇతి వక్తు మివ జనేభ్యో । ధృతవపుషం దత్తనాథ మహమీడే॥ ౫

శ్లో॥ మోహాన్ధతమసోచ్ఛేది । భవబన్ధవిదాహకమ్
దక్షిణాభిముఖం తేజ । స్త్రైవం కిఞ్చి దుపాస్మహే॥ ౬

పై ౬ శ్లోకములలో ౧ శ్లో॥ ను 3 వ శ్లో॥ (1937) 15 సం॥ వయస్సులో

సున్నా; ౨ శ్లో॥ వ్యాకరణ శాస్త్రపు నోటు బుక్కులో (1943) 20 సం॥ వయస్సులో) సున్నా; 3 శ్లో॥ (19-2-33) నర్సారావు పేటలో జరిగిన రామారాయ వర్ధంత్యాహ్వానపత్రముపై (16సం॥ వయస్సులో) సున్నా; ౪ శ్లో॥ వేదాధ్యయనపు డైరీలో (1939) 17 సం॥ వయస్సులో) సున్నా; ౫ శ్లో॥ డిటో; ౬ శ్లో॥ చిత్రభాను శివరాత్రి లిఖితవిశ్వేశాష్టక పత్రపృష్ఠభాగమున (1942) 20 సం॥ వయస్సులో ను ఏతద్గ్రన్థకర్త ము. జ. రా. శర్మచే లిఖింపబడియున్నవి.)

## —: 2. గణేశనవరత్నమాలా :—

(బహుధాన్య భాద్రపద "విద్యా" పత్రికలో (1938) 16 సం॥ వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితమై గురుకులాశ్రమ గణపతినవరాత్రములలో శ్రీ చింతామణిగణపతిస్వామికి సమర్పితమైనది. 3-8-40 "దుందుభి" పత్రికలోగూడ లిఖితమైనది.)

శ్లో॥ హేరమ్బచరణయుగళం । వన్దేహం నిఖిలకలుషవిధ్వంసి
భక్తార్తినాశనకరం । సకలాభీష్టప్రదానపటు విమలమ్॥ ౧

శ్లో॥ ధ్యాయే సదా గణేశం । గిరివరజానయనకుముదశీతాంశుమ్
నిటలాక్షనిర్మలకృపా । పరిపూర్ణం పాతకాపహం దేవమ్॥ ౨

శ్లో॥ యత్పదపద్మపరాగం । కాఙ్క్షన్తోఽవిఫలమానసా హ్యభవన్
దేవాః కమలజముఖ్యాస్తం విఘ్నేశం భజామి భవనాశమ్॥ 3

శ్లో॥ విఘ్నాన్ధకారతరణిం । విద్యాదాతార మఖిలనేతారమ్
విశ్వోత్పత్తిస్థితిలయ । కారణ మీడే గణేశ్వరం నిత్యమ్॥ ౪

శ్లో॥ ఆగమవినుత మమేయం । రాగవిదూరం విరాగిజనసేవ్యమ్
నిజభక్తనిర్మలమన । స్సరసీరుహభాస్కరం భజే మనసి॥ ౫

శ్లో॥ ఖణ్డితదుష్టనుతారిం । మణ్డితసుశరీర మమితమాహాత్మ్యమ్
చణ్డాంశుకోటిభాసం । వన్దే విఘ్నేశ మమరవరసేవ్యమ్॥ ౬

శ్లో॥ యస్యానన్తగుణగణాన్ । స్తోతుం న శశాక కమలజాద్యాజీ
తం పార్వతీప్రియసుతం । వన్దేహ మశేషలోకనుతిపాత్రమ్॥ ౭

శ్లో॥ మన్దస్మితం సముత్సర । శీర్షస్థితరత్నకాన్తికాన్తపదమ్

ధ్యాయామి విఘ్ననాథం । విబుధార్చితమఖిలభక్తమన్దారమ్॥ ౮

శ్లో॥ శిఞ్జీరరఞ్జితపదం । శ్వేతామ్బరధారిణం సురూపయుతమ్
లమ్బోదరం నిరాల । మ్బనా మాలమ్బనం హృదిధ్యాయే॥ ౯

శ్లో॥ గణేశభక్త్యా య ఇదం శ్లోకానాం నవకం పఠేత్
సహేహ చాన్తే సుఖమే వాప్నో త్యత్ర న సంశయః॥ ౧౦

## —: 3. గణేశస్తుతిత్రయా :—

ఈశ్వర సం॥ సె. 2 ర ఫైలులో 1937, 14 సం॥ వయస్సులో ము. జ. రా. శర్మచే వ్రాయబడినది.

శ్లో॥ మన్దారపుష్పాభకరద్వయం గీ
ష్పన్దోహసత్కీర్తిత, మస్తవిఘ్నమ్
సన్దేహదుర్ధ్వాన్తవిభావసుం, తం
వన్దే గణేశం హృది సర్వదాఽహమ్॥ ౧

శ్లో॥ వన్దారుభక్తార్తిహరం చ దేవ
బృన్దార్చితాఙ్ఘ్రిద్వయ, మద్వయం, తమ్
కున్దాభదేహం, గజరాజశీర్షం
వన్దే గణేశం హృది సర్వదాఽహమ్॥ ౨

శ్లో॥ కన్దర్పదర్పాపహదేహకాన్తిం
కన్దర్పచేష్టారహితం, కృపాళుమ్
కన్దర్పశత్రుప్రియపుత్రరత్నం
వన్దే గణేశం హృదిసర్వదాఽహమ్। 3

## —: 4. గణనాథస్తవత్రయమ్ :—

౧ శ్లోకం విక్రమ సం. 4/7 ఫైలు 'దుందుభి'లో 1940, 18 సం॥ వయస్సులోను; ౨ శ్లోకం చిత్రభానులో కౌముదీపూర్వభాగావ్యాఖ్యానపత్రముపై 1942, 20 సం॥ వయస్సులోను; 3 శ్లోకం స్వభానులో వ్యాకరణ శాస్త్రపు టిప్పణీ పత్రముపై 1943, 21 సం॥ వయస్సులోను; ము. జ. రా. శర్మచే వ్రాయబడియున్నవి.

శ్లో॥ గణాధినాథం భువనైకనాథం
సురాధినాథార్చితపాదపద్మమ్
అనాథనాథం హతదైత్యనాథం
భజామి నిత్యం హృది విఘ్ననాథమ్॥ ౧

శ్లో॥ స వన్దనీయ స్స చ వేదనీయో
యో వన్దితో భూసుర వర్యబృన్దైః
యం వేత్తు మేతే విబుధా యతస్తే
గణాధినాథం గతవిఘ్నజాలమ్॥ ౨

శ్లో॥ అజాణ్డకోట్యో మయి విశ్వరూపే
వస న్త్యనన్తా ఇతి వక్తుమేవ
స్వకుక్షినిక్షిప్తసుమోదకాది
పిణ్డం, ప్రలమ్బోదర మాశ్రయేఽహమ్॥ 3

—: 5. దుర్గా స్తుతిః :—

('విద్యా' పత్రికలో విక్రమ విజయదశమిరోజు '1940' 18సం వయస్సులో ము. జ. రా. శర్మచే. వ్రాయబడినది)

శ్లో॥ మహాకాళీమహాలక్ష్మీ । ర్మహావాగీశ్వరీతి యా
త్రిభీ రూపై ర్విజయతే । సా దుర్గా పాతు న స్సదా ౧

శ్లో॥ కాళీంగళదుధిరకాళకపాలమాలాం
కాలామ్బుదోపమవిలోలజటాకలాపామ్
ఖేలావినిర్మితచలాచలలోకజాలాం
హేలావిమర్దితనిశుమ్భముఖాం స్మరామి॥ ౨

శ్లో॥ పద్మాలయాం వికచపద్మదళాయతాక్షీం
పద్మోద్భవాదిసురసేవితపాదపద్మామ్
పద్మాక్షకోటిరుచిముట్టనుకాన్తికాన్తాం
పద్మాం భజామి నిజసేవకసద్మసద్మామ్॥ 3



శ్లో॥ రాకేన్దుకున్దఘనసారనిభాచ్ఛదేహాం
వీణాక్షసూత్రవరపుస్తకపద్మహస్తామ్
వాణీ మశేషజనమోహాపహోధినాంకాం
వాగీశ్వరీం హృదిభజే విబుధైకవేద్యామ్॥ ౪

శ్లో॥ దుర్గాం త్రివర్గఫలదాం త్రిగుణస్వరూపాం
సర్గస్థితిక్షయకరీం హతదైత్యవర్గామ్
భర్గప్రియాం సతతపాలితభక్తవర్గాం
స్వర్గాధిపార్చితపదాం హృదయే స్మరామి॥ ౫

## —: 6. దేవీస్తవః :—

(స్వభాను గురుకులాశ్రమ దేవీనవరాత్రోత్సవమున. ము.జ.రా, శర్మచే దేవీ మానసికపూజా శ్లోకపత్రపృష్ఠభాగమున లిఖితము. (1943) 21 సం॥ వయసులో)

శ్లో॥ గణాధిపంనమస్కృత్య దేవీంచాపిసరస్వతీమ్
సద్గురూనపిసంస్మృత్య దేవీస్తవముదీరయే॥ ౧

శ్లో॥ కదాచి త్కర్పూరస్ఫటికమణిరాకేన్దుధవళా,
కదాచి న్మాణిక్యోద్యదరుణజపాపుష్పరుచిరా
కదాచి త్కాలాభ్రాఞ్జనవరమహేన్ద్రోపలరుచిః,
కదాచి ద్విద్యుద్భా జయతి హృది దుర్గా భగవతీ. ౨

శ్లో॥ ప్రధానమితి కేచన ప్రకృతి రిత్యథాన్యే జనాః
జగజ్జననపాలనక్షయకరీం చ శక్తిం పరే
పురాణవిద ఈశ్వరీతి చ రమేతి వాణీతి యాం
జగు స్తవ త దాశ్రయే నిరత మమ్బ నైజం పదమ్. ౩

శ్లో॥ కదాచి దజరూపిణం రుచిరభారతీవేషభాక్,
కదాచిదపి కేశవాకృతి ముపాత్తలక్ష్మీతనుః,
క్వచి ద్గిరిశరూపిణం గిరిసుతాకృతిః పూరుషం,
పరం రమయతే సదా వసతు మానసే సామ్బికా. ౪

శ్లో॥ వినమ్రమకుటాగ్రసంస్థగితదివ్యరత్నప్రభా
చయై ర్విదధతే సురాసురవరా స్సునీరాజనమ్
స్వవాఞ్ఛితఫలాప్తయే భృశ మనారతం యస్యత
త్వదీయ మరుణారుణం పదసరోజ మమ్బాశ్రయే. ౫

శ్లో॥ సర్వాత్మభూతాపి యతార్థత స్త్వం
భవస్యహో నిర్వచనీయశక్తిః
తతో న తే స్తౌమి మహాప్రభావం
కిం త్వాత్మని త్వా మనుసన్దధామి. ౬

శ్లో॥ పరాత్పరం మానిహ్నాదేశ వేద్య
మజం పరాత్మాన ముపేత్య నాథమ్
మాయే త్యవిద్యే త్యపి గీయమానా
విద్యాఽభవద్యా,మమ సాఽస్తుముక్త్యై॥ ౭

## —: 7. దేవీమానసిక పూజా :—

స్వభాను సం॥ గురుకులాశ్రమ దేవీ నవరాత్రోత్సవములో 1943 21 సం॥ వయస్సులో ఆశువుగా ము. జ. రా. శర్మచే దేవి సన్నిధిలో లిఖిత పఠిత సమర్పితము.

శ్లో॥ అమరా అపి నో వయం గతా । అమృతత్వం జనిమృత్యువర్జితమ్
ఇతి ఖేద ముపేత్య తే కృపా । మృతలబ్ధ్యై భవతీ ముపాసతే. ౧
శ్లో॥ యది తే కరుణాలవో భవేన్మయి తేనైవ కృతీ భవా మ్యహమ్
భగవ త్యఖిలే జగత్త్రయే।న మమాప్యం నచ కార్య మస్తి మే.౨
శ్లో॥ భగవ త్యచలాధిపాత్మజే । ధృతనానావిధదివ్యవిగ్రహే!
లలితే! విధుశేఖరప్రియే! కృపయాగచ్ఛ మనో మదీయకమ్॥ ౪
శ్లో॥ భగవ త్యతిదూర మాగతా।నిజభక్తానుజిఘృక్షయా స్వయమ్
తదిదం సురదీర్ఘికాజలం । ప్రతిగృహ్ణీష్వ సుపాద్య ముత్తమమ్॥

శ్లో॥ మకుటాగ్రవినిర్మితాఞ్జలి । ప్రకరైర్దేవగణైః ప్రపూజితే
హరిచన్దనకుఙ్కుమాదిభిః । కృతమర్ఘ్యమ్బు గృహాణ శాఙ్కరి!

శ్లో॥ మునినా ఘటజన్మనా పురా।సరుషా౽చాన్త చతుఃపయోధినా
పరిపూజితపాదపఙ్కజే! ఇదమాచమనీయకం తవ ౭

శ్లో॥ మధుకైటభదర్పనాశకే!మధుహాన్తకరతే! శివప్రియే!
మధుపర్కమిమంమయా౽హృతం।రుచిరం స్వీకురుభక్తవత్సలే ౮

శ్లో॥ కరుణారసవారిణా నమ।జ్జనదుష్పాపమలాపహారిణి;
సురనిర్ఝరిణీజలేన దేవ్యభిషిఞ్చామి సుగన్ధగన్ధినా ౯

శ్లో॥ అయి దేవి! దిగమ్బరప్రియే! నవదివ్యామ్బరహారశోభితే
ప్రతిగృహ్యాదుకూలయుగ్మకం।ప్రియతాంభక్తజనార్పితంమహత్.

శ్లో॥ అహిరాజకృతోత్తరీయకే, గజచర్మామ్బరతోషకారిణి!
ధర దేవి సువర్ణసూత్రసం।గ్రధితం చోజ్జ్వలముత్తరీయకమ్. ౧౧

శ్లో॥ అవధీరితమల్లికానుమ । ప్రకరామోదవపుఃపరీమళే
ఘనసారసుకుఙ్కుమాదిసం । మిళితం గన్ధమిమం విలేపయ.౧౨

శ్లో॥ సురపాలకమాళికల్పభూ । రుహపుష్పస్రజి దత్తపాదుకే
కుసుమాని గృహాణ మల్లికా । వరమన్దారముఖాని శైలజే ౧౩

శ్లో॥ అగరుప్రముఖై స్సుధూదితే! హిమశైలాగ్రనిశాన్తవాసిని!
సువనస్పతిసమ్భవైశ్శివై।రచితో ధూప ఇహానుభూయతామ్.౧౪

శ్లో॥ దినమధ్యగచణ్డభానుసం। మితదేహచ్ఛవిభాసురే!శివే!
ఘృతసంభృతవర్తికాత్రయో । జ్జ్వలితం స్వీకురు దీపమమ్బకే!

శ్లో॥ నిజభక్తజనావనోత్సుకే! పరిపీతాసురకోష్ణశోణితే!
రసషట్కవిరాజిశాకసం।యుత మన్నం వినివేద్యతే మయా.౧౬

శ్లో॥ సురవారవధూటికావిని । ర్మితతామ్బూలసువీటికాప్రియే!
అపిభక్తజనేన తే౽ర్పితం వరతామ్బూలమిదం ప్రగృహ్యతామ్

శ్లో॥ ప్రణమత్సురమౌళిరత్నస ద్ద్యుతినీరాజితపాదపఙ్కజే!
చిరతప్తసువర్ణభాస్వరే! మమనీరాజనమస్తు తే ముదే. ౧౮

శ్లో॥ సకలాగమలోకసంనుతే । నవలీలాసువిలాస శాలిని!
తవ పాదయుగే సమర్పయే సుమజాతంబహు మన్త్రమన్త్రితమ్

శ్లో॥ తవ దేవి నమోస్తు పాదయో । శ్శతశశ్చాపి సహస్రశః పునః॥
పునరస్తు పునఃపునశ్చ మ । య్యచలా తేస్తుకృపా నిరన్తరమ్॥

—: 8. భారతీనుతిః :—

(గాయత్రీ తత్వానుసన్ధానమ్)

[ప్రమాది విజదశమి 'విద్యా' పత్రికలో [1939] 17 సం॥ వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము. 15-10-42 'కల్పవల్లి' లో ముద్రితము.]

శ్లో॥ ధ్యాయే సారస్వతం తేజ । స్సర్వహృద్ధ్వాభసకం పరమ్
ధర్మాఽధర్మావివేకాన్ధ । తమసాపహ మన్వహమ్॥ ౧

శ్లో॥ అత్యన్తమపటుర ప్యహ మమ్బ । త్వద్గుణగణస్తుతౌ మూఢః
త్వత్కారుణ్యాన్మూకం । వాచాలయతోఽత్ర దేవి! సంవృత్తః ౨

శ్లో॥ త్వత్కరుణామృతవృష్టి । ర్వహ్నిం వైజ్ఞానికం వివర్ధయతి
విపరీతేఽస్మి న్కార్యే । హేతుం కం వాప్య లౌకికం మన్యే॥ 3

శ్లో॥ దేవి! త్వత్పదపఙ్కజ । సేవానిరవస్య మానవస్యేహ
న స్ఫురతి వస్తు కిఞ్చి । ద్భోజ్యం పేయం చ దర్శనీయం చ॥ ౪

శ్లో॥ న ధనం నాపి చ ధాన్యం । భూషణజాతం న గేహమపి నైవ
భార్యాపుత్రాశ్చ నృణాం । న సుఖాయ హి కిన్తు త్వత్కృపైకైవ॥౫

శ్లో॥ న సుఖం జన్మశతైరపి । లభతే మనుజో భవత్కృపాహీనః
యత్త్వదనుగ్రహలభ్యం । జ్ఞానం తద్ జ్ఞానలభ్య మేవసుఖమ్॥౬

శ్లో॥ బ్రహ్మ విష్ణూ రుద్ర స్సర్వేప్యన్యే తవైవ శాసనతః
దేవా స్స్వాని స్వాని హి కార్యాణి నివర్తయన్తి నిస్తన్ద్రాః॥ ౭

శ్లో॥ మన్యే త్వామేవ తతో జగత స్సృష్టౌ స్థితే ర్లయస్యాపి
కారణభూతా మాద్యాం శక్తింత్రిగుణాత్మికాం పరాం ప్రకృతిమ్

## —♦ 3. స్వధర్మానుష్ఠానము – సాంగవేదాధ్యయనమూ ♦—

### (నేటి వర్ణాశ్రమధర్మవిప్లవమునకుస్వధర్మానుష్ఠానసహిత విద్యాభ్యాసాభావమే ప్రధానకారణము.

'నె 3 ర పైలులో '4-10-37' 15 సం వయస్సులోను '21-11-38' "విద్యా" పత్రికలోను ము. జ. రా. శర్మచే లిఖితము.'

శ్రీమద్భరతఖండమున నేడు భారతీయజను లెల్లరు సామాన్యముగ నైహికమాత్ర దృక్కులును, పారమార్థికదృష్టివిహీనులు నగుచు స్వస్వవర్ణాశ్రమవిహితధర్మానుష్ఠానము పట్ల శ్రద్ధలేక వేదశాస్త్రముల విశ్వసింపక తుదకు భగవంతుడుగూడ గల డనునదియు నేమాత్రము విశ్వసించక, పరమతవేషభాషాదుల బూర్తిగ ననుకరించుచు, స్వమతధర్మభ్రష్టు లగుచున్నారలు. ఇట్టివారలలో ననేకులు "తా చెడ్డకోతి వనమెల్ల జెరచె" నన్నవిధమున తాము స్వమతధర్మ పరిభ్రష్టులగుటయేగాక తదితరులగూడ నట్లే యొనర్చుటకు బహుభంగుల ప్రయత్నించుచున్నారు. తుదకు బలవంతముగనైన జనుల నందర వైదికధర్మదూరుల నొనర్పజూచుచున్నారు. శారదాశాసన ( బాల్య వివాహ నిషేధశాసన ) ప్రభృతి శాసనము లిట్టి ప్రయత్నఫలములే. వీనిచే దేశమెల్ల నధార్మిక మగుచున్నది. హిందూమతమున ముఖ్యము లగువర్ణాశ్రమధర్మములే నశించుచున్నవి. ఇట్టి దుస్థితి కర్మభూమి యనదగు భారతభూమికి సంభవించుట మిగుల శోచనీయము.

ఇట్టిచో ముష్టిమేయులుగా నున్నవైదికమతాభిమాను "లీదుస్థితికి కారణ మెద్ది? దీని కెయ్యది ప్రతీకారము?" అని తల్లడిల్లుచున్నారు. అనేకవిధ లౌకికోపాయముల నీదుఃస్థితిని దొలగింప బ్రయత్నించుచున్నారు. కాని యివి యన్నియు కూకటివేరున కీటకదంశనమారంభమైన వృక్షమునకు జల సేచనాది శైత్యోపచారములవలె నిష్ఫల మగుచున్నది దానికి కారణ మెచట దోషము గలదో

యచట సంస్కరింపకుండుటే. నిజముగనుగొనిన వర్ణాశ్రమధర్మమహా వృక్షమునకు బ్రాహ్మణ్యమే మూలము. అయ్యది ప్రాథమిక మగుబ్రహ్మచర్య మనుకూకటివేరుపై నాధారపడియుండును. ఆకూకటివేరు ననే ప్రథమమున కీటకదంశన మారంభమైనది. అందువలననే వృక్షము కొననుండి మొదటివరకు క్రమముగా నెండుకొని వచ్చుచున్నది. వృక్షకైణ్యమునకు పైన నొనర్చు (లౌకికోపాయాదిరూప) జలసేచన ముపశాంతికరము కాజాలదు. అందుననే మున్ముందు కూకటివేరుననే సంస్కరణ మొనర్చి కీటకదంశనము కాకుండునటుల నొనర్పవలెను. అపు డీవృక్షము మరల కాంతియుత మగును. మహాశయులారా! అష్టవర్షోపనీత బ్రాహ్మణవటువులయందు ద్వాదశవర్షబ్రహ్మచర్య నియమపూర్వక వేదవేదాంగాద్యధ్యయనము లోపించుటయే (కీటక దంశన స్థానీయము) దేశోపప్లవకారణము. అట్లు యథావిధి బ్రహ్మచర్యధర్మముల ననుష్ఠించినవాడే తదుపరి గార్హస్థ్యము స్వీకరించి యజ్ఞయాగాది విహితకర్మానుష్ఠాన మొనర్చి తన్మూలమున

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు."

అనినట్లు లోకకల్యాణ మొనర్ప సమర్థుడగుచున్నాడు. అట్టివానితప శ్శక్తివలననే సమస్తప్రజలు స్వస్వధర్మానుష్ఠానతత్పరత మెలంగు చుందురు. అట్టి ప్రాథమిక బ్రహ్మచర్యాశ్రమ ధర్మానుష్ఠానమే లోపించినచో నట్టివాడు గార్హస్థ్యధర్మముల సక్రమముగా నెట్లొనర్ప జాలును? తదుపరి తురీయాశ్రమస్వీకార మొనర్చి మోక్షసామ్రాజ్యము నొందగల్గు టెట్లు?

•

ఇట్లు బ్రహ్మచర్యలోపమున బ్రాహ్మణ్యలోపము తటస్థించుట లోడనే దానిపై నాధారపడియున్న యితరవర్ణాశ్రమధర్మానుష్ఠా

నము లోపింప దొడంగినది. ఇదియే నేడు వర్ణాశ్రమమహావిప్లవ మే తెంచిన మార్గము.

కాన నిపుడు వైదికధర్మానుష్ఠానపరు లెల్లరు అట్టిబ్రహ్మచర్యాశ్రమధర్మానుష్ఠానపూర్వక సాంగవేదాధ్యయనమును వృద్ధినొందింప సర్వశక్తుల బ్రయత్నించవలెను. కూకటివేరు బాగుపడిన వృక్ష మంతయు తిరిగి బాగుపడినట్లే, బ్రహ్మచర్యాశ్రమము బాగుపడినచో నితర వర్ణాశ్రమధర్మము లన్నియు బాగుపడి తీరును. ఇదియే వైదికమత పునరుద్ధరణమార్గము. ఇప్పటికైన ధార్మికు లెల్లరు మేల్కొని యిట్టి ప్రయత్న మొనర్పనిచో కొలదికాలమున ధార్మికబీజములుసైతము నశించుట నిక్కము. కాన తమతమ ధనప్రాణములసైతము సమర్పించి యట్టి యథావిధిధర్మానుష్ఠానపూర్వక వేదవేదాంగాద్యధ్యయన మష్ట వర్షోపనీత బ్రాహ్మణవటువులయందు నెలకొల్పుదురుగాత!



## —: 4. బ్రహ్మచర్యము :—

(నె 5 రు ఫైలులో. ము. జ. రా. శర్మచే లిఖితము. లిపి యతిబాల్యములోనిది. లేఖన కాలము స్ఫుటము కాలేదు. ఈ వ్యాసము సంపూర్ణముగ దొరకలేదు.)

చాతుర్వర్ణ్యప్రజలలో నుత్తములు బ్రాహ్మణులు. అందు ప్రాథమికాశ్రమము బ్రహ్మచర్యము. చాతుర్వర్ణ్యమునందలి ధర్మాభివృద్ధి బ్రాహ్మణజాతిపై నాధారపడియుండును. బ్రాహ్మణులు స్వస్వధర్మానుష్ఠానపరతంత్రులై విలసిల్లినదివసములలో తక్కుంగల వర్ణములవారలుగూడ స్వస్వధర్మానుష్ఠానతత్పరులై విరాజిల్లిరి. ఏనాడు బ్రాహ్మణుడు స్వధర్మము పరిత్యజించెనో ఆనాడే సర్వులు స్వస్వధర్మముల పరిత్యజించిరి. అట్లే ప్రపంచమున నెపుడు బ్రాహ్మణ వటువులు స్వధర్మానుష్ఠానపరులై యుండిరో యపుడు ప్రపంచమునం దంతటను ధర్మము విస్తరిల్లెను. అది యేనాడు హ్రసమొందసాగినదో పిండికొలది రొట్టె యనుసామెత యందఱెరింగినదేగదా! బ్రహ్మచర్య

మిట్లు భవిష్యత్ప్రపంచశాస్త్రనిదాన మగుటచేత నేకాబోలు త్రికాలజ్ఞులగు మహర్షు లిక్కడనే గట్టికట్టుదిట్టముల నొనర్చిరి. తక్కిన యాశ్రమములలోగూడ చాలకట్టుబాట్లు గలవు. కాని బ్రహ్మచర్యనియమములలో నొకవైశిష్ట్యము గలదు. బాలునికి బ్రాహ్మణ్య ముపనయనమునుండియే ఆరంభమగుచున్నది. బ్రాహ్మణుడైనప్పటినుండి పాటింపవలసినదే బ్రహ్మచర్యము. అంతకు పూర్వము కామచారకామభక్షణాదులతో మెలగిన బాలకు డొక్కపరి యీనియమముల నన్నిటిని పాటించుట కష్టము. శౌచాచారాదుల నంతకు పూర్వము బాలకు డెంతమాత్రము నభ్యసించియుండడు. అట్టిబాలకు డొక్కపరి గృహస్థుకన్న రెండురెట్లుగ నీనియమముల పాటించు టెంతకష్టమో ఆలోచింపుడు. వంకరకొయ్యను సమీకరించ వలెనన్న గుంట తీసి వంకరగల భాగమునుగుంటపైకిరానిచ్చి, కట్టపై బండలుంతురు. కొంతకాలమునకది బాగుపడును. అట్లియీయాచారాదులుకూడ విహితములేమో యని లౌకికదృష్టికి తోచుచున్నది.

ఈయాశ్రమమున ప్రధానములైన విధి (1) గురుశుశ్రూష (2) ఇంద్రియనిగ్రహము (3) అధ్యయనము (4) భిక్షాటనము (5) సంధ్యాగ్నికార్యాదికర్మానుష్ఠానము (6) అధశ్శయ్యాదినియమములు. ఇవియన్నియు కలిగియున్ననే యయ్యది సంపూర్ణబ్రహ్మచర్యమగును. వీనిలో నొక్కొకటి ప్రత్యేకముగ ననంతాముష్మికఫలదము. వాని వాని విశేషములగూర్చి వ్రాయుచుంటిని. (1) గురుశుశ్రూష— ఎవరియొద్దనైన మనమేదైన ఫల మభిలషించుచున్నచో నేదో పద్ధతితో తత్ఫలదాతకు సంతసముగల్గించవలయును. తరువాత నాతని సంతసము ననుసరించి ఫల మందగలము. సామాన్యముగ లౌకికవ్యవహారములయందు సైతము తుదకు మన మొక రూప్యము సంపాదింపదలచినను తత్ప్రదాత ననేకవిధముల సంతసింప జేయ జూతుము. అట్టిస్థితిలో నమూల్య మగునఖండవిజ్ఞానము సాంగ మనుగ్రహించు గురువుల నెన్నివిధముల సంతసింప జేయవలెనో యాలోచింపుడు. ఐహికమునకంటె గొప్పదగు నాముష్మికఫల మభిలషించి తల్లాభమునకై అమిత

భక్తిశ్రద్ధలతో హవిరాదులనిడి దేవతల నెంతో సంతసింప జేయ నెంతుముగదా! అట్టిస్థితిలో నఖండానందము నొనగూర్చు మహాత్కృష్టమగు విద్య నెంతభక్తిశ్రద్ధలతో సాధింపదగునో యాలోచింపుడు. అందుచే దేవతలకన్న గురువుల నెహెచ్చుగ సంతసింపచేయవలెనని తెలుచున్నది. శుశ్రూషారహితముగ గూడ విద్యను సాధింపవచ్చును కాని, అయ్యది వీర్యవత్తరము కాజాలదు. ఆవిద్య విముక్తిదాయకము కాజాలదు. పర్యవసానమున గురునికి నానందము కలిగించుటయె శుశ్రూషయొక్క ముఖ్యోద్దేశము. అందుచేతనే కాబోలు 'గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేనవా। అథవా విద్యయా విద్యా' అని శుశ్రూషకు ప్రత్యామ్నాయముగ తృప్తిజనకమగు ధనమును గూడ విధించియున్నారు. అందుచే నన్నివిధములను గుర్వనుగ్రహసంపాదకమగు శుశ్రూష బ్రహ్మచారి కవశ్యకర్తవ్యము. శుశ్రూషాఫలభాక్కులలో మహాత్ముడగు నానందగిరి యాదర్శపురుషుడు కాడా?

—(•)—

## —: 5. గురుభక్తిః :—

(నె2రు హైలులో (13-7-37) 15సం॥ వయస్సులో, బాపట్లశంకరవిద్యాలయములో బ్ర. పిశుపాటి మృత్యుంజయావధానులుగారిచే నొసంగబడిన విద్యార్థిపరీక్షాపత్రమునకు ము. జ. రా. శర్మయొక్క తాత్కాలిక సమాధానలేఖనము.)

గురౌ భక్తిః = గురుభక్తిరిత్యస్య పదస్య విగ్రహః.

అత్ర గురుర్నామ క ఇతిచేత్ - యో వైదికవిద్యాం బోధయతి, యశ్చ బ్రహ్మాత్మవిద్యా మధిగమయతి స గురుః. మన్త్రాదికోపదేష్టాపి గురురేవ. తాదృశగురౌ యా భక్తిః క్రియతే సైవ గురుభక్తిరితి కథ్యతే. అత్రభక్తిర్నామ పూజ్యేష్వనురాగః. తాదృశానురాగవానేవ పురుషోఽస్మిన్ లోకే తేజస్వీ, వర్చస్వీ, మేధావీచ భవతి.

పూర్వస్మిన్ కాలే సర్వేపి ఛాత్రా స్స్వగురౌ స్సమిత్కుశసుమాద్యాహరణ, వస్త్రక్షాలన, శారీరసేవాదిపరిణతయా భక్త్యా సం

తృప్తా న్కృత్వా తేభ్యో వీర్యవత్తరాం విద్యాం ప్రాప్నువన్. యా తాదృశభక్తిసంపాదితా విద్యా సైవ సర్వదాపి వీర్యవత్తరా భవతి. యే మన్త్రా స్తాదృశభక్త్యా సంపాదితా స్తఏవకార్యకరణక్షమా భవన్తి. తద్భిన్నా స్తు న వీర్యవత్తరాః. గురుభక్త్యైవ గురవ శ్శిష్యేషు ప్రసన్నాః విద్యా స్సమ్య గ్బోధయన్తి, తతఏవ విద్యా స్సుజ్ఞేయా భవన్తి శిష్యాణామ్.

పశ్యన్తు మహాభాగాః! గురుభక్త్యైవఖలు శ్రీ. ప. ప. తోటకాచార్యవర్యా స్స్వగురూణాం జగద్గురూణాం శ్రీ. ప. ప. శఙ్కరాచార్యాణా మనుగ్రహ దృష్టిపాతజ్ఞాతసర్వవిద్యా అభవన్. ఏకలవ్యనామకవ్యాధోఽపి ప్రతిమాగతానామపి ద్రోణాచార్యాణా మనుగ్రహా ద్విజ్ఞాతధనుర్విద్యాసర్వస్వోఽభవత్. ఉపమన్యురపి గురుసేవయైవఖలు లబ్ధనయనోఽభవత్. కిం బహునా యే యే సన్తి తేజస్వినో. విద్వాంస స్తే సర్వేఽపి గుర్వనుగ్రహాలబ్ధవిద్యా ఏవేతి ఘణ్టాఘోషం వక్తుం న సందిహే.

అయి మహాశయాః! గుర్వనుగ్రహరహిత మవాప్తా యావత్యో విద్యా స్తాస్సర్వాఅపి భస్మక్షిప్తసుగన్ధోదకమివ వ్యర్థాఏవ, తదధ్యేతు రైహిక మాముష్మికం వా సుఖం నభవతి.

తస్మా త్సర్వైరపి ఛాత్రై ర్గురుభక్తియుక్తై ర్భవితవ్య మిత్యభ్యర్థయే. ఏతద్విషయ మేవఖలు స్ఫుటయ త్యేత త్సూక్తిరత్నజాతం ప్రాజ్ఞానామ్:—

"యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ,
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః"
"గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా.
అథవా విద్యయా విద్యా చతుర్థా నోపలభ్యతే"

"హరౌ రుష్టే గురు స్త్రాతా గురౌ రుష్టే న కశ్చన"
"న గురో రధికమ్"
తస్మా ద్గురుభక్తి రత్యావశ్యకీ సర్వోత్కృష్టా చ.

ఇతి శివమ్.

---

## —: 6. సత్తెనపల్లి, వల్నాడు తాలూకాల

## బ్రాహ్మణగురుకులాశ్రమ ప్రారంభోత్సవము. :—

'విద్యా' పత్రికలో '19-2-39' 17 సం॥ వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము'

ఈమహోత్సవము బహుధాన్యసం॥ మాఘశుక్లదశమీదివసమున నోంకారమందిరపరిసరవినిర్మిత మగునీయాశ్రమమున జయప్రదముగ నిర్వహింపబడినది. రెండుతాలూకాలనుండి పెద్దలందరు నేతెంచిరి. ఇంతియేగాక గుంటూరుమండల వేదపండితశిఖామణులగు బ్ర. వే. పుల్లాభొట్ల పాపావధాని ఘనపాఠిగారును, ఇతరమండలముల నుండి ఆగిరిపల్లిపాఠశాలా న్యాయవేదాంతప్రధానాధ్యాపకులగు బ్రి. వేమూరి రామబ్రహ్మశాస్త్రులుగారు, శ్రీత్రిలిఙ్గమహావిద్యాపీఠాధిప, వైద్యరాజ, శ్రీ. దంటు సుబ్బావధానులుగారు మొదలగుపెద్ద లనేకులేతెంచిరి. ఉదయము 10 గంటలకు పెద్ద లందరు నోంకారమందిరమున సమావిష్టులైరి. అవు డీయాశ్రమ సర్వోపద్రష్టలగు తర్క-వేదాంత విశారద, బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రిలుగారు గంభీరముగ నిట్లుపన్యసించిరి.

"ఎట్టి యథావిధిబ్రహ్మచర్యవ్రతగ్రహణపూర్వక వేదవేదాంగాధ్యయనము లోపించుటచే నేడు మనభారతదేశమున ధర్మవిప్లవము తటస్థించియున్నదో, యట్టి యార్షమగు స్వధర్మానుష్ఠానపూర్వక వేదవేదాంగాధ్యయనము నుద్ధరించి,తన్మూలమున సమస్తలోక

కల్యాణ మొనర్చుటయే ప్రధానోద్దేశముగాగల యీయాశ్రమము యొక్క యావశ్యకతగాని, గౌరవముగాని తామెల్ల రెఱుంగనిది కాదు. దైవానుగ్రహావశమున నేటి కేకొంచెమో ధార్మికబుద్ధి కల్గి యున్నయస్మదాదుల కింతకన్న నొనర్పదగిన ముఖ్యకార్యము వేరొండు లేదని మానిశ్చితాభిప్రాయము. ఈమాట విని కొందఱు "కాకిపిల్ల కాకికి ముద్దు" అని యనుకొనవచ్చును. అగుగాక; మన మార్షసంతతికి చేరినభారతీయుల మగుటచే, యావద్భారతవిపశ్చి న్నిశ్చిత మగునార్షవిద్యావిధానమును ప్రేమించకుండు టెట్లు?

ఇట్టి యుత్కృష్టకార్యము భారతదేశమున మున్ముందుగనే మాతాలూకాలలో నారంభింపబడుచున్నందులకు మేమెంతయు గర్వించుచున్నాము. ఏతన్మహాకార్యమునకు పునాది వైచినది బ్ర॥ వే॥ తంగెడ నరసింహారావుగారు, బ్ర॥ వే॥ లంకా వేంకటనారాయణగారు, బ్ర. వే. రామరాజు వీరేశ్వరరావుగారు. ఈత్రిమూర్తులసంకల్పబలముననే యీకార్య మిప్పటికి, ప్రారంభించ బడుచున్నదని నావిశ్వాసము. కాని మొదట ననుకొనిన దానికి భిన్నముగ నిపుడు జరుగుచున్నది. ఆరంభముననే మేము (30) వేల సొమ్ము వాగ్దత్తమైన గాని యాశ్రమము ప్రారంభించవల దనుకొంటిమి. నేటికి సుమారు(20) వేల సొమ్మమాత్రమే వాగ్దానము జరిగియున్నది. అయినను ఏదియో భగవత్ప్రేరణచే నిపుడీపనికి పూనుకొంటిమి. "ప్రారంభింపుడు! (30) వేలు పూర్తియగును లె"మ్మని జగద్గురుశ్రీశంకరభగవానుడు ప్రేరేపించుచున్నట్లున్నది. మిగిలిన పదివేలు ప్రారంభమునకు పూర్వమే పూర్తికావలసియున్నది. ఈ భార మిందు సమావిష్టులైన తమయందే కలదని విన్నవించుచు నింతటితో విరమించుచున్నాను.'

శాస్త్రిగారిట్లు తమయుపన్యాసోపసంహార మొనర్చిన వెంటనే సభ్యులలో నొకవిధమగు నుద్రేకముగలిగెను. సభ్యులలో నొకరును, ఏతదాశ్రమారంభకత్రిమూర్తులలో నొకరునగు శ్రీ లంకా వేంకటనారాయణగారు తా మిదివర కిచ్చిన రు.1116-0-0గాక 10000-0-0

పదివేలరూప్యముల నొసంగుదుమని వాగ్దాన మొనర్చిరి. సభ్యు లంద రాశ్చర్యానందపరవశులైరి. వారలవదనములనుండియప్రయత్నముగ జయజయధ్వానములు వెలువడెను. సభ్యులలో నొకరుగూడ నామహాత్ముని 'ధర్మవీర' బిరుదముతో గాని యూడకుండ నుండజాలకపోయిరి. తరువాత శ్రీ దంటు సుబ్బావధానులుగారు శ్రీ వేంకటనారాయణగారినిగురించి మాట్లాడుచు తమచేతిలోని పత్రికలో కాకతాళీయముగ గనుపించిన యొకశ్లోకము జదివి, అయ్యది వీరినిగురించియే వ్రాయబడియున్న ట్లున్నదని తెల్పిరి. తరువాత మరికొంద రుదారమతులు తమతమశక్తుల ననుసరించి వాగ్దానముల నొసర్చిరి.

తదుపరి సభ్యులందరు నోంకారమందిరసమీపమున నిర్మితమగునాశ్రమమున బ్రవేశించిరి. ఉపాధ్యాయదంపతు లందు బ్రవేశించినతరువాత నప్పటి కేతెంచిన 3 ముగ్గురు*విద్యార్థులకు నుపాధ్యాయులగు బ్ర॥ వే॥ సన్నిధానం లక్ష్మీనారాయణావధానులుగా రధ్యయనము ప్రారంభించిరి. తదుపరి యాశ్రమమున బ్రాహ్మణసమారాధన మొనర్పబడెను.

సాయంతనము 7గంటలకు మరల నోంకారమందిరమున నొక మహాసభ జరిగెను. ఏతన్మహాసభకు బ్ర॥ వే॥ వేమూరి రామబ్రహ్మశాస్త్రిలుగా రధ్యక్షత వహించిరి. అధ్యక్షులప్రారంభోపన్యాసమైన తరువాత బ్ర॥దంటు సుబ్బావధానులుగారు తమరసమృదుమధుర వచనములతో నిట్లుపన్యసించిరి.

"మహాశయులారా! ఏబ్రాహ్మణుడు పూర్వము ప్రజలచే భగవంతునికన్నను మిన్నగ గౌరవించ బడెనో అతడు నే డత్యంత నికృష్టుడుగ గనుగొనబడుచున్నాడు. దీనికి కారణమేమి? నాకుజూడ నిట్లగుపడుచున్నది. పూర్వపు బ్రాహ్మణులు స్వధర్మానుష్ఠాన మాత్రదృష్టులై ధనధాన్యభోగాదులవిషయమున నిస్పృహులై యుండెడివారు. కావుననె వారల కవి యానుషంగికముగను, నప్రయత్న

* ముగ్గురువిద్యార్థులలో మొదటివాడు ఏతద్వ్యాసకర్తయే.

ముగను సమకూరుచుండెడివి. రాను రాను మనవారలు ధనధాన్యా ద్యాసక్తులును. ధర్మశ్రద్ధారహితులును. కాజొచ్చిరి. కావుననె వారల కవి యలభ్యములు కాదొడంగినవి, నేడు కేవల మర్థాసక్తులును, ధర్మ పరిత్యాగులు నై యున్నారు. ఇట్లు బ్రాహ్మణులు స్వధర్మదూరు లగుట తోడనే మిగిలిన వారలుగూడ స్వధర్మముల బరిత్యజించిరి. కావుననే నే డెచట జూచినను నధర్మము తాండవించుచున్నది. ఇట్టి విప్లవ మునకు ప్రతీకార మెద్దియని విచారింప నిట్టిగురుకులాశ్రమములే యని తోచుచున్నది. ప్రథమాశ్రమ మగు బ్రహ్మచర్య మిట్టియార్షవిద్యా విధానముతో సంస్కృతమైన - తన్మూలముగ మిగిలిన యాశ్రమ ములు, బ్రాహ్మణులు సంస్కృతులైన- తన్మూలముగ నన్నివర్ణముల వారు సంస్కృతులు కాగలరు. నేడు దేవాలయప్రవేశశాసనాదు లేతెంచినందుకు ధార్మికులు కొందఱు చింతించుచున్నారు. దేవాల యములు భ్రష్టము లగుచున్నందుల కెవ్వడు చింతించవలెనో, దేవ తల సైతము తమయధీనములో నుంచుకొనజాలు తమ దివ్యశక్తి నశిం చుచున్నందు కెవ్వడు చింతించవలెనో విచారించిన నేతదాశ్రమా వశ్యకత బోధపడగలదు. భారతీయ వైదిక ప్రాభవమున కెల్ల ప్రాణ నాడియగు నిట్టి యార్షవిద్యావిధాన మహాకార్యము నారంభించిన యీమహాత్ముల కనేక నమస్కృతుల నొనర్చుచు నింతటితో విర మించుచున్నాను."

అవధానులుగా రిట్లు పరిసమాప్తి చేసిన తదుపరి బ్ర.శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిలుగా రాశ్రమప్రశంసాపద్యముల జదివిరి. అధ్య క్షుల యన్త్యోపన్యాసానంతరము బ్ర॥ వే॥ ముదిగొండ వేంకటరామ శాస్త్రిలుగారు సభికులకు తమ యభినందనముల తెల్పిరి. జయజయ ధ్వానములతో సభ పరిసమాప్తి నందెను.

వాస్తవికభారతీయార్షవిద్యావిధానారంభ మిదియే.



శ్రీసద్గురు శ్శరణమ్.

# శ్రీ జయరామ విద్యా విలాసము

( ప్రథమ భాగము. )

## ౪. ధర్మవిచారము.

---

దుం-దు-భి

("దుందుభి" పత్రికలో (3-8-40) 18 సం॥ వయస్సులో ము.జ.రా. శర్మచే లిఖితము. ఈ పత్రికశీర్షిక తన జన్మ సంవత్సరనామమగు దుం-దు-భి అను మూడక్షరములతో నొకపెద్దరణభేరి యాకృతి గలచిత్రిమును లిఖించి, తన పత్రికా నినాదముగూడ భేరీభాంకారతుల్యముగ భూనభోంతరవ్యాప్త మగునని సూచించుచు నీక్రిందివిధముగ ప్రారంభించెను.)

క. నతుల నొనర్చెద నిత్యము, నతులితగురుభక్తి శైలజాత్మజునకు నే
నతిలంబోదరునకుఁ బోన్నతశిరునకు శిరము వంచి నతవరదునకున్. (గప్ప)

క. భారతి నెదలోఁ దలఁచెద, నీరజభవురాణి, నమలనీరజనేత్రిన్
సూరిజనసమధిగమ్యను, గోరినకోరికల నొసఁగఁ గూరిమితోడన్. (గప్ప)

### — 1. రెండు మాటలు —

శ్లో॥ "ఊర్ధ్వబాహు ర్విరౌ మ్యేత న్నహి కశ్చి చ్ఛృణోతి మే
ధర్మా దర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే."

ర. ఆర్యులారా! కొంచె మవధరింపుండు
వినదగు నేదైన వినినయాపైన
వివరింపవలె నని విబుధు లంద్రుగద!
కాన నామాట లాకర్ణించి పిదప,
మంచిచెడుంగుల మఱి విచారించి,

కర్తవ్యమున కంత గడగంగ వలయు,
పుడమి ననేకులు పుట్టుచున్నారు
కొంతకాలముపాటు వింతపుంతలను
జీవిత మంతయు జీర్ణింపజేసి,
కాలము రాఁగానె కాలమందెదరు.
ఇట్లులే పుట్టుచు గిట్టుచుండెదరు,
కాని, 'యీసంసారకారణ మేమి?
ఎంతకాలమువఱ కీవిధి నుండ
వలె?' నని యొకఁడైన పరికింపబోడు.
సంసారసాగర సంతరణంబు
నెట్లుసేయుదు నని యీక్షింపలేడు.
అయ్యయో! కలిమాయ యందఱజనుల
బరమార్థదృష్టికి బరమకతు్రిలుగ
గావించివైచెను గాదె సత్యముగ.
ఇకనైన గన్నుల నొకకొంత విచ్చి,
మోక్షమార్గముదిక్కు వీక్షింపుడయ్య!
విజ్ఞాననిధి యైనవేదవ్యాసుండు
చెప్పినమాటకు జెవియొగ్గరయ్య!
అర్థకామములందు నాసక్తి గల్గు
జనులుసైతము చరించవలె ధర్మమున,
దాన నర్థాదులు దరిజేరు నిజము
మోక్షకాములె యైన ముక్తు లయ్యెదరు.



— 2 రాజు — భగవానుడు —

"దండుభి" పత్రికలో 3-8-40 18 సం॥ వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము

పరమేశ్వరు డపరిజ్ఞేయుడు. అమేయ మహిమాన్వితుడు. అఖిల స్వరూపుడయ్యు నదృశ్యుడు. అఖిలగుణాన్వితుడయ్యు నిర్గుణుడు. అతని

నెఱుంగ సామాన్యుల కశక్యము. అతని నెరుగవలె నన్న నతని దయకు బాత్రులు గావలెనన్న, ప్రతిమనుజుడు నాతని యాజ్ఞారూపములగు శ్రుతి స్మృతుల ననుసరించవలెను. దాన నాతడు తృప్తుడగును. దయతో మానవుని ముక్తు నొనర్చును. అది సహజమే. ఒక రాజే కల డనుకొనుడు. అతని యాజ్ఞల నౌదల దాల్చువారి నాత డనుగ్రహించి, యుల్లంఘించినవారి నిగ్రహింపడా? అట్లే భగవానుడు గూడ తన యాజ్ఞల నతిక్రమించినచో నాతని నరకకూపమున బడ వేయును. అం దాతనిపక్షపాతము ద్వేషము హేతువులు గావు. అతడు నిష్పక్షపాతియే. జీవులకర్మల ననుసరించి వారివారికనుకూలము లగుఫలముల నిచ్చుచుండును. నరహత్య నొనర్చినవాని కొకనికి నరపతి యురిశిక్ష విధించె ననుకొనుడు. అందులకు హేతు వేమి? రాజుపక్షపాతమా? లేక ద్వేషమా? రెండును గావు. ఇక నేమి? విషయ మట్లున్నది. శాసన మతిక్రమించినవారల శిక్షించుట రాజవిధి, అంతియే. అట్లే భగవానునివిషయమునగూడ దలంచ వలెను. మన మున్నతస్థాన మందవలె ననిన నాతనియాజ్ఞల నౌదల దాల్చవలెను. అతనియెడ నపరిమితభక్తిశ్రద్ధల జూపవలెను. ఆతని నర్చించవలెను. దాన మన మున్నతగతి నందగలము-

—:(♦):—

## —: 3. గురుశిష్యసంవాదము :—

నె 3 వ ఫైలులో 4-10-37 15 సం॥ వయస్సులోను, "విద్యా" పత్రిక 23-9-38 లోను ము. జ. రా. శర్మచే లిఖితము

సూర్యోదయమై యెక్కుడు కాలము గాలేదు. భాను డింకను తనయరుణిమను త్యజింపలేదు. ఇట్టి సమయమున నర్మదాతీరమందలి మున్యాశ్రమమున విద్యార్థు లందఱు స్నానసంధ్యాదిస్వస్వకాల్యకృత్యముల నెరవేర్చుకొని తమతమ కృత్యములందు బ్రవర్తించుచుండిరి. నా డనధ్యయన మగుటచే విద్యార్థు లందఱును విద్యాభ్యాసమును త్యజించి, కొందఱు సమిధల దెచ్చుటకును, మఱికొందఱు కుసుమముల

దెచ్చుటకును, మఱికొందఱు దర్భల దెచ్చుటకును వెడలుచుండిరి. కొందఱు మాణవకులు లేడిపిల్లల వచ్చిక మేపుచుండిరి. మఱికొంద ఱాశ్రమలతాపాదపములకు జలసేచన మొనర్చుచుండిరి.

ఇట్టితఱి నిరువురు మాణవకు లొకపలాశవృక్షముక్రింద కృష్ణాజినముపై నుపవిష్టులై యేయ్యదియో ముచ్చటించుకొనుచుండిరి. ఇంతలో నచటి కొకమనుష్యు డేతెంచెను. ఆతనివయస్సు సుమారు నలువదివర్షములై యుండవచ్చునని తోచుచున్నది. దీర్ఘకాయుడును సువర్ణచ్ఛాయ గలదేహమువాడుగ నుండెను. నొసటవిభూతియునాపై కుంకుమరేఖయు ముఖమున నొకశోభ గల్గించుచుండెను. అంత నాతడు మెల్లగ నడుగులిడుచు నామాణవకులవెనుకగ నేతెంచి కొలదికాలము నిశ్శబ్దముగ నిలువబడి వారిమాటల జెవియొగ్గి వినెను. అట్లు కొంతసే పుండి ముఖమున మందహాసము దోప మెల్లగ నేదియో యలికిడి నొనర్చెను. అంత నామాణవకు లిరువురు వెనుకకు దిరిగి చూచిరి. వెంటనే సంభ్రమమున దిగ్గన లేచి యాతని కభివాదన మొనరించి మఱియొకకృష్ణాజిన మచట బరచి దానిపై కూర్చుండ బ్రార్థించిరి. అంత నాతం డుపవిష్టుండై వారలగూడ గూర్చుండ నియమించెను. వారలు గూడ గూర్చుండిరి. ఇదియంతయు జూడ పెద్దయాతడు వారి గురువని వార లాతనిశిష్యులని దోపక మానదు. వారిరువు రాసీనులైన పిదప నాముువ్వుర కీక్రిందివిధముగ సంభాషణము జరిగెను:—

గురువు:—మీరు సంభాషించున దెయ్యది?

1. శిష్యుడు:—శ్రుతిస్మృత్యాది ప్రామాణ్యవిషయమున మాట లాడుకొనుచుంటిమి. ఇంతలో నొక సందియము దోచినది.

గు:—ఆసందియ మెద్ది?

1. శి:—శ్రుతిస్మృతులలో శ్రుతికి స్వతఃప్రామాణ్యమును స్మృతికి పరతఃప్రామాణ్యము నెందువలన? అని.

గు:—ఔను. ఇయ్యది విచారణీయాంశమే. ఈదిన మనధ్యాయ నమేగదా! కాన నీవిషయము దెల్పెద. వినుడు.

1,2.శి:— చిత్తము సెలవొసంగుడు. సావధానమనస్కులమై యాలకింతుము.

గు:—వినుడు. "శ్రుతియన వినబడినదనిగదా యర్థము. అనగా నియ్యది సృష్ట్యారంభమున బ్రజాపతిచే వినబడినదని తాత్పర్యము. ప్రజాపతి వేదముల రచింపలేదు. తాను వినిన వేదములనే మున్యాదుల కనుగ్రహించెను. సృష్ట్యాదియందుకూడ సృష్టివిధానమును ప్రజాపతికి వేదమే యుపదేశించినది. అయ్యది యనాదియగుటచే వెనుకటి కల్పములయందు సృష్టి జరిగిన విధముననే ప్రతికల్ప ప్రారంభమునను బ్రజాపతి కుపదేశించుచుండును. ఈవిషయమునే "ధాతా యథా పూర్వ మకల్పయత్" ఇత్యాదిశ్రుతులు దెల్పుచున్నవి.

2 శి:_స్వామీ! తా మంగీకార మొసంగినచో నాయీచిన్నిశంకలకు సమాధానము నంద నాసింతును.

గు:-నీసంశయముల నవశ్యము దెల్పుము.

2 శి:—స్వామీ! తాము వేద మనాదియని సెలవొసంగితిరి కదా! "సహోవాచ వ్యాసః పారాశర్యః" 'భృగుర్వై వారుణిః, వరుణం పితర ముపససార' 'ఉశన్హవై వాజశ్రవస స్సర్వవేదసం దదౌ' ఇత్యాది స్థలములయందు భూతార్థప్రతిపాదకములగు నాయాయాఖ్యాయికలు కనుపించుచుండ నయ్యది యనాది యగు టెట్లు సంభవించును?

గు:—పరశ్శతప్రమాణములచే వేద మనాదియనువిషయము సిద్ధమగుచున్నది. ఐన నీయభిలాషానుసారము నీవడిగినప్రశ్నకు యుక్తితోడనే సమాధాన మొసంగెద; నాలకింపుము:— ఆయాస్థలములయందాయావ్యక్తుల నామగ్రహణపూర్వకముగ వారికథలు వేదమున వర్ణించబడియుండుటచే వేద మనాది కాదనియేగదా నీవు చెప్పునది? అట్టిచో నిది గనుగొనుము. వేదమున— "సహోవాచ వ్యాసః పారాశర్యః" అనుచోట వ్యాసునిగురించి వ్రాయబడియుండుటచే నయ్యది వ్యాసునియనంతర మావిర్భవించినదని నిశ్చయింతు మనుకొనుము. అట్టిచో నావ్యాసునికన్న నెంతయో ప్రాచీను లగుమనుపరాశరాదు

లు నైతము తమగ్రంథములయందు వేదము తమకన్న నెంతయో ప్రాచీనకాలమునుండి వచ్చుచున్నట్లును, అందుచే నయ్యది యనాది యనియు సిద్ధాంతీకరించియుండిరే; అందుల కేమందువు?

1 శి:—అట్లైన నాయామున్యాదులయనంతరమాయాగ్రంథభాగము లుద్భవించియున్న వనుకొనరాదా? అనగా వ్యాసునితరువాత నాతని విషయము వర్ణించుకథయు, మరియొకనితరువాత నాతనివర్ణించు కథయు జనించియుండరాదా? అట్టిచో తమపూర్వులకథలు మొదలైనవిషయములు గలభాగములు తమకాలమునకు పూర్వమే యుండియుండుటచే పరాశరాదులు వేదము తమకు పూర్వమే యుండియున్నదని వ్రాసినచోటు విరోధము గల్పింపదుగదా!

గు:—అటులు తలంచ వీలులేదు. ఏలయన నాయాపరాశరాదులు తమగ్రంథములయందు వేదత్రయముకూడ తమకు పూర్వముననే యున్నదని వ్రాసియుండిరిగదా! అపుడు పరాశరునకు పూర్వము "వ్యాసః పారాశర్యః" అనువాక్యముగల యరుణపాఠము లేదనిగాని, యట్లే పరాశరునికి పూర్వము పరాశరునిపేరు వచ్చుభాగమును మనువునకు పూర్వము "యద్వై కించ మను రవదత్" అనువాక్యము గల భాగమును, లేవన వీలు లేదుగదా!.

1. శి:—అగుచో భవిష్యదర్థములు వేదమునం దెట్లున్నవి?

గు:—తదంగభూత మగుజ్యోతిషము నెరింగిన వారలే త్రికాలజ్ఞులై వెలయుచుండ సకలమూలభూత మగువేదమునకు త్రికాలజ్ఞత యుండరాదా? అట్టిత్రికాలజ్ఞతచే భవిష్యదర్థముల సూచించెనని తలంచరాదా?

1,2, శి:—సందియములు దీరినవి. తదుపరి సెలవిండు!

గు:—ఇక శ్రుతి యనాది యనువిషయము నిశ్చిత మైనదిగదా! అందుచేతనే (అనగా ననాది యగుటచేతనే) యయ్యది యపౌరుషేయ మనునదిగూడ నిశ్చితమగుచున్నది. పౌరుషేయమే (అనగా నొకపురుషునిచే విరచితమే) యైనచో నయ్యది సాది-(అనగా ఆది గలదియే) యై యుండెడిదిగదా! కాన నియ్యది, యపౌరుషేయము ననాది యను

విషయము నిస్సందిగ్ధమే. అట్టివేదమునందలివిషయములనే యల్పజ్ఞులకు దెలియజేయుటకును, నిషిద్ధశాఖావేదధర్మముల బోధించుటకును, సాక్షాత్కృతాఖిలవేదరాసులగుమహర్షులచే స్మృతులు రచింపబడినవి. అందువలననే యవ్వానికి ప్రామాణ్యము సంభవించినది. ఇట్లే వేదమునందలి విధినిషేధప్రతిపాదకము లగువచనముల కథాదిరూపముగ నుపబృంహణ మొనర్చుటకు పురాణేతిహాసాదు లుద్భవించినవి. ఈవిషయముల నాయాస్మృతి పురాణేతిహాసాదికర్తలు తమగ్రంథముల యందు వెలువరించియున్నారు. వేదములయందలివిషయముల బ్రతిపాదింప నేతెంచినవీగాన స్మృత్యాదులు పరతఃప్రమాణము లైనవి. శ్రుతి యట్లుగాక తనకు దానే ప్రమాణముగా ననగా మఱియొకదానిచే దెల్పబడినదానిని ప్రతిపాదించుట కేతెంచినది గాకపోవుటచేత నయ్యది స్వతఃప్రమాణ మైనది. ఇయ్యదియే శ్రుతిస్వతఃప్రామాణ్య సిద్ధాంతము.

1,2. శి:—స్వామీ! యుష్మదో్బధామృతవర్షముచే నస్మన్మనశ్చాతకములు సంపూర్ణానందము నొందినవి. ఇక మాధ్యాహ్నికానుష్ఠానకాల మేతెంచినది. వెడలుదము.

ఇట్లనుచుండగనే మఱికొందఱు బ్రహ్మచారులు సమిత్కుశకుసుమహస్తులై యేతెంచి పలాశవృక్షచ్ఛాయ నాసీనులై యున్న తమగురుచరణుల గని త్వరగా నచటి కేతెంచి తచ్చరణయుగళము నకు బ్రణమిల్లి స్వానీతము లగు కుసుమాదుల నచట నునిచి నిలువబడిరి. తరువాత గురునాజ్ఞ గైకొని విద్యార్థు లందఱు తమతమపనులకై వెడలిరి.

---

## —:4. పుణ్యాపాపములు :—

"కల్పవల్లి" పత్రికలో 1-9-42 21 సం॥ వయస్సులో శ్రీవత్సశర్మ నామముతో ముద్రితము.

మానవు డొనర్చు సత్కర్మ (అనగా మతగ్రంథములద్వారమున భగవానునిచే నాయామతములవారికి విహితమైన కర్మ) నాచ

రించుటవలన నాతని కాయాకర్మల కనురూప మగుసుఖమును కలుగ జేయ దగుపుణ్య మనునొకసంస్కారవిశేషము; అత డొనర్చుదు ష్కర్మ (అనగా భగవదాజ్ఞారూపము లగుమతగ్రంథములచే చేయ రానిదిగ నిషేధింప బడిన కర్మ) నాచరించుటచే తత్తత్కర్మాను రూప మగుదుఃఖమును గలుగ జేయదగు పాప మనుసంస్కారవిశేషము, నాతనియంతరంగమున నుత్పన్నము లగుననియు నాసంస్కారము లాయా కర్మల కనురూపము లగుఫలము లనుభవింపబడ నంతవరకు నశింప వనియు; ఆపై నశించుననియు ననాదికాలమునుండియు సనాతనభార తీయులు దృఢవిశ్వాసముతో నున్నారు. పూర్వ మత్యల్పసంఖ్యాకు లగు లోకాయతికమతస్థులుమాత్రి మీసిద్ధాంతము నంగీకరించెడి వారు గాదు. వారి మతములో పరలోకములు లేవు. సర్వకర్త యగు భగవానుడు లేడు. ప్రాక్తనకర్మానుభవయోగ్యము లగునుత్తర జన్మములు లేవు. పుణ్యపాపములు లేవు. మానవునకు గుహ్యోదర పరాయణత్వమే పరమార్థము.

కలికాలవశమున గాబోలు నేడు మనవారలలో జాలమందియం దీమతము వ్యాపించుచున్నది. పరిశ్కృతమెచటజూచిన నీమతప్రచారమే యధికముగ గానుపించుచున్నది. ఏతన్మతప్రచారకులచే సనాతన భారతీయసిద్ధాంతములపై నధిక్షేపము లధికముగ గావింపబడు చున్నవి.

పరిశ్కృతమిచట వారియాక్షేపముల నొకింత విచారించి పుణ్య పాపముల యస్తిత్వము ధ్రువపడినతరువాత వానిలోని విశేషముల రెండు మూడింటిని దెలుపుటయే యీవ్యాసోద్దేశ్యము. ప్రధానమల్ల నిబర్హణన్యాయానుసార మిపుడు రెండు మూడు మాత్రిము పూర్వ పక్షములు చూపి ఖండింపబడును.

(౧) పుణ్యపాపములు ప్రత్యక్షముగ సిద్ధించుట లేదు; కాన నిట్టి వానిని విశ్వసించుట ప్రాజ్ఞలక్షణము గాదు.

(౨) ఆస్తికులయభిప్రాయములో పుణ్యమువలన సుఖము; పాప మువలన దుఃఖముగలుగుననియేగదా? అట్టిచో ధర్మమునే యనుష్ఠించి

పుణ్యము నే యార్జించినవాడు దుఃఖమునందుచున్నపు డిక నేమని తలంపవలసి యుండును? పుణ్యాపాపములు లేవనియే గదా! అవి యున్నచో నట్టివారు దుఃఖలేశమైన లేకుండ కేవలము సుఖభాక్కులుగ నుండవలసి యుండును. అనుభవములో నట్లు గానుపించుట లేదే? రామునివంటి ధర్మశీలునకు గల్గినకష్టము లెన్నతరమూ? హరిశ్చంద్రునివంటి సత్యవ్రతు డట్టి యిక్కట్టుల నందుటకు హేతు వేమి? ధర్మమూర్తియని పేరుపడసిన ధర్మరా జేమి సుఖముల నందెనో యొకింత దెల్పుడు. నలునివంటి మహానుభావున కట్టికష్టములు గలుగుటకు కారణ మేమి? పరమభక్తాగ్రేసరు డగు రామదాసు పుణ్యాపాపము లుండుట సత్యమగుచో నట్టిచెర ననుభవించియుండునా? కాన నీ పుణ్యాపాపముల విశ్వసింపరాదు.

(3) ఆస్తికులు మనకు గలుగుచున్నయనుభవములకన్నింటికి నేవో పుణ్యాపాపములతో నతుకుపెట్టుచుందురు. చూడుడు. ఒకగ్రామమున నేదైన దేవద్రోహకార్యము జరిగిన దనుకొనుడు. తరువాత వర్షములు లేక పరిసరగ్రామములతోబా టాగ్రామమునకు క్షామము వచ్చినను అంతకుపూర్వ మట జరిగిన దేవద్రోహకార్యపాపఫలితముగ నీ క్షామ మేతెంచిన దందురు. ఎచటనైన నభిషేకములు జరిగినమరునాడు కాకతాళీయముగ వర్షము పడె ననుకొనుడు. ఆయభిషేకమున కిది ఫలమని యార్భాట మొనర్తురు. వాతావరణ పరిస్థితులచే గలుగు వర్ష తదభావములకుగూడ పుణ్యాపాపములతో నతుకువెట్టుట యేటి న్యాయము? అభిషేకముచే వర్షము పడుచో గ్రీష్మకాలమున నీ బావులు వర్షింపజేతురా? దేవద్రోహముచే క్షామ మేతెంచుచో నా గ్రామమునకు మాత్రమే రాక చుట్టుపట్లనైతము క్షామము గలుగుటేల? కాన నిట్టి కార్యకారణభావ మంగీకర్తవ్యము గాదు.

ఇక నీయాక్షేపములపై యథాక్రమముగ ఆస్తికుల సమాధానములు చూపబడుచున్నవి.

(౧) ప్రత్యక్ష మొక్కటియే ప్రమాణ మనియు ప్రత్యక్షసిద్ధము గాని దెయ్యదియు విశ్వసింపరా దనియు దలంచుట యవివేకి లక్ష

ణము. కొన్నిస్థలములలో ననుమానమును మరికొన్నిచోట్ల శబ్దమును సైతము ప్రమాణములుగ నంగీకరింపనిచో మానవునకు వ్యవహార నిర్వాహమే గలుగదు. ఒక చార్వాకు డొక వత్సరపర్యంతము దేశాటన మొనర్చి యింటి కేగుదెంచుసరి కాతని భార్య యారునెలలగర్భముతో నున్నదట. అంత నాతడు భార్య వ్యభిచారిణియని నిశ్చయించి యామెను దండింపబోవుచుండ నొకడోయీ! నీవు ప్రత్యక్షముగ నీ భార్య వ్యభిచరించుట జూచితివా? లేనిచో నేల దండింపబూనితివి? నీ కనుమానాదు లప్రమాణములుగదా? అని పృచ్ఛ జేయ నాతడు నిరుత్తరుడాయెనట. చూచితిరా? ప్రత్యక్షమునకుమాత్రమే ప్రామాణ్య మంగీకరింతుమనుట బలహీనమని తెలినదిగదా? ఇక నిట్లే కొన్నిస్థలములలో శబ్దముగూడ ప్రమాణమని యవశ్య మంగీకరించి తీరవలయును. చూడుడు. నీపే రేమి? అని యీలోకాయతికుని ప్రశ్నించినను తనపేరు రాముడు, భీముడు అని యేదియో తెలుపును. ఈవిషయము నాతడేప్రమాణముచే గ్రహించెను, ప్రత్యక్షముచేతనా? పేరనునది యట్లు ప్రత్యక్షముగ గనుపించునది గాదే? ఇక ననుమానమా? అట్టి యనుమాన మేదియు లేదే? ఇక నేమనవలెను? నన్నందరిట్లే యనుచున్నారు. నా 11 వ రోజున నాతలిదండ్రులీపేరే యుంచిరని నమ్మదగిన పెద్దమనుష్యులు తెలుపుచున్నారు. అందుచే నే నమ్ముచుంటినని దెల్పునుగదా? అయినచో నిక శబ్దప్రమాణము నంగీకరించినట్లు గాలేదా? కాన ముఖ్యముగ ప్రత్యక్షము, అనుమానము, శబ్దము- ఈ మూటినైన ప్రమాణములుగ నంగీకరింపకతప్పదు. కానపుణ్యాపాపములీమూటిలో నేయొక్కదానిచేనైన సిద్ధించుచున్నవా, లేదా? అనువిషయ మిచట విచారణీయము. ప్రత్యక్షముచే జూచినచో నీపుణ్యాపాపములు సిద్ధించుటలేదు. ఈవిషయ మందరంగీకరించినదే. అంతమాత్రముచే నవి యసలే లేవనదగదు. పుణ్యాపాపము లంగీకరించనివారుసైతము చాలమంది మానవున కనుభవమువలన నంతరంగమున నొక సంస్కార మేర్పడుననియు, అయ్యది స్మృతిగల్గుట కుపయోగించుననియు అయ్యది ప్రత్యక్షయోగ్యము గాదనియు నంగీకరించి యున్నారు.

మేము పుణ్యాపాపములుగూడ సంస్కారమును బోలినవే యనియు, కొన్నిమాత్రము విశేషములు గలవనియు దెల్పుచుంటిమి. వారి సంస్కారము స్మృతిని జనింపజేయును; మా పుణ్యాపాపము లనుభవమునే గల్గించగలవు. వారిసంస్కారము స్మృతి గల్గినవెంటనే నశింపనక్కర లేదు. మా పుణ్యాపాపములు తత్తదనురూపఫలముల నొసంగి నశించును. వారి సంస్కారము దుర్బలమైనచో స్మృతి గలుగకముందే నశింపవచ్చును. మా పుణ్యాపాపములో కల్పకోటిశతముల కైనను ఫలముల నొసంగనిది నశింపవు. ఇట్టి కొన్ని విశేషములతో వారంగీకరించిన సంస్కారమువంటివే యగుపుణ్యాపాపము లుండునని యంగీకరించిన మీ కేమి బాధ?

ఇక పుణ్యాపాపములు ప్రత్యక్షసిద్ధములు గావని యందరంగీకరించిరిగదా! ఏప్రమాణముచే నివి సిద్ధించునని శంకింతురేమో? వినుడు. అనాదియై అపౌరుషేయమై అఖిలవిజ్ఞానసిధియై అశేషప్రమాణమూర్ధన్యమై యేది వెలుంగుచున్నదో యట్టి వేదము తదర్థప్రకాశకములగు స్మృతిపురాణేతిహాసాదులచే నియ్యవి సిద్ధించుచున్నవి. వేదశాస్త్రములు పుణ్యాపాపములను బోధించుచున్న వనువిషయమున విప్రతిపన్ను లెవరు గానుపింపమి తన్నిరూపణ మిట జేయనుంకించుట లేదు. శబ్దమున కిదివరకే ప్రామాణ్యము నిరూపింపబడినదిగదా? కాన నీవిధముగ శబ్దప్రమాణముచే పుణ్యాపావములు సిద్ధించుచుండ ప్రత్యక్షయోగ్యములు గానంతమాత్రమున నసలే లేవనుట యేటిపాటి?

ఇక నొకవిధమగు ననుమాన ప్రక్రియచే గూడ పుణ్యాపాపములను పునర్జన్మాదులను సిద్ధింపజేయవచ్చును. ఒకతండ్రి కిరువురు పుత్రులు గలరు. అందొకడు మేధావి. మరొక డున్మాది. కారణ మేమి? తలిదండ్రుల శుక్లశోణితములయందు గల్గువిలక్షణపరమాణుసంయోగ మందులకు మూలకారణమని నేటి నవ్యవిజ్ఞానవేత్త సమాధాన మొసంగును. కాని అట్టి విలక్షణ పరమాణు సంయోగభేదము గలుగుటకు హేతు వేమి? అని ప్రశ్నించినచో నాతడు నిరుత్తరుడగును. లేదా ఊరక మొండిప్రశ్నల వైతువు; అడుగువానికి చెప్పు

వాడు లోకువయని విసువుకొనును. లేక యేదైన కారణము తెల్పి ననుకొనుడు. అపు డందులకు హేతు వేమనియు నాపై నేదైన తెల్పినచో నందులకు హేతు వేమనియు నీవిధి నడుగసాగినచో నాతడు కొంతవడికి నేమియు దోచని స్థితి నందక తప్పదు. ఆస్థితిలో–

"నిరూపయితు మారబ్ధే నిఖిలైరపి పండితైః
అజ్ఞానం పురత స్తేషాం భాతి కక్ష్యాసు కాసుచిత్॥

అను వచన మమలులోనికి వచ్చును. "ఆపైహేతువు లాయాజీవుల పురాకృతపుణ్యపాపములై యుండు" నని యాత డంగీకరింప వలసి వచ్చును. ఎచట మానవునిలౌకికోహాలు కుంఠితము లగునో యచట నుండియే యాగమమున కావశ్యకత ఘటించును. ఆపై విషయముల మాత్రమే యది తెలియజేయును.

ప్రత్యక్షే ణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే
ఏతం విందంతి వేదేన తస్మా ద్వేదస్య వేదతా॥

అనిగదా యభిజ్ఞుల వచనము? అట్టి యూహాతీతస్థితిలో నాప్తవాక్యానుప్రాణిత మగుధర్మగ్రాహ్యానుమానముచే పుణ్యపాపములు సిద్ధించుచున్నవి. ఇట్టియెడ ప్రత్యక్షసిద్ధములు గానందున పుణ్యపాపములు లేవనుట యుక్తము గాదని తెలియుచున్నది.

(౨) ప్రతిపక్షులు చూపిన రెండవహేతువాదముచేగూడ పుణ్యపాపముల యస్తిత్వము ఖండిత మగుట లేదు. పుణ్యము సుఖమును కల్గించు ననువిషయము నిశ్చితమే కాని యీజన్మపుణ్యమే యీజన్మలో సుఖమిచ్చునని గాని, యీజన్మపుణ్య మీజన్మలోనే ఫల మొసంగునని గాని నియమము లేదు. అట్లే పాపము దుఃఖప్రదమేయగుగాని ఈ జన్మలోనిపాపమే యీజన్మలో ఫలమిచ్చునని గాని యీజన్మలోనిపాప మీజన్మలోనే దుఃఖ మొసంగితీరునని గాని నియమము లేదు. జీవుని యంతరంగము నాశ్రయించియున్న పుణ్యపాపముల బలాబలముల ననుసరించి క్రమముగ నొక్కొకసంస్కార మమలులోనికి వచ్చుచుం

డును. ఒకొక్కప్పుడు యుత్కటమగుపుణ్యము లేక పాపము ఆజన్మలోనే యనుభవములోనికి రావచ్చును. లేక మరొక బలవత్తరమగు సంస్కారమ మములులోనికి రావలసియుండుటచే నీ సంస్కారము ముందు జన్మలలోనికి నెట్టబడవచ్చును. అందుచే నీజన్మమున ధర్మము నను నుగించినవా రంద రీజన్మలో నీలోకమందే తత్ఫలమగు సుఖము ననుభవించవలెనని తలంచుట గొప్ప పొరపాటు. ధార్మికు లగువార లీజన్మలో కష్టము లనుభవించుట మనము చూచుచున్నపుడు వార లిదివరలో గావించిన పాపలేశ మిపుడు పరిపక్వమై యనుభవములోనికి తెంచినదని యెరుంగవలసియుండును. ఈజన్మలో వా రొనర్చినపుణ్యము స్వర్గాది పుణ్యలోకములలోనో, లేక రానున్న జన్మలలోనో మున్ముందు వారిచే ననుభవింపబడుననియు నెరుంగవలయును. అంతియగాని యీజన్మపుణ్యపాపములిపుడే యమలులోనికి రానందున పుణ్యపాపములసలే లేవని తిరస్కరించుట విమర్శకుడు తత్వజిజ్ఞాసువు నగువానికి తగదు. ధర్మరాజ హరిశ్చంద్రాదు లందరు ధర్మతత్పరులయ్యు పుణ్యశీలురయ్యు నట్టికష్టముల నందుటకు వారి పురాజనికృత పాపలేశము వల్లనే యను విషయమును యథార్థ మెరుంగగోరువారే గ్రంథములవలన వారిట్టికష్టముల నందిరని యెరుంగుచుండిరో యాగ్రంథములనే సమగ్రముగ పర్యాలోకన మొనర్చిననా డెరుంగజాలుదురు. రామదాసు పూర్వజన్మమున చిలుకను పంజరమున నుంచి బాధించుటచే నాతని కట్టిచెర ప్రాప్తించిన దనుకథ మన దేశమున నందరెరింగినదే. గ్రంథవిస్తరభీతిచే హరిశ్చంద్రాదుల చారిత్రవిశేషముల నిట దెలుప నుత్సహించుట లేదు. ఆయా ప్రాకృత దేహముల పరిత్యజించిన తరువాత ధర్మజాదు లెట్టి పారలౌకికమహోత్కృష్టసుఖముల నందిరో భారతాది గ్రంథముల సమగ్రముగ జదివినచో వా రొనర్చిన పుణ్యము ఫలప్రదమైనదో లేదో దెలియజాలుదుము. కాన నిట్టినిస్సారపుపలుకులు పుణ్యపాపాదులయసత్యతను నిరూపింపజాలవు.

(3) పై సమాధానములలో దెల్పినట్లు ప్రతికర్మ తనఫలము నిపుడే యీయదనియు ఇపు డనుభవించుఫల మిప్పటికర్మలదే గాదనియు

నెఱుంగనికొంద ఱా స్తికులు ప్రతిఫలమునుగూడ ప్రకృతపుణ్యపాపకర్మ లతో ముడిపెట్టజూచుచుండుట నిజమే. అట్లు ప్రతికర్మకు ప్రకృతఫల ములతో ననుసంధాన మొనర్చుట పొరపాటేయనియు నంగీకరింతుము. కాని ప్రతిపక్షీయాశయ మంతటితో నాగుటలేదు. శాస్త్రములలో క్షామాది దేశోపద్రవజనకములుగ దెలుపబడిన దేవద్రోహాదులచే క్షామా దులు గల్గుటయు, దేశప్రశాంతికరములు వర్షాదిజనకములుగ నుప దేశింపబడినకారీర్యాదులచే వర్షాదులు ఘటించుటయుగూడ నసత్య మనియు నాతనిప్రతిపాదనసరళిచే దెలియుచున్నది. ఈ విషయమున మేము విరోధింతుము. క్షామములలో నభిషేకాదులచే వర్షములు పడుట మన మనేకస్థలములలో గనుగొనుచుంటిమి. కాని నాస్తికు డందుల కభిషేకాదిజన్య మగునపూర్వమును హేతువని యంగీ కరింపడు. ఏదియో వాతావరణపరిస్థితి యందులకు హేతు వను చున్నాడు. కాని అట్టి పరిస్థితికి హేతు వేమనియు—ఆపైహేతు వేమని యు తత్తత్కారణపృచ్ఛ జేయసాగినచో ౧ సమాధానములో డెల్పిన శ్లోకచోట నిరుత్తరుడు గాకతప్పదుగదా? ఆపై వేదశాస్త్రాను ప్రాణితధర్మద్రోహానుమానముచే తద్వర్షాదులకుమూల హేతువుగ నపూర్వము నొకదాని నంగీకరింపవలసినస్థితి ఘటించును. ఒకయూరి లో నేదైన పాపము జరిగిన పరిసరగ్రామములకుసైతము క్షామా దులు గల్గుటేల యనియు; అభిషేకాదులచే వర్షములు గురియుచో గ్రీష్మకాలమున గురిపింతురా యనియు జేయుశంకలు నిస్సారములు. "కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః" అనునట్లు సమీప మున దేవద్రోహకార్య మాచరింపబడుచున్నపు డద్దానిని ప్రతిఘటిం చక మిన్నకుండిన పరిసరగ్రామవాసులు అనుమోదకులు గారా? వారుమాత్రము "చత్వార స్సమభాగినః" అన్నట్లు తత్ఫలభాక్కులు గావలదా? ఇక రెండవది వర్షింపవలసినకాలములో నేదియో ప్రతి బంధవశమున వర్షించ కుండినచో నాప్రతిబంధమును తొలగించు టకు అభిషేకాద్యుపశాంతికర్మ లాచరింపబడుచున్నవి. అంతియగాని నూత్నముగ మేఘముల సృజింపజాలుసామర్థ్య మాకర్మలకు లేదు.

ఎవరైన ధీరులు వైదికకర్మకాండయొక్క యాథార్థ్యమును పరిశీలింప దలచువార లుండి తగుసంభారముల సమకూర్చి నడిపించు నెడల గ్రీష్మసమయమున సైతము ధారాసంపాతముల జూపింపజాలు మహోత్కృష్టకర్మవిధానము వైదికవాఙ్మయమున గలదు. ఈనాటికిని, ఏనాటికిని తనయథార్థత్వము ధ్రువపరచుకొనుటకు వైదికకర్మకాండము సంసిద్ధమై యున్నదనువిషయమును ప్రతిపక్షులు గుర్తింతురుగాక.

ఇంతదనుక గావించిన విచారముచే పాపపుణ్యములసత్తు స్థిరీకరింపబడినది. ఇకముందు వానినిగూర్చి రెండుమూడు విశేషముల మాత్రము ముచ్చటించి యీవ్యాసమును ముగింతును.

తత్తత్కర్మభేదముల ననుసరించి వీనిని మూడువిధముల విభజింపవచ్చును. (౧) కేవలైహికసుఖదుఃఖమాత్రదాయకములు (౨) కేవల పారలౌకికసుఖదుఃఖమాత్రదాయకములు (3) ఉభయవిధ(ఐహిక పారలౌకిక) సుఖదుఃఖప్రదములు. ఒకదోషి కధికారి జరిమానాను మాత్రము విధించును. మరొకనికి జైలునుమాత్రము విధించును. మరొకనికి కొంతకాలము చెర, కొంతజరిమానా రెండును కలిపి విధించును. ఈవిధముగనే పాపపుణ్యములలోగూడ పైదెల్పిన మూడు తెరంగులభేదము నెరుంగదగును.

వేదవిహితము లగుకర్మ లన్నియు ప్రాయశః పుణ్యపాపరూపమగు నపూర్వముద్వారముననే తమతమఫలముల నొసంగును. ఐహికఫలములుగూడ నపూర్వముద్వారముననే గల్గును. కొన్నికర్మల వలన దృష్టద్వారమున అనగా మనకు తెలియుపద్ధతితోడనే దృష్టఫలములు కొన్ని గలుగుచుండవచ్చును. కాని వేదవిధిలోనియుద్దేశ మట్టి ఫలము గాదని యెరుంగవలెను.

పుణ్యము తేజస్సువలె ప్రకాశమానముగ, పాపము తమస్సువలె అంధకారముగ వర్ణింపబడి యున్నది. మానవునియంతఃకరణమును పాపమావరించిన, చీకటిలో పప్రించమును చూడలేకపోవుట, ఒకదానిని మరొకవిధముగ జూచుట యెట్లు సంభవించునో, యదేవిధ

ముగ భగవత్స్వరూప మన లెరుగజాలకపోవుట, విపరీతముగ నెరుంగు టయు సంభవించును. నేటి నాగరికంమన్యులు కొందరు భగవంతుని గూర్చి విపరీతపు వ్యాఖ్య గావించుచుండుట కిదియే కారణము గా వచ్చును. తేజస్సు తమస్సును పోగొట్టువిధముగ పుణ్యముపాపమును సంహరింపగలుగును. తమస్సు తేజస్సును పోగొట్టజాలనివిధముగ పాప మెప్పుడును పుణ్యమును నశింపజేయజాలదు. పుణ్యము తత్ఫలాను భవానంతరముగాని నశింపదు. పాప మధికమై పుణ్యము స్వల్ప మైన పుడు పుణ్యము కప్పి పెట్టబడును. అంతియెగాని పుణ్యము పాపముచే నశింపదు. ఇది యొకసూక్ష్మ మగువిశేషము. ఎవ్వడైన చీకటి కాం తిని పోగొట్టజాలునా? పుణ్యశాలి యగునాతనిఅంతఃకరణము నిత్య ము ప్రసన్నమై భగవద్దర్శన సముత్సుకమై యున్నతస్థితిని జెందుచుం డును. పాపిహృదయము భగవద్విముఖమై యుండుచు, అధోగతిని జెందుచుండును. ప్రతివానికి పరిగ్రాహ్యము పుణ్యకర్మ; పరిత్యాజ్యము పాపకర్మ. మనము పుణ్యశీలుర మగుదుముగాక!

---

## —♦ 5. పుణ్యము – పాపము ♦—

("దుందుభి" పత్రికలో (3-8-40) 19 సం॥ వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము.)

విహితకర్మానుష్ఠానమువలన పుణ్యసంజ్ఞకమును, నిషిద్ధకర్మా చరణమువలన పాప సంజ్ఞకము నగు నపూర్వము గల్గునని మన సిద్ధాంతము. క్రీస్తు, మహమ్మదాది మతాంతరీయులతో మనకు విహిత పదార్థనిర్వచనవిషయమున భేదాభిప్రాయ ముండవచ్చును. కాని విహితావిహితకర్మలు సుఖదుఃఖహేతువు లగుపుణ్యపాపసంజ్ఞకా పూర్వముల గల్గించు నను విషయమును వారలుగూడ నంగీకరింతురు. మనయభిప్రాయమున విహితమన వేదప్రతిపాదితము. నిషిద్ధమన వేద నిషిద్ధము. అందు విహితకర్మ నిత్య, నైమిత్తిక, కామ్య భేదములచే త్రివి ధము. ఈకర్మ లన్నియు ఫలాభిసంధిపూర్వముగ నొనర్చిన తత్తదుచిత

పరిచ్ఛిన్న స్వర్గాదిసుఖదములును, ఫలాభిసంధిరహితముగ నొనర్చిన చిత్తశుద్ధిమూలముగ నిరతిశయమోక్షదములును కాగలవు. వీనిలో నిత్యనైమిత్తికము లకరణే ప్రత్యవాయజనకములు. కామ్యము లట్లుగాక పురుషేచ్ఛాయత్తములు.

ఇక ప్రాయశ్చిత్తరూప మగుకర్మగూడ నొకటి గలదు. దీనివలనగూడ పుణ్యరూపాపూర్వము గలుగగలదు. కాని ఆ యపూర్వము తత్తదుక్త పాపకర్మజనితము లగు పాపముల మాత్రము పోగొట్టగలదు. (స్వర్గాపవర్గ సాధన మగుట సందిగ్ధము.) "ధర్మేణ పాప మపనుదతి" అనుశ్రుతి కర్థ మియ్యదియే. మరొక విశేషము కలదు. శ్రుతిస్మృతులచే నిషిద్ధము లగుకర్మముల నాచరించుటచే గలెడి పాపముల బోగొట్టుకొనుటకై వేరువేరుగ నాయాపాపములకు ప్రాయశ్చిత్తములు విధింపబడి యున్నవి. కొన్నిపాపములకుమాత్రము విధింపబడి లేవు. అట్టిపాపములు కొన్ని పుణ్యములచే పోగలవు. యద్రాత్రియా త్కురుతే పాపం తద్రాత్రియా ప్రతిముచ్యతే-అని ఆచమించుచున్నాము. 'ఇహజన్మని జన్మాంతరేవా జ్ఞానాజ్ఞానకృత దోష నిర్హరణార్థ' మని స్నానమునకు సంకల్పించుచున్నాము, ఇట్టి కర్మములవలన గలుగుపుణ్య మపరిదృశ్యమానప్రాయశ్చిత్తము లగు పాపములను మాత్రము పోగొట్ట జాలును. ఈ కొద్దిపుణ్య మట్టి పాపములను మాత్ర మన్నింటిని పోగొట్టజాలునా? యని సందియ మంద వచ్చును. ఇచట నొక యుదాహరణముతో సమన్వయపరుపవచ్చును. ఇవుడు యుద్ధనిధి యొకటి స్థాపింపబడియున్నది. ఇందు సేకరింపబడు ధనము విమానదళము, నౌకాదళము, వైద్యసహాయము మొదలగు కార్యముల కుపయోగించబడును. ఒకరు తా మొసగుధన మిందులకు మాత్రమే వినియోగింప బడవలెనని కోరిన నట్లా కార్యమునకే వినియోగింప బడును. ఒకరూవ్య మిచ్చినను అదిగూడ కడమ ద్రవ్యముతోపాటు కామిత మగుఖర్చునకే వినియోగ పరచబడును. అట్లే మన మొనర్చు కర్మలో వేరువేరుగ వినియోగ ముండును. స్నానజన్య పుణ్యము స్వల్పమే కావచ్చును. అయిన, నయ్యది అట్టి కొన్ని పుణ్య

ములతో కలిసి కొన్ని పాపముల పోగొట్టజాలును. మరొక విశేషము కలదు. ఎప్పటికైనను పుణ్యముచే పాపము నశించును. కాని పాపముచే పుణ్యము నశింపదు. "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" అను సూక్తి కర్థ మిదియే. పాప మధికమగుచో నొకవేళ పాపకర్మఫలమే ముందుగా ననుభవమున కేతెంచ వచ్చును. అంతియే గాని పుణ్యము నశించదు. అపూర్వము సంస్కారమువలె జీవాధికారికము గాదు. ఇక నేమన ఈశ్వరాధికారికము. అందుచే సరియగు ననుభవము గల్గనిది అపూర్వము నశింపజాలదు. కాన మానవుడు ప్రతికర్మ ననుష్ఠించు నపుడుగూడ విహితావిహితముల బాగుగ విచారించుకొనుచు జరుపుచుండవలెను. త్వరపడి చేయరాదు. సక్రమమగు విజ్ఞానముతో ననుష్ఠిత మగుకర్మ మానవుని కభ్యుదయనిశ్శ్రేయస హేతు వగును.

---

## 6. మతాంతరీయులు.

("దుందుభి" పత్రికలో (3-8-40) 19 సం|| వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము.)

"ఆహారనిద్రాభయమైథునాని సామాన్య మేతత్పశుభిర్నరాణామ్। జ్ఞానంహి తేషా మధికో విశేషః" అనుసూక్తి ననుసరించి, యెనుబదినాలుగులక్షల ప్రాణిసమూహమున మానవులుమాత్రమే ధర్మాధర్మజ్ఞానవంతులని తెలియబడుచున్నది. వేదశాస్త్రోక్తము లగువిధి ప్రతిషేధము లన్నియు మానవులకుమాత్రమే వర్తించుచున్నవి. మానవు లందరు వేదశాస్త్రోక్తకర్మల ననుష్ఠించి, తన్మూలమున ముక్తి నందవలెను. ఇచట నొకింత విచారణీయాంశ మున్నది. మనశ్రుతిస్మృతులలో నెచట గనుగొనినను ఆధర్మములు భారతదేశీయులకు మాత్రమే సంబంధించినవిగను, అందును బ్రహ్మక్షత్రవిట్ఛూద్రాది జాతీయులకుమాత్రమే సంబంధించినవిగను చెల్పబడియున్నవి. తత్సి

ద్ధాంత మింతియె యగుచో నిక భారతేతరదేశస్థులకు, మతాంతరీయులకు గతి యేమి? వారలకు ముక్తి లేదా? వారు ముక్తి నెట్లు పొందవలయును? అను సంశయము ప్రతివారికి గలుగును. అందులకు సమాధాన మొసంగుదును.

మనమతధర్మములను రెండు రకములుగ విభజించవచ్చును. సామాన్యధర్మములు-విశేషధర్మములు. సత్యము, అహింస, దయాదులు సామాన్యధర్మములు-అగ్నిహోమాయాదులు విశేషధర్మములు. సామాన్యధర్మములు వర్ణాశ్రమాదివివక్ష లేక సర్వులచే నాచరణీయములు. విశేషములు తత్తద్విధుల ననుసరించి, ఆయావర్ణాశ్రమాయులచేమాత్రమే యనుసరింపదగినవి. ఎవరికి విశేషధర్మములు శాస్త్రముచే నుల్లేఖింప బడియుండలేదో, అట్టివారలు సత్యాహింసాది సామాన్యధర్మముల ననుసరించుచుండిన, క్రమశః ముక్తినందుదురు. లేకయువిహితములును తమ కనర్హములు నగుధర్మముల ననుసరించిన ఫలము లేకపోగా నష్టము నందుదురు. కావున కీస్తుమహమ్మదీయాది(దేశాంతరీయమతాంతరీయులు) సత్యాహింసాదిసామాన్యధర్మముల ననుష్ఠించుచుండుట విధి. "అప్రతిషిద్ధ మనుమత"మన్నట్లు అస్మచ్ఛాస్త్రనిషిద్ధములు గానిధర్మములు మతేతరమైన తత్తన్మతములలో జెప్పబడియున్నచో వానినైన ననుసరించి తరింపవచ్చును. వైదికమతానుసరణమున కనర్హులగువారలకు తత్తద్దేశములలో తత్తద్భాషలలో తత్తదుచితధర్మముల మతముల తత్తదవతారములలో తెలిపెదనని భగవానుడు తెలిపినట్లు సూతసంహితలో కలదు. కావున వారివారిమతములలో మన కవిరుద్ధము లగునంశము లేమైన నున్న నవి యన్నియు వారికి ముక్తిప్రదములని మనముగూడ నంగీకరించవలెను. అట్లని ఆధర్మముల మనమనుసరించుటమాత్రము తగదు. అది పతనహేతువే. స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహా అనిగదా భగవానుని యాదేశము?



## 7. దేవదానవులు వైదికకర్మాచరణమున కర్హులా?

"దుందుభి" పత్రికలో (3-8-40 19 సం|| వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము)

వేదప్రతిపాదితము లగుకర్మవిశేషముల ననుష్ఠింప వలసిన బాధ్యత భారతదేశీయు లగుబ్రాహ్మణక్షత్రియాదులయందుమాత్రమే యుండునని యిదివరలో తెలిపియున్నాము. భారతదేశీయు లైనను వేదోక్తకర్మల ననుష్ఠింపవలెనన్న భారతదేశమునదప్ప మరొకదేశమున నొనర్చుట కవకాశము లేదని శాస్త్రములు దెలుపుచున్నవి. మనయార్యావర్తమే కర్మభూమిపదవాచ్యముగాని మఱొండు కానేరదు. దేశాంతరీయులకు శ్రుతిస్మృత్యుక్తవిశేషకర్మల ననుష్ఠింపవలసిన బాధ్యత లేకపోగా అట్టికర్మల ననుష్ఠింప నర్హతగూడ లేదు-ఖండాంతరీయులకేగాదు; లోకాంతరీయు లగుదేవదానవులకు సైతము వైదికకర్మానుష్ఠానయోగ్యత లేదు, వారికి యజ్ఞోపవీతధారణాధికారమే లేదనిన నిక నవశిష్టకర్మాధికారవిషయమున నుడువవలసిన దేమి గలదు?

ఇట నొకసంశయ ముదయింపవచ్చును. ఏదన, "వేదమున నొకచోట 'సహ వై దేవానాంచాసురాణాంచ యజ్ఞౌ ప్రతతా వాస్తాం' అనుస్థలమున దేవదానవులయజ్ఞాచరణము వర్ణితమై యున్నది. మరి యొకచో ప్రజాపతి యొకయజ్ఞములో తనవపనే హోమ మొనర్చిన ట్లగపడుచున్నది. ఇంక ననేకస్థలములలో దేవాదులయజ్ఞాచరణ మభివర్ణితమై యున్నది. దేవాదులకు యజ్ఞార్హత లేనిచో నట్లేల వర్ణింపబడియున్నది" అని. ఇట కొంచెము దెల్పవలసినవిషయ మొండుగలదు. వేదమున (లేక పురాణాదులలో) గలయాఖ్యాయికలకు కథాకథనమాత్రముననే తాత్పర్యము లేదు. ఇక నేమన, ఒకవిధివాక్యమునో ప్రతిషేధవచనమునో ఉపబృంహణ మొనర్చుటనుమాత్రమే. అందువలన నెచటనైన నొకయాఖ్యాయికలో దేవాదులయజ్ఞాచరణవర్ణనమున్నను బహుత్రప్రతిషేధవచనములు గనబడుచుండుటచే నాయా

ఖ్యాయికలను దేవతలయజ్ఞార్హతాసంపాదనమే తాత్పర్యమని భ్రమ పడరాదు. "సహ వై" అనునాఖ్యాయికకు యజ్ఞోపవీతము కర్మా చరణకాలమున నవశ్యము ధార్య మనువిషయమును బోధించుటే యుద్దేశము. ప్రజాపతివపాయాగకథకు వపాహోమప్రాశస్త్యబోధన ముద్దేశమే, కాని వేరు గాదు. అందుచే దేవతల కీకథలమూలమున కర్మాచరణార్హత గల్గునని తలచుట పొరపాటు- బాలురకు నీతిని బోధించునుద్దేశముతో కొంగ, తాబేలు, నక్క, కాకి, పాము, కోతి మొదలగుజంతువులతో కథల కల్పించి బోధింతురు. అంతమాత్రమున ఆకథ జరిగియే యుండవలె ననిగాని ఆజంతువు లెల్ల అట్లొకభాష లోనే భాషించియుండితీరుననిగాని యెవడైన నూహించునా?

ఇక మరొకవిధముగగూడ నీయాఖ్యాయికలకు సమన్వయము జూపించవచ్చును. ఆయాఖ్యాయికలలో గల యింద్ర, వరుణాది పద ములకు నింద్రాదిపదవుల నంద మనుష్యజన్మలో యజ్ఞముల నొనరించు మానవులే యనిగూడ జెప్పవచ్చును. కాళిదాసు "గౌరీశిఖరం దదర్శ" అని తెల్పియుండలేదా? లేక అగ లింద్రాదులే కర్మాచరణోత్సుకులై భారతదేశమున మనుష్యయోనులలో జన్మించి (రామాదులవలె ఆయాకర్మల నొనర్చి యుండవచ్చును. ఇట్లే రాక్షసాదిపదములవిష యమునగూడ రాక్షసత్వప్రాపకకర్మవిశేషానుష్ఠాత లగుమనుజులే రాక్షసపదముచే వ్యవహరింపబడిరనిగాని, రాక్షసులే మనుజావతా రముల (రావణాదులవలె) దాల్చి ఆయాకర్మల ననుష్ఠించి రనిగాని సమన్వయపరచుకొనవచ్చును. అంతియెగాని ప్రత్యక్షప్రతిషేధవచ నములు గనుపట్టుచున్నప్పుడు ఆఖ్యాయికలమాత్ర మాధారముగ నొనర్చుకొని దేవాదులకు వైదికకర్మాచరణబాధ్యతనుగాని, అర్హ తనుగాని అంటగట్టరాదు.



## — 8. భేద మేమి ? —

"దుందుభి" పత్రికలో 3-8-40 19 సం|| వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము.

మన వైదికమత మత్యంతవిశాల మైనది. ఈమతము ఉత్తమ మధ్యమమందకక్ష్యాగతులగు బ్రాహ్మణక్షత్రియ వైశ్యాదివరస్పరవిభిన్నజాతీయుల కందరకు ముక్తిమార్గప్రదర్శకమై యున్నది. అంతియే గాక మంతాంతరీయులకు గూడ ముక్తిమార్గము లున్న ట్లిదివరలో నిరూపితము. తమతమకర్మల ననుష్ఠించు నన్నిమతములవారలుగూడ ముక్తులుకాగలరు; కాని అందు భేదము గలదు. ఎవరు స్వతః ఉత్తమ జాతీయులో వారలు త్వరలో ముక్తులు కాగలరు. మధ్యమాదిజాతీయులు కొన్నిజన్మములకు ముక్తు లౌదురు, ఒకడు 2.వ కక్ష్యనుండి, మరొకడు 10.వ కక్ష్యనుండి ప్రతిసంవత్సరము ప్యాసగుచుందు రనుకొనుడు, ప్యాసగుట యనునంశమున నిరువురు తుల్యులైనను, ఇద్దరికి జ్ఞానఫలప్రాప్తియందు చాలభేదము గలదుగదా! ఉత్తమకక్ష్యావిద్యార్థి త్వరలో పట్టభద్రుడు కాగలడు. అధమకక్ష్య వాడు పట్టభద్రుడగుట కెంతయో కాలము పట్టును. ఇట్లే ముక్తివిషయమునకూడ నని యెరుగవలెను. మరొకవిశేషము. ఉన్నతజాతీయుని. కర్మవిశేషమువలన ప్రపంచమున కధిక మగునుపకారము జరుగును. ఇతరుల వలన కొలదియే. ఇదియే భేదము.

## — 9. ధర్మప్రమాణవిచారము —

"దుందుభి" పత్రికలో 3-8-40 19 సం|| వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము.

ప్ర. ఆర్యా! ధర్మ మన నేమియో దెలియజేయుదురా?

ఉ. నీ వడుగదలచినప్రశ్నకు ముందుగనే కొన్నివిషయముల ప్రశ్నింతును. సమాధాన మొసంగెదవా?

ప్ర. చిత్తము.

ఉ. నీవు ధర్మమునందు విశ్వాసము గల్గియుండి యింకను విశేషముల నెఱుంగవలె ననునాసక్తితో జిజ్ఞాసువుగ బ్రశ్నించుచుంటివా? లేక, విశ్వాసము లేకయే అద్దాని విమర్శించుటకుగాను మమ్ము బ్రశ్నించుచుంటివా?

ప్ర. అయ్యా! నేను శిష్టవంశోద్భూతుడ నగుటచే పిన్ననాటినుండియు ప్రాచీనాచారాదులయందు విశ్వాసము గలవాడను; కాని కాలవశమున నండఱతోపాటు పాశ్చాత్యవిద్యలోప్రవేశించుటచే నచటివాతావరణము నన్నుగూడ కొలదిమార్పునకు గురిచేసి నది. నేటికి ప్రాచీనాచారాదులయెడ విశ్వాసము పూర్తిగ నశిం చలేదు. కాని నవీననాగరకవాసనలవలన నప్పుడప్పుడు కొన్ని సందేహములుగల్గుచుండును. మీబోంట్లయుపదేశమువలన నా సందేహములు తీరునని ధర్మతత్వము నెఱుంగదగు ననియు నిట్లు ప్రశ్నించుచుంటిని. అంతియెగాని విమర్శదృష్టితో గాదు.

ఉ. అయిన వినుము. ధర్మ మనగా మానవుల కైహికాముష్మిక సుఖములను గల్గించునది.

ప్ర. దీనిని తెలియుటెట్లు?

ఉ. వేదములవలన దెలియ నగును.

ప్ర. వేదములవలనమాత్రమే ధర్మము నెరుగనగునా?. మరొకసాధ నము లేదా?

ఉ. వేదార్థమునే సరళముగ దెల్పుటకు బయలుదేరినస్మృతులవల నను, పురాణములవలనను, శ్రుతిస్మృతిపురాణమూలక మగుశిష్టా చారము వలనను ప్రామాణికపండితులచే శ్రుతిస్మృతిపురాణ వచనములకు సమన్వయము జూపుటకు రచింపబడిన నిబంధన గ్రంథములవలనసైతము ధర్మము నెరుంగవచ్చును—

ప్ర. వీనిలో నెయ్యది ప్రధానము?

ఉ. పైనిదెల్పినవి యొకదానికన్న నొకటి బలహీనములు. అన్నిం టిలో వేదము ప్రధానము.

ప్ర. వేదమునకు విరుద్ధముగా స్మృత్యాదు లుండినచో నవి గ్రాహ్యములు కావా?

ఉ. స్మృత్యాదులు వేదమూలకము లైననే ప్రమాణము లగును. వేదము స్వతఃప్రమాణము. అందుచే వేదవిరుద్ధము లగుస్మృత్యాదులు గ్రాహ్యములు కాజాలవు.

ప్ర. ఇంతటియధికారము వేదమున కొనంగుటకు కారణ మేమి?

ఉ. బాగుగ నున్నది. బంగారమునకు వెండికన్న రాగికన్న విలువ యధికముగ నుండు టేల? నీప్రశ్న యిట్లే యున్నది.

ప్ర. బంగారపుగొప్పదన మంద రెరింగినదగుటచే నడుగవలసినయక్కర లేదు. వేదవిషయము తెలియని దగుటచే ప్రశ్నించుచుంటిని.

ఉ. అయిన వినుము. వేదమునందు మరెచ్చటను లేనివిశేషము లనేకములు గలవు. కొన్నింటిని దెల్పెదను. అది యనాది; అనగా నొకసమయమున నుద్భూతమయినది కాదు. మరియు ననంతము అనగా నశించనిది. మరియు నపౌరుషేయము; అనగా నొకపురుషునిచే రచింపబడినది కాదు. అంతియె కాక అపరిమితము; అనగా నింతటిగ్రంథమని తెలుప వీలుకానిది. సర్వవిజ్ఞానములకు నాకరము. ఇవి చాలవా వేదముగొప్పదనమునకు హేతువులు?

ప్ర. చిత్తము; మీరు తెల్పినట్టివిశేషములు వేదమున కున్నచో నద్దానికి సర్వాధిక్య మొసంగవలసినదే.

ఉ. ఏమి? చో- అని సంశయించుచున్నావు!

ప్ర. ఏమియు లేదు. ప్రకృతివిరుద్ధముగ నొకగ్రంథమునం దిట్టివిశేషము లుండు టెట్లనియె నా సంశయము.

ఉ. వైదేశికశిక్షాశిక్షితుల కందఱ కిట్టిసంశయములె కలుగుచుండును. అదేలనో వైదేశికులు తెల్పువిషయములలోమాత్రము వీరి కిట్టిసంశయములు కలుగవు. ప్రకృతమున నీవు ప్రకృతివిరుద్ధముగ కన్పించిన దేమి?

ప్ర. ఒకపురుషుడు రచించినగాని గ్రంథ మేర్పడుట మన మెచటను చూడలేదు. వేద మపౌరుషేయ మనుట ప్రకృతివిరుద్ధముకాదా?

ఉ. ప్రకృతి యన నేదియో ఎఱుంగక మాటలాడుచుంటివి. వేదాంతులు మాయ, ప్రకృతి- అనుపదములను సమానార్థకములుగా నుపయోగింతురు. అయ్యది యచింత్యరచనాశక్తులు గలదని వారంగీకరించిరి. చిత్రవిచిత్ర మగుప్రపంచ మంతయు దానినుండియే జనించుచున్నది, అఘటనఘటనాపటీయసి యగునీయది యనిర్వచనీయయని నిర్ణయింపబడినది. ఈప్రకృతియే శుద్ధ మగుపరబ్రహ్మమం దీచరాచరాత్మకప్రపంచము నంతను కల్పించినదని శారీరకమీమాంసాదర్శనము తెలుపుచున్నది. ఇట్టిప్రకృతివలన పురుషప్రయత్నాదులు లేకయే స్వతస్సిద్ధ మగునొకయపూర్వశబ్దజాలము బయలుదేరుటలోమాత్రము వైరుధ్య మేమిగలదో యొకింత విచారించుము.

ప్ర. అయినచో మీయభిప్రాయ మేమి? వేద మెట్లు బయలుదేరినది?

ఉ. ప్రపంచసృష్టికి పూర్వము సచ్చిదానందరూపమగుపరబ్రహ్మము నుండి ప్రకృతివైచిత్ర్యమువలన నాబ్రహ్మమే వేద (శబ్ద) రూపముగ నభివ్యక్త మయినది. అద్దానిని ప్రప్రథమమున నాకర్ణించి మహర్షులమూలమున నభివృద్ధినొందింపజేసినవాడు చతుర్ముఖుడు.

ప్ర. చతుర్ముఖుడు వేదకర్త కాడా?

ఉ. అతడు అభివ్యక్తిస్థానము. అంతియెకాని వేదకర్త గాడు.

ప్ర. మహర్షులు వేదముల రచించిరని నవీనచరిత్రలు చెప్పుచున్నవి గదా! అట్లు మన మంగీకరించరాదా?

ఉ. మహర్షులు తాము రచించినస్మృత్యాదిగ్రంథములలో నన్నింటియందు వేద మనాదినిధన మని తెల్పియుండగా వారలే వేదముల రచించిరని యెట్లంగీకరింతుము?

ప్ర. మీరు చెప్పినట్లు వేద మనాది యపౌరుషేయమునై యున్నచో నం దచటనచట మహర్షులు మొదలగువారినిగూర్చినగాథ లుండుట యెట్లు కుదురును?

ఉ. అయిన నీయభిప్రాయమేమి? మహర్షులతరువాతికాలములో వేదము రచింపబడినది యనిగదా? అట్లయినచో నెవరినామములు వేదములో కన్పించుచున్నవో వారె తమగ్రంథములలో వేదమనాదినిధన మని తెల్పిరిగదా; యిది యెట్లు ఘటించును?

ప్ర. వేదములు భిన్నకాలములలో నపుడు కొంత మరొకపుడు కొంత యీవిధముగ రచింపబడిన దనియును తమతమకాలములకు పూర్వమే సిద్ధమైయున్న వేదభాగములను వారలు పేర్కొనియున్నారనియు తలంచుటకు వీలు లేదా ?

ఉ. వారలు కేవలము వేదవచనమును పేర్కొనుటయేగాక ఉపలభ్యమాననిఖిలవేదపరిగణనమునుగూడ నొకొ్కకచో నొనర్చియున్నారు. నీమతములో నియ్యది కుదురదు.

ప్ర. వేదభాగములపేర్లలో కొన్నింటియందాయామహర్ష్యాదులనామములు ఘటితములయియుండుటకు హేతువేమి? వారు కర్తలు కారని అంటిరిగదా.

* * * *





శ్రీసద్గురు శ్శరణమ్.

# శ్రీ జయరామ విద్యా విలాసము

( ప్రథమ భాగము. )

## ౫. వైదిక గోష్ఠి

---

### 1. అగ్ని - బ్రాహ్మణుడు

"దుందుభి" పత్రికలో '3-8-40' 17 సం॥ వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము "కల్పవల్లి" పత్రికలో '15-1-41' ముద్రితము.

పరిదృశ్యమాన మగునీప్రపంచ మంతయు ధర్మముపై నాధారపడియున్నదని ప్రాజ్ఞులు వచింతురు. ధర్మ మనుపదమునకే యట్టి గంభీరార్థము గల దనువిషయము విజ్ఞలోకవిదితచరమే. "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" యనుశ్రుతి యీ విషయమును దృఢపరచుచున్నది. ధర్మము సక్రమముగ ప్రవర్తించుచున్న, నీ ప్రపంచము గూడ నట్లే నడచును. అట్లుగాక ధర్మమునకు వ్యత్యయము గలిగిన చో నీ లోకముగూడ వ్యత్యయము నందును- ఇక ధర్మమన నేమి యనువిషయమును జైమినిమహర్షి 'చోదనాలక్షణోఽర్థో ధర్మః' అను సూత్రమున స్ఫుటీకరించియున్నాడు. అట్టి వైదికధర్మ మంతయు ముఖ్యముగ అగ్ని, బ్రాహ్మణుడు, అను నిరువురపై నాధారపడియున్నది. అందుచే నీవైదికగోష్ఠిలో మున్ముం దాయిరువురనుగూర్చి యెరుంగుట మనకర్తవ్య మనునాశయముతో నీ చిన్నవ్యాసమును వ్రాయుచుంటిని.

శ్రుతి స్మృతి విహితము లగు సకలకర్మలు నగ్నితో గూడినవియై యున్నవి. సప్తపాకయజ్ఞములేమి, సప్తహవిస్సంస్థ లేమి, సప్తసోమసంస్థ లేమి, ఇవి యవి యన నేల-సమస్తశ్రౌతస్మార్తకర్మలు సామాన్యముగ నగ్నితో గూడినవియే. ఏయే దేవతల కాహుతుల నీయదలచినను వానినన్నింటి నగ్నిద్వారముగనే యొసంగవలయును. అగ్నిద్వారముగనే సకలసురలు స్వస్వహవిర్భాగములను గ్రహింపు చుందురని శాస్త్రములవలన దెలియుచున్నది. అందుననే సర్వకర్మల యందును అగ్నిముఖాహుతి యనుపేరనగ్నికి ప్రప్రథమముననే యాహుతి యొసంగబడుచున్నది. అగ్ని కాహుతిలేని శ్రౌతస్మార్తకర్మలు సామాన్యముగ నుండవు. అగ్ని లేని వైదిక కర్మలే లేవని చెప్ప వచ్చును.

బ్రాహ్మణుడుగూడ నట్టివాడే. సకల శ్రౌతస్మార్తక్రియలు మంత్ర తంత్రములపై నాధారపడి యుండునుగదా! ఆ మంత్రతంత్రములు రెండును బ్రాహ్మణునియధీనమున నుండును. అధ్యాపనము, యాజనము అను రెండింటికి బ్రాహ్మణుడేగదా యధికారి. అట్టియెడ బ్రాహ్మణుడు లేనిచో నిక యాజనమెట్లు? యాజనము లేనిచో యజనమెట్లు? బ్రాహ్మణుడే లేనిచో యాజనము, యజనము, రెండు నుండవు. కొన్ని సామాన్యకర్మ లగ్ని లేకున్నను నిర్వర్తింప వీలగును. కాని బ్రాహ్మణుడు లేకున్న నేకర్మను నిర్వర్తింప వీలుగాదు. అందువలననే మున్ముందుగనే సకల వైదికకర్మలు అగ్ని, బ్రాహ్మణులపై నాధారపడి యున్నవని తెలిపియుంటిని.

ఇకముందు అగ్ని బ్రాహ్మణులకుగలసంబంధమునుగూర్చియొకింత ముచ్చటింతును. తైత్తిరీయశ్రుతి, సప్తమకాండ, ప్రథమప్రశ్న ప్రథమానువాకమున నీవిధముగ నున్నది.

"అగ్ని ర్దేవతాన్వసృజ్యత గాయత్రీ ఛందో రథంతరగ్ం సామ బ్రాహ్మణో మనుష్యాణా మజః పశూనాం తస్మాత్తేముఖ్యాముఖతో హ్యసృజ్యన్త"

సృష్టికర్త యగు ప్రజాపతిముఖమునుండి దేవతలలో నగ్ని, ఛందస్సులలో గాయత్రి, సామములలో రథంతరము, మనుష్యులలో బ్రాహ్మణుడు, పశువులలో మేషము సృజింపబడెను. దేవతలు మొదలగు వానిలో క్రమముగ నగ్ని మొదలగునవి ప్రధానములు. యజ్ఞమునగూడ పైవియే ప్రధానములు. అగ్ని బ్రాహ్మణుల కిట్టి జన్మసంబంధ ముండుటచేతనే గాబోలును "ఆగ్నేయోవై బ్రాహ్మణః"

అని యనేకస్థలములలో శ్రుతి ఘోషించుచున్నది.

బ్రాహ్మణున కుపనయనకాలముననే "అగ్ని రాచార్య స్తవ" యని యాచార్యునిచే నాదిష్టమైనది. అదిమొదలాజీవితాంతము బ్రాహ్మణున కగ్నిపరిచరణ మవశ్యకర్తవ్యమని శాస్త్రములచే జెప్పబడియున్నది. బ్రహ్మచర్యాశ్రమమున సాయంప్రాతఃకాలములను బ్రహ్మచారి కగ్నికార్యము విధింపబడియున్నది. అలసటచే నగ్నిపరిచర్యను పరిత్యజించినచో మనువుచే నేమి ప్రాయశ్చిత్తము విధింపబడినదో గనుగొనుడు.

"అకృత్వా భైక్ష్యచరణ మసమిధ్యచ పావకమ్
అనాతుర స్సప్తరాత్ర మవకీర్ణివ్రతం చరేత్॥"

బ్రహ్మచర్యానంతరము స్నాతకునికిసైత మగ్నిపరిచరణము తప్పనిసరియే. ఇక గృహస్థువిషయమున జెప్పవలసిన యక్కరయే లేదు. ఆతనిజీవిత మంతయు అగ్నిసాహచర్యయుతమై యున్నది. ఒకయగ్ని కాదు, ఒకటి స్మార్తాగ్ని, మూడు శ్రౌతాగ్నులు, పక్షపక్షమునకు స్థాలీపాకములు, ఇష్టులు. వీనితో గృహస్థునస్త్రశస్త్రములు ప్రసంగుచుండును. అందునుగూడ గృహస్థాగ్నులునిత్యములేగాక ధార్యములు ఆపస్తంబమహర్షి.

"నిత్యః, ధార్యః." గృహ్యసూత్రము. ౫ ఖండ- అని తెలిపియున్నాడు. ఈ యగ్నులు విచ్ఛిన్నము లగుచో ప్రత్యవాయము గలుగును. ఏ యొక్క పూట నగ్నిపరిచర్య మానినను ప్రాయశ్చిత్తము

తప్పనిసరియే. గృహస్థయికూడ నగ్నుల ధరించి పూజింపని బాపని గూర్చి శాస్త్రము లేమని వచింపుచున్నవో గనుగొనుడు.

"యస్తు స్థితాయాం భార్యాయా మగ్నిం త్యజతి మూఢధీః
సోఽనగ్నిక ఇతి ఖ్యాత స్సర్వకర్మబహిష్కృతః॥

(విష్ణుధర్మోత్తరము.)

"యస్తు హిత్వా ద్విజో హ్యగ్నిం గృహస్థ ఇతి మన్యతే
అన్నం తస్య న భోక్తవ్యం భుక్త్వా చాంద్రాయణం చరేత్॥

(ఆశ్వలాయనుడు.)

"ఔపాసనపరిత్యాగీ సురాపీ త్యుచ్యతే బుధైః
న కర్మార్హో భవే త్తత్ర శూద్రఏవ నసంశయః (దేవలుడు)

"ఔపాసనాగ్నిహీనస్తు యో యథాభార్యయాగమః
తద్భార్యా వృషలీ జ్ఞేయా తజ్జాతశ్శూద్రసంభవః॥ (వ్యాసుడు)

ఇక వానప్రస్థాశ్రమము స్వీకరించినను వైతానికాగ్న్యుపాసనము విధింపబడియున్నది. చూడుడు,

"వైతానికంచ జుహుయా దగ్నిహోత్రం యథావిధి
దర్శ మస్కందయ స్సర్వంపౌర్ణమాస్యాం ప్రయత్నతః

(మనువు)

ఈవిధముగ బ్రాహ్మణున కాజీవితాంత మగ్నిపరిచర్య ముఖ్యతమముగ జెప్పబడియున్నది. బ్రాహ్మణుని మేధావర్చస్తేజో యశో బ్రహ్మవర్చసాదు లగ్నివలననే సిద్ధించుచున్నవి.

బ్రాహ్మణాగ్నుల కిట్టి గాఢతరసంబంధముగలదుకాని,అయ్యది గ్రంథములలో మాత్రమేనా యను సంశయమునకు గురియగుచున్నది. నేటిబ్రహ్మచారులలోనుపనయనము నాల్గుదినములు తప్ప నితరదివసములలోనగ్నికార్యమొనర్చువారు చూచుటకైన దొరకుట కష్టముగనున్నది.స్నాతకుని విషయము చెప్పనవసరమే లేదు(స్నాతకుని గూర్చి మరొకపరి వ్రాయుదును.) ఇక గృహస్థులలోగూడ నగ్నిపరిచర్య యట్లె యున్నది. వివాహాగ్నికి పునస్సంధానము పునస్సంధాన (గర్భా

ధానము)లోనే. ఔపాసనమో?అయ్యది పైతృకములయందుమాత్రమే చేయబడుచున్నది. వేయిమంది కొకడైన సాగ్నికుడు దొరకకున్నాడు.

ఇట్టి పరిస్థితి యేర్పడిన నిక బ్రాహ్మణుల ముఖమున బ్రహ్మవర్చస్సేవిధముగ బ్రకాశింపగలుగును? ఆతని గనుగొనుటతోడనే యితరుల కాతనియందు పూజ్యభావ మే విధముగ నుదయించును? మమ్ముల సరియగు గౌరవముతో జూచుట లేదని మనము మొఱబెట్టుకొనిన దాన గలుగులాభ మేమి?

ఇప్పటికైన ధర్మోద్ధరణము జేయ నుత్సహించు మహామహులు వేరువేరు త్రోవల జనక ప్రతిబ్రాహ్మణ గృహమున నగ్నిహోత్రముల స్థాపింప బ్రయత్నింతురు గాక. దానిచే నిహపరసుఖభాజనులు కాగలరు. అభీష్టార్థసిద్ధి గలుగగలదు. "బ్రాహ్మణత్వస్య హి రక్షణే రక్షిత స్స్యాద్వైదికో ధర్మః, తదధీనత్వా ద్వర్ణాశ్రమధర్మభేదానాం" అనిగదా శంకరభగవత్పూజ్యపాదులవారియాదేశము

ఓమ్.



## —♦ 2. ఉపనయనము. ♦—

"విద్యా" పత్రికలో '10-10-40' 19 సం|| వయస్సున ము. జ. రా. శర్మచే లిఖితము: కల్పవల్లిలో (15-3-41, 1-4-41 15-4-41, 1-5-41 ముద్రితము.

ఉపనయనము ముఖ్యతమ మగునొకబ్రాహ్మ సంస్కారము. ఇతరసంస్కారములద్వారమున నీసంస్కారమున కనేకవిధములవైశిష్ట్యము కలదు. దైవికములగు విఘ్నములచే నొకవేళ బాలకునకు నిషేకాదిసంస్కారములు జరుపబడకపోవచ్చును. అట్టివానికిసైత ముపనయన మొనర్చి వేదాధ్యాపనాదుల నొనర్చుట కవకాశము గలదు. కాని సక్రమముగ నుపనయనసంస్కారము. నిర్వర్తింపబడకపోయిన చోనట్టివానికి వేదాధ్యయనమున గాని, ఇతర శ్రౌత స్మార్త కర్మలలో

గాని యధికార ముండ జాలదు. ఈ విషయము నీక్రింది వచనముల వలన దెలియ నగును.

"వైవాదే ర్విఘ్నాత్ పూర్వై ర్నిషేకాదిభి ర
సంస్కృతస్యా ప్యుపనయనం భవత్యేవ. న
తూపనయనాసంస్కృతస్య ఉత్తరాణి
శ్రౌతస్మార్తాని... ఆప. గృ. భాష్యము.

ఉపనయనమునకు పూర్వము బ్రాహ్మణబాలకుడైనను శూద్రతుల్యుడే యగుచున్నాడు. ఆతనికి కృత్యాకృత్య భక్ష్యాభక్ష్యాది వివక్ష లేదు. సంధ్యాగ్నికార్యాది స్వధర్మానుష్ఠానము గాని, గురుశుశ్రూషా, భిక్షాచర్యాదికము గాని, ఇక నెట్టివిధినిషేధములు గాని లేవు. వర్యవసానమున నాతనికి సిద్ధిపూర్వక మగుబ్రాహ్మణాది వర్ణము గాని, బ్రహ్మచర్యాశ్రమము గాని, సంధ్యాదిధర్మము గాని లేవు. ఇట్టిబాలకు డుపనయనసంస్కారముతో సిద్ధిపూర్వక మగుద్విజత్వము నందుచున్నాడు. బ్రహ్మచర్యాశ్రమి యగుచున్నాడు. శ్రుతిస్మృత్యుక్తసకలవిధిప్రతిషేధపాత్రు డగుచున్నాడు. ఈ క్రింది శ్లోకము కనుగొనుడు.

"ఉపనీతేః ఫలం త్వేత ద్ద్విజతా సిద్ధిపూర్వికా
వేదాధీత్యధికారశ్చ సిద్ధిః ఋషిభి రీడితా."

ఉపనయనద్వారమున ద్విజకుమారు డుత్కృష్టమగు బ్రహ్మజన్మ నొందుననియు ఇట్టి రెండవజన్మ కలవారలగుటచేతనే బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు ద్విజులు (రెండవ జన్మము కలవారు) అనుపేరు కల్గిన దనియు శాస్త్రములు వక్కాణించుచున్నయవి. ఈ ద్వితీయ జన్మలో బాలకునకు తల్లి గాయత్రియనియు, తండ్రి యాచార్యుడనియు నీక్రింది మనువచనములవలన దెలియుచున్నది.

"మాతురగ్రేధిజననం ద్వితీయం మౌంజిబంధనే
తృతీయం యజ్ఞదీక్షాయాం ద్విజస్య శ్రుతిచోదనాత్
తత్ర య ద్బ్రహ్మజన్మాస్య మౌంజీబంధనచిహ్నితమ్

తత్రాస్య మాతా సావిత్రీ పితా త్వాచార్య ఉచ్యతే
వేదప్రదానా దాచార్యం పితరం పరిచక్షతే॥
(మనుస్మృతి. ద్వితీయాధ్యాయము 169–170–171)

ఉపనయనమున ప్రధానము సావిత్ర్యుపదేశము. సకలవేద సారాత్మకమును, సమస్తమంత్రములలో నుత్తమోత్తమము నగు నీ గాయత్రీమహామంత్రగ్రహణద్వారమున బాలకుడువిజ్ఞాననేత్రమును పొందును. నీల పీతాది రూపగ్రాహకము లగునయనములు రెండుగాక ధర్మాధర్మాద్యలౌకికవిషయగ్రాహక మగువిజ్ఞాన నయనము నీ సంస్కారద్వారమున బాలకుడు పొందుచున్నాడు. కాన నిద్దానికి ఉప...నయనము...అనుపేరు కల్గినదని విద్వద్వరేణ్యులు కొందరు వాకొనుచున్నారు.

మరి కొందరిట్లు వక్కాణించుచున్నారు. "ఉపనయన మనగా ఉప=సమీపమునకు, నయనమ్=గైకొనుట అనగా దరిజేర్చుకొనుట–యని యర్థము. ఉపనయనమొనర్చినదిమొదలుగనాచార్యుడువటువును తనదరి జేర్చుకొని అతనికి వేదాధ్యాపన మొనర్ప వలెను. తన విద్యాభ్యాసము పూర్తియగుడనుక నావటు వాయాచార్యుని కడనే శుశ్రూషాదిపూర్వకముగ నధ్యయన మొనర్పవలెను, ఈ సంస్కారమునుండి యాచార్యుడు వటువును తనదరి జేర్చుకొనును. అందువలననే యీ సంస్కారమునకు 'ఉపనయనము' అనుపేరు గల్గినది." అని.

విచారించి చూచిన నీరెండుపక్షములలో నుత్తరపక్షమే సిద్ధాంతానుకూల మను విషయమును విజ్ఞు లెరుంగజాలక పోరు. ఈవిషయము నిచట నొకింత విచారించి యావల కేగుదము.

చూడుడు ఉపనయనమున కుమారుడాచార్యుని గూర్చి యిట్లు పలుకుచున్నాడు. "బ్రహ్మచర్య మాగా ముప మా నయస్వ" (వేదాధ్యయనార్థ మగుబ్రహ్మచర్య వ్రతము నవలంబింతును. కాన నన్ను నీదరిజేర్చికొనుము.) ఇచట 'నయస్వ' అనుపదము వాడబడియున్నది, నయస్వ అను పదము, నయనమ్ అనుపదము, ఈరెండును 'నీ' ధాతు

వికారభూతములే, రెండును గైకొనుట యను నర్థమునకు సంబధించినవియే. అంతియేగాదు, "ఉత్తరేణ యజుషోపనీయ" అనుసూత్రానుసారము ఆచార్యుడు "దేవస్య త్వా సవితుః ప్రసవ ఉపనయేసౌ" (ఓయీ! దేవు డగుసూర్యునియనుజ్ఞతో నిన్ను నాదరిని జేర్చుకొనుచున్నాను) అని పలుకుచు చేతుల జాచి కుమారుని తన సమీపమున కూర్చుండబెట్టుకొనుచున్నాడు. పై మంత్రమునగూడ 'నీ' ధాతు వికారభూతమగు 'నయే' అనుపదమే వాడబడినది. ఆ పదమునకు పూర్వమున నుపపదముగూడ నుపయోగింప బడినది. ఇక ఉపనయనమ్ – ఉపనయే అనుపదము లోకయర్థమునకు సంబంధించియే వాడబడిన వనియు, నందుచే నుపనయన మనగా నాచార్యుడు వటువును తనదరి జేర్చుకొనుటయే యని వేర చెప్పవలసిన యావశ్యకత గనుపట్టదు.

ఇచట పాఠకుల కొకసంశయము గలుగవచ్చును. 'కుమారున కుపనయన మొనర్చునది తండ్రియేగదా? మీ రన్నవిధముగ నుపనయన పదమునకు దరిజేర్చుటయనియే యర్థమైయున్నచో, పుట్టిననాటి నుండి నేటిదనుక పెంచి పెద్దచేసిన తండ్రి కుమారుని క్రొత్తగా దరి జేర్చుటయేమి? ఇదివరకుమాత్రము కుమారుడు తండ్రియుద్దనే యుండుటలేదా?" యని.

కాని పాఠకులకికకొంత దెలియవలసిన విషయము గలదు. ఉపనయనమున కుమారుని నాచార్యుడీవిధముగ ప్రశ్నించుచున్నాడు. 'కోనామాసి?' (నీ దేమి పేరు) 'కస్య బ్రహ్మచార్యసి?' (ఎవరిపిల్లడవు) మీరనుకొనినట్లుపనయనపదమునకు దరిచేర్చుటయనెడి యర్థము కాదనియే అంగీకరించితి మనుకొనుడు. అపుడు వారీప్రశ్న కేమి సమాధాన మొసంగుదురు? మీ యభిప్రాయమున తండ్రియే ఉపనేత గదా? అట్టిచో నాతడు నీపేరేమి అని కుమారు నడుగవలసినయావశ్యకత యేమి కలదు? నీవెవరివాడవని యడుగుటేల? తన కుమారునిపేరేదియో అత డెవరివాడో తా నెఱుంగడు కాబోలు! ఈ ప్రశ్నకు సమాధానము నేమని యొసంగుదురో?

ఇచట నొకింత విస్తృతవిచార మొనర్చినచో నిట్టిసంశయములు చాలవరకు తలలెత్తకుండ నుండును. కాన నిచట నొకింత విచారింతము, నిజమునకు కుమారునకు తండ్రియే ఉపనయన మొనర్పవలెననునియమము లేదు. శాస్త్రకారులయభిప్రాయము లిట్టినియమముల కవకాశము నిచ్చుట లేదు. చూడుడు—

"తస్మి న్నభిజనవిద్యాసము దేతగ్ం సమాహితగ్ం
సగ్ స్కర్తార మీప్సేత్"
(ఆపస్తంబధర్మసూత్రము ౧ ఖండ ౧౨ సూత్రము)

ఉపనయనము కావలసియున్నచో నాభిజాత్య విద్యాది సంపన్నుడగు నాచార్యు నన్వేషించుకొని, యాతని తన కుపనయన మొనర్ప ప్రార్థింపవలెనని పై సూత్రము వలన దెలియుచున్నది. తండ్రియే ఉపనయన మొనర్పవలెనను నియమ మున్నచో కుమారు డాచార్యుని వెదకికొనవలసినయావశ్యకత యేమి గల్గును? ఇందులకు కారణ మేమి? అని విచారించినచో నీ క్రిందివిషయము పర్యవసన్నము కాగలదు. వస్తుతః ఉపనయనము వేదాధ్యయనార్థ మగు సంస్కారము. ఈ క్రిందిసూత్ర మీ విషయమును దృఢపరచుచున్నయది.

'ఉపనయనం విద్యార్థస్య శ్రుతిత స్సగ్స్కారః'
(ఆపస్తంబధర్మసూత్రము ౧ ఖండ ౯ సూత్రము)

అందుచేత నుపనేత యగునాతడు వేదవేదాంగవిదు డగు విద్వాంసుడై యుండవలెను. అవిద్వాంసు డగునాత డుపనేతృత్వమున కర్హుడు కాజాలడు. అట్టి యవిద్వాంసు డొనర్చెడి యుపనయనమును శ్రుతి యీ విధముగ నిందించుచున్నది.

"తమసో వా ఏష తమః ప్రవిశతియమ విద్వానుపనీయతే
యశ్చావిద్వా నితి హిబ్రాహ్మణమ్"
(ఆ. ధర్మసూ. ౧ ఖండ ౧౧ సూ.)

కావున బాలకు నుపనీతునిగ నొనర్చువాడు విద్వాంసుడై యుండవలెను. కుమారునితండ్రియే వెనుక దెలుపబడిన ఆభిజాత్యవిద్యాది

గుణసంపన్నుడై యున్నచో బాలకు డాతనియొద్దనే వేదవేదాంగా ధ్యయన మొనర్పనచ్చును. ఆతడట్లు వేదవేదాంగాధ్యాపన మొనర్ప నసమర్థు డగుచో మరియొక సమర్థుడగు నాతనియొద్దకరిగితనకుపనయ నమొనర్ప వలసినదిగ నాతని ప్రార్థింపవలెను. ఆత డాబాలకుని కుప నయన మొనరించి వేదవేదాంగముల జెప్పవలెను. అట్టివాడే ముఖ్యా చార్యు డనబడును. ముఖ్యాచార్యుని లక్షణమును మను వీవిధముగ నిర్వచించియున్నాడు.

"ఉపనీయ తు య శ్శిష్యం వేద మధ్యాపయే ద్ద్విజః
సకల్పం సరహస్యం చ త మాచార్యం ప్రచక్షతే."

పర్యవసానమున,

"తస్మిన్గ్ శ్చైవ విద్యా కర్మాంత మవిప్రతిపన్నే ధర్మేభ్యః" ఆ. ధ సూ. ౧. ౧౩. సూ. అను వచనము ననుసరించి, తన కుపనయన మొన ర్చినవారియొద్దనే వేదాధ్యయన మొనర్చుట ముఖ్యపక్షము. అందుచే వేదాధ్యాపనాప్త్యా డుపనయన మొనర్చుట ముఖ్యపక్షము. అట్టియ ప్తాత తనతండ్రి కడనే యున్నచో నాతడే యాచార్యుడు కావచ్చును. ఆయాచార్యత్వ మాభిజాత్యవిద్యాదిప్రయుక్తముకాని, పితృత్వప్రయు క్తము కాదు.

ఇక నేవైన కారణములచే నవిద్వాంసునియొద్ద బాలకు డుపనీతు డైనచో నాతడు మరియొకగురువుకడ కేగి, విద్యాభ్యాస మొనర్ప వచ్చును. అట్టిసందర్భమున నాబాలకున కుపనయన మొనర్చినయాతడు ముఖ్యాచార్యుడు కాజాలడు. ఆవేదాధ్యాపకుడుసైతము ముఖ్యా చార్యుడు కాజాలడు. ఇక నేమన బాలకుని కుపనయనము నొనర్చిన యాతడు అముఖ్యాచార్యు డగును. ముఖ్యాచార్యాముఖ్యాచార్యులకు గలభేదము(తారతమ్యము) మనుస్మృతిలో నీవిధముగ బేర్కొన బడినది. "ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం దశం పితా సహ స్రంతు పితౄన్మాతా గౌర వేణాతిరిచ్యతే" మనుస్మృతి ౨ అం. గరసి- శ్లో॥ 'అత్రోపనయనపూర్వకసావిత్రీమాత్రాధ్యాపయితా ఆచార్యోఽ

భిప్రేతః ఉత్పాదక బ్రహ్మదాత్రోరిత్యనేన ముఖ్యాచార్యస్య పితర మపేక్ష్యోత్కర్షం వక్ష్యతీ త్యవిరోధః”

కుల్లూక భట్ట వ్యాఖ్యానము,

“ఉత్పాదకబ్రహ్మదాత్రో ర్గరీయా న్బ్రహ్మదః పితా బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్య చేహ చ శాశ్వతమ్.” మనుస్మృతి. ౨అ. ౧౪౬ శ్లో॥ కనుగొంటిరా యిరువురి కెంతభేతము కలదో? ఇక నట్టిబాలకున కధ్యాపన మొనర్చిన యాతడుగూడ నుపాధ్యాయు డగును. ఉపాధ్యాయాచార్యులకు గలభేదము నైతము పై వచనములచే నెరుగ దగును. ఇంతకు పర్యవసానమున నుపనేత యగువాడు తండ్రియే కానవసరము లేదనియు, ఇక నేమన నాభిజాత్యాది గుణసంపన్నుడై యుండు నాతడే యుండవలెననియు తేలినది. ఇచట మరియొక సంశయము తల యెత్త వచ్చును. “బ్రహ్మచర్య మాగా ఇతి కుమార ఆహ” “ప్రష్టంపరస్య ప్రతివచనం కుమారస్య” “కుమార ఉత్తరేణ మంత్రేణోత్తమ మోష్ఠ ముపస్పృశతే” “కుమారో దక్షిణేన పాణినా దక్షిణం పాద మన్వారభ్యాహ సావిత్రీం భో అనుబ్రూహీతి” మొదలగు సూత్రములలో నన్నిచోట్లను కుమారపదము ప్రయోగింపబడుచున్నది. కుమారుడన పుత్రుడనియేగదా యర్థము అట్టిచో నిక నిచట తండ్రియే ఉపనేత యనియు కుమారుని యుపనయన మొనర్చుచున్నాడయు నేల నిశ్చయింపరాదు? అని

ఈప్రశ్న స్మార్తపరిభాషానభిజ్ఞత్వప్రయుక్తమే. ఇచట కుమార పదమునకు పుత్రుడని యర్థము కాదు. ఇక నేమందురా?

శిశు స్స్వన్నపాశనాత్ప్రాగాచౌలా ద్బాలక స్మృతః
కుమారకస్తు విజ్ఞేయో చౌలా దామౌంజిబంధనాత్-

అనులక్షణము ననుసరించి యనుపనీతుడును కృతచూడుడు నగుబాలకుడే యిచట కుమారపదవాచ్యుడు. అందుచే నిచట కుమారపదము మీరివాదమున కంతగ నుపయోగింపదు. పితృపదమున్న నేమైన నుపయోగించు నేమో? కాని యాపదము సూత్రమున గనుపింపదు. “వపంత

ముత్తరయానుమంత్రయతే దక్షిణతో మాతా బ్రహ్మచారిణా" యను సూత్రమున మాతృపద మున్నది. కాని, యచటి ప్రయోగము చౌలమునగూడ కర్తవ్యముగ నుండుటచేతను, ఉత్తరత్రచౌలమును చెప్పుచు సూత్రకారుడు "అపాగ్ం సగ్ంసర్జనాద్యా కేశనిధానాత్సమానం" అని సంక్షేపముగ దెల్పియుండుట చేతను, చౌలము పితృకర్తృకము గనుక చౌలమున మాత యనుమంత్రించుననియు, ఉపయనమున బ్రహ్మచారి యనియు, సూత్రకారుడు మంత్రప్రశ్నక్రమము ననుసరించి వ్యాఖ్యాన మొనర్చియుండుట నచటి మంత్రవినియోగము నంతయు నపుడే దెల్పియుండెననియునుగూడ నూహించుట కవకాశము కలదు. పోనిండు- ఒకవేళ నా ప్రయోగ ముపనయనమునకు సంబంధించినదే యనినను, వికల్పితుడగు బ్రహ్మచారి యనుమంత్రించుట పరనిర్వర్త్య మగునుపనయనమునగూడ సంభవించుట కెట్టియాటంకము నుండదుగదా, రెండు నమవికల్పములుగ నొకసూత్రముననే దెల్పియుండుటచే నభావపక్షమున బ్రహ్మచారి యనుమంత్రింపవలె ననుటయు నంత సమంజసము గాదు.

ఇక నిచట కొంద రజ్ఞాత కులగోత్రాదికము లగు నీక్రింది శ్లోకముల జూపి, తండ్రిదప్ప మరొక రుపనయన మొనర్చుట మహా పాతకమని నిరూపింప జూతురు.

పిత్రైవోపనయేత్పుత్రాన్ తదభావే తు తత్పితా.
తదభావే పితు ర్భ్రాతా తదభావే తు తత్పితా.
వ్రతబంధం కుమారస్య వినా పితు రనుజ్ఞయా.

యః కరోతి ద్విజో మోహా న్నరకం ప్రతిపద్యతే, కాని ఈ శ్లోకముల నాధారముగ గైకొని వాదింపజూచు వారు మున్ముందీ ప్రశ్నలకు సరియగు సమాధానముల నొసంగవలసి యుందురు.

"ఉత్పాదకబ్రహ్మదాత్రో ర్గరీయాన్ బ్రహ్మదః పితా।
ఆచార్యాణాం దశం పితా.
సహి విద్యాత స్తం జనయతి.

తచ్ఛ్రేష్ఠం జన్మ
శరీర మేవ మాతాపితరౌ జనయతః.

మొదలగు పరశ్శతప్రమాణములచే జనకుడేగాక మరియొక డుపనేత యున్నట్లు తెలియుచున్నది. పైవచనమునకు నీ ప్రమాణవచనముల కు గల భేదము నెట్లు పరిహరింతురు? మరొకమాట ఉపనీతు డైన వటువు వ్రతదీక్షాపూర్వకముగ గురుకులమున నుండి విద్యాభ్యాసా నంతరము గృహమునకు సమావృత్తుడు కావలెననిగదా శాస్త్రము బోధించుచున్నది. యీమతము ననుసరించి నియతముగ తండ్రియేయా చార్యు డైయుండవలసినచో సమావర్తనపదమున కెచటగూడముఖ్యా ర్థమే లేక నేతిబీరకాయవంటిదేయగునా? బహుప్రామాణిక గ్రంథ వచనముల కన్యార్థముల జెప్పి, అజ్ఞాతకులగోత్ర వచనమును సిద్ధాంత వచనముగ నొనర్ప వలసిన యావశ్యకత యేమి? కావున ఈ వచన ముల ప్రామాణ్యము నిర్ణీతమగుదనుక నీశ్లోకముల నప్రమాణములు గనో, అభిజాత్యవిద్యాదిసంపన్ను డగుపితయే ఉపనయనమొనర్చుట ముఖ్యపక్షమను నభిప్రాయముతో వ్రాయబడినవనియో పితృవ ద్భావాసద్భావములలో తదనుజ్ఞా తత్స్థానీయబోధకములనియో తలం పవలసియుండును.

ఇక చాలకాలమునుండియు తండ్రియే కుమారున కుపనయన మొనర్చుచుండుట శిష్టాచారమున గనుపట్టుచున్నది. అంతియకాని మరి యొక రొనర్చుట లేదుగదా? దీనికారణ మేమి యనుప్రశ్న విచార ణీయమై యున్నది. ఇచట నస్మదభిప్రాయమును ప్రకటించుచున్నాను.

కాలక్రమమున నిషేకాదిసంస్కారములు సక్రమముగ జరు గుట సన్నగిల్లినది. జాతకర్మాదిసంస్కారముల నన్నిటి నుపనయనకా లమున నే పాటపాడుట పరిపాటియైనది. ఆవిధముగనే యథాశాస్త్ర మగు వేదవేదాంగాద్యధ్యయన మడుగంటినది. ముఖ్యాచార్యులు ధర్మ శాస్త్రవచనములో దప్ప నిక నెచ్చటగూడ కనుబడుట కష్టతమమైనది ఇట్టి క్లిష్టపరిస్థితు లేర్పడుటచే తండ్రిని వదలి మరియొకనియొద్ద బాలకు డుపనీతుడు గావలసినయావశ్యకత లేకపోయినది. ముఖ్యాచార్య

త్వము వహింపదగిన వ్యక్తియొక డుండి యాతడు తనను శిష్యునిగ నంగీకరించిన గదా మరొకనియొద్ద నుపనీతు డగుట.? అట్టి వ్యక్తియే కనుపింపకపోయిన నిక జెప్పున దేమి? ఎటులనో మాఖ్యాచార్యుడులభిం చడు. ఇక నితరునొద్ద కేగుటేల? నిషేకాది చౌలాంతసంస్కారకర్త యు గురుపదవాచ్యు డగుతండ్రియేయుండెగదా? ఆతనికడనే ఉపన యనసంస్కారముగూడ నిర్వర్తించుకొనిన నాతనికి పితృత్వము గౌణా చార్యత్వముగూడగల్గును అనెడి యాశయముతో క్రమముగ నందరు బాలకులు తమతమ తండ్రులకడనే ఉపనీతులగుచు వచ్చిరి. రాను రాను అయ్యదియే అంతటను అలవాటై పోయినది. పెద్దపెద్దలు సైత ముపనయనము జాతకర్మ నామకరణాదులవలె పితృకర్తృకమేగాని, వేదవ్రతాదులవలెనాచార్యకర్తృకముకాదనియు, ఇతరుడు వేదవేదాం వేత్తయైనను ఉపనయన మొనర్ప రాదనియు వాదించుపరిస్థితి యేర్ప డినది, శాఖాచంక్రమణముగ నీవిషయ మత్యంతవిస్తృతమైనది. ఇక దీని ముగించి యావలి కేగుచున్నాను.

ఉపనయనముతోడనే బాలకునకు బ్రహ్మచర్యాశ్రమము సిద్ధిం చునని యిదివరలో తెలుపబడినది. అందువలన నుపనయనముననే బాలకుని యాచార్యు డీవిధముగ బ్రహ్మచర్యనియమముల శాసించు చున్నాడు.

"బ్రహ్మచార్యసి. అపోశాన, కర్మ కురు.
మాసుషుప్థాః. భిక్షాచర్యం చర, ఆచార్యాధీనో భవ.

ఈయాన కన్నింటికిగూడ వటువు 'బాఢం'-'సరియే' అనియంగీకార మును సూచించును. ఇది యంతయు గనుగొనిన గురుశిష్యుల యొడంబ డికలవలె గనుపట్టును. నేడు కొన్నికళాశాలలలోవిద్యార్థి, నిర్ణీతగ్రంథ పరిసమాప్తి వరకు కళాశాలను పరిత్యజింపకుండునట్లును, కళాశాలా నియమముల కన్నింటికి బద్ధుడై యుండునట్లును ఆతనిచే ప్రమాణపత్ర ముల (బాండులను) వ్రాయించుకొని ప్రవేశపెట్టుకొనుచుందురు. శాస్త్రీయమగు గురుకులవాసవిధానమున నిట్టి యావశ్యకత గనుపట్టదు

"తస్మిన్గ్శ్చైవ విద్యాకర్మాన్తమవిప్రతిపన్నే ధర్మేభ్యః" అని యాప స్తంబుడు గురుపరిత్యాగమును నిషేధించియున్నాడు. ఇక గురువు 'దేవస్యత్వా సవితుః ప్రసవ ఉపనయే" అనిసూర్యసాక్షికముగ, శిష్యపరిగ్రహణ మొనర్చుచున్నాడు. శిష్యుడో గురూక్తనియమములకెల్ల తల యొగ్గి తనయంగీకారమును ప్రకటించుచున్నాడు. ఇట్టి గురుశిష్యుల గాఢసంబంధము బాండులను, డిపాజెట్టులను అపేక్షించునా? సూర్యాగ్నిసాక్షిక మగునీసంబంధమునకు ప్రమాణపత్రిక లేల? తనసర్వస్వమును శిష్యుడు గురున కర్పించుచుండ నిక డిపాజెట్టులేల? గురుశిష్యుల కిట్టి గాఢసంబంధ ముపనయనద్వారమున గల్గుచున్నది.

ఈవిషయములు మనలో నేడెందరకెంతవరకు?జ్ఞప్తిలోనున్నవి? అను నీప్రశ్నకు సమాధాన మీయవలసివచ్చినపుడు మనము సిగ్గున తలల వాల్చవలసివచ్చును. కాదా? 'ఉపనయనం విద్యార్థస్య శ్రుతితస్సంస్కారః" మన మెంతవరకు జ్ఞప్తియందుంచుకొంటిమి? మన బాలకుల కెందర కట్టి యుద్దేశముతోడ నేఉపనయనముగావించుచుంటిమా? అట్టి గుర్తుతోడనే ప్రవర్తించి యున్నచో నేడు మనమిట్టి దుష్టపరిస్థితికి పాల్పడి యుండెడివారమే కాము. నేడు మనలో నూటికి కోటి కొక వేదాధ్యేత కలవాటకు కారణ మేమి? సంస్కారము లన్నియు నమసిపోవు టేల? కారణ మేమి? పెద్దలమాట పెడచెవిని పెట్టుటవలననే కాదా?

ఇట్టి యుపనయనసంస్కారసందర్భమున బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు ముఖ్యగౌణకాలము లీవిధముగ దెలుపబడినవి.

"గర్భాష్టమేఽబ్దే కుర్వీత బ్రాహ్మణ స్యోపనాయనం॥
గర్భా దేకాదశే రాజ్ఞోగర్భాత్తు ద్వాదశే విశః॥
'ఆషోడశా ద్బ్రాహ్మణస్య గాయత్రీ నాతివర్తతే
ఆద్వావిశా క్షత్రబంధో రాచతుర్వింశతే ర్విశః॥

ఉక్తకాలము నతిక్రమించినచో.

'అత ఊర్ధ్వం త్రయోప్యేతే యథాకాల మసంస్కృతాః
సావిత్రీ పతితా వ్రాత్యా భవం త్యార్యవిగర్హితాః॥

ఉపనయనకాలనిర్ణయవిషయము వ్యాసాంతరము నపేక్షించు చున్నది కాన నిట క్లుప్తముగ దెల్పబడినది.

— వి వా హ స ం క ల్ప ము. —

"దంభి" పత్రికలో (3-8-40 19 వయస్సున. మా. జ. రా. శర్మచే లిఖితము.
"కల్పవల్లి" పత్రికలో. (1-1-41) ముద్రితము.

నేటివరకు తప్పోబప్పోవైదికసంఘమున నశించక నిలచియున్న సంస్కారములలో వివాహ మొకటి. ఇయ్యది ధర్మప్రజాసంపత్తి కొర కేర్పడినది. ఈసంస్కారమునుండియే గృహస్థాశ్రమము ప్రాప్త మగుచున్నది. అది మొదలే యాతడు సకలశ్రౌతస్మార్తకర్మల నొనర్ప నర్హు డగుచున్నాడు. యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతి గ్రహములను షట్కర్మలను బ్రాహ్మణుడు గృహస్థుడగనుండియే నెరవేర్పగలుగుచున్నాడు.

సకలశ్రౌతస్మార్తకర్మార్హతను గలుగజేయు ద్వితీయ యజ్ఞో పవీతమీ వివాహమునసే ధరింపబడుచున్నది. తనచే గావింపబడబోవు సకల వైదికకర్మలలో భాగస్వామిని యగు ధర్మపత్ని యీ వివాహ మునసే పరిగ్రహింపబడుచున్నది. నిత్యమై, ఆజీవితాంతమును ధార్యమై సకలగార్హ్యకర్మల కాధారభూత మగుగృహ్యాగ్ని యీ వివాహమునసే స్థాపింపబడుచున్నది. ఇట్టి వివాహమున వధూవరులచే

"ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని"

అని సంకల్ప మొర్పబడుచున్నది. పై విషయముల గమనించి చూచిన వివాహసంస్కారము,

"అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే
ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః॥

అనువిధముగ సకలజగత్క్షేమదాయకము లగుయజ్ఞయాగాదిసత్క ర్మల ననుష్ఠించుటకే యని తోచుచున్నది.

వివాహమునకు ముందు వరు డిట్లు సంకల్ప మొనర్చుచున్నాడు

"ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియ ముద్వహే"

వివాహ ముఖ్యోద్దేశ మేమి యనువిషయమును దెలియవలెనన్న నీసంకల్పార్థమును ముందుగ నెఱుంగ వలయును. అందుచే నా విషయము నీ వ్యాసమున నొకింత ముచ్చటింతును.

కొందరు పండితులు దీని కీవిధముగ తాత్పర్యమును దెలుపుచున్నారు:— ప్రపంచమున బ్రశాంతి యభివృద్ధి జెందవలె నన్నచో నందులకు ధర్మప్రజ యవసరము. ధర్మప్రజ యనగా ధర్మాభిమానము, తదనుష్ఠానతత్పరతగల ప్రజ యని యర్థము. అట్టి ప్రజ యున్నచో యజ్ఞాదిసత్కర్మ లన్నియు సక్రమముగ నేరవేర్పబడ గలవు. దాన సకలలోకప్రశాంతి చేకూరగలదు. "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" యనిగదా శ్రుతి. అందుచే నీ వివాహమున విశ్వశ్రేయోహేతుభూత మగుధర్మప్రజకై సంకల్ప మొనర్పబడుచున్నది. ధర్మప్రజా సంపత్తికొరకే పత్నీపరిగ్రహణ మొనర్చుచుంటిని, (కాని నేడు కొందరు దలచు విధముగ పాశవదృష్టితో కామసుఖమాత్రలాలసతచేగాదు) అని దీని తాత్పర్యము. వివాహసంస్కారద్వారమున ధర్మైకదృక్కులగు ప్రజ లుద్భవింతురా యందురేమో! తప్పక యుద్భవింతురు. ఇదియే యందులకు సరియగు సమాధానము. శాస్త్రీయము సక్రమము నగువివాహమున బరిగృహీత యగుధర్మపత్ని యందు ఋతుకాలగమనాది శాస్త్ర నియమానుసారము వర్తించుటవలన నుద్భవించినయాతడే ధర్మైకదృక్కగును. లేక, యశాస్త్రీయములగు పైశాచికాది వివాహముల బరిగృహీతయగు స్త్రీయందు బలాత్కారాది మార్గములచే నుద్భూతు డగువాడు తప్పి శాచసదృశ బుద్ధిశాలియే యగును. ఈ క్రింది స్మృతివచనముల గనుగొనుడు.

"బ్రహ్మాదిషు వివాహేషు చతుర్ష్వే వానుపూర్వశః
బ్రహ్మవర్చస్వినః పుత్రా జాయంతే శిష్టసమ్మతాః
ఇతరేషు తు శిష్టేషు నృశంసానృతవాదినః
జాయంతే దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విష స్సుతాః (మనువు

పర్యవసానమున నట్టి ధార్మిక ప్రజోత్పాదనమే వివాహము ఖోద్దేశము. "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియ ముద్వహే" అను వరసంకల్పమునకు 'ప్రజాశ్చోత్పాదయితవ్యాః' అను వధూవర సంకల్పమునకు నిదియే తాత్పర్యము.

మరికొందరు పై వర సంకల్పమున కీవిధముగ వ్యాఖ్యనొనర్చుచున్నారు:– "ధర్మము, అర్థము, కామము మోక్షము అనునవి నాలుగు పురుషార్థములు. ఇందంతిమ మగు మోక్ష పురుషార్థమే సర్వజనప్రియము. కాని, అయ్యది సన్యాసాశ్రమ స్వీకృతి లేక సిద్ధింపదని పలువురు పెద్దలు వక్కాణింతురు. అందుననే కాబోలు సన్యాసాశ్రమమునకు మోక్షాశ్రమ మనుపేరుగూడ వైదికజనప్రసిద్ధమై యున్నది. ఇక మిగిలిన మూడు పురుషార్థములు గృహస్థసాధ్యములు. అందుచే పరిణయము జేసికొని గృహస్థుడు గానున్నవరుడు పురుషార్థత్రయమును సాధించుటకు వివాహము జేసికొనుచుంటినని యిచట సంకల్పించుచున్నాడు. ఇచట (ధర్మప్రజాసంపత్త్యర్థ మనుచోట) ధర్మపదమునకు విశ్వక్షేమంకరములగు యజ్ఞయాగాదులర్థము. దీనిచే ధర్మ మనుపురుషార్థము సూచింపబడినది. ఇక ప్రజాపదము కామ మను తృతీయపురుషార్థమును సూచించును. సంపత్తిపదము ద్వితీయ పురుషార్థ మగు నర్థమును సూచించును. మరొక విషయము. వివాహమునదాత కన్యాదానానంతరము వరునితో 'ధర్మార్థ కామేషు త్వయైషా నాతిచరితవ్యా' అని యనుచున్నాడు. వరుడు 'నాతిచరామి' అని యంగీకరించుచున్నాడు. దీనిని గమనించి చూచినను వివాహము ధర్మార్థకామములకొరకనియు, నీపురుషార్థ త్రయమునందును తనకు భాగస్వామినినిగా ధర్మపత్నిని [illegible]హించుచున్నాడనియు తెలియుచున్నది. కాననీసంకల్పమునకు "పురుషార్థత్రయమునకై" అనునర్థమే సమంజసము

కాని పై యర్థము జెప్పుకొనుట కొకయాక్షేపణ వచ్చుచున్నది. ఇచ్చట ధర్మ, ప్రజా, సంపత్తి, పదములు ధర్మ, అర్థ, కామ నామక పురుషార్థత్రయ సూచకములే యగుచో క్రమముగనుండక

తృతీయ పురుషార్థసూచకమగు ప్రజాపదము ద్వితీయముగను, ద్వితీయపురుషార్థసూచక మగుసంపత్తిపదము తృతీయముగ నుండుటకు హేతు వేమి? క్రమముగ ధర్మసంపత్తి, ప్రజార్థ మనియుండవలదా?

ఇంత విచార మొనర్చి చివర కీవిధముగ నిర్ణయమునకు రావలసివచ్చుచున్నది. ఇచట పైజెప్పిన రెండర్థములు గలవు పై యాక్షేపణ ననుసరించి "ధర్మ, సంపత్తి, ప్రజార్థం" అని చెప్పినచో మొదలు జెప్పినట్టి. ధార్మికసంతతికొరకనెని యర్థము రాదు. కావున ప్రథమమున దెల్పినయర్థముగూడ ముఖ్యముగ నభిలషిత మగుటచె నీవిధముగ జెప్పబడినది... అనాదిగ శిష్టాచారానుసారముగ నుచ్చార్యమాణములగు సంకల్పము లనల్పగభీరార్థములై యుండునుగదా!

మన వివాహసంకల్పమున నింతటి పవిత్రార్థములుండ నేటి విమర్శంతమన్యులు కొందరీవిషయముల నెఱుగక వివాహమన జతకట్టుటయని కటువుగ వ్రాయుచుండుట శోచనీయవిషయము. ఒకవేళ వీరి యార్యసామాజిక సిద్ధాంతానుసారము వివాహ గర్భాధానము లొకచేయనుకొనినను, ఈవిషయము గమనింపదగియున్నది ఏమందురా. వివాహమున భార్యను మాత్రమే సంపాదించుకొనుట లేదు. సకలకర్మానుష్ఠానార్హతాప్రాపకమగు ద్వితీయయజ్ఞోపవీతము, నిత్యము ధార్యము నగుగృహ్యాగ్నిసైతము గ్రహింపబడుచున్నవి. వీర లీవిషయముల నెరిగి యికనైన తమ దుర్వాదముల నుపసంహరించుకొందురుగాక.



## —: 4. వివాహము :—

"కల్పవల్లి" పత్రికలో (15-11-41;15-12-41) 20సం॥ వయస్సులో ముద్రితము.

(ఈవ్యాసము (శ్రీ) సనాతనధార్మిక యువజన సంఘమువారి—నె 2 రు-పరీక్షలో ద్వితీయకక్ష్యా బహుమానమును బడసినది.)

భారతీయుల దృష్టిలో వివాహ మనునది దేశాంతరీయులయభిప్రాయములందువలె కేవలైహికసుఖమాత్రసాధక మగుకర్మవిశేష

ము గాక పరమోత్కృష్ట మగునొక వైదిక సంస్కారముగ భావింప బడుచున్నది. భారతీయు లొనర్చు కర్మలు సామాన్యముగ నైహిక సుఖమాత్రపర్యవసానములు గాక పరమోత్కృష్టపారలౌకిక సుఖసంధాయకములగుచుండుట సహజమే. దేశాంతరీయులుగూడ సామాన్యముగ నేదియో యొక మతమునకు చెందియున్నను భారతీయులవలె మతైకదృక్కులు కారను విషయ మనుభవజ్ఞుల కవిదితము గాదు. ఇట్లుండుటచేతనే దేశాంతరీయుదృష్టిలో లోకాయతికత ప్రబలుటచే వివాహాదులు సంస్కారములు గాక, కేవలము లౌకికకర్మలు మాత్రమే యని భావింపబడుచు వచ్చినవి. విదేశీయులను వివాహమన నేమి యని ప్రశ్నించినచో వివాహమనగా నొక స్త్రీయందు పురుషుడు కామసుఖముల ననుభవించుటకు సంఘమునుండి యనుమతిని వైకొనుటకుగా నేర్పడిన తంతని కొందరు, స్త్రీపురుషు లిరువురుగలసి తాము కామసుఖముల ననుభవించుటకు నిత్యజీవనములో నిరువురు గలసి సాహాయ్యముతో వ్యవహరించుటకు సంఘము నెదుట నొడంబడిక జేసికొనుటయని మరికొందరు, సంఘమే దేశాభివృద్ధి ప్రజాభివద్ధి కొరకు స్త్రీపురుషుల గలుపు తంతని మరికొందరు, నిట్లు భిన్నభిన్నములుగ లౌకికదృష్టితో సమాధానముల నొసంగుదురేగాని పారలౌకిక సంబంధము వివాహమున కున్నటుల నొకరైనను దెలుపరు. రానురాను భారతీయులు సైతము పరశ్శతకారణములచే పరవిద్యాభ్యాస మొనర్చుటచే తన్మూలముగ తన్నాగరకతాభిరుచి మెండై క్రమక్రమముగ వారలభావములనే యలవరచుకొని తత్పదృశులైరి. ఈ కారణముననే భారతీయుల నడిగినను నేడు వివాహ విషయమున నైరీతిగనే సమాధానములు లభించుచున్నవి. ఈవిషయ మత్యంతము చింతాస్పదము

నిజమునకు వివాహోద్దేశ మేమి? దానిస్వరూప మెట్టిది? దానియుపయోగ మేది? అను విషయము లీకాలములో చాలమంది తలపోయుటే మరచిపోయిరి. ఈవిషయము నీవ్యాసమున నొకింత దెలుపదలచితిని

వివాహముఖ్యోద్దేశము ధర్మప్రజాసంపత్తి యని వివాహసంకల్పము వలననే మన మెరుంగవచ్చును. లోకదృష్టిలో గూడ ప్రజాసంపత్తి వివాహోద్దేశములలో నొకటియైనను ధర్మబుద్ధి యచట లేదు ధర్మపదార్థ మేమి యని విమర్శింపదొడగిన చాలకాలముబట్టును కాన నిచటమాత్ర ముపయోగించు నర్థమును క్లుప్తముగ దెల్పుదును.

మనుజునకు జన్మసిద్ధములుగ మూడు ఋణములుండును. అందు పితరుల ఋణము ప్రజోత్పాదన ద్వారమున దీర్పబడును, అట్టి ఋణవిమోచనరూప ధర్మార్థ మేప్రజ యభిలషింపబడుచున్నదో అయ్యది యిచట ధర్మప్రజాపదార్థమని తలంపవచ్చును. పాణిగ్రహణసమయమునగూడ 'సుప్రజాస్త్వాయ" అనుమంత్రములోని సుప్రజాపదమునకు నిదియే యర్థము గావచ్చును. ఉద్దేశము నిర్వచింపబడినది. ఇక స్వరూపమును గూర్చి యొకింత తెలిసికొందము.

సకాలమున యథాశాస్త్ర ముపనీతుడై తదుపరి సంధ్యాగ్నికార్యభిక్షాచర్యాదిస్వాశ్రమ విహితకర్మల నప్రమత్తతతో ననుష్ఠించుచు గురుశుశ్రూషా పూర్వకముగ ద్వాదశవర్షములో, చతుర్వింశతివర్షములో, షట్త్రింశద్వర్షములో, అష్టాచత్వారింశద్వర్షములలో వ్రతనియమములతో వేదవేదాంగముల నభ్యసించి, కృతవేదవ్రతచతుష్టయుడై గురుకులమునుండి సమావృత్తుడైన బ్రహ్మచారి సకలవర్ణాశ్రమధర్మముల కాధారభూతమగు గృహస్థాశ్రమమును స్వీకరింప నెంచి, స్వకులజయు, సులక్షణయు నగు కన్యను స్వీకరించి యామెపై వివాహమాడ వలెనని ధర్మశాస్త్రములవలన దెలియబడుచున్నయది చూడుడు.

'గురుణానుమత స్స్నాత్వా సమావృత్తో యథావిధి
ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితాం'

(మనుస్మృతి)

ఇట్టి వివాహ మష్టవిధములుగ నున్నట్లు ధర్మశాస్త్రకారులు తెల్పియున్నారు. ఈ యష్టవిధవివాహములలో నేయే జాతివారల కే

వివాహములు ప్రశస్తములో యేవినింద్యములో వానినిగూడ వారలు తెలియపరచియున్నారు. ఆయాజాతులవారి నైతిక సాంఘిక జీవితముల కాయావివాహము లెంతయు ననుకూలములను విషయములు పరిశోధన ద్వారమున బండితు లెరుగజాలుదురు. అష్టవిధవివాహభేదముల నిట క్లుప్తముగ ధర్మశాస్త్రవచనములవలన దెలిసికొందము. మనువు,

'బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచ శ్చాష్టమోఽధమః॥'

అని సామాన్యముగ వివాహభేదముల నామతః సూచించి యీపై నొక్కొక్క వివాహస్వరూప మును వ్యక్తీకరించుచు నిట్లు వ్రాసియున్నాడు.

'ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతిశీలవతే స్వయమ్
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః
యజ్ఞేతు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే
అలంకృత్య సుతాదానం దైవం ధర్మం ప్రచక్షతే
ఏకం గోమిథునం ద్వేవా వరా దాదాయ ధర్మతః.
కన్యాప్రదానం విధివ దార్షో ధర్మ స్స ఉచ్యతే.
సహోభౌ చరతాం ధర్మ మితి వాచానుభాష్య చ
కన్యాప్రదాన మభ్యర్చ్య ప్రాజాపత్యో విధి స్స్మృతః
ఇచ్ఛయాఽన్యోన్యసంయోగః కన్యాయాశ్చ వరస్యచ
గాంధర్వ స్సతు విజ్ఞేయో మైథున్యః కామసంభవః.
హత్వా ఛిత్వాచ భిత్వాచ క్రోశంతీం రుదతీం గృహాత్
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధి రుచ్యతే
సుప్తాం మత్తాం ప్రమత్తాంవా రహో యతోఽపగచ్ఛతి
స పాపిష్ఠో వివాహానాం పైశాచ శ్చాష్టమోఽధమః.

ఇట్లు తత్తద్వివాహస్వరూపముల వ్యక్తీకరించుటయేగాక తత్తద్వర్ణములకర్హము లగువివాహము లేవి యనువిషయము లిట్లు తెలిపెను.

చతురో బ్రాహ్మణ స్యాద్యా న్ప్రశస్తా న్కవయోవిదుః,

రాక్షసం క్షత్రియస్యైక, మాసురం వైశ్యశూద్రయోః.

కేవలశ్రీమ ప్రధాను డగుబ్రాహ్మణునకు బ్రాహ్మాదివివాహములను, పౌరుషప్రధాను డగు క్షత్రియునకు రాక్షసవివాహమును, రజస్తమరిపరిధాను లగువైశ్యశూద్రులకు ఆసురము, నిట గుణకర్మాను సారముగ విహితములై యున్నయవి. ఇచట నెరుగదగిన విశేష మొండు గలదు.

ఈ యష్టవిధ వివాహభేదములు కన్యా సంపాదన విషయమున మాత్రమే. కన్యను సంపాదించుకొనిన పిమ్మట నా కన్యకయందు లౌకికస్వత్వము గల్గును. అంతియగాని వైదికముగ స్వత్వము గలుగ లేదు అయ్యది తత్తచ్ఛాఖోక్త సంస్కారాచరణమూలముగనే గలుగును. అట్టివి వివాహసంస్కారము నెరవేర్పబడనంతదనుక నీకన్యయం దా వరునకు సంపూర్ణస్వత్వము లేదు. కన్యకకు మాతృ గోత్రవిముక్తి భర్తృగోత్రప్రాప్తి గలుగదు. అందులకైయీయష్టవిధవివాహములలో సైతముగాస్త్రోక్తవివాహసంస్కారము నొనర్పుటతప్పసనిరిదే.

గాంధర్వాదివివాహేషు పున ర్వైవాహికో విధిః
కర్తవ్యశ్చ త్రిభి ర్వర్ణై స్సమయే నాగ్నిసాక్షికః.
(దేవలస్మృతి)

ఇంతియగాక శూద్రాదులకుగూడ నీ సంస్కారము లమంత్రకముగ నొనర్పవలెనని యీ మనువచనము వలన స్పష్టమగుచున్నది.

శూద్రేప్యేవంవిధః కార్యో వినామంత్రైశ్చ సంస్కృతః

ఇచట తదుపరి యొనర్పదగిన సంస్కారములోని కొన్ని ముఖ్యభాగములగూర్చి ముచ్చటించుట యప్రస్తుతము గాదు.

'వివాహ' పదమువలననే విశేషభారప్రాప్తి యీసంస్కారమునుండి గలుగుచున్నదని తెలియనగుచున్నది. గృహస్థాశ్రమ స్వీకారమే భారమును వహించుట యని చెప్పవచ్చును.

యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః
తథా గృహస్థ మాశ్రిత్య వర్తన్తే సర్వఆశ్రమాః. (మనుస్మృతి

అని మనువు తెల్పినట్లు సకలాశ్రమపోషణభారము గృహస్థునియందే యున్నది, అంతియగాక నూటికి తొంబదివరకు శ్రౌతస్మార్తకర్మలు గృహస్థునకే యుపదేశింపబడియున్నవి, అంతియేగాదు గృహస్థాశ్రమమే సకలసారస్థితి హేతుభూతమని యనేకస్మృతివచనములు దెలుపుచున్నవి. ఇట్టి గృహస్థాశ్రమము వివాహసంస్కారము వలన లభించుచున్నది. ఈ వివాహమున గృహిణిని, గృహపతియగు నగ్నిని పరిగ్రహించుచున్నాడు. గృహ్యాగ్నిత్వ సిద్ధికొరకే ఆగ్నేయ స్థాలీపాకము మొదలు శేషహోమాంత తంత్రకలాప మేర్పడినది.

సోమః ప్రథమో వివిదే, గంధర్వో వివిద ఉత్తరః
తృతీయో అగ్నిష్టేపతి స్తురీయ స్తే మనుష్యజః.

అనువిధముగ వివాహమునకు పూర్వము కన్యకనావహించిన సోమ గంధర్వాగ్నులయధికారము నుండి కన్యక వరునియధికారము లోనికి జేరుటకు, వరుని పతిత్వసిద్ధికొరకు, కన్యకకు పతిగోత్రప్రాప్తికిగాను సప్తపది ప్రభృతి ప్రధానహోమాంతసంస్కార మొనర్పబడుచున్నది. దంపతుల సౌభాగ్యాభివృద్ధికై యరుంధతీ దర్శనాదులు, పీడానిరసనకు తృణనిరసనాదులు, కన్యకకు వర్చస్సు గల్గుటకు యుగచ్ఛిద్రాభిషేచనము నొనర్పబడుచున్నది.

ఇట్లు సక్రమముగ వివాహము నిర్వర్తించుకొనుచు స్వవిహిత ధర్మనిష్ఠులై యున్నచో నిహపరసుఖభాజను లగుదురు, మనపూర్వులందరిట్టిమార్గమునే యవలంబించిరి. రానురాను కాలమహిమచే సంస్కారలోపములు. సంస్కారములలో నవకతవకలుగూడ నెక్కుడుగా జొచ్చినవి అశాస్త్రీయము లగు నేకావివాహాదు లధికస్థానమునాక్రమించినవి. ఇంతియుగాక రజస్వలా, వర్ణాంతర, విధవా, వివాహాదులుగూడ బయలుదేరుచున్నవి. వీనికి ఫల మేమి గల్గునో.

కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేన చ
కులా న్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ.

అని మనువు వక్కాణించియున్నాడు! ఆఫలముల బ్రత్యక్షముగ గనుగొనుచుగూడ మనవార లాప్రవర్తనమును మానుటలేదు

ఇంతరవరకు దిఙ్మాత్రముగ భారతీయవివాహస్వరూపము ప్రదర్శింపబడినది. ఇకముందు నేడు సంస్కర్తృనామధారులచే నీవివాహవిషయమున నొనర్పబడుచున్న కొన్నిసంస్కరణముల విమర్శనమును, కొన్ని కుశంకలకు సమాధానములును, వ్రాయబడుచున్నవి.

ఇచట ముఖ్యముగ నెరుగదగిన విషయ మొకండు గలదు. ప్రతిపక్షీయులగు సంస్కర్తృనామధారులు సామాన్యముగ బాల్యమునుండి పరవిద్యల నభ్యసించి, పరనాగరకతలో నారితేరి, అందు సంపూర్ణ విశ్వాసముగలిగియున్నవారలై యున్నారు. అంతియేగాక వీరలకు మనమతమందును, మతప్రమాణగ్రంథములయందును ప్రమాణబుద్ధి లేదు. వారలు పాశ్చాత్యుల నాదర్శముగ నుంచుకొని కొన్నిదురాచారముల నేర్చుకొనిరి. తమకు సంఘములోనీదురాచారము మూలమున నవమానము జరుగు ననుభయముతో కృత్తలాంగూలగో మాయు న్యాయము ననుసరించి తమ మార్గమే మంచిదని లోకమునకు బోధింపదొడంగిరి. వేదశాస్త్ర విశ్వాసశీలురగు భారతీయులు వీరల లౌకిక యుక్తుల లెక్కబెట్టక పోవుటచే తమకు విశ్వాసము లేకున్నను ఉన్నట్లభినయించి వానియందుగూడ తమకే యానుకూల్యము గలదని కుయుక్తులతో సమర్థింపజూచుచున్నారు. ధర్మాభిమానులగు ధార్మిక పండితు లాదుర్వాదముల ఖండించుచున్నారు. అట్టి వాదోపవాదముల గొన్నింటి నిట సంగ్రహముగ జూపింతును అందును అస్మన్మతానుసారము వివాహము వైదికసంస్కార మగుటచే వైదికసరణి ననుసరించి ప్రతిపక్షులొనరించు వాగ్వాదములకు శాస్త్రీయ సరణితో సమాధానము నొసగి యాపై ప్రతిపక్షుల నిజదృష్టిలో నియ్యది లౌకికకర్మమాత్రమగుటచే వారలు లౌకికసరణితో గావించు లౌకిక తర్కమునకు విహిత కర్మలు సాక్షాత్తు పారలౌకిక ఫలమును ఆనుషంగికముగ చూతవృక్షమునకు నీడవలె నైహిక సుఖములనుగూడ గల్గించు మతమువారల మగుటచే లౌకిక సమాధానములనుగూడ నొసంగుదును ప్రకృతమందు వివాహకాల మెద్ది మనువిషయమున

సనాతన సంస్కర్తృ వాదోపవాదములు చూపబడుచున్నవి. సంస్కర్తలిట్లు వాదించుచున్నారు.

(౧) వివాహఏ వోపనయ స్త్రీణాం వైదిక ఇష్యతే
స్త్రీణా ముపనయస్థానే వివాహం మను రబ్రవీత్
ఉపాయనోదితః కాల స్త్రీణా-ముద్వాహకర్మణి

(మనుస్మృతి)

ఇత్యాది వచనశతములచే స్త్రీలకు వివాహము పురుషుల కుపనయనము రెండును సమకాలికములని తెలియుచున్నది. దాన ఉపనయన కాల మెయ్యదియని విచారించి స్త్రీవివాహమునకుగూడ నయ్యదియే సమయమని నిర్ణయించుకొనవలసియున్నది. విచారించగా,

ఆషోడశా ద్బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే
ఆద్వావింశా త్క్షత్రబంధో రాచతుర్వింశ తే ర్విశః॥

మనుస్మృతి.

అనువచనమువలన బ్రాహ్మణస్త్రీలకు పదునాఱు వర్షములవరకు, క్షత్రియస్త్రీలకు నిరువదిరెండేండ్లవరకు, వైశ్యస్త్రీలకు నిరువదినాల్గు వర్షములవరకు వివాహకాల మనియు సిద్ధించుచున్నది. కాన సామాన్యముగ పండ్రెండు వర్షములు దాటినచో స్త్రీలకు వివాహకాల మతిక్రమించు ననెడి సనాతనులవాదము దుర్బలము.

(౨) శ్రుతిలింగము ననుసరించి వివాహకాల విమర్శన మొనర్తుము, వివాహమంత్రములలో నొకమంత్ర మీవిధముగ గనుపించుచున్నది.

సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిదఉత్తరః
తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః॥

ఈ మంత్రమువలన సోమగంధర్వాగ్నుల భోగానన్తరము మానవుని వివాహమాడుటయని తేలుచున్నది. సోమగంధర్వాగ్నుల భోగకాలమే యదియని విచారించగా నీక్రింది శ్లోకము గన్పించుచున్నది.

"కామకాలేతు సంప్రాప్తే సోమోభుంక్తేతుకన్యకాం
రజఃకాలేతు గంధర్వో వహ్నిస్తు కుచదర్శనే॥

(సంవర్తస్మృతి)

ఏతద్వచన విమర్శనముచే రజోదర్శనానంతరముగాని సోమాదుల భోగకాలము పూర్తి కాదనియు నాపైనగాని మానవవుడు కన్యను బరిణయమాడరాదనియు సిద్ధించుచున్నది. సనాతనులు రజోనంతర వివాహము బాతిత్యహేతువని వాదించుట దీనిచే నిరాధారమని తెలియుచున్నది.

(3) స్మృతి లింగములచే విమర్శించిచూచినను రజోనంతర వివాహమే సిద్ధించుచున్నది చూడుడు. ఆపస్తంబ మహర్షి తను గృహ్యాసూత్రములో శేషహోమాంతము వివాహము నుపదేశించి యాపై మిగిలిన మంత్ర వినియోగమును, "శేషగ్ం సమావేశనే జపేత్"

అని సమావేశన కాలమున జపించమని తెల్పియున్నాడు ప్రకృతమునగూడ సర్వులచే సమావేశన మంత్రజప మొనర్పబడుచునే యున్నది, వివాహమునకు పూర్వము కన్య రజస్వల కానిచో నిచట సమావేశనమెట్లు సిద్ధించును? ఋతుమతిగాకముందు సమావేశమును.

ఋతౌనోపైతియోభార్యా మనృతౌయశ్చగచ్ఛతి
తుల్యమాహుస్తయోఃపాప మనృతౌయశ్చగచ్ఛతి॥

ఇత్యాది వచనములనేకములు నిషేధించు చుండుటచే నీ సమావేశనము ఋతుసమావేశనమేననియు వివాహము రజోనంతరమేననియు సిద్ధించుచున్నది. సనాతనుల వాదములు నిస్సారములేగదా!

(ర) మన్వాది స్మృతులుగూడ రజస్వలావివాహమునే ధ్రువపరచుచున్నవి.

త్రీణివర్షాణ్యృతుమతీ కాంక్షేత పితృశాసనం
ఊర్ధ్వంతుకాలాదేతస్మాద్విందేతసదృశంపతిం
త్రీణివర్షాణ్యుదిక్షేత కన్యాఋతుమతీసతీ

తతశ్చతుర్థే వర్షేతు విందేత సదృశంపతిం
ఋతుత్రియముపాస్యైవ కన్యా కుర్యాత్స్వయంవరం॥

ఇత్యాది వచనములు కన్యరజస్వలయైన యావల మూడు వర్షములుండి నాల్గవవర్షమున స్వయంవర విధిననుసరించి తగినవరుని పరిణయమాడ వలెననియు గన్పించు చుండ రజస్వలగాకపూర్వమే వివాహమొనర్పవలె నను సనాతనవాదమున కాధారమేమియో దెలియకున్నది.

ఇట్టి పూర్వపక్షములపై సనాతనుల సమాధానములు జూపబడుచున్నవి.

(౧) సంస్కర్తలు తెలిపినట్లు స్త్రీలకు వివాహముపనయన స్థానీయమను విషయము సత్యమేకాని యిచట నుపనయన స్థానీయమనగా నుపనయనమువలె నిత్యమని దెలియవలయును. "ఉపాయనోదితః కాలస్స్త్రీణాముద్వాహకర్మణి" యనగా నుపనయన మెట్లష్టమవర్షమున జేయదగినదో స్త్రీలకు వివాహము గూడ నట్లే యష్టమవర్షమున గావించుట ముఖ్యపక్షమనియర్థము. ఇట్లు తాత్పర్యమును నిర్వచించు కొనినచో

సప్తసంవత్సరాదూర్ధ్వం వివాహస్సార్వవర్ణికః
కన్యాయాశ్శస్యతే రాజన్నన్యథా ధర్మగర్హితః॥

ఇత్యాది వచనములతో సమన్వయముగుదురును. అంతియే గాని ఉపనయనమునకుచెల్పిన యంత్యావధియే వివాహమునకు గూడ నగుననితలంచుట పొరపాటు. "ఉపాయనోదితఃకాలః" అనువచన మంత్యావధి ప్రాపకమనియే నిశ్చయించినచో నీక్రిందివచనములతో విరోధము ఘటించును

"అష్టవర్షాభవేద్గౌరీ నవవర్షాతురోహిణి
దశవర్షాభవేత్కన్యా అతఊర్ధ్వంరజస్వలా
కన్యాగౌరీద దన్నాకపృష్ఠ వైకుంఠం రోహిణీందదత్
కన్యాందదద్బ్రహ్మలోకం రౌరవంతురజస్వలాం

పితుర్గేహేతుయాకన్యా రజః పశ్యత్యసంస్కృతా
సాకన్యావృషలీజ్ఞేయా తత్పతిర్వృషలీపతిః
రజస్వలాచయాకన్యా యదిస్యాదవివాహితా
వృషలీవార్షలేయస్యాజ్జాస్తస్యాంసుతస్మృతః॥ (అంగీరస
పితృవేశ్మనియా కన్యారజస్సుసముపస్పృశేత్ స్మృతి)
భ్రూణహత్యాపితుస్తస్యాస్సానారీవృషలీభవేత్ (లఘు
మాతాచైవపితాచైవజ్యేష్ఠభ్రాతాతథైవచ శాతాతపః)
త్రయస్తేనరకం యాంతి దృష్ట్వాకన్యాంరజస్వలాం
ఉద్వహేద్యస్తుతాంకన్యాం బ్రాహ్మణోమదమోహితః
అసంభాష్యోహ్యపాంక్తే యస్సవిప్రోవృషలీపతిః
యాకన్యాపితృవేశ్మస్థా యదిపుష్పవతీభవేత్
అసంస్కృతా పరిత్యాజ్యానపశ్యేత్తాంకదాచన
వివాహేచనయోగ్యాస్యాల్లోకద్వయవిగర్హితాః
ఏతాంపరిణయన్విప్రోన యోగ్యోహవ్యకవ్యయోః
వృషలీసంగృహీతాయో బ్రాహ్మణోమదమోహితః
సతతంసూతకంతస్య బ్రహ్మహత్యాదినేదినే
ప్రాప్తేచద్వాదశేవర్షే రజస్త్రీణాంప్రవర్తతే
యస్తాంవివాహయే న్మోహాత్సజ్ఞెయోవృషలీపతిః॥

ఈ పై వచనములచే కన్యావివాహమునకు ఎనిమిది తొమ్మిది పదియవ వర్షములు యోగ్యము లనియు, ఆ పై కన్యక రజస్వల (గౌణముగ) యని పిలువబడు ననియు, సామాన్యముగ ద్వాదశవర్షప్రాయమునకుస్త్రీ రజస్వల యగుననియు, రజస్వల యగువరకు వివాహము గావింపకుండినచో నా కన్యకతలిదండ్రులకు, పెద్దయన్నకుభ్రూణహత్యాదోషము ఘటించుననియు నా కన్యకవృషలి యగుననియు, నా కన్యకను బరిణయమైన విప్రుడు గూడ బతితు డగుననియు దెలియుచుండగా షోడశవర్షములవరకు గూడ వివాహమున కధికారము గలదనుట భ్రమయో వంచనమో యని దెలియుట లేదా? పర్యవసానములో "ఉపాయనోదతః కాల" అనువచనమునకు-

"వివాహం చోపనయనం స్త్రీణా మాహ పితామహః.
తస్మా ద్గర్భాష్టమ శ్శ్రేష్ఠః జన్మతో వాష్టవత్సరః యమః.

ఇత్యాదివచనానుసారము అష్టమవర్షముఖ్యకాలత్వ విధానమునందే తాత్పర్యముగాని ఆషోడశా దాబ్రాహ్మణస్య" అన్నట్లు షోడశవర్షాన్తావధి విధానమునందు తాత్పర్యము లేదనియు.

తస్మా దుద్వాహయే త్కన్యాం యావ న్నర్తుమతీ భవేత్

(సంవర్తః)

ఇత్యాది వచనానుసారము వివాహాన్త్యావధి. రజోదర్శనమే యనియు, ఆపైపరిత్యావాయము తప్పనిసరి యనియు తేలినది.

ఈ పూర్వపక్షమున సంస్కర్త కృత్రిమమార్గము నవలంబించి యున్నాడు చూడుడు. తా నుదహరించిన శ్లోకమునకు వెంబడిగ నంటియున్నశ్లోకార్థము తనకు విరోధించు ననుభయముచే కప్పివుచ్చి యున్నాడు. అసలు సంస్కర్త యుదహరించిన సంవర్తస్మృతిప్రమాణము.

రోమకాలే తు సంప్రాప్తే సోమో భుంక్తే తు కన్యకామ్
రజఃకాలే తు గంధర్వో వహ్ని స్తు కుచదర్శనే

"తస్మా దుద్వాహయే త్కన్యాం యావన్నర్తుమతీ భవేత్" ఏతత్ప్రమాణవచనములో చివరశ్లోకార్థముచే రజస్వలకాకపూర్వమే వివాహము గావింపవలెనని సిద్ధించుచుండుటచే రజోదర్శనానంతర వివాహాభిలాషు లగు సంస్కర్తలద్దాని గప్పిపుచ్చవలసివచ్చినది. అంతియే కాదు. దీనిలో సోమగంధర్వాగ్నిభోగకాలమునకు పూర్వమే వివాహము సిద్ధించుచుండుటచేతను తామే ప్రమాణముగ నుదాహరించిన "సోమః ప్రథమో గంధర్వ" ఇత్యాది మంత్రముచే దద్భోగానంతరము వివాహము సిద్ధించుటచేతను, రెంటికి విరోధము గల్గుచున్నది. ఈ విరోధమునుగూడ పరిహరింపవలసినభారము తమపై బడును. అది చేతగాకయో, లేక యథార్థపద్ధతితో విరోధపరిహార

మొనర్చునరికి తమ రజోనంతర వివాహవాదము భస్మీపటల మగు ననుభయముచేతనో పైనున్న యర్థశ్లోకము నుదాహరించియుండలేదు ప్రస్తుతము మే మావిరోధము నుపహరించుచు వస్తుస్థితినినిరూపింతుము

అసలు మహర్షి మతముల ననుసరించి చూచినచో కన్యకయొక్క సోమగంధర్వాగ్నిభోగకాలములు రెండుగ గనుపించుచున్నవి. ప్రథమకాలము ఏడేండ్లవయస్సునకే పూర్తియగును. ద్వితీయభోగకాలము రజోదర్శనమునకు కొలదికాలము ముందుగ నారంభ మగును. ఇచట "సోమః ప్రథమః" మంత్రమువల్లను,

సోమో దద ద్గంధర్వాయ గంధర్వో దద దగ్నయే
రయించ పుత్రాంశ్చాదా దగ్ని ర్మహ్యా మథో ఇమాం,

అను మంత్రమువలనను గతించినదిగా సిద్ధించిన సోమగంధర్వాగ్ని భోగకాలము పైజెప్పినవానిలో మొదటిది. "తస్మా దుద్వాహయే త్కన్యాం" అనుస్థలమున ననాగతముగ దెలుపబడినది ద్వితీయభోగ కాలము. ఇట్లుగాఽ ఈ రెంటికి సమన్వయము సమరసము గానేరదు. ప్రథమభోగకాలమున క్రిందివచనములు ప్రమాణములుగ నున్నవి.

జన్మతః ప్రథమే వర్షే సోమో భుంక్తేఽథ కన్యకాం.
గంధర్వోఽథ ద్వితీయేఽబ్దే తృతీయేఽగ్ని స్తతో వరః. వ్యాసః.

ఈ వ్యాసునిమతములో మూడేండ్లకే ప్రథమ భోగకాలము పూర్తి యగును. పరాశరునిమతములో నొక్కొకరికి రెండేసియేండ్లచొప్పున షడబ్దములకుగాని పూర్తిగాదు.

షడబ్దమధ్యే నోద్వాహ్యా కన్యా వర్షద్వయం యతః
సోమో భుంక్తే తత స్తద్వ ద్గంధర్వశ్చ తథానలః.

ఈ యిరువురకు భోగపరిమితిలో భేదభావ మున్నను ఏడేండ్లకు భోగ రహితురాలగుననువిషయ ముభయసంప్రతిపన్నమే. అందుననే

సప్తసంవత్సరా దూర్ధ్వం వివాహ స్సార్వవర్ణికః
కన్యాయా శ్శస్యతే రాజ న్నన్యథా ధర్మగర్హితః.

అని యాశ్వలాయనాదులు సప్తవర్షములనుండి కన్యావివాహకాలముగ నిర్ణయించియున్నారు. పర్యవసానములో ప్రతిపక్షులు చూపినశ్రుతిలింగము వారివాదమునకు ప్రోద్బలకము గాకపోగా పై పెచ్చు విరుద్ధమనియు. కన్యావివాహమే శ్రుతిసిద్ధమనియు తెలిసినది.

ప్రతిపక్షిచే ప్రమాణీకృత మగుగృహ్యసూత్రము వలనగూడ రజస్వలావివాహము సిద్ధింపనేరదు. ఇచట "శేషగ్ం సమావేశజపేత్ అను సూత్రము వివాహ చతుర్థదివసమున సమావేశనము తప్పక గావించి తీరవలెనను విధిని బోధించుట కేర్పడియుండలేదు. అచట సమావేశన మొనర్పకపోయినను ప్రత్యవాయము గనుపింపదు. ఒక వేళ రాగాతిశయముచే ఋతుమతిగాకపోయినను సంభోగేచ్ఛ గల్గినచో నపుడు పఠించవలసిన మంత్రము లియ్యవి యనిమాత్రమే యీ సూత్రము బోధించుచున్నది. ఈసమావేశనము కొందరు మహర్షులకు సంమతముగాదు. ఆపస్తంబ బోధాయనాదులు కొందరుమాత్ర ముపదేశించియున్నారు, ప్రతిపక్షి చూపిన "ఋతౌ నోపైతి యోభార్యాం" అను ప్రమాణమేగాక,

పాణిగృహీతో గ్దర్శనా స్నేయా గ్గత్వా పత్నీం పత త్యధః
వ్యర్థీకారేణ శుక్రస్య బ్రహ్మహత్యా మవాప్నుయాత్

మొదలగువచనములు సైతము అనృతు సమావేశము నుపదేశింపని యాశ్వలాయనాదుల మతమని నయ్యది యాపస్తంబీయులకు వర్తింపదనియు చంద్రచూడీయాది గ్రంథములవలన దెలియుచున్నది. ఇయ్యది ఋతుసమావేశనమైనచో ముందుసూత్రములో "ఋతుసమావేశన ఉత్తరాభి రభిమంత్రయతే" యనుచోట ఋతుసమావేశనమునకు భిన్నమంత్రములను జెప్ప నక్కరలేదు. ఈవిషయముల నీక్రింది గృహ్యవ్యాఖ్యాకారుల వ్రాతలు ధ్రువపరచుచున్నయవి,

"సంవేశన మృతుకాలా దూర్వమేవ గమనం. గర్భాధానం పునః ఋతుగమనం," గృహ్యరత్నకంఠాభరణం.
"చతుర్థాపరరాత్రే, శేషహోమాంతే. నాతాప్రో హారు మిత్యాదిమంత్రా న్పఠేత్, తేషాం సమావేశనే నివి

యోగాత్" గృ, ర, కం.

'ఏతచ్ఛరాగప్రాప్తసమావేశనాశ్రితం వివాహకర్మార్థం
క్రమజపయో ర్విధానం, యథా భోజనపర్యాయప్రతా
శ్రితం పయ ఆదివిధానం" సుదర్శనభాష్యమ్

ఇంతియ గాదు, గౌతమమహర్షి సైతము,

గౌరీమపి చర త్యర్థం గచ్ఛే త్పురుష ఆకులః
అన్యథా వీర్యపాతోహి సహస్రకులపాతకః.

అని రాగాతురు డగువానికి రతినిమిత్తము స్వదార సమావేశన మభ్యనుజ్ఞాతమై యున్నది. ఇచట విశేష మేమి యన అనృతు సమావేశము కేవలరత్యర్థము గనుక నకరణే ప్రత్యవాయము లేదు. ఋతుసమావేశన మట్లుగాక ప్రజోత్పత్తిహేతుభూత మగుటచే నియ్యది నిత్యకర్మగ విధింపఁబడి యట్టి సమావేశనము నొనర్పనిచో దోషముగూడ తెలుపబడినది, చూడుడు

ఋతుస్నాతాంతు యో భార్యాం సంనిధౌ నోపగచ్ఛతి
ఘోరాయాం భ్రూణహత్యాయాం పచ్యతే నాత్ర సంశయః

ఇంతియగాక జ్యోతిష సంప్రదాయమునగూడ నిషేకమనుపదము రత్యర్థ విషయమునను గర్భాధానపదము ప్రజార్థవిషయమునను వాడబడుచుండుట విజ్ఞలోకమునకు విదితచరము. ప్రకృత గృహ్యసూత్రమున నుపదిష్టమైనది నిషేకమేగాని గర్భాధానముగాదు. ప్రతిపక్షి కభిలషితమగు ఋతుమతీవివాహ మీసూత్రముచే సిద్ధింపదు పైగా ననృతుమతీవివాహమే సిద్ధించుచున్నది.

ప్రతిపక్షి యుదహరించిన త్రీణివర్షాణి మొదలగు వచనములు స్త్రీవివాహమునకు ముఖ్యకాలబోధకములుగావు. మరియేమన మాంద్యముచేగాని, నాస్తికతచేగాని. అనుకూలవరాభావముచేగాని కన్యక రజస్వలయగుదనుక తలిదండ్రు లాకన్యకు వివాహము గావింపకున్నచో నపుడు కన్య యేమొనర్పవలె ననువిషయమునుమాత్రమే తెలుపు

పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే (చున్నది.
రక్షన్తి వార్ధకే పుత్రా న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి.

అనుసూక్తిననుసరించి స్త్రీకి కన్యాత్వమునందు తండ్రియధికారి యగును. ఆకన్యక నర్హు డగునొకవరున కర్పించుట కాతనికే సంపూర్ణాధికారము గలదు. అట్టి స్వాతంత్ర్యము వివాహ మొనర్చినతరువాత భర్తది యగును. తండ్రి యొకవేళ వివాహమును గావింపకపోయినచో నట్టి స్వాతంత్ర్యము తండ్రికి తనయ రజస్వలయగువరకు మాత్రమే యుండును, ఆపై నాతనికి కన్యయందు స్వాతంత్ర్యము నశించును. అందుననే—

పిత్రేన దద్యాచ్ఛుల్కంతు కన్యా మృతుమతీం హరన్
నహి స్వామ్యా దతిక్రామే దృతూనాం ప్రతిరోధనాత్ ।

అని మనువు వచించియున్నాడు. అట్లు రజస్వల యగు కన్యగతి యేమి? అను విషయములో నీ 'త్రీణి వర్షాణీ' త్యాది వచనములు బయలు దేరినవి. వానిని నియమవిధులుగ జెప్పుట తప్ప త్రీణి వర్షాణి యను మనువచన వ్యాఖ్యానమున కుల్లూకభ ట్టేమి వ్రాసెనో చూడుడు.

పిత్రాదిభి ర్గుణవద్వరా యాదీయమానా కన్యా
సంజాతార్తవా సతి త్రీణి వర్షాణి ప్రతీక్షేత, వర్షత్రయా
త్పున రూర్ధ్వ మధికగుణవరాలాభేన సమానజాతి
గుణం వరం స్వయం వృణీత— మన్వర్థముక్తావళి—

అట్లు నిరీక్షణానంతరము స్వయముగనో యాజ్ఞవల్క్యాది మతాను సారము రాజాజ్ఞతోడనో స్వయంవర మొనర్చుకొనినచో నాకన్యకకు పిత్రాద్యుల్లంఘనదోష ముండదను విషయమును మనువిట్లు తెల్పుచున్నాడు.

అదీయమానా భర్తార మధిగచ్ఛే ద్యది స్వయం
నైనః కించి దవాప్నోతి నచ యం సాధిగచ్ఛతి.

కాని పర్యవసానములో నెట్లో యొకవిధముగ రజోనంతర వివాహ మంగీకరింపబడినదిగదా యందు రేమో? కానియిది సప్రాయశ్చిత్త

వివాహమెగాని సాధారణము గాదు. ఇట్లు గానిచో వెనుక నుదహరిం చిన రజోనంతర వివాహదూషకవచనము లన్నియు విరోధించును. కావున త్రీణివర్షాణీత్యాదివచనము లాపత్కల్పములే గాని రజస్వలా వివాహ విధాయకములు గావని తేలినది.

ఇట్లు శాస్త్రసరిణితో వాదముల నొనర్చి వరాజితులగు సం స్కర్త లంతట నూరకొనక లౌకికయుక్తులతో రజోనంతరవివాహము ప్రశస్తమని నిరూపించుచు బాల్యవివాహము లనర్థజనకములని వాదిం చుచున్నారు. అట్టి వాదములను, వానికి సనాతనుల సమాధానము లను కొలదిగ నిచట వ్రాయుచున్నాడ.

(౧) బాల్యవివాహములొనర్చుటయను దురాచారమువలన దేశమున విధవలసంఖ్య యభివృద్ధిజెందుచున్నది. మిగిలిన దేశములలో కన్న బాల్యవివాహము లధికముగ నమలులోనున్న మనదేశములో విధవలసంఖ్య యధికముగ గనుపించుచుండుటయే యందుకు నిదర్శ నము. సామాన్యముగ ద్రవ్యలుబ్ధు లగుజననీజనకులు కుమారికల భవి ష్యజ్జీవితమున గలుగనున్న భయంకరసంఘటనల తలంపక తాత్కా లికముగ తమకు గల్గులాభములమాత్రమే లక్షించి యేముదుసలికో, రోగిష్ఠికో తమ పిల్లల నొసంగుచుండుటయు, బాహ్యాప్రపంచజ్ఞానలేశ మైన లేని పసికందులగు బాలికలు తమభవిష్యజ్జీవిత దుస్థితి నెఱుంగ లేక తలిదండ్రులకు తలయొగ్గి యట్టివారినే పరిణయమాడుచుండుటయు, నాపై కొలదికాలముననే యాభర్త పరమపదించుటచే నాజీవితాంత మలమటింపవలసినదుస్థితి గల్గుచుండుటయు మన కనుభవసిద్ధమే. దీని కంతయు బాల్యవివాహములే కారణభూతములుగదా! ఇట్టి దురా చారమును రూపుమాపి యువతీవివాహముల నమలునకు దెచ్చినచో నావయస్సునకు సామాన్యముగ బాలికలు ప్రపంచజ్ఞాన పూర్ణులై తమ కనుకూలురగు యువకుల దామే వరించి యాజన్మాంతము సుఖం చుట కవకాశము గలుగును. వైధవ్యమునుగాని, మతు లతుకని దుర్జీ వితమునుగాని గడప వలసిన యోగము పట్టదు. విదేశీయు లిట్టి వివా హపద్ధతుల వలననేనే డఖలైహికసుఖముల నందుచున్నారు.

(౨) బాలికావివాహముచే బాల్యవయస్సుననే బాలికలకు సంభోగము, తన్మూలముగ గర్భధారణము, పిల్లల గనుట, అపై పిల్లలు దుర్బలులై శిశుమరణములెక్కువ యగుట, తల్లులుగూడ రోగముల నందుట, పురుషులు నిస్సత్వులగుట యనుదుష్ఫలములు గలుగుచున్నవి. రజోనంతరవివాహమైనచో ఈదుస్థితి చాలవరకు నశించును, జనులు బలశాలులగుదురు. శిశుమరణములు సన్నగిల్లును. కాన బాల్య వివాహముల మాని రజస్వలావిహములనే గావింపవలెను.

(3) బాల్యవిహముల మూలమున విద్యాభివృద్ధి కాటంకము గలుగుచున్నది. చిన్నవయస్సునందే వివాహ మొనర్చినచో నింక వారలకు విద్యావ్యాసంగమెట్లు సాగును. కాన స్త్రీలకు రజస్వల లగు వరకైన కనీసము వివాహ మొనర్పకుండ నుండినగాని విద్యాభి వృద్ధి గలుగదు.

(౪) పవిత్ర ప్రేమయేగదా దాంపత్యసుఖమునకు ముఖ్యహేతువు. ముక్కుపచ్చలారని పసికందులకు బరిణయ మొనర్చినచో నవుడు వారలకు ప్రేమయన నేమి యోగూడ సరిగ తెలియదు. అట్టిచో పరస్పర ప్రేమానుబంధము అభివృద్ధిజెందుట కవకాశ ముండదు. ప్రేమానుబంధములేని దంపతుల జీవిత మడవి గాసిన వెన్నెల వంటిదే యగును. అందుచే ముఖ్యముగ బాలబాలికల కిరువురకు ప్రేమ స్వరూపము బాగుగ నవగాహన మగుదనుక వివాహమొనర్చుట యుచితముగాదు. ప్రేమస్వరూపమును బాగుగ నెరింగి పరస్పరము ప్రేమించుకొనిన వధూవరులకు వివాహమొనర్చినచో వారల భావి జీవిత మతిసుఖముగ నడచును. పర్యవసానముఃలో వధూవరనిర్ణయము పరస్పర ప్రేమోపేతు లగువధూవరులచే గావింపబడ దగునుగాని వారి హృదయముల నెరుంగని మరియొకరు, తలిదండ్రులుగాని, అన్న లుగాని, మరియొకరుగాని యొనర్చుట మంచిది గాదు. స్వయంవర వివాహములు. యువతి వివాహములే ముఖ్యములు, నాశ్రియణీయ ములు.

ఇట్లు సంస్కర్తలు గావించువాదములపై సనాతను లొసంగు సమాధానములు యథాసంఖ్యముగ నిరూపింపబడుచున్నవి.

(౧) బాల్యవివాహములవలన వితంతువులసంఖ్య యభివృద్ధి చెందుననుట నిజముగ హాస్యాస్పద మగువిషయము. పాపము సంస్కర్తల యాశయములకు వ్యతిరేకముగ చిన్నపిల్లలకు తాలిబొట్టు గట్టినంతమాత్రమున యావరు డచిరకాలముననే మృత్యువువాత బడును గాబోలు! ఆహా! ఏమి వీరి హేతువాదసరణి! నిజమునకు విచారించినచో సంస్కర్తలు తలంచునట్లు మనదేశమునను, అందును బాల్యవివాహములు గావించు జాతులలో మాత్రమే యత్యుత్కటముగ విధవ లగుట లేదు. కాలానుసారము కారణాంతరములచే పలువురకాలమరణముల పాలగుచుండుట ప్రపంచమునం దంతటగూడ నిట్లే వైధవ్య మభివృద్ధినొందుచున్నది. కాని భారతమహిళలుమాత్రముపాతివ్రత్యప్రధాన లగుటచే శాస్త్రకారులయాదేశముల ననుసరించి, యాజీవితాంతము బ్రహ్మచర్యనియమమును బాలించుచుండుటచేతను, పరదేశీయ లట్లుగాక 'వీడు గాకున్న మరొక' డనునట్లు మరొకరిని బరిణయమాడుచుండుటచేతను భారతదేశమందే విధవ లెక్కువగ నున్నట్లు గానుపించుచున్నది. అందును అగ్రవర్ణములవారలు బ్రహ్మచర్య నియమపాలన మెక్కుడుగ నొనర్చుచు వేషములయందు గూడ మార్పునందుచుండుటచే నగ్రవర్ణములలో మరియు నెక్కువగనున్నట్లు గానుపించుచున్నది. కాని సంస్కర్తలనుకొనునంతటి యత్యధిక భేదము లేదు, మనదేశపు విధవలుగూడ పరదేశీయులవలె సధవలు గాదొడంగినచో మనదేశముగూడ పరదేశసామ్యము నందవచ్చును. కాని పాపభీతి భారతీయులలో నింకను సంపూర్ణముగ నశించమిచే సంస్కర్త లొకవంక నుద్బోధించుచున్నను భారతమహిళ లామార్గము నవలంబించుటకు జంకుచున్నారు. పోనిండు. తుష్యతున్యాయానుసారమేకొలదియాధిక్యమో గలదనియే తలంతము. అందులకైన బాల్యవివాహములే కారణ మనుటకు సబ బంతగ గనుపించదు. కారణములనేకము లుండును, అంతియేగాని చిన్నపిల్లలకు తాళిగట్టుటపురుషుల

మృతికి హేతువనుట యవివేకము, మరియొకవిషయము. ధనలుబ్ధు
లగుతలిదండ్రులేముదుసలికో, రోగికో, తమపిల్లల నొసంగుచుండుట
యీ దుస్థితికి హేతువనుటగూడ యంతగ రుచించుట లేదు. కొందరు
మాత్ర మట్టి పాపపుతలిదండ్రులు కోటికొకరుగ నుండిన నుండవచ్చును
గాని బహుళసంఖ్యాకు లట్టివారని వచించుట మాతాపితరులకు పుత్ర
పుత్రికలయం దుండువాత్సల్య మెట్టిదో యెరుంగని మొఱకువాని కఱ
కుకూతలనవలసివచ్చును నేటికిగూడ స్వసుతల కనుకూలవరుల నన్వే
షించుచు కష్టసుఖముల బాటింపక యహర్నిశము లన్నపానాదుల
గూడ లెక్కజేయక పరిభ్రమించుచుండు వాత్సల్యపూర్ణుల మనము
కనులయెదుట వేలకొలదిగ గాంచుచునే యున్నాము. అట్లు చూచుచు
నిట్లుపలుకుట ద్రోహము. అంతియెగాక మరొకటి విచారింపదగియున్న
ది. నేడు తయారగుచున్న బాలవిధవలభర్త లందరు ముదుసలులు.
లేక వివాహ సమయముననే మహారోగ పీడితులుమాత్రమే యైయుం
డిరా? యను విషయము నిష్పక్షపాతబుద్ధితో విమర్శించి చూచినచో
నట్టివారలు స్వల్పసంఖ్యాకులే యనువిషయమును మన మెరుగ జాలు
దుము. అంతియె గాదు. అట్టి వైధవ్యములకు హేతువులు నూటికి
యేబదివరకకాలమరణములే యని గూడ నెరుంగ గల్గుదుము. ఆట్టి
యకాలమరణములకు నేడు మనలనావహించుచున్నట్టియు నస్వా
భావికమును తత్కాలరమణీయమునగువిదేశీయనాగరకతయు,తన్నా
గరకతానుసరణముచే నేటి యువకులలో నేర్పడిన కొన్ని దుష్ప్రవర్త
నలును హేతువు లనువిషయమునుగూడ తెలియగల్గుదుము. ఇంతి
యేగాని సంస్కర్తలు దెల్పుకారణములు సక్రమములు గానేరవు.
మరియొక విషయము. యువతీ వివాహముల నవలంబించి విదేశీయు
లధికసుఖముల నందు చుండిరనియు మనముగూడ వాని నవలంబించ
వలెననియు సంస్కర్తలు దలంచుచున్నారు. కాని యీయాచారము
లెంగిలిచుట్టవలెపాశ్చాత్యులచేననుసరింపబడి యసహ్యకరముగ దోచి
పరిత్యజింపబడుచున్నవి. లేక పరిత్యజింపవలెనని తలంపబడుచున్న
వియెగాని వారలుగూడ నీ పద్ధతి సుఖకరమని తలంచుట లేదనియు

వారలలోఁగూడ బుద్ధిశాలులనేకు లిద్దానిని రోఁయుచుండి రనువిషయ మీఁ క్రింద నుదాహరింపబడఁబోవు విదేశీయపండితులవాక్యములచేఁదెలి యనగును. ఈ యభిప్రాయము లనేకములున్నను గ్రంథవిస్తరభీతిచే రెండుమూఁడుమాత్ర మొసంగుచున్నాను.

"హిందూదేశమున స్త్రీలకు స్వయంవరాధికారము లేకుండుట సర్వోత్తమమై యున్నది. మన ఇంగ్లీషు కన్యలన్నచోఁ తగినవరుడు లభించుటకు పడరానిపాట్లు బడి హృదయాందోళనచేఁ పరితపించుచు, బహువిధముల నీతిదూర లగుచున్నారు" అని ఫ్రెడిక్ ఫిన్కాటు దొర చెప్పెను.

"మనము స్త్రీపురుషుల పరస్పర ప్రేమల ననుసరించి వివాహములొనర్చుకొనుచున్నాము. ఈ విధానము సర్వానర్థ దాయకమై గనుపించుచున్నది. ఏనాటికైన నీ పద్ధతి పారద్రోలబడగలదా? ఆదశ మన కెపుడు గల్గునాయని నిరీక్షింపవలసియున్నది" అని రివరెండు జె. టి. డే విన్. చెప్పెను.

"నేడు యువతీవివాహముల నాచరించి మనము పూర్వపుస్థితి కన్న అరోగ్యమున - ఆయుష్యమున - దేహబలమున - నీతిప్రవర్తనమున - శాంతిజీవనమున నభివృద్ధిలోఁ నుంటిమా? ఇంతియెగాదు నవీనవివాహపద్ధతులు యూరపుఖండమం దెచటనైనను ప్రయోజనము లైనవా యని ప్రశ్నింతుమేని యవి మహోపకార మొనర్చెనని వచించుట కెవ్వరును సాహసింపరు" అని బిసెంటుగారి కొక యాంగ్లేయుడు వ్రాసెను.

ఇట్లు పాశ్చాత్యులుగూడ యువతీ వివాహముల నిందించుచుండ వానికాసపడుట యవివేకముగాక మరేమగును?

(౨) బాల్యవివాహములమూలమున దేశమున శిశుమరణము లభివృద్ధిజెందు ననువాదము నొకింత విమర్శించిననది నిస్సారమని తేలగలదు. బాల్యవివాహములవలన శిశుమరణము లేలగల్గునని యడగిన సంస్కర్త లిట్లు వచింతురు "బాల్యవివాహములవలన బాలికలకు

చిన్నతనముననే సంభోగము లభించుట, గర్భధారణము గలుగుట, తటస్థించుచున్నది. చిన్నతనమున బాలికల గర్భావయవములు గర్భధారణానుకూలములుగ నుండక దుర్బలములుగ నుండును. అట్టితరుణమున గర్భధారణము, శిశుజననము జరిగెనేని యప్పుడుద్భవించిన శిశువులు జన్మతోడనె దుర్బలులుగ నుండిదుర్వ్యాధులపాలబడిత్వరలో మరణింతురు. ఇదియె యనర్థపరంపర" యని. ఇయ్యది విచారింతము. ఇచట సంస్కర్తల వాదధోరణిలో వివాహ గర్భాధానములకు భేద మున్నట్లు గనుపించదు. దేశాంతరీయులవలె వివాహమగుటతోడనే సంభోగగర్భధారణాదులు గలుగునని వారు తలంచుట కిదియొక కారణము. ఇవుడైన వివాహము, గర్భాధానము నొకటి కాదనియు హిందూమతానుసారము బాల్యవివాహము జరిగినను రజస్వల యగువరకు సంభోగాదులు జరుగుట లేదనియు నెరుంగుదురుగాక. రజస్వలయైనంతమాత్రమున గర్భావయవములకు దార్ఢ్యము గల్గి గర్భధారణార్హత గల్గునని తలంచుట పొరపాటని కొందరు నవీనులు వాదింతురు. కాని యయ్యది నిరాధారము. కన్యక ప్రథమరజస్వల యైనప్పటినుండి స్త్రీకిసంభోగావశక్యత గలుగుననియు, గర్భధారణార్హత గల్గుననియు నాయుర్వేదశాస్త్రమువలన దెలియబడుచున్నది. అంతియెగాక పాశ్చాత్యవైద్యశాస్త్రవిదులుగూడ ననేకులీయభిప్రాయములనే వ్యక్తీకరించియున్నారు. జీవశాస్త్ర వేత్తయగు డాక్టర్ విల్సన్ అను వైదేశికపండితుడు "మ్యారేజి కొశ్చెన్" అను గ్రంథములో.

శరీరమును పెంచు నాళములకును, బిడ్డల కనుటకు హేతువు లగు నాళములకును ఎంతమాత్రము సంబంధము లేదు అని తెలిపెను.

మరియు హ్యావ్లక్ ఎల్లిస్ అనునాతడు,

'ప్రథమ రజస్వల యగుటయే గర్భధారణార్హతనుసూచించును.' అని యొకచో వ్రాసియున్నాడు. పెక్కుమంత్రసాని శాస్త్రగ్రంథములలో రజస్వలయగుట గర్భధారణార్హతాసూచకమని కలదు. విస్తరభీతిచే నాయుదాహరణముల నిట నొసంగుట లేదు. మరియు,

బొంబాయిలో డాక్టర్ మిస్, మ్యూర్గెంట్ బాల్‌ఫోర్ అను దొరసాని మిస్. మేయో కన్యయొక్క గ్రంథమును విమర్శించుచు తమయాసుపత్రిలో నూటికి నెనుబది యైదుగురు 17 ఏండ్ల పిల్లలని తెలిపెను. పర్యవసానములో బాల్యవివాహములైనంతమాత్రమున చాల చిన్నతనముననే గర్భధారణాదులు జరుగ నవసరము లేదు, రజస్వల యైనతరువాత నట్లు జరిగినను ప్రమాదము లేదు. ఒకవేళ సంస్కర్తల యాశయములో రజస్వల యైన తరువాతగూడ కొంతకాలమువరకు సంభోగ మారోగ్యహానికరమని యుండవచ్చునేమోకాని అయ్యది ప్రకృతివిరుద్ధము అట్లు ఋతునిరోధమొనర్చుట హానికర మని పలువురు శాస్త్రవేత్తలు తెల్పియున్నారు. ఒకవెళ నట్లు నిరోధింపజూచినను అయ్యది దుస్సాధ్యము. ఈమధ్యనెగదా ఈశ్వరచంద్ర విద్యాసాగర విద్యాలయమున విద్యార్థినుల పెట్టెలలో పోలీసులు వరిశోధింపగా భ్రూణహత్యాసాధనములు బయల్పడెనని వార్తాపత్రికలలో ప్రకటింపబడినది. విదేశములలో వివాహమునకు పూర్వమే గలుగుచున్న శిశువులసంఖ్య ముందొసంగుదును. ఇచట ప్రతివక్షి సంకోచమును బోగొట్టుటకు దేశములయందలి శిశుమరణసంఖ్యల పట్టిక నిట నుదాహరించుచున్నాడ.

| దేశము. | నూటికి బాల్యవివాహములు | శిశుమరణములు |
|---|---|---|
| దర్భాంగ | 57 | 13 |
| డార్జిలంగుపూరీ | 17 | 22 |
| బర్మ (అప్పర్) | 4 | 41 |
| బర్మా (లోయర్) | 4 | 47 |
| చీనా | 0 | 32 |
| రష్యా | 0 | 25 |
| హంగరీ | 0 | 20 |

ఇది 1911 సంవత్సరపు జనాభాలెక్కల ననుసరించియున్నది, పైపట్టికలో బాల్యవివాహము లధికములుగనున్న దర్భాంగదేశమున

13 మాత్రమే శిశుమరణములు, అత్యంతస్వల్పముగ బాల్యవివాహములు జరుగు బర్మాలో 47 శిశుమరణములు జరుగుటయు జూచి నచో బాల్యవివాహములకు శిశుమరణములకు సంబంధము లేదని తేలును. ఇట్లే స్త్రీల బలహీనతకు గూడ బాల్యవివాహములే హేతువులనుట పురుషుల నిస్సత్తువకుగూడ నవియే హేతువులనుటయు జన్మాంతర కర్మవశమున గల్గిన బాల్యవివాహ విద్వేషముచేత నే గాని వేరుగాదు. నిజమునకు విచారించిన బాల్యవివాహముల నొనర్చుకొనిన మన తాతతండ్రులపటుత్వము మనకుకలదా? నిజరహస్య మేమన పరవిద్యా పరనాగరకతాది వశమున మనభారతీయ యువకులు నీతి నియముల బాటింపక నియతాహారవిహారముల బరిత్యజించి యథేచ్ఛాచారులై దుష్ప్రవర్తనల కలవాటుపడుటయే యిందులకు ముఖ్యనిదానము, గుట్టు గుట్టుగ నుంచి బాల్యవివాహముల దూషించిన నేమిలాభ ముండును? మీరె యాలోచించుడు. పట్టుమని పట్టెడు మెతుకులు మ్రింగలేనివాడును, పడకకుర్చీల వదలి పట్టుమని గంటయైన పద్మాసనమున గూర్చుండలేనివాడునగు యువకునకు దేహదార్ఢ్యము గలశిశువు లెట్లు జనింతురు? కాని యిచట దెలుపవలసినముఖ్యవిషయము గలదు. బాల్యవివాహమనగా వధూవరు లిరువురు బాలురు గావలెనని మా యభిప్రాయము గాదు పురుషుడు తా నెంత వరకు బ్రహ్మచర్యనియమము (ముఖ్యముగ నింద్రియనిగ్రహము) తో విద్యాభ్యాస మొనర్పగలడో యంతదనుక నుండి యాపై వివాహ మాడవచ్చును. మన ధర్మశాస్త్రములు 48 వర్షములవరకు గూడ పురుషున కవకాశ మిచ్చియున్నవి. ఎట్లయినను వరునకు ప్రజోత్పాదనసామర్థ్య మేర్పడుదనుక వివాహ మొనర్పకుండుటయే శాస్త్రానుభవముల ననుసరించి మంచిది, నే డట్లు గాక పురుషులకు పిన్నవయస్సునందే వివాహములొనర్పవలసివచ్చుచున్నది. ఇందులకు నేటియువకులు చాలమంది మనోనిగ్రహరహితులగుటయేకారణముఈదుష్పరిస్థితిచే సరియగు వీర్యశక్తి లేని పురుషులకు జన్మించుటచే నేటిశిశువు లకాలమరణము లందుచున్నారని యూహించుట కవకాశ మేర్ప

డుచున్నది. ఇంతియేగాని స్త్రీలకు చిన్నతనమున వివాహ మొనర్చుటకే శుమరణహేతువని వాదించుట యర్థములేనిమాట.

(3) ఇక విద్యాభ్యాస ప్రతిబంధకమను విషయము నొకింత విమర్శింతము. అసలు విద్య యనునది యెవనికావశ్యకమని విచారించినచో ధర్మదృష్టిలో 'అధ్యేతవ్యః' అను విధికి పాత్రుడు పురుషుడే యగుటచే, నాతనికివిద్య యావశ్యకమని తెలియుచున్నది. లోకదృష్టితో జూచినను ప్రపంచముతో బహుళసంబంధము గలపురుషునకు మాత్రమె విద్య యావశ్యకమని తోచుచున్నది, స్త్రీ కేకొలదిమాత్రము విద్య వచ్చినను జాలును. (ఈవిషయము వ్యాసాంతరసాపేక్షమగుటచే నిట నింతటితో విరమింపబడుచున్నది) అందుచే పురుషునకు మాత్రము వివాహ మెంతవరకు విద్యావిఘ్నకారి యని విచారింతము మా యాశయముల ననుసరించి, ధర్మశాస్త్రముల ననుసరించి పురుషుని విద్యాభ్యాసంగము పూర్తియైనతరువాత వివాహమొనర్పవలసి యుండుటచే మా యాశయములకుగాని, స్మృతికారులయభిప్రాయములకుగాని యీ యాక్షేప మన్వయింపనేరదు. ఇప్పటి పరిస్థితుల ననుసరించి పురుషులకుగూడ చిన్నతనముననే వివాహమొనర్పవలసి వచ్చిన దంటిరిగదా యందురేమో? కాని దాని ననుసరించి విద్యాభ్యాసంగమునుగూడ కొంతవరకు సంకోచమొనర్చు కొనవలసియే వచ్చును.

ఎట్లో పూర్వులవలె నిప్పటివా రధ్యయనము జేయుటలేదు గదా? మరొకమాట. నేటి లౌకికవిద్యాభ్యాసమే సంస్కర్తలవాక్యములలోని విద్యాపదార్థ మనుకొనినను అందు వివాహము ప్రతిబంధకము గాజాలదు. ఈ విషయము ననేకు లాంగ్లకళాలాధ్యక్షులు స్పష్టీకరించియున్నారు వారి వచనములను వివాహితు లెంద రెందరు పట్టభద్రులైరో యాసంఖ్యలను గూడ నిచట యాధిక్యభయముచే నుదాహరించుటలేదు. ఇంతకు పర్యవసానములో ధర్మశాస్త్రముల ననుసరించి చూచినను, నేటి పరిస్థితుల ననుసరించి చూచినను వివాహము ప్రతిబంధకము గాదని తేలినది. ఒక వేళ నెవడైన పురుషుడింద్రియ

నిగ్రహాశాలియై బహుకాలము విద్యాభ్యాస మొనర్పదలచినచో నట్టి ద్యావ్యాసంగమును ధర్మశాస్త్రములుగాని సనాతనులుగాని ప్రతిబంధింపరని తెలియుదురుగాక. స్త్రీలకధిక విద్యావ్యాసంగ మనుపకారి యేగాక యనర్థ కారిగూడ నగునేమో యనువారల మగుటచే స్త్రీవిద్యావ్యాసంగవిషయము నిట దెలుపలేదు.

(౮) పరస్పరప్రేమానుబంధ మేర్పడనిది పరిణయము పనికి రాదని సంస్కర్తలు వాదించుచున్నారు. నడుమ నడుమ పవిత్రప్రేమ పదమును వాడుచున్నారు. కావున నిచట పవిత్రప్రేమస్వరూపము, వీరు గోరు వివాహస్వరూపము తత్ఫలమునుగూడ క్లుప్తముగ దెలుపబడుచున్నవి.

ప్రేమ యన నొకవ్యక్తియం దింకొకవ్యక్తికి గలుగు సద్భావము. అయ్యది పూజ్యు లగువారలయందు భక్తియనియు, నింద్రియ సుఖజనక పదార్థములయందు కామ మనియు, పుత్రాదులయందు వాత్సల్య మనియు, వ్యవహరింపబడును. ఇందు భార్యకు భర్తయందు గలుగ వలసినది భక్తిసహకృతమగు కామము. ఈభావము సార్వజనీనము. ఇట్టిభావ మలవడినగాని దంపతులజీవితము నిరపాయముగ నిష్కళంకముగ నడువనేరదు. కేవలకామభావముమాత్ర మున్నచో నింతకన్న మరొకయందగాడు లేక యందగత్తె గనబడినపుడు వారి బుద్ధులు మారి, పరస్పర వియోగము గలిగితీరును. ఈవిషయ మనుభవసిద్ధమే. ఇట్టి పరిణయమె గాంధర్వమని యష్టవిధ వివాహములలో నొకటిగ "మైథున్యః కామసంభవ" అని మనువుచే నిర్వచింపబడియున్నది. ఈవివాహ మంతఃపురరక్షణాది నిబంధనము లనేకములు గలిగిన కొందరకుమాత్రమే తగునుగాని సామాన్యుల కైనచో మరొక సౌందర్యవద్యువతీయువక దర్శనమున నీయిరువురవియోగము తప్పనిసరి యగును. అందొకరు పరిత్యజించినపుడు రెండవవారికి గల్గు మనోవ్యథ వర్ణనాతీతము. తన్ను బరిత్యజించిన రెండవవ్యక్తి మరొకవ్యక్తితో గలసియున్నపుడు వారిరువురి దాంపత్యమున కీవ్యక్తి

విఘాతమును గల్పింప యత్నించుట, అట్లొనర్చుటయును జరుగుచుండును. క్రమముగ నియ్యది మహానర్థదాయక మగును. భక్తియుత మగుప్రేమ యగుచో నట్లు శిథిలము గాదు. 'దైవముచే మన కీవ్యక్తితో సంబంధ మొనగూర్పబడినది; మన మింతటితో తృప్తిజెందియుండవలె నని భార్యాభర్త లిరువురు పరస్పర పరిత్యాగమును తలంపనైన తలంపరు. బాల్యవివాహమునమాత్రమే యిట్టి భక్తిసహితత్వము ఘటింపగలదు గాని యువతీవివాహములలో ఘటింపదు. యువతీవివాహములలో కామముమాత్రమే ప్రబలముగ నుండును. అదితాత్కాలికసుఖాభాసమాత్రమును గల్గించినను చివరకు దాన సుఖ ముండదు. ఈవిషయముల నన్నింటి నెరింగియే పాశ్చాత్యవిద్వాంసు డొకడు "ప్రేమ గుడ్డిది కాదు. కాని కామము గుడ్డిది" అని నుడివియున్నాడు. ఇచట ప్రేమయనగా మేము దెల్పిన భక్తిసహిత ప్రేమ. కామమనగా రెండవది. మొదటి ప్రేమయే పవిత్రప్రేమ యగునుగాని రెండవది కామముమాత్రమే యగును. విపత్ర ప్రేమ ఒక పదార్థమును విడిచి మరొకపదార్థముపైకి పోనేరదు. నేడు నవీనులు తలంచునది పవిత్రప్రేమ గాదు. అది క్రొత్తక్రొత్తల కెదురుచూచుచుండును. తాను ప్రేమించబోవు పదార్థము పవిత్రమై ప్రేమించదగినదియై యుండినగాని యాప్రేమ పవిత్రప్రేమ గాదు. చూపునకింపైనంతమాత్రమున పదినిముసములలో గల్గు ప్రేమ పవిత్రము, చిరస్థాయి గాజాలునా? మరొకమాట. కొడుకెంత పెద్దయైనను తండ్రికన్న చిన్నయే. వయస్సు వచ్చినంతమాత్రమున యువతికి వర వరణార్హత కల్గు ననుకొనుట పొరపాటు అనుభవజ్ఞులు వాత్సల్యపూర్ణులు నగు తలిదండ్రులే "శ్రీయును గులమును రూపును ప్రాయము శుభలక్షణంబు" అని చెప్పినవిధముగ ననుకూలు డగువరుని నిర్ణయింపనర్హులు. అట్లుగాక కన్యకకే యధికార మొసంగినచో నేడు విదేశములయందలి దుస్థితియే మనకు ఘటింపవలసివచ్చును వింటిరా? విదేశములలో కన్యలువివాహమాడుటకు మచ్చుజూచుటకు కొందరు యువకులతో గలయుదురట! శివ శివ ఈవిషయముల నింకను నధికముగ

వర్ణించు విదేశీయవిద్వాంసులవచనములుచాలనున్నను ప్రస్తుత మిచట ప్రదర్శింప దలపలేదు. ఇట్లు కామమాత్రప్రధానము లగుటచేతనే విదేశీయవివాహములు స్థిరభావము నొందక డైవోర్సులపాలగుచున్నవి. విదేశములలో డైవోర్సు లెంత యధికములుగ నున్నవో గనుగొంటిరా? అమెరికాదేశములో 1926 సంవత్సరమున 1200000 వివాహములు జరిగినవట. అందులో 180000 వివాహములు విచ్ఛేదమొనర్పబడెనట. ఆహా! ఈసౌభాగ్యము మన దేశమునకుగూడ పట్టవలె ననియే కాబోలు సంస్కర్తలు యువతీవివాహముల గోరుట. మరియు సంస్కర్తలువివాహము నెక్కువకాలమువర కాపవలెనని వాదించుచున్నారు. పరదేశములలో నిట్లే యువతులకే భర్తలనేరుకొను నధికార మొసంగబడగా వారలెంతకాలమునకు గూడ భర్తలు కుదురక వివాహమాడక యుండవొడంగిరి. కాని ప్రకృతిధర్మ మేమగును? పశుప్రవృత్తి, ప్రసవములు దప్పలేదు. ఆదేశములలో వేయికి 150 శిశువులవరకు వివాహమునకు పూర్వమే జన్మించుచున్నారట, సంస్కర్తృమతానుసారము యువతీ వివాహముల జేయ నారంభించినచో ఇట్టి సౌభాగ్యమేగదా మనకు గల్గునది. అహా! పరమ పాతివ్రత్యమునకు పుట్టినిల్లని పేరెన్నికగన్న భారతావనిలో భారతీయయువతీయువకులు చిత్తకార్తె శునకములవలె వీధులవెంట దిరుగ వలసినదుస్థితి మన యీసంస్కర్తృనామధారుల మూలమున గలుగబోవుచున్నది గాబోలు. పాపము శాంతించుగాక!

ఇంతదనుక నొనర్చిన విచారముచే బాల్యవివాహమే యాశ్రయణీయమని తేలినది. రజస్వల యైనతరువాత వివాహ మొనర్పదగదని స్పష్టమైనది. ఈ సంస్కర్త లిట్లే విధవావివాహము లొనర్పవలెననియు, సగోత్ర వివాహములసైతము గావింప సంసిద్ధులము గావలెననియు, వర్ణాంతర వివాహముల నొనర్పవలె ననియు దుష్ప్రచారముల గావించుచున్నారు. వారి దుర్వాదము లన్నియు మరొకపరి సవిమర్శముగ ఖండింపబడును. అవకాశాభావముచేతను విస్తృభీతిచేతను నిచట నావాదోపవాదములు ప్రదర్శింపబడలేదు. కావున భార

తీయు లెల్లరు స్వమతగ్రంథ విహితపద్ధతుల ననుసరించి యథాశాస్త్రముగ యథాపూర్వముగ వివాహసంస్కారముల నెరవేర్చుకొందురుగాక. అకృత్రిమ వివాహముల నొనర్చి తన్మూలముగ నిహపర సుఖభ్రష్టులు గాకుందురుగాక యని యభ్యర్థించుచు నింతటితో విరమించుచున్నాడను.

---





శ్రీసద్గురు శ్శరణమ్.

# శ్రీ జయరామ విద్యా విలాసము

( ప్రథమ భాగము. )

## ౬. ధర్మప్రచారము.

—♦ ప్రబోధః ♦—

(“కల్పవల్లి” పత్రికలో. (15-8-42) 21 సం వయస్సులో) ముద్రితము

శ్లో॥ భో ధార్మికా శ్శృణుత వైదికధర్మనిష్ఠాః!
కాలోప్యయం పరమదారుణతా ముపైతి
భూదేవవంశజనితాః ఖలు పూర్వదేవాః
తానేవ ధార్మికవరా న్బహు లేధయన్తి ౧

శ్లో॥ రాజాశ్రయం సమధిగత్య మదా చ్ఛ్వపాకాన్
ప్రావేశయ న్ఖలు ఖలా స్సురమన్దిరేషు
వైవాహికో విఘటితో విధి రేభిరేవ
దుశ్శాసనై రతి బలా దపధర్మమార్గైః ౨

శ్లో॥ త ద్యూయ మద్య పరివర్జితమోహముద్రా
బద్ధాదరా స్స్వమతరక్షణదీక్షితాశ్చ
దుశ్శాసనాదిక మనర్థచయం సుదూరం
నిష్కాసితుం సుదృఢధైర్యయుతా యతధ్వమ్ 3

## 2. స్వధర్మే నిధనం శ్రేయః

(సంస్కృత "సూర్యోదయ" పత్రికానువాదము)

అనువాదకుడు:–

ముదిగొండ జయరామమూర్తిగారు,

(నె 1 రూఫైలు 25-3-34 12 సం. వయస్సు లో. ము. జ. రా శర్మచే లిఖితము "పాంచజన్య" పత్రికలో 19-1-35 ముద్రితము)

ప్రస్తుతము మన శ్రీభారతదేశమందు దేవదానవసంగ్రామము సంఘటించుచున్నది.

దేవాసురసంగ్రామము మూడువిధములని శాస్త్రములయందు వర్ణింపబడినది. అందధ్యాత్మమనునది, మానసిక మగు సుఖాసుఖ వ్యాపారములచే దెలియబడును. సప్తశతీపఠిత మగు మహిషాసురాదిసంగ్రామ మాధిదైవికము; రామ రావణుల యొక్కయు, కృష్ణకంసులయొక్కయు, పాండవకౌరవులయొక్కయు యుద్ధ మాధిభౌతికము. ఇపుడు భూలోకమునం దంతటను ఆధిభౌతిక మగు దేవాసుర సంగర మభివృద్ధినొందుచు భూలోకస్వర్గ మగుభారతదేశమును శీఘ్రముగ మ్రింగుచున్నదని విద్వాంసు లెరుంగుదురుగాక!

దానవులుమాత్ర మెప్పుడును దైవసామ్రాజ్యము లపహరింప యత్నించుచుందురు. కావున, దేవాసురసంగ్రామప్రసంగము సమీపించగా సీభారతదేశమే ప్రధానప్రదేశమగుచున్నది. దేవదానవులిరువురును, కామరూపు లగుటచే చతుర్విధభూతసమూహములం దేరూపమైనను ధరించుటకు సమర్థు లగుచున్నారు. ఆకారణముచేత వారీయాధిభౌతిక దేవదానవ సంగ్రామమున (ఇరువురును) భూమియం దవతరించి మానవాకారములతో సంచరించుచున్నారు. ఈయిరువురును ధర్మాధర్మములచేతను, సదాచారదురాచారములచేతను, దెలియదగియున్నారు.

దేవాంశాంశాలులగు మానవులు తమ సర్వస్వమును సనాతనధర్మ రక్షణమున కర్పించుచున్నారు. మరియు, సదాచారనిరతులగు వారు-శాస్త్రములయందు నిశ్చలమైన శ్రద్ధను, పరాత్పరు డగుపర మేశ్వరునియందు నిరపేక్షమగుభక్తిని ఉంచుచు, నెల్లప్పు డాస్తిక భావముతో పరలోకములు గనుపించకున్నను, నమ్మిచు, వేదవిహిత కర్మానుష్ఠాన మొనర్చుకొనుచు, తపస్వినియగు సంస్కృతభాష నభ్య సించుచు, తమజీవయాత్రను గడుపుచున్నారు. వారెప్పుడును బ్రాహ్మ ణుల నవమానింపరు, శాస్త్రముల నిందింపరు. ధర్మమర్యాదను రేఖా మాత్రమైనను నతిక్రమింపరు. మరియు, వీరలు శాసనమూలకముగా వివాహాది సంస్కారసమూహమును మొదలంటట బెకలింపరు. పతివ్రతా ధర్మమును పాడుచేసి చిరకాలము పితరులను నరకకూపముల పడ ద్రోయరు. శాస్త్రమర్యాద నుల్లంఘించి, దేశకాలాపలాపముగా వాగుచు, విధవా వివాహాది దుష్కృత్యములను జనసమూహమందు ప్రచారముచేయరు, పరమపవిత్రమైన యార్యదేశమును నీచభావ ముతో దూషింపరు. శాస్త్రోక్తకర్మల నాచరించుచు తమ తండ్రి తాతలచే పరిపాలింపబడినదియును, పూజ్యభావముతో గౌరవింప బడినదియు నగుసనాతనధర్మమార్గము ననుసరించుచున్నారు.

సనాతనధర్మపద్ధతిని నశింపజేయుచు, స్వకపోలకల్పితము, నంధకారమయము నగు నూతన మార్గము ననుసరించుచు ధర్మధ్వం సము నొనర్చుటకై తమ సర్వశక్తిని సమకూర్చుచు, సిగ్గుపడక మ్లేచ్ఛ లతోగూడ భోజన పానాదులయందు సంబంధము గలిగించుకొనుచు మిక్కిలి యుత్సహించుచు, ప్రాప యౌవనయగు తమ పుత్రికను యువన యౌవనునితో నేకత్ర చదివించుటకు సందేహించక, అర్థగ్రంథముల దుమ్మలో ద్రొక్కుచు, తమకన్న వేరుదైవము లేదని చెప్పుచు, పర లోకమున్నటులకూడ నిశ్చయింపక బ్రాహ్మణుల ననవరతము నిం దించుచు "వారలను బంధించి సముద్రమున బడద్రోయకున్న భారత దేశమున కౌన్నత్యము గలుగదు"ని యూహించుచు పరదేశభాషను చదువుచు, పరదేశముల గ్రుమ్మరుచు, పరకీయవేషభాషల నన్నిం

టిని గ్రహించుచును, స్వీయమగు ఆర్యభావమును త్యజించుచు, విచారమునొందక ధర్మమర్యాద నతిక్రమించియు ధర్మము నభివృద్ధి నొందించుచున్నటుల చెప్పుచునున్నవారలే దానవులు.

పైజెప్పిన లక్షణములచే రెండువిధములుగా నున్నసనాతన ధర్మ రక్షకులును, దేవాంశ సంపన్నులు నగు మానవులకును, ధర్మ ధ్వంసకులును అసురాంశా సంపన్నులగు మానవులకును, పరస్పరమే యుద్ధముసంభవించుచున్నదో అదియె ప్రస్తుతపు ఆధిభౌతిక దేవాసుర సంగ్రామమని వివేక శీలురును, విద్వాంసులు నగుపాఠకులు తెలిసి కొనుదురుగాక.

మానవ రూపధారు లగుదానవులకు కలిపురుషుడే ప్రభువు. వైదిక మతధ్వంసకు లగునవీనమతప్రవర్తకులె యతనిమంత్రులు. అర్థ కామైకదృష్టిగల యనార్యులె యాతని స్నేహితులు. మూఢజనులచే నొసంగబడిన ధనములె వారికోశములు. మహాసభాదిప్రచారప్రదేశ మే రాష్ట్రము. విదేశవిద్యాప్రచారమే ప్రధానముగాగల విద్యాలయ ములు, మహా విద్యాలయములు, విశ్వవిద్యాలయములు మొదలగునవే దుర్గములు. తదధిపతులే ముఖ్యసేనానాయకులు, వానియందలి యుపా ధ్యాయులే సేనానాయకులు విదేశవిద్య నభ్యసించువిద్యార్థులె రాక్షస సేనాసహాయకు లగు సైనికులు. ధర్మసంస్కార విధ్వంసకు లగుశాస నసభాసభ్యులే వాద్యవాదకులు సై యున్నారు, ఇక దేవాంశసంపన్ను లగు మానవులకు, సర్వ సార్వభౌముడును, షడ్గుణైశ్వర్య సంపన్ను డునగు శ్రీసనాతనధర్మమె ప్రభువు అతి భయంకరమైన యీ కలి కాలమందు సైతము వైదిక ధర్మప్రచారము జేయుచునాస్తికమతము లను మర్దించుచున్న భగవద్విభూతు లగుధర్మాచార్యవర్యులె మం త్రులు. ధర్మమోక్షైక తత్పరులు, నాస్తికులశేఖరులు నగుఆర్యులె వారి మిత్రులు ధార్మిక ప్రజలచే నీయబడిన మఠములు, మందిర ములు, మొదలగు సంపదలే కోశములు. సూర్యోదయప్రభృతి సూ ర్యాస్తమయ పర్యంతము గల సమృద్ధియే సామ్రాజ్యము (అఖిల భారతవర్షీయ వర్ణాశ్రమ స్వరాజ్య సంఘ కార్యాలయము) నిఖిల

భారతధర్మ మహామండలి మొదలైన ధర్మప్రచారస్థానములును, ధర్మోత్పత్తి స్థానము లగుమఠమందిరాది ధార్మిక నికేతనములును, సంస్కృతశిక్షా భవనములును, దుర్గములు, వాని యధికారులును, ఆచార్యవర్యులును, యోగ్యు లగుమహన్తు మొదలగువారలును ముఖ్య సేనానాయకులు. ఉపాధ్యాయవర్యులె సేనానాయకులు, సంస్కృత భాషనభ్యసించు విద్యార్థులె సైనికులు, సంస్కృతభాషాధకుభోలును, అధ్యాపకులును, పండితులును. ఉపదేశకులును, మహామహోపదేశకులును, శంఖ భేరీ మృదంగాదివాద్యవాదకులై యున్నారు.

దేవాసురసంపత్తిశాలులగు జనులచే కొలదికాలమునుండి దిగ్దిగంతవ్యాపినియగు తారస్వరముతో సమరఘోష గావింపబడుచున్నది. ఏక్షేత్ర సంస్కారమువలన ధర్మ ప్రాణులగు ధార్మిక మానవ శ్రేష్ఠులుద్భవించుచున్నారో, అట్టి వివాహ సంస్కారమునందె రాక్షస పక్షావలంబు లగుజనులచేత శాసనరూపమగు గొప్ప వజ్ర ప్రహారము గావింపబడినది. ఇంకను ధర్మ ధ్వంసకములగు, అస్పృశ్యతా నివారణ. విధవావివాహ, వివాహబంధవిచ్ఛేదాది దుశ్శాసన బాణ ప్రహారములు దగులనున్నవి. అట్లయ్యు నింతవరకును సనాతన ధర్మ రక్షణకొరకు-ధర్మాచార్యులును, మఠమందిరాధిపతులును, విద్వాంసులును, మహోపదేశకులును, విద్యార్థులును, సంగ్రామ ఘోషమును విని గూడ తమ ఘోరనిద్రను బరిత్యజింపరైరిగదా యని మానసము శోకసంపూరిత మగుచున్నది. అయ్యో! వర్ణాశ్రమ ధర్మావలంబుల కింతకన్న భయంకరమగు కాలముగాని, ఘోరమగు కష్టములుగాని వేరేమున్నవి? ఎప్పు డీనిద్రాలస్యముల విసర్జించి బద్ధపరికరులై సంగ్రామ రంగమున కేతెంతురు? మనమతమునకు రావణకంసాదులకన్న ప్రబలులగు శత్రువులు సనాతనధర్మము విషయమున సంభవించిరి. హా! హా! ఓ ఆర్యకులశేఖరులారా! వర్ణాశ్రమధర్మావలంబక పురుషసింహములారా! మీరంద రొక్కమారు భూనభోన్తరాళములు బ్రద్దలగునట్లు గర్జించి దిగ్దిగంతముల గంపింపజేతురుగాక! శత్రు సైన్యమును జీల్చిచెండాడుదురుగాక! స్వీయమగు విజయపతాకమును

లేవనెత్తుదురుగాక! సనాతనధర్మరక్షణకై ప్రాణములనైన నర్పింతురుగాక! భగవానుడగు శ్రీకృష్ణుడు గీతలయందు స్వయముగా "స్వధర్మే నిధనం శ్రేయః" యని యుపదేశించెనుగదా!

ఇతిశివమ్.

---

## 3 కర్తవ్యవిచారము.

"కల్పవల్లి" పత్రికలో (1-10-39) 18 సం॥ వయస్సులో' ము. జ. రా. శర్మచే లిఖితము.

అతిభయంకర మగుకలికాలమునాలుకల గోడుకొనుచు మనుజుల కబళింపజూచురాక్షసునివలె సనాతనధర్మమును గ్రసింపజూచుచున్నది. ఎటు గనినను "బాల్యవివాహముల రూపుమాపుదు, దేవాగారములలోనికి పంచముల బ్రవేశపెట్టుదు, శాసనద్వారమున పవిత్రదాంపత్యముల జెరచుదు" అనెడి కాలేయభయంకరధ్వానము లేతెంచి ధార్మికహృదయకుహరముల ప్రతిధ్వనించుచున్నవి. చూచుచుండగనే ఒకవంక వివాహవయోనిర్ణయశాసనాగ్నిజ్వాల లావరించినవి. మరొకవంక పంచమదేవాలయప్రవేశ శాసన మనెడికార్చిచ్చంటుకొనుచున్నది. మరొకవంక వివాహవిచ్ఛేదశాసనాగ్ని రగుల్కొనుచున్నది. వేరొకవంక నస్పృశ్యతానివారణశాసనాగ్నిధూమములగ్రమ్ముచున్నది. ఇట్లు నలుదిక్కుల నగ్నిపరీవృతమగు ధార్మికలోకము, దావాగ్నిమధ్యగత మృగలోకము వలె కింకర్తవ్యతా విమూఢమై, కర్తవ్యమేమి? యని వాపోవుచున్నది. కర్తవ్య విషయమై ధార్మికులు పలువిధము లగుభేదాభిప్రాయములు గలిగియున్నారు.

౧. కాలము, సంఘబలము, రాజాజ్ఞ అప్రతిహతములుగావున తదనుస్మృతమే ధర్మమనియెరిగి పెక్కు నికట్టుల కిక్కయగు నస్మదీయ ధార్మికమార్గమును కొంతకాలము పరిత్యజించి కాలము లనుకూలముగ నేతెంచిననాడు స్వమార్గమును స్వీకరింతమని కొందరు పల్కుచున్నారు.

౨. అట్లొనర్చుట యుక్తముకాదనియు, యథావకాశముగ యథాశక్తిగ మనమందరము స్వధర్మముల ననుష్ఠించుచున్నచో తద నుష్ఠాన మహిమచే నేటి ధర్మవిప్లవము శాంతించుననియు, ఏతద్విప్ల వ ప్రతీకారమునకై ప్రత్యేకప్రయత్న మనావశ్యకమనియు మరికొంద రందురు.

3. కేవల యథాశక్తి స్వధర్మానుష్ఠాన మాత్రమే నేటి ధర్మ విప్లవమును శాంతింపజేయజాలదనియు, దానికిగొప్ప భగవదనుగ్రహ మావశ్యకమనియు దానిచే నేతద్విప్లవము శాంతించగలదనియు అందు లకై "యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుస్తరం। తత్స ర్వం తపసాసాధ్యం తపోహి దురతిక్రమమ్" ఇత్యాది వచనానుసార ము శాస్త్రీయములగు మహాధనుష్ఠానముల నొనర్చవలెనని మరి కొందరందురు.

౪ కేవల వైదికమార్గమాత్రముననే ధర్మప్రతిష్ఠాపన మొనర్చు టకన్న దానికితోడుగ లౌకికోపాయములగూడ నాశ్రయించిన ధర్మ ప్రతిష్ఠాపన మొనర్చుట సులభమనియును, కాన నుభయవిధోపాయ ములు మనకాశ్రయణీయములనియు మరికొందరు వక్కాణింతురు,

ఈనాల్గుపద్ధతుల విచారించి ఏది యనుసరణీయమో దాని ననుసరింపవలసిన భారము ధార్మికులందరిపై గలదు. కాన నాయను భవము ననుసరించి వీనిని విమర్శించి ధార్మికలోకమునకు ప్రదర్శించు చున్నాను.

౧ కాలము, సంఘబలము, రాజాజ్ఞ-ఇవి బలవత్తరములగు గాక అంతమాత్రమున వానికి వెరచి స్వస్వపవిత్రధర్మముల బూది పాలొనర్చుట బుద్ధిమంతులలక్షణము గాజాలదు. కాలాద్యనుసృతమే ధర్మ మగునని తలచుటగూడ వెఱ్ఱియే, శాస్త్రప్రతిపాదితము ధర్మ ము. అదిశాశ్వతము, పరిణామరహితము. కృతాదికాలముల ననుస రించి ధర్మములు మారుటలేదా? యని కొందరిచట భ్రమించవచ్చును.

కాని యీ కాలముల నియ్యది యియ్యది కర్తవ్యమనిగూడ ధర్మమొక పరియే శాస్త్రముచే ప్రతిపాదితమనియు, అంతియెగాని తత్తత్కాలములను, తత్కాల ప్రజలబుద్ధుల ననుసరించి మార్చబడినది గాదని తెలిసిన నాభ్రమ తీరును. ఇక నట్టిశాస్త్రప్రతిపాదిత ధర్మమును సంఘ మతిక్రమించినను ధర్మమునం దభిమానము గలవాడు, ప్రాణములపైకే తెంచినను ధర్మమును వదల రాదు. "స్వధర్మే నిధనం శ్రేయః" "న జాతు కామాన్నభయా న్నలోభా ద్ధర్మం జహ్యా జ్జీవితస్యాపి హేతోః" ఇత్యాది పరశ్శత శాస్త్రవచనములచే నియ్యది దృఢము, గాగలదు. ఇట్లు శాస్త్రవచనములు గనుపట్టుచుండినను సంఘమునకు రాజాజ్ఞకు. కాలమునకు వెరచి ధర్మ పరిత్యాగ మొనర్చిన నేమగును? ధర్మద్రోహులతో బాటు నిరయమే శరణ్యమగునుగాన నీ మొదటిపక్షము నిస్సారమని తేలినది.

౨ ఇక రెండవపక్షము విచారింతము. ఒక మానవుడేవియో అపథ్యపదార్థముల భక్షించె ననుకొనుడు. దానిచే నాతని కొకగొప్ప రోగ మేతెంచిన దనుకొనుడు. అపుడు కర్తవ్యమేమి? రోగనివారణమునకై తదుచితౌషధముల సేవించవలెనా? లేక "అపథ్యపదార్థభక్షణమున నీరోగ మేతెంచినదిగాన నిపు డపథ్యపదార్థముల వదలి పథ్యపదార్థముల బెట్టించిన చాలు" నని యాలోచించి యట్లే యొనర్పవలెనా? ఒకవేళ నెవరైన నట్లు తలంచి రోగికి ఔషధమీయక పథ్యము పెట్టింతురనుకొనుడు, అపుడేమగును? దైవానుగ్రహమున నది విషమించకుండనున్నచో నపకారమునుమాత్ర మొనర్పదు, ఇంతియెగాని ఉపకారమేమైన కలుగునా? అట్లే యిచటగూడ నూహించవలెను. చిరకాలమునుండి మనవారలు స్వధర్మానుష్ఠానవిషయమున ప్రమత్తులై యుండుటచే నేడింతటి యనర్థము తటస్థించినది అంతటి యనర్థము నేడు స్వల్పసంఖ్యాకులొనర్చు యథావకాశ యథాశక్తి స్వధర్మానుష్ఠాన మాత్రముచే శాంతించునా? శాంతించదు. కానియిచట వారిట్లనవచ్చును. బ్రాహ్మణాదులు స్వధర్మానుష్ఠానఫలము నెట్లు ధారవోయుచున్నారు? "స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యే

నమార్గేణ మహీం మహీశాః గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు" (ఇత్యాది రూపముగనే గదా) అట్టియెడ బ్రాహ్మణాదుల స్వధర్మానుష్ఠానమహిమచేననర్థశాంతి యేలగలుగదని." నిజమేగాని విచారణీయాంశమొకటి గలదు. వీరనినట్లు బ్రాహ్మణాదుల యనుష్ఠాన బలముచే ప్రపంచ మెప్పుడును నిరుపద్రవముగనే యుండ వలెగదా! అట్టిచో క్షామాద్యుపద్రవములు సంభవించినపుడొనర్పవలసిన వైదికక్రియలు శాస్త్రచోదితములై కనుపట్టుచున్నవిగదా! యథాశక్తి యత్కించిత్స్వధర్మానుష్ఠానముచేతనే దేశప్రశాంతి సమకూరుచో నీకృత్యములేల? రెంటికి సమన్వయమెట్లు? నట్టిచోట్ల స్వధర్మానుష్ఠానము సామాన్యపరిస్థితులలో (అనగా సర్వులు సామాన్యముగ స్వధర్మపరులై యున్నపుడు) శాంతిని కాపాడుననియు, విశేషపరిస్థితులలో (అనగా నధర్మ ప్రాబల్యముచే క్షామాదిదేశోపద్రవములు తటస్థించినపుడు) తత్తద్విశేష కృత్యము లాచరణీయములని యంగీకరింపవలదా? అట్లే నేడుగూడ చిరకాలమునుండి వృద్ధిజెందుచున్న యధర్మముయొక్క ప్రాబల్యముచే నిట్టి విప్లవమేతెంచినదనియు దీనికిగూడ యత్కించిత్స్వధర్మానుష్ఠానముమాత్రమేగాక యితర ప్రతీకారోపాయ మావశ్యకమని తేలుచున్నదిగాన "విప్లవప్రతీకారమునకై ప్రత్యేకప్రయత్న మనావశ్యకము." అను నీపక్షముగూడ నంతగయుక్తముకాదని తేలుచున్నది.

3. ఇక మూడవపక్షమును విచారింతము. ప్రచారాది లౌకికోపాయము లుపయోగకరములుకాకపోగా పైపెచ్చు దుష్ఫలదములు గూడ నని యీ పక్షమువారు తలంతురు. దానికి కారణ మియ్యది. ప్రచార మనుటతోడనే ఆచరణశూన్యులగు కొందరు ప్రచారకులు, వారియందలి దోషములు వీరికండ్లకు గట్టినట్లగపడును. అందుచే వారలు లౌకికోపాయముల తిరస్కరింతురు. కాని సూక్ష్మదృష్టితో విచారించిన వైదికకర్మల జేయించువారలయందును చేయించబడు క్రియలయందునుగూడ ననేకములగు దోషములు పొడగట్టగలవు. అంతమాత్రముననే వైదికోపాయ మవలంబనీయము గాదనుట బుద్ధి

మల్లక్షణమగునా? అట్లే ఎవరో కొందరు ఆచరణశూన్యులగు ప్రచారకులు గలరని ప్రచారమను పద్ధతినే దూషించుట తగదు. అదియుగాక మరొకటి విచారించవలెను. పూర్వకాలమున ధర్మవిప్లవ నిరాకరణమునకై యిట్టి పద్ధతి యవలంబింప బడినదా? లేదా? విచారించి తత్పరిగృహీతోపాయము ననుసరించినచో దోష ముండదుగదా? చూడుడు. బౌద్ధ, జైన, చార్వాకాది దుర్మత పరివృతమగు భరతఖండము నంతను భట్టపాదుడు నిరంతర యజ్ఞధూమ పరివృతముగ నొనర్చినది ప్రచారద్వారముననేగదా! కేవల కర్మఠవ్యాప్తమగు భరతభూమిని శ్రీమచ్ఛంకర భగవత్పాదులు స్వపవిత్రాద్వైతమతమును వ్యాపింపజేసినది ప్రచార మూలముననేగదా? ఇంతయేల! తక్కుంగల యాచార్యులుగూడ చాలవరకు స్వస్వమతవ్యాప్తిని ప్రచార ద్వారముననే యొనర్చిరి. అట్టియెడ దానిపై మనవారలకు ద్వేషముగల్గుటకు కారణమేమి? కాని వారలిట్లనవచ్చును. "భట్టపాద శంకర మధ్వ. రామానుజాదులు భగవదంశసంభూతులగుటచే స్వమతముల దేశమున వ్యాపింపజేయజాలిరిగాని ప్రచారముయొక్క గొప్పదనముచే గాదు" ఇందు కొంత సత్యమేగలదు. బోధకుని యాంతరంగికశక్తి ననుసరించియే శ్రోతల కాతనివాక్యములయెడ విశ్వాసము, తదనుష్ఠాన విషయమున శ్రద్ధగలుగుట, ఆరీతిగ ననుష్ఠించుట సంభవించును. కావున భగవదంశసంభూతు లగువారల మహాశక్తిచే నంతటి ప్రబోధముగల్గినది. మనకోటిమానవు లంతటి ప్రబోధ మొనర్పగలరని మేమనము, గాని వారివారి యాచరణముల ననుసరించి తత్ప్రచారములు కార్యకారు లగునని దెల్పుదుము. ఎప్పటికైనను ఆచరణపూర్వకముగనే ప్రచారముండవలెననునది సర్వసంప్రతిపన్నమె ఆచరణములేనిచో ప్రచారము ఫలకారి కాజాలదుగాన నందువిషయమై ప్రచారకు లప్రమత్తులై యుండుట యవసరము అపుడే ప్రచారము ఫలవంతమగును నిజమున కిట్టి ప్రచారవిషయమై యెవ్వరును తిరస్కృతిజూపుట యుక్తముగాదు. ఇంతకు తేలిన దేమన? వైదికధర్మరక్షణాభిలాషు లెవరును గూడ వైదికోపాయము లననుష్ఠేయములని

యనజాలరు. కాని కేవలము వైదికోపాయమేగాని లౌకికము పనికిరా దనువాద మంత యుక్తియుక్తముగ లేదు.

౭. ఈ యొనర్చిన పక్షత్రయవిమర్శనముచే నీపక్షమే సిద్ధాంతముగ దేల్చబడుచున్నది. ప్రథమపక్షవిమర్శనమున ధర్మపరిత్యాగము కూడనివనియని నిరూపింపబడినది. ద్వితీయపక్షవిమర్శనమున విప్లవప్రతీకారమునకు యతిక్రమించి స్వధర్మానుష్ఠానము చాలదని తేల్చబడినది. తృతీయపక్ష విమర్శనమున వైదికోపాయ మావశ్యకమేయనియు లౌకికోపాయావలంబనమున దోషములేదనియు చూపింపబడినది. ఇకనిట లౌకికోపాయావలంబనముయొక్క యావశ్యకతను గురించి కొంచెము ముచ్చటించి ముగింతును.

"వజ్రం వజ్రేణ భేదయేత్తు"ను వచనము ప్రసిద్ధమై దాని ననుసరించి చూచిన నేడు శాసనసభాదిద్వారమున మన కేతెంచిన యిట్టి యనర్థముల నామార్గముగనే పోగొట్టుట సులభమని తోచుచున్నది. మరొకవిషయము భగవానుడు సైతము తన యవతారములయందిట్టిపద్ధతుల తోడనే ధర్మస్థాపన మొనర్చినట్లు వినుచున్నాము. అదియునుగాక వైదికమార్గము ననుసరింపని లౌకికమార్గ మొకప్పుడు భగవదనుగ్రహాభావముచే విఫలము గావచ్చును. కాని వైదికమార్గములచే భగవదనుగ్రహమునొందిన ధార్మికులు లౌకికోపాయములాశ్రయించిన నయ్యవి సఫలము లగుననుట సందేహింప నవసరము లేదు. కాన నీ తురీయపక్షమే జశ్రేయోదాయకముగ గనుపట్టుచున్నది. ధార్మికు లంద రీమార్గము నవలంబించి కృతకృత్యు లగుదురని విశ్వసించుచున్నాను.



## —: 5 సింహావలోకనము. :—

"కల్పవల్లి" పత్రికలో 1-4-42 20 సం॥వయస్సులో ముద్రితము

ధార్మికమహోదయులారా! ఒకపరి కనుల దెరచి పరికింపుడు. మనపురాతన మహోన్నతస్థితిని, నేటి మనదుస్థితిని ఒకపరి బాగుగ విమర్శించుకొనుడు. నేటి మనపరిస్థితి పర్వతాగ్రమునుండి క్రిందబడినవాని స్థితివలె లేదా? ఆధ్యాత్మిక, భౌతిక, వైజ్ఞానిక, ఆర్థిక విషయములలో నన్నింటగూడ మన మానాడు ధర్మమువలన నత్యున్నతస్థితి నొందియుంటిమి. భగవదాజ్ఞారూపములగు శ్రుతిస్మృతులచే విధింపబడిన వర్ణాశ్రమధర్మముల నత్యాదరభావముతో ననుసరించుచు పరస్పర సౌహార్దముతో మెలంగుచు మనము సభ్యతయొక్క పరాకాష్ఠ నొందియుంటిమి. నేడో అత్యంత విపరీతస్థితి నొందితిమి. ఆధ్యాత్మికముగ, వైజ్ఞానికముగ, ఆర్థికముగ ఎట్లుచూచినను మనమతినీచస్థితిలో నుంటిమి, భగవానుడు మనల నుద్ధరింపవలెనను నాశయముతో శ్రుతిస్మృతుల ద్వారముగ మనలకు విధించిన వర్ణాశ్రమధర్మముల పరిత్యజించుచుంటిమి. పరస్పర వర్ణవిద్వేషములతో క్రౌర్యభావముల వెళ్లగక్కుకొనుచు ప్రపంచశాంతికి భంగము గలిగించుచున్నాము. భగవదాజ్ఞల నతిక్రమించుటయె మన యీప్రపంచశాంతిరాహిత్యమునకు ముఖ్యహేతువు. పెద్దలమాటల వినని పిల్లని జీవితమెట్లు పరిణమించును? దుఃఖాంతముగనే పరిణమించునుగదా. అట్టియెడ సకలజగద్రక్షకుడును. నిఖిలజగత్పరిపాలకుడును. అశేషజగల్లయకర్తయునగు భగవానుని యాజ్ఞల నతిక్రమించినపుడు మన మిట్టిదుస్థితిని జెందుటలో నాశ్చర్యమేమియో యోజింపుడు. ఏకాగ్రచిత్తముతో నొకపరి విచారింపుడు. నేటి మన దారిద్ర్యమునకు; నిస్సత్త్వమునకు, ఆధ్యాత్మికజ్ఞాన రాహిత్యమునకు; మనశ్శాంతిరాహిత్యమునకుముఖ్యకారణము భగవదాజ్ఞారూపమగు ధర్మము నతిక్రమించుటకాదా?

ఇప్పటికైన మనలో కొందరీవిషయము నన్వయవ్యతిరేకములచే నిశ్చయించుకొని జగత్కళ్యాణ హేతుభూతమగు ధర్మోద్ధరణ

మునకు బాటుబడుచుండుట యనునది మనమందర మానందింపదనగి విషయము. ఏదినశించుటచే నెయ్యది నశించుచున్నదో దానిని రక్షించుటయే రెండవదాని రక్షణకు ముఖ్యోపాయ మనుసూత్రము సర్వ సంప్రతిపన్నమేగదా! ప్రస్తుతము ధర్మక్షైణ్యముచే జగత్ప్రశాంతి నశించుట మనము జూచుచున్నదే. జగత్కల్యాణమును మనము కలిగించదలచినపు డట్టిధర్మము నుద్ధరించుటయే ముఖ్యకర్తవ్యముగదా!

కాన నో మహోదయులారా! మన మిప్పటికైన మేల్కొని ధర్మరక్షణకై పాటుపడుట ముఖ్య కర్తవ్యము. నేడు కొందరు మన ధర్మమును సమూలముగ నున్మూలింప నుద్యోగించుచున్నారు. వారల ప్రయత్నముల మనమెదుర్కొనవలనయున్నది. అట్టి ప్రతిఘటనమే మన మొనర్పనిచో మనము మనధర్మముల నిలువబెట్టుకొనుట కష్టము. మనసంఘమునం దన్నియెడలను నిట్టి యాంగ్లనాగరకతా వ్యామోహమోహితులగు కొందరు సంఘసంస్కర్త లనుగౌరవనామమును వహించుచు మన సంఘమునే ధర్మదూరముగఁజేసి చెడగొట్టుటకు పలుభంగుల యత్నించుచున్నారు. ధర్మవిరుద్ధముగ ప్రచార మొనర్చుటతోవారు తృప్తినందుటలేదు. ఇకనేమన మనల నందరను బలవంతముగనైన ధర్మదూరుల నొనర్చుటకై రాజకీయనాయకు లను పేరుతో శాసనసభాదుల నాశ్రయించి శాసననిర్మాణాదుల ద్వారమున మనల నందర హింసించుటకు పూనుకొనుచున్నారు. నిజమునకు వారి యాశయములోగూడ నీ శాసనములచే మనల హింసించుటయే ముఖ్యోద్దేశ్యము గాకపోవచ్చును. కాని పర్యవసానములో నా శాసనములవలన మనకు మన పరమ పవిత్రతమమగు హిందూమతమునకు అత్యుత్కటమగు నపకారము గలుగుచున్నదనువిషయము నిస్సంశయము. మనము ఇదివరలోనిట్టి శాసనములు శాసనసభలలో ప్రవేశపెట్టబడుచున్నపుడు; విచారింపబడుచున్నపుడు మామతధర్మముల నీ శాసనము భంగపరచుచున్నది. ఇట్టి ఈశాసనముల బ్రయోగించి మమ్ము మామతధర్మములను బాధింపకుడు. అని యనేకవిధముల మొరబెట్టుకొనియుంటిమి. సకల మతధర్మవేత్తనువలును అనుభ

వశాలులునగు పెద్దలనేకులు శాసనసభల నీవిషయములో మందలించి
యున్నారు. కాని అధికారమదోన్మత్తు లగువారలకు మనమొరలు
చెవికెక్కలేదు. మనమతములు వారిదృష్టిలో నతిక్రూరము లగుపిశా
చములవలె గన్పించుచుండుటచే మతము నశించునని మనమొనర్చు
నాక్షేపము వారలదృష్టిలో గుణముగనే గనుపించినది. కాని మతధర్మ
ముల నతిక్రమించుట మానవున కిహపరదుఃఖప్రద మనువిషయము
వారిమనస్సునకు తట్టనేలేదు. మనము తలపెట్టిన కార్యక్రమమునకు
ముష్టిమేయు లగునీసనాతను లెదుర్కొనువారా? వీరిమాటల మనము
చెవిబెట్టుటయా? అను నావేశముతో వారలు గబగబ ననాలోచితము
గ కొన్ని శాసనములగూడ ప్యాసుచేసియుండిరి. ఈశాసనములు మన
విషయములో నెట్లు పరిణమించినవో చూడుడు. శారదశాసనము కడు
పార కన్నబిడ్డలకుసైతము తలిదండ్రులు తమతమ మతగ్రంథముల న
నుసరించి సకాలమున ననుకూలవరున కిచ్చి పెండ్లిచేయుట కధికారము
నూడ్చిపెట్టినది. ఇంతటి వ్యక్తిస్వాతంత్ర్యవినాశక మగుశాసనము మ
రొకటి యుండబోవునా? మరొక శాసనము సవర్ణులు శాస్త్రోక్త విధా
నములతో ప్రార్థనలజేసికొనుట తన్మూలముగ మోక్షసామ్రాజ్యము
నధిగమించుటకు, ఆగమోక్తవిధానములతో గట్టుకొనిన గుళ్ళలో య
థాశాస్త్రముగ ప్రార్థనల జరుపుకొనుయోగ్యత నశింపజేయబడినది.
పవిత్రతమములగు నీ యాలయములలో పంచములు శాస్త్రవిరుద్ధము
గ బలాత్కారముగ నీశాసనబలమున ప్రవేశపెట్టబడుచున్నారు.
హిందూమతములో ప్రధానసంస్కార మగువివాహమును, పవిత్రత
మము లగుదేవాగారములను పాడుచేయబూనినచో నాపై నాగునది
యేది? చేతి కడ్డేమి? చూడుడు. ఇట్టి దుస్థితి మనలో గలుగుటలో
ముఖ్యహేతుభూతు లెవరు? మతాంతరులు కాదు. మనవారే. మన
మతములోనివారే, మనకుటుంబములలోనివారే, మనచే నెన్నుకొన
బడినవారే. మోసము. మోసము. ఈమోసమునుండి మనము బయ
టబడ యత్నింపవలదా! ధర్మోద్ధరణకై పాటుపడవలదా?

ఇందులకు ముఖ్యముగ మనధార్మికసంఘము నభివృద్ధినొందింప జేసికొనుట యవసరము. మనము బలపడిననాడు వీరలు మనకు నేటి వలె తీవ్రమగు నపకారమును గలిగింపజాలరు. మెత్తనివాని మొత్త బుద్ధిపుట్టునని గదా సామెత మనము నిద్రాముద్రితులమై తగిన యుద్బోధలేక ఆందోళనాశూన్యులమై యుండునంతకాలము వీరియపకారములకు గురికావలసివచ్చుటతప్పదు. మనము సంఘమునుబలపరచుకొనినపు డీ కష్టముల గడచుటయేగాక ధర్మమునభివృద్ధిలోనికి దీసికొనిరాగలము. మనసంఘములో సరియగునాందోళన సాగింపవలసియుండును. ప్రతిపట్టణములోను ప్రతిపల్లెలోను సనాతనసంఘములు స్థాపింపబడవలెను. పండితులద్వారమున ప్రజలలోనత్యద్భుతమగు ప్రచారము జరిపింపవలెను. ప్రజలలో మనమతముయొక్క సత్యస్వరూపము ప్రతిఫలింపజేసిన గానిమనము సరిగ నుద్దిష్టఫలము నందజాలము. కాన ముఖ్యముగ ప్రజలలో పండితుల ద్వారమున మత తత్వస్వరూపమును ప్రచారమొనర్పజేయవలెను. మనప్రచారకార్యక్రమములో నారితేరి మనసంఘము నొకవిధముగబలపఱచుకొనిననేగాని రాజకీయముగ మన వ్యక్తిత్వము గమనింపబడదు; ఆనాడుగాని మన మీాశాసన పిశాచముల బారినుండి తప్పించుకొనుటకైన నవకాశము లభించదు. చూడుడు! నైజాంరాష్ట్రమున సుమారు రెండేండ్లనుండి యొకవిధముగ మనధార్మికులలో సంచలనము గలిగినది. ఇందులకు హేతు వప్పటి నైజాంశాసనసభలో బాల్యవివాహనిరోధకశాసనము ప్రవేశపెట్టబడుటయే. అపుడు మేల్కానిన మనసనాతనులు సనాతనధర్మమహాసభ యనుపేర నొకసంఘమును స్థాపించుకొనిరి. శారీరక, మానసిక, ఆర్థిక క్లేశముల లక్ష్యపెట్టక నమోఘమగుప్రచారమును గావించిరి. ఊరూర పల్లెపల్లెల శాఖాసభలు స్థాపింపబడినవి. పండితప్రకాండులు ప్రజల హృదయకుహరములలోధర్మోపన్యాస సింహనాదముల ప్రతిధ్వనింపజేసిరి. ఆ యాందోళనకు ఫలితముగ రాజకీయాధికారుల హృదయములలో సనాతనధార్మికసంఘపు వ్యక్తిత్వము చిత్రింపబడెను. ధార్మికులమొరకు చెవియొగ్గబడెను. దయాశాలులగు

కౌన్సిలుసభ్యులు జన్మచే మనకు మతాంతరులైయున్నను మనమత మును రక్షింపవలె ననునభిప్రాయముతో శాసనమునకు వ్యతిరేకము గ వోటుచేసి, బిల్లును ప్రతిఘటించి, రోడించిసనాతనధార్మికుల యభినందనములకు పాత్రులైరి. తరువాతగూడశాసనసభలో ప్రవేశపెట్టబడిన (1) స్త్రీస్వాతంత్ర్యపుబిల్లు (2) హిందూవారసత్వహక్కుల బిల్లు (3) వికలాంగులవారసత్వపుహక్కు అనుమూడుబిల్లులును బహుళసంఖ్యాక సనాతనప్రజలకోర్కెననుసరించి త్రోసివేయబడనవి. ఇట్లేఅన్ని దేశములలోగూడ మనము తగుయత్నముల చేసినచో మనకోర్కెలు ఫలించునని యాశ నాకు పూర్తిగాగలదు.

ధార్మికవరేణ్యులారా! మీరు భయపడకుడు. మన మేధర్మమునకై నేడు ధనమానప్రాణముల లెక్కించక పోరాడుట కిచ్చగించుచుంటిమో యాధర్మము పేరేమి? సనాతనధర్మము. సనాతనము అనగా నిత్యము. అట్టి ధర్మమునకై పాటుపడుమనకుభయ మేల? మరియు మనము భగవదాజ్ఞానువర్తులము. అట్టి మనపక్షముననే భగవానుడు మెలంగుచుండును. ఏపూజ్యమూర్తి యొక్కసాన్నిధ్యముచే నర్జునుడు సకలశత్రుసేనానివహము నొకక్షణములో సంహరింపజాలుదునని తలంచెనో, అట్టి భగవానునియనుగ్రహము మనపై ప్రసరించుచున్నంత కాలము మనమెట్టిభయము నంద నావశ్యకత లేదు. ఉత్సాహముతో ధైర్యముతో, విశ్వాసముతో, త్యాగముతో ధర్మరక్షణకై కార్యరంగమున కురుకుటయే మనపని. అపై మనకోర్కెల నన్నింటిని దీర్చుభారము సర్వకర్తయగు భగవానునిదే. మనల నీట ముంచినను పాలముంచినను భారమాతనిదే.

కాన ధర్మాభిమాను లందరు సోత్సాహులై ధర్మరక్షకై పాటుబడుదురుగాక. స్వమతధర్మముల రక్షించుకొని తన్మూలముగ నిహపరసుఖము నేలగాక మోక్షసామ్రాజ్యమునుగూడ నంద యత్నింతురుగాక! మన కిప్పుడు ముఖ్యముగ నీవచనములు స్మరణీయములు "న

జాతు కామా న్న భయా న్నలోభా ద్ధర్మం జహ్యా జ్జీవితస్యాపి హేతోః" ధర్మా దర్థశ్చ కామశ్చ. ఇతిశివమ్.

ఒకసభ్యుడు.

## 6. ధార్మికవీరాగ్రణీ!

31-12-37 16 సం. వయస్సు. ము. జ. రా. శర్మచే లిఖితము

లెమ్ము సంసిద్ధుడవు కమ్ము. ఏతెంచినది నీయవన్ధ్యతేజఃపరాక్రమముల ప్రకటింపవలసినకాల మేతెంచినది. ప్రతిపక్షులెల్లరుధర్మోన్మూలనబద్ధకంకణులై స్వప్రయత్నములపట్ల నప్రమత్తులై యున్నవారలు దాన, ధర్మవిప్లవ మేతెంచనున్నది. ఇట్టియెడ ధైర్యస్థైర్యముల కిక్కయై తేజఃపరాక్రమంబులకు పుట్టినిల్లయి, అఖండతేజంబున వెలొందినభారతావని జనించిననీవు స్వీయధైర్యస్థైర్యపరాక్రమధర్మపరత్వములకు పుట్టినిండ్లై యన్యాప్రతిధృష్యులై వెలొందినహైందవమహావీరులయం దుద్భూతుండవైననీవు స్వీయతపఃపరాక్రమాదిశక్తుల ముల్లోకములసైతము గడగడలాడించిన భార్గవ-కౌశిక-వసిష్ఠ-భరద్వాజ-కశ్యపాదిమహర్షులపరమపవిత్రవంశసంజాతుండవగునీవు ప్రాణోత్కృష్ట మగుధర్మమునకు హాని వాటిల్లుచుండ పిరికిపందవలె పరాక్రమవిహీనునిభంగి ప్రయత్నరహితుడవై యుదాసీనత వహింపనగునా? "ఇసీ" కనుగొనుము. మున్ను తురుష్కముష్కరులచే దేవాగారములన్నియు ధ్వంసమొనర్పబడుచున్నఘోరకాలమున పరమపతివ్రతామానభంగ మొనర్పబడినక్రూరకాలమున గోబ్రాహ్మణవధలొనర్పబడినదుష్కాలమున స్వీయధర్మసంరక్షణదీక్షితులై స్వప్రాణములసైతము తృణప్రాయముగ వెచ్చించినధీరులు నీవారు కారా! లెమ్ము నీపరాక్రమము విజృంభింపజేసి శత్రువుల నెదుర్కొనుము, ప్రాణములసైతము ధర్మదేవతాపాదారవిందములకడ సంతోషపూర్వకముగ సమర్పింప నిశ్చయించుము, ధర్మమును సుప్రతిష్ఠిత మొనర్పుము. లోకకల్యాణముకొరకు బద్ధకంకణుడవగునీకు భగవానుడు తోడ్పాటు తథ్యము

## ——♦ 7. మాధవవిద్యారణ్యుడు ♦——

'4—10—37' 16 సం॥ వయస్సు' లోను, "విద్యా" పత్రిక.
(9—6—37 29—5—38' లోను ము. జ. రా. శర్మచే లిఖితము')

ఔను, ఆబిరుద మామహాత్మునికే తగియున్నది! అయ్యది యరణ్యమే. అందు తర్క-వ్యాకరణసాహిత్యవేదాంతాదివిద్యలే వృక్షములు. అయ్యవి నిష్ఫలములు గావు; పల్లవితములు, కుసుమితములు, ఫలితములు. ఆమహారణ్యమున నొకఫలమందలిరసము నాస్వాదించియే విబుధు లమృతపానానందము నొందుచున్నారు. అం దొక పుష్పమందలిమకరందము పానమొనర్చియే విద్వద్భ్రమరములు మదించి ఝుంకారమొనర్చుచున్నవి. అందలి యొక్క-పల్లవమును భక్షించియే రసికజనపికసమూహ మొకటలుమరచి కుహూనాదమొనర్చుచున్నది. అట్టియరణ్యముకాదా యియ్యది? ఇం దతిశక్తి యేమి గలదు?

* * * * *

తలంచుకొనిన గుండె లవియునే! సామాన్య మగుకార్యమా యేమి యీసాహసము? అనంత మగువేదరాశికి భాష్య మొనర్చుటా? ఇంతకన్న మిన్న యగుసాహసకార్య మొందుండునా? ఈపనికై సాహసించినవారు లేకపోలేదు. కాని, వారందఱు జాలవరకు "కతిచన తదర్థరచనే" యన్నట్లు కార్యమును సంపూర్ణముగా నొనర్పజాలకపోయిరి. అట్టికార్యమును సాహసించి యారంభ మొనర్చి కృతకృత్యత గనుట యనునిట్టిదిట్టతన మామహామహునకే చెల్లినది. ఆసమర్థత సామాన్యమా? సర్వవిషయములగూడ కూలంకషజ్ఞానము గలయీ విబుధునిసామర్థ్యమునకు కొఱతయేమి గలదు?

* * * * *

ఒకవిజీవిత మాగ్రంథముల బఠించుటకు జాలదే! అన్నిగ్రంథములు! అబ్బా! పదుగురుమనుష్యులైనను వ్రాయజాలని యన్నిగ్రం

థములు రచించెనే! అందును రసవిహీనములా? భావగాంభీర్యవిరహితములా? అసాధుపదభూయిష్ఠములా? కావు కావు దివ్య మగునా హస్తమునుండి రసవిరహితమును భావగాంభీర్యవిరహితమును అసాధువు నగుపద మొక్కటియు లిఖింపబడలేదే! అవన్నియు రత్నములే. ఆమహాత్ముని విజ్ఞానమహోదధియందలి తరంగము లన్నియు సద్విషయ రత్నమయములే అం దువ్వానీరు కనుపట్టదు. రంగురంగులచిత్రవర్ణములు గలయీరత్నము లమూల్యము లనుటయందు సందియములేదు.

*　*　*　*　*

ఇక రాజకీయమున గనుగొనినను ఆశక్తి యపారమే, ఆయద్భుతమహామేధాశక్తికి నాశ్చర్యచకితుడు గానిరాజ్యతంత్రజ్ఞుడు కలడా? ఆయద్భుతకృత్యముల గనుగొని ముక్కుపై వ్రేలిడనిధీమంతు డుండునా? లేడు. ఉండడు. నిజము. పరశ్శతవర్షములకైనను జెక్కుచెదరనిశిల్పచాతుర్యము గల్గి, చూపరు లగుఖండాంతరీయులకు సైత మాశ్చర్యావహ మగుచున్నవిజయనగర మమ్మహాత్మునియమోఘ సంకల్పఫలభూతము గాదా? బుక్కరాజనరేంద్రుడు శత్రులోకభయంకరుడై తనసామ్రాజ్యమును విస్తరింపజేసి, యత్యంతజనామోదకరముగ రాజ్యమేలగల్గినది యిమ్మహాత్ముని సాహాయ్యమున నేగదా! వైదికరాజకీయముల నసమానప్రజ్ఞావంతుడై

"అగ్రతశ్చతురో వేదాః పృష్ఠత స్సశరం ధనుః
ఇదం బ్రాహ్మ మిదం క్షాత్రం శాపాదపి శరాదపి"
అనులోకోక్తికి లక్ష్యభూతు డగునమ్మహాత్మునికీడగుమరియొక డేడీ?

*　*　*　*　*

అమ్మహాత్మునివిషయమున కృతజ్ఞుడు గానిభారతీయు డుండునా? ఆయుపకారము సామాన్యమా? తనజీవితము నంతయు ధార్మికరాజ్యనిర్మాణమునకు ధారవోసెనే! అట్టిత్యాగము మరియొక్కని యందు గలదా? తనవిద్యాపాండిత్యిని తనరాజకీయ తంత్రజ్ఞతను, తన

తపశ్శక్తిని-అదియిది యననేల? తుదకు తనజీవితసర్వస్వమును దేశసేవయందే వినియోగించినయమ్మహాత్మున కీడగుమరియొక రీజగమున కంచుకాగడాలతో వెదకినను కనుపట్టునా? కానరాదు. నిజము. ముమ్మాటి కిదియే నిజమని నమ్ముడు అట్టిమహాత్ము నెల్లపుడు స్మరించుచుండుట ప్రతిభారతీయునకు విధి కాదా? అట్టివానివిషయమున కృతజ్ఞుడు కానివాడు తనమానవత్వముసైతము గోల్పోయిన కృతఘ్నుడు కాడా?

* * * * *

**అమ్మా**! భారతజననీ! నీ వెల్లపు డట్టిధీరులనే, స్వార్థత్యాగులనే-దేశసేవకులనే-లోకక్షేమంకరులనే-గనుము! భీరులును, స్వార్థపరులును, దేశసేవావిదూరులు నగులోకవంచకమానవాధముల గనకుము.

---

## 8 వైదిక సంస్కరణమ్.

[నెం 8 రు ఫైలులో పావుటావులో నాల్గవ పంతు పత్రముపై నత్యంత సూక్ష్మాక్షరములతో ము. జ. రా. శర్మ లిఖించెను. లేఖనకాలము స్ఫుటము కాలేదు]

బహుమధ్యమాల్పధనికభేదేన బహుమధ్యమాల్పకుటుంబిభేదేనచ బ్రాహ్మణా నవధా. । తేఽప్యాస్తికనాస్తికభేదేనాష్టాదశధా. । తత్రాస్తికా అపి-వైదిక, మాధ్యమిక, లౌకిక, భేదేన సప్తవింశధా భవన్తి. తత్రలౌకికైస్సంధ్యాస్నానాదియత్కించిద్ధర్మానుష్ఠాతృభి ర్గ్రామే వర్తనేవా స్థాతుం శక్యతే. । మాధ్యమికైస్తు వైశ్వదేవదేవార్చనాదిస్మార్తకర్మానుష్ఠాతృభిః పట్టణేతరజనపదేష్వేవ కృతవసతిభిర్భావ్యమ్ వైదికైస్తు శ్రౌతమార్గప్రవిష్టైర్వేదవేదాఙ్గవిద్భిః పృథఙ్నిర్మితబ్రాహ్మణాగ్రహారేష్వేవస్థాతవ్యం, నపట్టణేషు, నాపీతరజనపదేషు.

ఏతైస్సర్వైరపి సభానిబన్ధనానుసారిభి ర్భావ్యమ్—

1. బ్రాహ్మణబ్రాహ్మణేతరాణాం పృథక్పఙ్క్తిత్వమ్.
2. బాలేభ్యో వ్యశుచివస్త్రధారిభ్యోఽన్నాప్రదానమ్.

3. శిశూనాం శూద్రసమీపే ఖేలనాదినిషేధః
4. స్తనంధయానాం శూద్రాక్షీరదాపననిషేధః
5. స్త్రీభి స్స్వయం శాకాదిక్రయణనిషేధః
6. సాక్షాచ్ఛూద్రేభ్యో ముష్టిపరిదాననిషేధః
7. శునకమార్జాలాదిపోషణనిషేధః
8. స్త్రీభి ర్మహార్ఘభూషణాదిధారణనిషేధః
9. మహార్ఘవస్త్రధారణనిషేధః సర్వేషామ్.
10. దివసకృత్యనిర్ణయానుసారిప్రవర్తనమ్.
11. శుచిసమయే శూద్రైస్సహ భాషణనిషేధః
12. స్వేనాచర్యమాణధర్మస్వరూప స్యాబ్రాహ్మణేభ్యః కథనే శుచిత్వం నస్యా ద్భ్రష్టతా చ భవతి.
13. పక్వపదార్థానా మితరదినయోగనిషేధః
14. బ్రాహ్మణగృహాసంసృష్టగృహఏ వావస్థాతవ్యమ్.
15. ఆర్తవస్త్రీవాసాయ గృహాన్తరనిర్మాణ మావశ్యకమ్.
16. ప్రసూతయే స్త్రీణా మత్యన్తవిప్రకృష్టగృహనిర్మాణమ్.
17. బ్రాహ్మణానాం శూద్రాదిసన్నిధానే పఠననిషేధః
18. స్వయంకృషి రేవ జీవనసాధనమితి విశ్వాసః
19. యావద్బ్రాహ్మణేతరై ర్నిర్వాహ్యం వ్యావసాయికం కర్మ స్యాత్తావ త్ప్రత్యేకప్రదేశేషు కారయితవ్యమ్.
20. పృథక్స్వయంకృషిరపి తథా కర్తవ్యా యథైషా ధర్మదృష్టి
ప్రధానా కృతప్రయత్నైర ప్యన్యై ర్నజ్ఞాయేత-

బె. ఆ. కె. బ్రాహ్మణసహకార సంఘస్థాపనమ్.

సమిష్టిపశుసంరక్షణ పద్ధతినిర్మాణమ్.
సమష్టిధార్మిక కృషిపద్ధతి నిర్మాణమ్
యజ్ఞభూమినిర్ణయః
విద్యార్థి సంస్కరణమ్,
వైదిక యజ్ఞోపవీతప్రచారః
ధార్మికమార్గోద్ధారసంపాదన ప్రయత్నః

గృహావరణాది సంస్కర్తృ సంఘస్థాపనమ్.
క్షేత్రప్రతి కృతి గ్రహణమ్.
నవధాన్యో త్పాదనపద్ధతిః
బీజసస్య భూకృషి విశేషాంశాన్వేషణమ్.
స్వపరవిద్యానాం కర్మోపాసనాదీనా మభివర్ధనమ్.
పరిచారకాః కారయితారః సహాయకర్తారః





శ్రీసద్గురు శ్శరణమ్.

# శ్రీ జయరామ విద్యా విలాసము

( ప్రథమ భాగము. )

## ౭. ఆంగ్లవైదిక విద్యా ఫలితములు.

---

### —( 1. ఆశీస్సు )—

("విద్యా" పత్రికారంభమున. 18–8–36) 15 సం॥ వయస్సులో ము.జ. రా. శర్మచే సీసము లిఖితము. "విద్యా" పత్రికలోనె (27–6–38) 16 సం॥ వయస్సులో కందము లిఖితము

సీ॥ పాశ్చాత్త్యవిద్యలు ప్రబలి వైదికములౌ విద్యలు నశియించు
వేళయందు, ఆర్యులు రచియించి రామ్నాయములటన్న గ్రం
థము త్రోలసిన కాలమందు, అగ్రజాతులవార లన్యభాషల
నేర్చిస్వమతవిద్రోహులౌ సమయమందు, వెదసంపన్నులౌ
విద్వాంసు లందఱు హేళనపాత్రులౌ నట్టితఱిని

గీ॥ వెదవిద్యాప్రభావంబు వెలయఁజేసి । దుష్టవాదంబు లన్నియుఁ
తుదినిఁజెంద నుద్యమించినయట్టియో "విద్య" నిన్ను । దత్త
నాథుండు ప్రోచుత దయను సతము

క॥ విద్యా!సుమనోహరబహుపద్యంబులతోడ, విమలభావంబులతో
హృద్యవుగా భాసిలుచు నవిద్యనుఁబో గొట్టుమమ్మ!విఖ్యాతయశా॥

## —( 2. ఆంగ్లవిద్యావ్యామోహము )—

ఇందులో. ౧ పద్యము 29_5_48 "విద్యా" పత్రికలో ౨ పద్యములు. 23_10_38 "విద్యా" పత్రికలో 17 సం॥ వయస్సులో నె 3 పద్యములు నె. 3 రూపైలు. 4_10_37 16 సం. వయస్సులోను ము. జ. రా. శర్మచే లిఖితములు

సీ॥ ఆంగ్లభాషామోహ మావహించిన నాఁడెస్వమతవిజ్ఞానంబు
సన్నగిల్లె, స్వమతవిజ్ఞానంబు సన్నగిల్లిననాఁడెసంస్కారభావ
ముల్ సంభవించె, సంస్కారభావముల్ సంభవంచిననాఁడె
ధర్మంబు క్షీణించె ధరణియందు, ధర్మంబు క్షీణమై ధరఁ
దలంగిననాఁడెభారతీయోన్నతి భగ్నమయ్యె

గీ॥ గాన నిపుడైన నియ్యది కనుల విప్పి తెల్వితో గాంచు డోభార
తీయులార! మ్లేచ్ఛభాషల నత్యంతతుచ్ఛములని వెలసియవ్వానిఁ
ద్యజియింప దలవరయ్య॥

సీ॥ ఇంగ్లీషువద్యము. లెన్నియో వల్లించుగాని సన్మంత్రముల్
గఱవఁబోఁడు, పాశ్చాత్యరచితప్రబంధముల్ పఠియించుగాని
గన్గొనఁడు సత్కావ్యములను, హీనసంగ్రథితమహా హిస్టరీని
బఠించుగాని పురాణముల్ గాంచఁ డెపుడు, జాతివారలు
గూర్చుసైన్సును బఠియించుగాని యాయుర్వేదగరిమ గనఁడు

గీ॥ ఇంగిలీషున మాటాడు నెల్లయపుడుఁగాని తనభాషఁ బలుకఁడు
గరువమునను వేదవేదాంగపారగ విప్రవంశసంభవుండయ్యు
గులవిద్య సంత్యజించి,

సీ॥ మ్యాథమెటిక్సును మఱవకుండ బఠించు గణితశాస్త్రమువంక
గనఁగలేఁడు, అమెరికామార్గము నరయజాలునుగాని కాశికా
మార్గము గానలేఁడుఆల్జిబిరాయంత యరయఁజాలునుగానియిం
టిపై శాల్యంబు నెఱుఁగలేఁడు, అనుదినంబుమడ్రిల్లు నాచరిం
చునుగానిపద్మాసనము వేయ బాధపడును,

గీ॥ వృక్షశాస్త్రమెఱుంగు సమృద్ధిగాను దులసియుప్రయోగ మెఱు
గఁడు, తుచ్ఛము కుక్కనక్కలబ్బాయిల్లాలె సామ్రాజ్య
వ్రాయుగుండ్రని లిపితోడ వ్రాయలేడు.



—( 3. సంస్కృత భాష )—

"విద్యా" పత్రికలో (17-8-36' 15 సం॥ ... ము. జ. ... శర్మ చేలిఖితము.

దేశమందలి జనులు పరస్పరము భాషించుదానికి భాష యని పేరు. ఇట్టిభాషలలో సంస్కృతభాష యొకటి. ఇయ్యది యెల్లభాష లలోనుత్తమమైనదనియు,మనోహరమైనదనియుభారతీయులచేత నేగాక పాశ్చాత్యులచేతసైతము కొనియాడబడియున్నది. వ్యాకరణాదులచేత సంస్కరింపబడినందున దీనికి సంస్కృత మనుపేరు గలిగినది. మఱియు దేవతలుగూడ నీభాషతోనే భాషింతురుగావున దేవభాష యనియు గీర్వాణవాణి యనియు నియ్యది ప్రసిద్ధమై యున్నది. ఇంతేగాక యపౌరుషేయములు, సనాదులు నగువేదములును, తదర్థనిర్ణయసాధన భూతము లగునాఱువేదాంగములును, నీభాషయందలివే. ఈ భాష యం దున్నన్ని గ్రంథములు మఱియేభాషయందును లేవు. బ్రహ్మ, పద్మ, విష్ణుప్రభృత్యష్టాదశపురాణములు మను పరాశర యాజ్ఞ వల్క్యాద్యష్టాదశస్మృతులు, భారతరామాయణాదీ తిహాసములు, మఱియు తర్కవ్యాకరణ మీమాంసాది శాస్త్రములకు సంబంధించిన లెక్కకు మీఱిన గ్రంథము లన్నియు నీభాషయందే యున్నవి. అన్య భాషలయందుకూడ పరివర్తితములై యనేకులచే బఠింపబడుచున్నట్టి కాళిదాస, భాణ, దండి, భవభూతి ప్రభృతికవిపుంగవులచేరచింపబడిన శాకుంతలము, కాదమ్బరిదశకుమారచరితము, ఉత్తరరామచరితము మొదలగుగ్రంథరత్నము లనేకము లీభాషయం దావిర్భవించినవియే! ప్రపంచమందలి సర్వభాషలకుగూడ నీ భాషయే యాదిభాష యగు టచేతను, తదితరభాషల కన్నిటికి మాత యగుటచేతను దీనికి మాతృ

భాష యని నామాంతరము సుప్రసిద్ధమైయున్నది. వేయేల? ఇట్టి సర్వోత్తమ మగుభాష మఱియొండు లేదని నొక్కివక్కాణింపవచ్చును. ఇట్టిభాష ప్రకృతదుష్కాలమున మృతభాష యని పిలువబడుచున్నది. భారతీయుల కిది యెంతయేని దుఃఖకారణ మనక తప్పదు. ఏనాడు కృత్రిమవిలాసవతి యగువారకాంతంబోలిన పాశ్చాత్యభాష భారత దేశమున నడుగిడినదో, ఆనాటినుండియే దూరదృష్టి లేనిజనులు తద్విలాసముగ్ధులయి, సహజ సౌందర్య సౌకుమార్య విలాసభాసుర యగుసంస్కృతభాషా యోషామణియందుకులకాంతయందుబోలె వైమ నస్యము నొందుచున్నారు. ఇయ్యది యెంతయు నధఃపతననిదాన మనక తప్పదు. ఓ భారత ధర్మాభిమానులారా! ఒకపరి యీవిషయమున తమదృష్టి ప్రసరింపజేయుడు. ఎప్పుడు మాతృభాషయందు నిరాదరణ మేర్పడినదో, అప్పటినుండియే భారతీయుల ధార్మిక విజ్ఞానము సైతము కొఱవడినదని గుర్తింపుడు. ఇపుడు దేశమును కల్లోలపరచుచున్న ధర్మ విప్లవమునకు సంస్కృతభాషాక్షీణతయే ముఖ్యకారణమని తెలిసి కొనుడు. ఎందుచేతననగా ధార్మికగ్రంథము లన్నియు, సంస్కృత భాషయందే గలవు. ఆధర్మములను తద్రహస్యములను తెలిసికొన వలెనన్న తద్భాషాధ్యయనమావశ్యకము. సంస్కృతభాషాధ్యయనము క్షీణించుటచేతనే ధార్మికవిజ్ఞానమును క్షీణించుచున్నది. ఏనాడు మరల పూర్వమందువలె మనదేశమున సంస్కృత విద్యాధ్యయనము చేయువిద్యార్థులసంఖ్య యభివృద్ధిగాంచునో, అపుడే దేశమున ధార్మిక విప్లవము లన్నియు నశించును. సకలసౌఖ్యములు చేకూరును. ప్రకృతము మిక్కిలి దీనదశలో నున్నసనాతనధర్మజననికి మన మింతకన్న చేయతగిన హితకృత్య మింకొకటి లేదు. కావునత్వరపడుడు.!

భారతీయులారా! మీమీకుమారులచే సంస్కృతభాష నభ్య సింపచేయుడు. మీ ప్రయత్నమునకు పరమేశ్వరుడు తోడ్పడుగాక!



## —( 4. నేటి విద్యావిధానము. )—

("విద్యా" పత్రికలో (15-10-36) 15 సం|| వయస్సులో ము. జ. రా. శర్మచే వ్రాయబడినది.)

రానురాను ప్రతిదానియందును సంస్కరణ మేర్పడుచున్నది. క్రమశః అది విద్యావిధానమునగూడ నేర్పడజొచ్చినది. పూర్వులు సకాలోపనీతులై యథాశాస్త్రముగ గురుకులమున తపస్సంపన్నులగుగురువుల యొద్ద శుశ్రూషయొనర్చుచు వేదవేదాంగాదుల నధ్యయనమొనర్చెడివారలు. కాలగతిచే పాశ్చాత్యులు ప్రభువులగుటచే తద్భాషాభ్యాసమున ద్వితీయపురుషార్థ మగునర్థము లభించు ననునాసతో ననేకులు తమపుత్రుల నాంగ్లవిద్యాలయముల కనుపజొచ్చిరి. వానియందలివిద్యావిధాన మతివిచిత్రము. విద్య నభ్యసించుటకు పెద్దలచే

"గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేనవా
అథవా విద్యయా విద్యా అన్యథా నోపలభ్యతే"

అని మూడువిధములగు నుపాయములు చెప్పబడియున్నవి అందీయాంగ్లవిద్యావిధానము దేనియందును జేరినదికాదు. ఏనెలజీత మానెల కట్టి నేర్చుకొనునది. ఇక నుపాధ్యాయులందునను శిష్యహితకాములై విద్యాదాన మొనర్చువారలు కారు. వందలకొలది నెలజీతముల తీసికొనుచు స్వోదరపోషణకై చదువుచెప్పెడివారు. ఇక నచటి విద్యార్థులకు గురుభక్తి ఆకాశకుసుమసమమే. దైవభక్తిగూడ తత్సమమే. ఇక నచట నేరుపబడుగ్రంథములవిషయము చెప్ప నక్కరలేదు. ఒక గ్రంథమున వేదముల నార్యులు రచించిరనియు, ఒక గ్రంథమున రామాయణమంతయుఆర్యులకుఅనార్యులకుజరిగినయుద్ధకథయెయనియు, అసలు దశరథపుత్రు డగురాముడొకడుండుట రావణుడనువానిని సంహరించుట సీతను మరల గ్రహించుట ఇత్యాదికమెల్ల నసత్యమనియు ఈ విధముగ నుండును. అందువలననే వారలకు వేద

శాస్త్రిపురాణాదులయందు విశ్వాసము నశించుట తటస్థించినది. ఇందుచే రానురాను నాటిగురుకులములే నేటిఆంగ్లవిద్యాలయము లగు హైస్కూలు, కాలేజి మొదలగునవిగను, నాటినిష్కాములును, తేజస్సంపన్నులును అగునుపాధ్యాయులే నేటిధనాశాపరులును, పాశ్చాత్య వాసనావాసితులునగు మేష్టర్లుగను. నాటిగురు దేవతాభక్తియుతులగువిద్యార్థులే నేటి గురుదేవతాదూషణతత్పరు లగుస్టూడెంటుగను, నాటియథావిధి నైష్ఠికద్వాదశవర్షబ్రహ్మచర్యసహితగురుశుశ్రూషాది ప్రాప్తవేదవేదాంగాద్యధ్యయనము నేటివేతనలబ్ధ మగుహిస్టరీ సైన్సు మొదలగుఅంగసహిత మగుపాశ్చాత్యభాషగా మారినది.

ఇక నెచటనో యొకరుగ నున్న వేదవేదాంగాద్యభ్యాసకులవిషయము కొంచెము పరిశీలింతము. అందు ముందు సంస్కృతవిద్యావిధానవిషయము పరికింతము. పూర్వులు ప్రథమమున నిఘంటువులను ధాతుపాఠమును, శబ్దములను విద్యార్థికి కంఠస్థమొనర్చితదుపరి కావ్యాదుల పఠింపించెడి వారలు. ఇటుల నభ్యసించెడివారిపుడు చాలతరుగుగ నుండిరనుట సాహసము కాజాలదు. బాలునకు నిఘంట్వాదులు కంఠస్థమొనర్చుకొనుట కష్టమగునని కాబోలు. అట్టిపద్ధతి తొలగిపుచ్చుట యనునది చాల విచారకరము. ఇకనిపుడు చాలమంది ఉపాధ్యాయులు బాలురకు ప్రథమమున నే సః=వాడు త్వం=నీవు, అని యీవిధముగ నేర్పుచున్నారు. అట్లుచెప్పుటచే చదువువానికి ఆ పదములవలు నర్థమగునేమోకాని, ఏ శబ్దమునుండి యేవికారముచేత నా పదమేర్పడినదో ఏ విభక్తియో ఏలింగమో, ఏవచనమోగూడ తెలియుట కష్టము. ఇక కావ్యాదుల చదువువారయినను శ్లోకముల కంఠస్థమొనర్చుకొనుట లేదు. అందుచేత నేశ్లోకమును చదివి అర్థముచెప్పుమనినను, పుస్తకాపేక్ష తప్పదు. ఇక వర్ణనలు గలస్థలముల చదువక యే వదలి వైచుచుందురు. దీనికి కారణ మేమనినచో అచట చదువుట విసువు కలిగించుననియు, అందుచే వదలెదమనియు చెప్పెదరు. అట్లనుటకన్న నవి యర్థము కావనిచెప్పుటయే అసత్యదూరము, ఇటులనే మఱికొన్నిగ్రంథముల పఠించినవారలే నేటిశిరోమణి-భాషాప్రవీణ-

విద్వాన్ మొదలగు బిరుద ధారులలో పలుమంది కలరనుట సాహసము కాజాలదు.

ఇక వేదపాఠకులసంగతి కొంచెము విమర్శింతము. కాలమహిమచే వీరలయందుగూడ నాగరకతావ్యామోహము కలుగజొచ్చినది. అందుచే యథావిధినైష్ఠిక బ్రహ్మచర్యముతో వేద వేదాంగాద్యధ్యయన మొనర్చువారు క్షీణింపజొచ్చిరి. నేటివిద్యార్థుల విద్యావిధానము యథావిధినైష్ఠిక బ్రహ్మచర్య గురుశుశ్రూషాయుతము కాకపోవుటచే నాకొక్కవిద్యార్థి శాస్త్రోక్తసకలానధ్యయనముల పాటించక పోయినను, స్వశాఖీయ మగు వేదము పదక్రమసహితముగ చదువు నప్పటికే షుమారు పదిపండ్రెండు వత్సరములైనను పట్టుచున్నది. చూడుడు! పూర్వులు ద్వాదశవర్షబ్రహ్మచర్యములోపలనే శిక్షవ్యాకరణము, ఛందస్సు మొదలగు అంగసహితముగా వేదమును, షట్ఛాస్త్రములను పూర్తిజేసి, తదుపరి గృహస్థాశ్రమ స్వీకార మొనర్చెడివారు గదా! నేటి వేదాధ్యేతలకు శుష్క వేదాధ్యయనమునకే యింతకాలము పట్టుటకు కారణమేమి. యోచింపుడు దీనికంతకు యథావిధినైష్ఠిక ద్వాదశ వర్షబ్రహ్మచర్యాది సహిత విద్యావిధానలోపమే కారణము, గాన ప్రాజ్ఞమహాశయు లట్టిలోపములను పోగొట్టి సక్రమ విద్యావిధానమును త్వరలో పునరుద్ధరణ మొనర్చి వైదిక విద్యాసేవ నొనర్ప ప్రార్థితులు.

---

## ఆంగ్ల వైదిక విద్యార్థుల సంభాషణము.

("విద్యా" పత్రిక (8-6-37' 16 సం॥ వయస్సులో, ము, జ. రా. శర్మచే వ్రాయబడినది.)

వైదికవిద్యార్థి:-( కూర్చుండి "వాయవ్యగ్ శ్వేత మాలభేత భూతికామః" అని చదువుచుండును.)

ఆంగ్లవిద్యార్థి:-( ప్రవేశించి ) ఓయీ! నీ వదేమియో మూల్గినట్లుబెకిరిందికి బల్కుచున్నావేమి?

వైది:- నే పఠించునది వేదము. అయ్యది యుదాత్తానుదాత్తాదిస్వర భేదముననైకి క్రిందికి బల్కుచుండవలెను, అందుచే నే నట్లు చదువుచున్నాను. ఇదివర కెపుడు వేదము వినిగూడకయుండన ట్లున్నావు. అందున నిట్లు పల్కుచుంటివి.

ఆంగ్ల:- అయిన నిది నేర్చుకొనిన ఫల మేమి? ఏమైన నుద్యోగము లభించునా?

వైది:- దీనిని పఠించుట యుదరపోషణకై ద్రవ్యము నార్జించుటకు గాదు. మఱియెందులకన "స్వాధ్యాయోఽ ధ్యేతవ్యః" ఇత్యాదిశ్రుతులు వేదాధ్యయనమును విధించుచుండుటచేతను, "యస్తిత్యాజ సఖివిదగ్ం సఖాయం" మొదలగుశ్రుతులు తదధ్యయన మొనర్పకుండుటయందు దోషమును దెల్పుచుం డుటచేతను, విధిచోదిత మగునధ్యయన మొనర్చుచున్నాను.

ఆంగ్ల:- ఐన దీనికి ఫలము లేదా యేమి;
"ప్రయోజన మనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే"
అన్నట్లు నిష్ఫల మగుకార్య మొనర్చుట ప్రాజ్ఞసమ్మతము గాదుగదా! నీ విట్టి నిష్ఫలకార్య మొనర్చుటెందులకు?

వైది:- పొరపాటుపడుచున్నావు. వేదాధ్యయనమునకు ఫలము లేక పోలేదు, ఫలరహితకార్యమును శాస్త్ర మెపుడును విధించదు. ఇక ఫల మేమన—చిత్తశుద్ధియు, తన్మూలముగ విజ్ఞానమును దాన మోక్ష మొందుటయే యేతత్ఫలము.

ఆంగ్ల:- అది సరి, యటుండనిమ్ము. నీవు చదువువేదము సంస్కృత భాషాత్మకముగదా! అయ్యది నీ కన్వయించునా?

వైది:- నాకే గాదు. సామాన్యశాస్త్రిపండితుల కెవరికి గూడ నన్వ యించదు.

ఆంగ్ల:- ఓయీ! అర్థము లేనిచదువు వ్యర్థ మనుమాట నెరుంగవా? ఇట్టియర్థవిహీన మగుచదువు నభ్యసింప నేల?

వైది:- నీవు వచించిన ట్లర్థజ్ఞాన మత్యావశ్యక మేగాని, యర్థజ్ఞాన రహిత మగునదియెల్ల వ్యర్థ మనుట కొంచెము వివేకదూరము.

కనుగొనుము. అర్థము నెరుగని మాత్రమున రామకృష్ణాది నామములు పుణ్యదములు గాకపోవుచున్నవియా? వానివలెనే వేదమును పఠనమాత్రముననే పుణ్యద మగును. చూడుడు:-

"వేదాక్షరాణి యావన్తి పఠితాని ద్విజాతిభిః
తావన్తి హరినామాని కీర్తితాని న సంశయః"

అన్నవాక్యముచే నీయర్థమే సిద్ధముగుచుండుట లేదా?

ఆంగ్ల:- ఓహో! అటులనా? అయిన దో మొన్న నే నొకగ్రన్థమున నీశ్లోకము చూచియుంటినే దానితాత్పర్య మేమి?

వైది:- అది యేమి తెల్పుము.

ఆంగ్ల:- వినుము:-

"యథా పశు ర్భారవాహీ న తస్య భజతే ఫలమ్
ద్విజ స్తథాఽర్థానభిజ్ఞో న వేదఫల మశ్నుతే"

దీని తాత్పర్య మేమి?

వైది:- (నవ్వి) ఇట్టిశ్లోక మిది యొకటియే గాదు. అనేకములు గలవు. కాని, వాని కన్నింటికిగూడ నర్థజ్ఞానమహత్త్వమును దెల్పుట యందే తాత్పర్యముగాని, అర్థజ్ఞానరహితముగ నధ్యయన మొనర్చిన వేదమునకు ఫలాభావము దెల్పుటయందు గాదు. ఇక నాసంధ్యాద్యనుష్ఠానమునకు సమయ మాసన్నమయినది. నే వెడలెద. నీవు చాలశాంతునివలె నున్నావు. అపుడపుడు వచ్చుచుండుము. నే సంతోషింతును.

ఆంగ్ల:- మంచిది. సంతోషము. నేనుగూడ నాపనుల నిర్వర్తించుటకు వెడలెద.

వైది:- అపుడపుడు వచ్చుచుండుము.

ఆంగ్ల:- మంచిది మఱియొకసారి తప్పక వచ్చెదను.

(ఇరువురు నిష్క్రమింతురు.)



## —( దేవవాణీవిలాపము )—

'నె 3 రు ఫైలులో '4-10-37' 16 సం॥ వయస్సులో "విద్యా" పత్రికలో (27-6-38) సు. ము. జ. రా. శర్మచే వ్రాయబడినది'

భారతీయులారా! నను గనుగొనుడు! నేడు నాకు తటస్థించిన దుఃస్థితిని దొలగింప బ్రయత్నింపుడు. మాతృసేవకన్న మిన్న యగు పుణ్యకార్యం బొండుండదని యెరుంగుడు. నే నిట్లు దురపిల్లుచుండ మీ రెల్ల రుపేక్షవహించుట తగదని తెలియుడు.

నాయనలారా! వేయివత్సరములకు పూర్వమువరకు సమస్త భాషాసామ్రాజ్యాధికారిణినిగ వెలుగొందిన నేను, కాలదుర్విపాకమున నిట్టియిక్కట్టుల నొందితిని. ఈనాయిక్కట్టులకు కారణభూతులుమీరలే. అబ్బా! నే నెపుడు నిట్టినైచ్యము నొందియుండలేదు. చిన్నతనమున వల్మీకసంభవునిచే నత్యన్తముగారాబమున పెంచబడి, తదుపరి పారాశర్యునిలాలనమున క్రమముగ మాటలాడనేర్చి, పిదప కొంతకాలమునకు భాసకాళిదాస-భవభూతి-ప్రముఖులనాశ్రయించితిని. వారు నన్ను దగ్గఱకు జేర్చి కావ్యనాటకాద్యనేకానర్ఘభూషణముల నలంకృతజేసి సర్వాంగసుందరి నొనర్చిరి. అయ్యదియే నాయత్యంతోన్నతికాలము అదియే నాభాషాసామ్రాజ్య పరిపాలనాచరమకాలము.

దైవదుర్విపాకమున క్రమముగా కొంతకాలమునకు పండితులకు నాపై గౌరవము-అభిమానము-భక్తి తరుగజొచ్చినవి. అంతకు పూర్వము న న్నత్యంతము గౌరవించినపండితులే న న్నవమానింపసాగిరి. కాలక్రమమున నాదురదృష్టఫలకాల మేతెంచినది. ఆంగ్లేయులు పాలకులుగా నేతెంచిరి. అదియే నాజాతకమున శనిమహాదశయందు శన్యన్తర్దశారంభము ఆదిమొదలు నాయం దత్యంతగౌరవము గల్గియుండువారుసైతము తమపుత్రపౌత్రాదుల నాంగ్లవిద్యాభ్యాసమున కాపాఠశాలల కనుపజొచ్చిరి. కాని, యయ్యది తమసంపూర్ణాధఃపతనమునకు కారణభూతములని యెరుంగజాలకపోయిరి. తాము తమపుత్రులుసైత మీవిద్యవలన నిహపరములకు జెడుదుమని గుర్తింప

జాలకపోయిరి. కేవల మర్థమాత్రదృక్కులై స్వపుత్రాదుల నందఱి నందు బ్రవేశపెట్టిరి. ఇక న న్నాదరించువారేరి? ఆపాతరమణీయ పాశ్చాత్యభాషా వేశ్య భారతీయుల నందఱి తనవలలో వైచుకొనుటచే మాతృసమాన నగునావంక దృష్టి నిగుడ్చువారుసైతము లేకపోయిరి.

కుమారుడు వ్యభిచారియై తలిదండ్రుల నాదరింపకపోయినవిచట నో ముష్టిమేయులుగ నున్నవైదికులుసైతము నాయం దాదరము త్యజించిరి. ఇట్టిదుఃస్థితి నుండుటచేతనే పరభాషాలంపటు లగుధూర్తులు కొందఱు నాకు మృతభాషయని నామకరణ మొనర్చిరి. నే నమరభాష నను విషయము మదోన్మత్తు లగువార లెరుంగలేకపోయిరి. వా రభ్యసించెడియిట్టితుచ్ఛభాష లెన్నియో నే జూచుచుండనే చెదలువలె పుట్టుచు, గిట్టుచు నున్నవి, నేనే నిత్యస్వరూపిణిని. నన్ను నిందించినయాధూర్తులు నరకకూపముల బడుదు రనుమాట నిక్కువము.

భారతీయులారా! ఇకనైన వెనుకకు దిరిగి మీపూర్వస్థితిని జ్ఞప్తికి దెచ్చుకొనుడు! ముల్లోకములు గడగడలాడింపజాలినమీశక్తి క్షీణించుటకు కారణ మేమియో తిలకింపుడు. కేవల మతధేసక్తులై యతిదుర్లభ మగుమోక్షమునకు దూరులు గాకుడు. ఇకనైనవివేకవంతులై నన్నాదరించి నాదుస్థితిని దొలగించిననే మరలమీపూర్వోచ్చస్థితినొందగలరు.

---

## —: 11 సమాజమూర్ధన్యుల నివేదనము :—

(వలె రు స్టైలులో (4-10-37) 16 సం. వయస్సులో) ను. "విద్యా పత్రిక లో (25-8-39) సు. ము. ప. సం. శర్మచే లిఖితము. బ్రాహ్మణ మహాసమ్మేళన పత్రికానువాదము)

"ఊర్ధ్వబాహు ర్విరౌ మ్యేత న్నహి కశ్చి చ్ఛృణోతి మే
ధర్మా దర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే"

ఇట్లు త్రికాలవేదియు భగవానుడు నగుద్వైపాయనమహర్షి ద్వాపరయుగాంతమున బల్కియున్నాడు.

కృతయుగమున హిరణ్యకశిపుప్రభృతులయుత్పత్తియు-త్రేతాయుగమున రావణాద్యావిర్భావమును-ద్వాపరమున కంసముఖ్యులగు నధార్మికరాజన్యుల యుదయము, నట్లే-ఇక్కలియుగమునసైతము తమ్ముఁ క్షత్రియులుగా తలంచెడిజైన, బౌద్ధ, మ్లేచ్ఛ, ప్రభృతులగు రాజులప్రభావమున ధర్మవిప్లవము తటస్థించెను. ఇట్టి ధర్మవిప్లవమును దొలిగించుటకును ధర్మస్థాపనమునకు శిష్టరక్షణమునకును పూర్వము భగవాను డవతరించియున్నాఁడు. ఒకపుడు తదంశసంభూతులును, మఱియొకతఱి తదనుగృహీతులు, సమాజమూర్ధన్యులునగు బ్రాహ్మణులు శాశ్వత మగుసమాజస్థితి నొనర్చిరి.

ఇక్కాలమున కొందఱు విప్లవవాదులు బయలుదేరుటకుగూడ ముఖ్యకారణభూతులు బ్రాహ్మణులే. పెద్ద లందఱేకీభవించి గొప్ప ప్రయత్నమొనర్చి ప్రతిఘటింపఁబూనుకొనినచో నింతటిధర్మవిప్లవము తటస్థించియుండెడిది కాదు. ఎట్లు జైనబౌద్ధమ్లేచ్ఛు లావిర్భవించిన దుష్కాలమున సుప్రసిద్ధు లగుకుమారిలభట్టు-ప్రభాకర-శంకర-వాచస్పత్యుదయనప్రభృతులు స్వీయము లగునితరకార్యముల నన్నిటినిత్యజించి ధర్మరక్షణశీలురై పాటుపడిరో యట్లే నేటిపెద్ద లందఱొనర్పవలెను.

ఆశ యను మరుమరీచికచే నపహృతవిజ్ఞానులును, శాస్త్రరహస్యానభిజ్ఞులు నగు సామాన్య సామాజికులును, పండితులుగూడ తమ ధర్మమునకు నాచారములకు, దూర మగు విద్యను బలపఱుపకపోయినచో వైదేశిక మగువిజ్ఞానశిక్షకొఱకు స్వపుత్రాదుల నధార్మికాచారదూషితము లగునట్టివిద్యాలయముల కప్పగించకపోయినచో, నప్పుడిట్టిప్రపంచమును కబళించెడి మహావిప్లవ మేతెంచియుండెడిది కాదు. ఇది మోహమో లేక తొందరపాటుదనమో మూఢవిశ్వాసమో, గతానుగతికన్యాయమో, మిగులభయంకర మగుకలియొక్క దుష్ప్రభావమో కావలెను. ఏమైన నగుగాక! ఉపేక్షిత మగువ్యాధివలె గొప్పయనర్థమునకే కారణమైనది. ఎవ రాదర్శకులో ఎవరు ధర్మప్రవక్తలో, ఎవరు సాంఘికమర్యాదానిధులో వారలే చలితమనస్కు లగు

చో నిక సాధారణు లెట్లు చలింపకుందురు? ఎపుడు పండితులే వైదేశికాచారశిక్షామార్గముల ననుసరింతురో యపుడు నిరాధార మగు వర్ణాశ్రమాచారశిక్ష నిలుచు టెట్లు? ఎవరు వైదేశికశిక్షాచారముల దోషముల నెన్నుచుండిరో వారే స్వపుత్రాదుల నట్టిశిక్షాచారములం బ్రవేశపెట్టుచో సామాన్యు లేమొనర్తురు?

అట్టిధర్మవినాశక మగునాపదను దొలగింప నెంచు ప్రాచీనాచారశిక్షావ్యవహారదక్షు లగుపండితప్రకాండులు నితరసామాజికులు స్వాధీను లగుపుత్రాదుల నట్టిధర్మాచారవిద్యాదులయందు ప్రవర్తింప జేయుటే యయ్యాచారాదిరక్షణోపాయమని లౌకికదృష్టితోను, యుక్తితోను నిశ్చయించుచున్నాము.

జగత్సృష్టిస్థితిలయవిధాత యగుభగవానునిచే బుద్ధికిగూడ ననూహ్య మగు నీప్రపంచభవనము విలాసమాత్రమున నిర్మితమనియు నిశ్శ్వాసభూతములును, సమస్తధర్మప్రదర్శకములును, స్వస్వరూపములును, స్వతఃప్రమాణములును, అపౌరుషేయములు నగుసమస్తశ్రుతులును, తదుపబృంహకము లగు బ్రహ్మసూత్రపురాణాగమాదులును, నావిర్భవింపబడినవని తామంద రెఱింగినదే.

ఇట్లొనర్పబడినను తా పరోక్షముగనుండుటచే స్వనిర్మితమును యథార్థమును తన కత్యంతప్రియము నగుధర్మము బలవంతులచే నాక్రమింపబడ — "పరిత్రాణాయ సాధూనామ్ ... ... " అన్న తనవాక్యములను సత్య మొనర్చుటకును, తన యపారాద్భుతమహిమము వెల్లడించుటకును నాభగవానుడే స్వభక్తజనరక్షకము లగుతనయవతారముల ధరించెను. వానినిరుపమానములు ననన్యసామాన్యములు నిఖిలస్తోత్రపాత్రములు నగులీలాకృత్యములై నేటికిని మనచే వినంబడుచున్నవి. మరల దుష్కాలప్రాబల్యముచే స్వస్వరూపభూత మగుధర్మమును మార్చుటకు కొందఱు ధూర్తరాక్షసులు యత్నించుచుండ తనరూపముల నాయాయాచార్యరూపముల వెలువడజేసి సకలాంధకారము నిశ్శేష మొనర్పబడినది. అపుడు దిగంగనా

వదనపద్మములు వికాసమొందెను. వేదశాస్త్ర(ములకుగల) కంటకము లు మిక్కిలిదూరమున కెగురగొట్టబడి మర్దింపబడి, తగులబెట్టబడి నిశ్శేషితము లొనర్పబడినవి. భగవత్స్వరూపభూతులగు నాయాయా చార్యులచే సద్విద్యయొక్కయు, అవతారములయొక్కయు పరంపర భూతలమున నవిచ్ఛిన్నముగ నెలకొల్పబడి, నేటివరకును, స్వకర్తవ్య మును నెరవేర్చుచు నాధర్మమహాసేతువును రక్షించుచున్నది. ఎట్టికృత్యములచే ప్రాచీనము లగుధర్మములు క్షీణింపజేయబడు చున్నవో, మరియు పూర్వపుకట్టుబాట్లు ఛేదింపబడుచున్నవో,-సదా శ్రియభూతము లగునారామములనదగు సత్పురుషుల యాచారములు ఛేదింపబడుచున్నవో, యట్టిపాపభూయిష్ఠము లగుకృత్యములు భయం కరదుష్కాలికాలప్రభావమున మహాత్ము లనబడినవారే కొందరికా లమున నొనర్చుచున్నారు. వేదశాస్త్రములయందు పరస్పరము సామాన్యమున నందరిపుణ్యసంపదలు నిశ్శేషితములొనర్పబడునట్టియు స్వసాంఘికులమనమున భేదమొనర్చునట్టియు, ముగ్ధమనస్సులయంతః కరణభూముల వేరుగా నొనర్చునట్టియు బహువిరుద్ధవాద మొనర్చు చున్నారు. భయావహ మగునికాలమున తరుచుగ సహజముగనే మానవప్రవృత్తి ధర్మవిముఖముగా నుండును. అట్టిప్రవృత్తి వీరిచే మిగుల బలయుతముగా నొనర్పబడుచున్నది.

బహుజనపూర్ణమును స్వర్ణప్రసవియు నగునీభారతదేశమున పదేశికరాజచక్ర మవ్యాహతాధిపత్యమ గలదై (అందుచే ఆర్యావ దేశవిరుద్ధ మగుస్వదేశీయకౌశలమును విద్య యనుమిషతో ప్రవర్తింప జేసెను. సామాన్యముగా నందఱు నాశిక్షచే మార్పబడినమనస్సు గలవారలై సంఘస్థితికి విరోధు లగుచున్నారు. అంతర్భేదముచే నాల్గు వర్ణములు మిగుల ధర్మబాహ్యములై జీర్ణించుచున్నవి. "అందఱు మను ష్యులకు సామ్యము గలదు. స్వార్థసాధనపరులగుధూర్తబ్రాహ్మణులచే వర్ణాశ్రమభేదము కల్పించబడినది. నూతనముగ నేతెంచినయార్యు లచే ప్రాచీనప్రజలు బాధింపబడిరి. అసలు ప్రాచీనభారతవర్షాధి కారులుశూద్రులే. వారిలోశ్రేష్ఠులేద్రావిడులు."-అన్నయనర్థప్రచార

కమె వైదేశికశిక్ష. ఆశిక్షచే మెల్లగా పరస్పరవిద్వేషము లేవనెత్తబడినది. భేదము నేటిరాజులకు గర్తవ్య మగుప్రథమోపాయముగదా. భేదము, పరస్పరవిద్వేషము క్రమముగ వృద్ధినొందుచుండ నదును జూచుకొని సర్వసామ్యపరిశంగకూడ లేవనెత్తబడినది.

ఇట్టివైదేశికశిక్షచే మార్పబడినబుద్ధులు గలకొందరు సంఘసంస్కరణాభిలాషులు స్వాతంత్ర్య మన నేమియోగూడ నెరుగక స్వరాజ్యవాదముచే నితరుల విశ్వసింపజేసి బుద్ధుల వ్యామోహపెట్టుచున్నారు. మఱికొందరు బాహ్యముగా పూర్వాచారముల నాశ్రయించుచున్నను, బుద్ధిచే వారలనే యనుకరించుచున్నారు. అది యుక్తమే. వారు శాస్త్రముల నాదరింపరు. పూర్వాచారములగూడ గౌరవింపరు. వైదేశికులు బ్రాహ్మణద్వేషము నెట్లు ప్రచార మొనర్చిరో వీరు నట్లే నమ్ముచున్నారు. జన్మాంతరకృతకర్మఫలముచే జాతి ఆయుష్యము భోగము సంభవించు ననునదియు వారు విశ్వసింపరు. ఇట్లు పరానుకరణసులభమగు మనస్సుచే దలంచబడుస్వాతంత్ర్యమును పారతంత్ర్యముకొఱకే యగును. చూడుడు. ద్వారపాలకునిచే రక్షితుడైనమాత్రమున గృహయజమాని పరతంత్రుడు గాడు. అట్లే ద్వారపాలకవిరహితమును తలుపులు మూయబడినట్టిగృహమున సంకెలలచే గట్టబడిన మనుష్యుడు స్వతంత్రుడు గాడు. ఆర్షపద్ధతి ననుసరించుచున్నవర్ణాశ్రమధర్మపరులు మిగులదీర్ఘకాలము బాహ్యపారతంత్ర్య మనుభవించుచున్నను ఆంతరస్వాతంత్ర్యామృతపానముచే దృప్తులై జీవితభంగ మండకుండిరి. విచారింప పుష్టినే పొందిరి. ఆర్షపద్ధతిపరిత్యాగోత్సాహు లగునవీను లొకవేళ బాహ్యపారతంత్ర్యవిముక్తులైనను ఆంతరపారతంత్ర్య మనుకాలకూటమును మ్రింగి జీవితమునుండియే భ్రష్టు లగుచున్నారు. ఇక నేడు వారు నాయకత్వమన, శాస్త్రముల నవమానించుట; దేశభక్తియన, బ్రాహ్మణద్వేషము; ఔదార్యమన, నిర్విచారముగ త్రావుట, కుడుచుట; సమదర్శనమన, ప్రతిష్ఠితము లగుదేవాలయముల నందఱ ప్రవేశపెట్టుట; విద్యయన, నితరుల వంచించుట; కర్మమన, విశ్వాసఘాతుకత్వము; వీరత్వమన, సదాచారమును

బరిత్యజించుట; త్యాగమన, నితరధనమున శాధిపత్యము వహించుట; దయయన, దుఃఖజీవు లగుస్వజనుల నుపేక్షచేయుట; సంస్కారమన, సమాజస్థితిని భంగపరచుట యనునూతనపరిభాషల లేవదీసిరి.

ఎవరు మొదటినుండియు సజాతీయు లైనను విజాతీయభావము నొందియు సమభాష గలవారయ్యు విషమభాషావ్యవహారులును, కులముచే మిత్రులయ్యు శత్రుప్రాయులునై శాంతిసమర ద్వారమున రాజకీయమున ప్రవేశించి సాంఘికాచారముల బాడు చేయజూచుచున్నారో వారలను నిజముగా లోక మెరుంగ లేకున్నది. వీ రెవరియోట్లచే రాజకీయమున కంపబడి పదముల నందిరో యట్టి వారలప్రాణాధిక మగుధర్మమును నాశమొందింప నిశ్చయించుచు న్నారు. స్వాలంబనశాఖోచ్ఛేదక మగువారిప్రయత్నము దుర్నీతియు నంతట నుచ్చైస్స్వరమున నుద్ఘోషింపదగినది. శాస్త్రవిశ్వాసము లేనిచో జాతీయాభ్యుదయము సిద్ధింపజాలదు. ఈ శాస్త్రవిశ్వాస మెట్లు స్థిరపడునో యట్టిప్రయత్న మొనర్పదగియున్నది. శాస్త్రవిశ్వాస మంతరించిన పరలోకభయము నశించి సమస్తస్థితులు నాశమందును. భగ్నస్థితిక లగుమానవులు పశుప్రాయు లగుచున్నారు. ఇట్టియనర్థ పరంపర యంతట తెలియవలెను.

నేడు స్పర్శాస్పర్శనిరాకరణరూప మగువర్తమానకలికాల మందలి ఆందోలనము సనాతనధర్మవిరుద్ధ మనునది నిశ్చితమే. మనకు శ్రుతిస్మృతిపురాణములయందు దృఢవిశ్వాసము గలదు.

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"

అనెడిభగవద్వచన మన్యథా కాజాలదు. ఆందోలనరూప మగునీగాలివాన యెట్టిపరిణామమైన నొందుగాక! మననిశ్చితవిశ్వాస మియ్యదిగో.

"యస్య నిశ్వసితం వేదా యస్యేచ్ఛాకల్పితం జగత్
స రక్షిష్యతి ధర్మం నో యేనాచారః ప్రవర్తితః"

మహాగ్రాహేణ సంగ్రస్తం కాతరం శరణాగతమ్
గజేంద్రం మోక్షయామాస సేయం పౌరాణికీ కథా.
సత్య స్సనాతనో యశ్చ ధర్మో దేవర్షిసంస్కృతః
స కథం విప్లవేభ్యశ్చ నాత్మాన ముద్ధరిష్యతి."

---

## —* 8. భారతీయులకు దేవభాష హేయమా, ఉపాదేయమా? *—

(బ్రాహ్మణమహాసమ్మేళన పత్రికానువాదము.)

(నె 3 ర ఫైలులో (4-10-37) 16 సం. వయస్సులోను, "విద్యా" పత్రికలో (25-8-38) ను, ము. జ. రా. శర్మచే లిఖితము.)

"ఇద మన్ధంతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీవ్యతే"

గుణగరిష్ఠులును, పండితవరేణ్యులు నగు నోపాఠకులారా! పరివర్తనస్వరూప మగుప్రపంచమున దిరుగుచున్న మానవులాదిగ తిర్యగ్జంతువులవరకు గలజీవులసుఖమునకై దయాసముద్రు డగుభగవానునిచే శబ్దజ్యోతి ప్రపంచమున వృద్ధి నొందింపబడి వెలుగొందుచున్నది. సాయంకాలము వనమునుండి తిరిగివచ్చెడియావులు తమ లేగలయొక్క తేజోరూప మగునంబారవము నాకర్ణించి, వాత్సల్యభరితహృదయములై తమచనులనుండి బాలుగార నేతెంచి నాల్కచే నాకుచు తమపొదుగుల గలపాల ద్రావజేయును. ప్రేమమయదృష్టుల మునుంగజేయును. నీచోపాధికము లగుపక్షులుసైతము తమగూళ్ళయందలి పిల్లలధ్వనుల విని తమవృక్షములకడ కేతెంచి, తొఱ్ఱలయందలితమగూళ్ళయందు ప్రవేశించి, ముక్కుల గైకొనివచ్చు బియ్యము మొదలగు ధాన్యములచే వానిని తృప్తినొందించుచు కడు గారాబమున పోషించుచుండును. అట్లే యీప్రపంచమున నన్ని కార్యములు జరుగుటకు నీశబ్దజ్యోతియే ముఖ్యకారణభూతమై యలరారుచున్నయది. ఇద్దానివలననే యొకపురుషుడు మఱియొకని

నొకానొకకార్యమున నియోగించుటకుగాని, యుపసంహారింప జేయుటకుగాని, శబ్దాత్మకము లగుశాస్త్రీయగ్రంథములచే ధీమంతులవిజ్ఞానము నభివృద్ధినందించుటకుగాని చాలుచున్నాడు. సరసమృదువచనములచే సజ్జనుల సంతోషపరచుచు, అల్పజ్ఞుల సిగ్గిలజేయుచున్నాడు వేయేల? శబ్దమను తేజ మీప్రపంచమున వెలుగొందనిచో నపు డీలోకత్రియము తమోమయమై యుండెడిది. అందుచే విజ్ఞులగుమానవులుసైతము తమస్స్వరూపులై పశువృత్తి నొందెడివారు. అందుచే నీశబ్దజ్యోతి నందఱు నాదరించి యుపాసించవలెను.

ఇయ్యది ఆర్య—అనార్య అనురెండు భేదములనొప్పారుచున్నది. అం దార్యవంశీయుల మగుమన మెద్దాని నాశ్రయించవలె ననువిషయమిట చర్చించుచున్నాము.

అన్నిభాషలయందు నెయ్యది సంస్కారవిశేషముచేతను, పండితాదరణముచేతను గౌరవనీయమో అయ్యదియే మన కాశ్రయింప తగిన దనునది సర్వవిదితమేగదా! ఈసంస్కృతభాష మహామహిములగువైయాకరణసింహములచే ప్రకృతిప్రత్యయాదికల్పనల నొనర్చి సిద్ధస్వరూపముగ జేయబడినదగుటచే సూక్ష్మవిషయనిరూపణమునను భావప్రకాశనమునను గొప్పశక్తి గలిగి గనుపట్టుచున్నయది. అందుచేతనే యికాలమునగూడ నఖిలపాండిత్యనిధు లనదగు పండితప్రకాండులచే నాదరింపబడి పర్యుపాసితమై వెలుగొందుచున్నది. ఇట్లే సంస్కారరంజితములును, గుణగరిష్ఠములు నగుయవనహూణాదిభాషలు కొన్ని కలవనుట సత్యమే. అయినను గీర్వాణభాష సర్వభాషలకు మూలమగుటచేతను, స్వబుద్ధిపరికాశితభువనత్రయులును, తమదివ్యచక్షుస్సుచే భూతభవిష్య ద్వర్తమానముల గరతలామలకమువలె నెరుంగ సమర్థులును, విజ్ఞానస్వరూపులు నగుమహర్షులచే నాదృతమగుటచేతను, గొప్పమహిమ గలదని తెలియుచుండుటచేతను మన కందర కాశ్రయింపదగినదై యున్నది.

మరియొకవిషయము. మనధర్మశాస్త్రములును, మరియు వివిధము లగుశాస్త్రములును, మనోహరము లగుకావ్యములు నీభాష

యందే రచింపబడియున్నవి. నైతికవ్యవహారోపదేశకములగుస్మృతులు జగజ్జేగీయమానములు నాదర్శభూతస్త్రీపురుషచరిత్రాత్మకము లగు రామాయణమహాభారతాది మహాప్రబంధములును సూక్ష్మదృష్టులచే విచారణీయము లగుభట్టకుమారిల, శంకర, గదాధర, జగదీశ, నాగేశప్రభృతు లగుపండితశ్రేష్ఠుల యాయాప్రబంధములు నట్లే సారస్వతప్రాసాదశృంగభూతు లగుభాసకాళిదాసభవభూత్యాదుల మధుర మధురసాంద్రసాహిత్యపారిజాతకుసుమగుచ్ఛము లనదగుకావ్యనాటకాదులు నీభాషయందే విరాజిల్లుచున్నవి. అందుననే వివిధగంభీర మనోహరసరసప్రబంధములచే బ్రహ్మానందతుల్య మగురసము నాస్వాదించుట కీగీర్వాణవాణియే సాధనమై యున్నదని నిశ్చయించి ఆర్యవంశాలంకారభూతులును ధీమంతులు నగుతమ రందరు నిద్దానిననురాగమున జూచుచు వివిధోపాయములచే నభివృద్ధి నొందించవలెను.

ఇచట సంస్కరణాభిమాను లగుకొందఱు నవీను లిట్లు సగర్వముగ నెదురొడ్డుచున్నారు.

"ఆహా! సంస్కృతభాషాభిమాను లగు పిచ్చిపండితుల కిది యెచ్చటివ్యామోహమో! గతానుగతికన్యాయము ననుసరించు నీ యంధపరంపరయం దభిమానము వీరి కేడనుండి వచ్చినది? చూడ నియ్యది ప్రస్తుతము వ్యావహారికభాషగాని రాజకీయభాషగాని కాదు. ముదుసలియై నాశమున కెదురుసూచుచున్న దీనిసేవ (అభ్యాసము) వలని ఫల మేమి? నేడు దీనియందు నవనవోన్మిషితము లగు భౌతికశాస్త్రప్రబంధములుగాని నూత్నరసమనోజ్ఞము లగు కావ్యములుగాని బయలుదేరుట లేదు. పోనీ, యేదైన గొప్పధనము నార్జించుటకుగాని, యశఃప్రాప్తికిగాని సాధన మనుకొన్న నదియు గానరాదు. నూత్నవిషయవిచారమధుపరిప్లుత ప్రబంధోత్పలవిరహితమై గ్రీష్మాతపపరిశుష్కపల్వలమువలె నున్నయీభాష రాజహంససదృశుల మగుమన కాశ్రయణీయ మగుటెట్లు? విశేషించి వివిధరససంపూర

మును. అనేకశాస్త్రప్రబంధముల నలరారుచున్నదియు, విపులధన సంపాదనక్షమమును, మహాయశోజీవనౌషధమును, రాజభాష యగుటచే గౌరవనీయమును, ప్రపంచవ్యవహారమున కత్యంతోపకారకము నగుపాశ్చాత్యభాషను వదలి యీభాష నార్జించుట యెందులకు?

మఱొకవిషయము. ఈగీర్వాణభాష పిశాచమువలె ననేకరూప పరివర్తనముల భయపెట్టుచు బాధను గల్గించుచున్నది. చూడుడు! "సం + కర్తా" అనుచోట నూటయెనుబది సంధిరూపములు గలవు. "గవాక్" శబ్దమున నెనిమిదువందలయిరువదియేడువిభక్తిరూపములున్నవి. 'శశ్రీ' శబ్దము కుటుంబమున కోడలిని నత్తవలె, కోమలమనస్కులగువిద్యార్థుల క్లేశపెట్టును. "ఉష్ట్ర" శబ్దము స్వవాచ్య మగు 'నొంటె' యొక్క మెడనువలె బల్కువాని నాల్కను వక్రముగా నొనర్చును.

"వాశ్ఛ్రేడ్ధ్వజ దగ్ధృతోడ్వధిపతిః' ఈ మొదలగుశ్లోకములు వర్ణోచ్చారణమును బాగుగా నెఱింగినబుద్ధిమచ్ఛ్రోత్రియునిచేనైన మనాయాసముగ బల్క శక్యములు గావు. అందుచే నన్నివిధముల సంస్కృతభాషాభిమానము పరిత్యజింపదగినది. సమస్తజనతాసుఖ నాశక మగునీభాష యెపుడు భూమండలమునుండి తొలగి పేరుగూడ లేకుండ నశించిపోవునో, అపుడు మన మందరము నిఖిలప్రపంచసుఖ సంధాతయగుభగవంతుని వివిధము లగుకాన్కలచే నారాధించి యీ భూలోకముననే నందనవనవిహారసుఖ మనుభవింతము."

ఇట్లు వచించుచున్నవిచిత్రమనస్కు లగునామహానుభావులు నాచే నిట్లు ప్రశ్నింపబడుచున్నారు,

'ఓవిద్వద్వరేణ్యులారా! ఈ సంస్కృతభాష మృతభాష యను విషయమును తమ కేయాప్తు లుపదేశించిరి? పల్లవగ్రాహిపాండిత్య వంతులును మృదుమనస్కులు నగునోపండిత[illegible] యొక్క మరణజీవనవిషయక మగుమాయభ్[illegible]

ఏవాక్కును వినినపుడు పురుషులకు[illegible] రసభావ ములు వృద్ధిజెంది శృంగారహాస్యకరుణరౌద్రభయ[illegible]

నొందునో, దేని వర్ణపదవాక్యవృత్తులు విభక్త్యాదిభావముల నుద్బోధించి సహృదయుల నత్యంతసంతోషయుతుల నొనర్చునో, ఎయ్యది మధురధ్వనివిశేషములచేతను, వివిధములగువ్యంజనములచేతను నభిలషిత మగుసూక్ష్మరహస్యార్థమును విశదపరచుచు శ్రోతల నానందింపజేయునో అయ్యదియే సజీవ మగుభాష. తదితర మగునది నిర్జీవమే. ఈపైసల్లక్షణము నంగీకరించినచో రామాయణాదిమనోహరగ్రంథములు నిఖిలప్రాణులకు రత్యాదిభావముల నుద్బోధించుచు వారి యానందపూర్ణమనస్సులచే తలల నెగురవేయించుచున్నవి గావా? అట్టియెడ నియ్యది మృతభాష యగు టెట్లు? అందున యుష్మద్వాక్యము మూఢజనవాచ్యమని తలంచవలెను.

ఇక నియ్యది వ్యవహారభాష గాదని విచారించుటయు తగదు. భారతీయులము వైదికుల మగుమనకు సమస్తధర్మసంస్కారవిధులు, పదవాక్యప్రమాణములు, శాస్త్రములు పూర్వపద్ధతి ననుసరించువాని పఠనపాఠనపద్ధతులు మొదలగున వన్నియు నీ భాషతోడనే యొనర్పబడుచున్నవి.

ఇక నియ్యది రాజభాష గాదనునదియు దోషము గాజాలదు. ఏమన- నిచటిభారతీయులు పరస్పరకలహములచే విశ్వాసరహితులై మత్సరదోషావిష్టులై యైకమత్యము లేక పారతంత్ర్య మను తమస్సున బడి తమహైన్యమును భాషయం దారోపించుచున్నారు వేయిసంవత్సరములకు పూర్వ మీభాష రాజభాషాసింహాసనము నధిష్ఠించినదై సకలవిద్వజ్జనునుతమై యుండెను. ఆభాష నాస్థానమును డి తొలగించి నైచ్యము నొందించిన దెవరు? ఇది విచారింపక తమహైన్యమును దానియం దారోపించి యీవాణి నపహసించుటకు మీరు తలపెట్టు టాశ్చర్యము కాదా? ఔనౌను. ఆశ్చర్య మేమికలదు? తమ దౌర్బల్యమును మరియొకనియం దారోపించి తాము సమాహితులై యుండ నెంచుట నీచులసహజమార్గమేగదా!

ఇక నీభాష వివిధక్లిష్టపదభూయిష్ఠమనియు, దీని నుచ్చరించుట యతికష్టమనియు బలికితిరి. ఇయ్యది విచారింప మంచిదిగా గన్పట్టదు.

కొన్నిశబ్దముల కేయే వివిధరూపములు గలవో వాని నెల్ల వాక్యములయందుగాని, ప్రబంధములయందుగాని ప్రయోగించి తీరవలె ననెడియీశ్వరాజ్ఞ లేదు. ప్రయోక్త కేయేరూపములు సులభములో, యవసరములో వానినే యాతడుపయోగింప వచ్చును. "సంస్కర్తా" యనుచోట నేయేసంధిరూపములు గలవో వానియందొకదానిచే వ్యవహార మొనర్చిన, మిగిలినరూపములు కోపమున గుర్రెత్తజేయవు. "శశ్రి-ఉర్ట్ర్టా" ప్రభృతిశబ్దముల త్యజించి యాయర్థమునే యిచ్చెడి ఆర్యపుత్ర-జననీ-దాసేరకాది శబ్దముల నుపయోగించిన నేయర్థహానియు వాటిల్లదు. కేవలక్లిష్టపదరచనాకుశలత్వప్రదర్శనమునకు రచించబడిన "వాశ్చ్రేడ్ధ్వజ" మొదలైన కొన్ని వాక్యముల పురస్కరించుకొని శబ్దకాఠిన్యము జూపించుచున్న మీరు "దేవానాంప్రియులే." ఓమహాభాగులారా! "వాశ్చ్రేడ్" మొదలైనకొన్నిశ్లోకములు మీ కెట్లుదొరకినవో!- వానికన్న వందలువేలకొలది యిటునటు విస్తారముగా గన్పట్టుచున్న

"త్వం జీవితం, త్వ మసి మే హృదయం ద్వితీయమ్"

అర్థముచేతను శబ్దముచేతనుసైతమత్యన్తమధురము లగునిట్టిపదములు కన్పట్టలేదా? సాహిత్యకోవిదులచే సామాన్యముగ నఖిలరచనలయందు వైదర్భీరచనయే కావ్యములయం దెక్కుడుగా వరింపబడుచున్నది. వైదర్భీరీతి యన—

"శ్లేషః ప్రసాద స్సమతా మాధుర్యం సుకుమారతా
అర్థవ్యక్తి రుదారత్వ మోజఃకాంతిసమాధయః
ఏతే వైదర్భమార్గస్య ప్రాణా దశగుణా స్స్మృతాః"

అని కవిశ్రేష్ఠు డగుదండిచే మాధుర్యసౌకుమార్యాదిగుణములు వైదర్భప్రాణభూతములుగా కొనియాడబడినవి. అవి మీరు వినియుండలేదా?

ఇక ననేకవిద్యానురక్తు లగునిక్కాలపువిద్యార్థులకు సంస్కృతభాషావగాహన మతికష్ట మనుటయు దగదు. ఆంగ్లపాఠశాలలయందలి

పఠనపాఠనపద్ధతియే యీదోషమునకు లక్ష్యమగును. ఏభాషయైన నగుగాక! పరస్పరవ్యవహారసంభాషణాదులచే నెట్లు సులభముగ గ్రహింప వీలగునో వివిధవ్యాకరణాదినియమముల గురుముఖముగా నధ్యయనమొనర్చుట మొదలగుపరిశ్రమలచే గూడ నట్లు గ్రహింప శక్యముకాదు. ఆయాభాషల సులభముగా నెఱుంగుట కాభాషతోడ సంభాషణమే రాజమార్గము. ఎట్లు వ్యవహారముచే భాషలందు పరిచయ మేర్పడునో, యట్లు మరియేవిధముగగూడ గలుగ దనునది సిద్ధాంతమే. అందువలననే యిటీవల నాంగ్లప్రధానపాఠశాలలయం దాభాషానైపుణ్యసంపాదనమునకై సంస్కృతము మొదలగునన్నివిషయముల నాభాషతోడనే నేర్పుచున్నా రనునది యెఱింగినదేకదా! భాషాసామర్థ్యమునకు వ్యాకరణాదుల కంఠస్థము లొనర్చికొనుట "కాశికి వెళ్ళదలచినయాతడు రామేశ్వరమార్గము ననుగమించుట" వంటిదే. అయ్యది కంటికోనికలకను పోగొట్టుటకు చెవిలో నూదుట ననుసరించుచున్నది. వ్యవహారముచే నీగీర్వాణభాషాపరిచయ మొనర్చుట కుపాధ్యాయసమూహ మెట్లు పరిశ్రమ మొనర్చునో, తదనుసారముగనే కోమలమనస్కులగుఛాత్రులుసైత మీభాషయందు నిపుణులగుదురు.

శాఖాచంక్రమణరూప మగు నీ చర్య యటుండనిండు. నేను తదను వినతుడనై రెండుచేతులు జోడించి శిరమున నుంచి సవినయముగా విజ్ఞాపనమొనర్చుచున్నాను:—

"సంస్కృతభాషయం దనురాగము వహింపుడు. దానియం దనాదరము పరిత్యజింపుడు. మీపుత్రపౌత్రాదుల సంస్కృతభాషనే చదివింపుడు. అపుడు భగవాను డగుపతంజలియు, కవిశ్రేష్ఠు డగుభవభూతియు బల్కినదానిని పొందగలరు.

భగవాను డగుపతంజలి యిట్లుద్ఘోషించుచున్నాడు :—

"ఏకశ్శబ్ద స్సమ్యగ్ జ్ఞాతః సుష్ఠు ప్రయుక్త
స్స్వర్గే లోకే కామధు గ్భవతి"

భవభూతి:—

"కామాన్ దుగ్ధే విప్రకర్ష త్యలక్ష్మీం
కీర్తిం సూతే దుష్కృతం యా హినస్తి-
తాం చాప్యేతాం మాతరం మంగళానాం
ధేనుం ధీరా స్సూనృతం వాచ మాహుః"

—పల్లవిత మైనది; ఇక చాలును—



## —• 9. స్వప్నవృత్తాంతచింతనము •—

[నె 5 వ ఫైలులో '31-12-37' 16 సం. వయస్సులోను, "విద్యా" పత్రికలో '23-10-38' న, ము. జ. రా. శర్మచే లిఖితము.]

అది యొకమహాసభ. అందలిసభ్యు లందరు ప్రాచీనసంప్రదాయానుసారు లగుధార్మికబ్రాహ్మణులే. అందరు వేదశాస్త్రపారంగతులే. అందు వైదికవిద్యాగంధశూన్యు డొక్కడైన గన్పట్టడు.

ఆసభామధ్యమున నిర్మిత మగువేదికపై నొకముదుసలి యాసీనుడై యుండెను. చూడ నాతడే యామహాసభ కధ్యక్షుడై యుండు నని తోచకమానదు. మరియొకపండితు డావేదికపై నిలువబడి యుపన్యసించుచుండెను. గంభీర మగునాకృతియును, దాని కను వగుకంఠధ్వనియు, దాని కనురూప మగు వక్తృత్వము నాతనిపాండిత్యమున కొకశోభను గల్గించుచుండెను. సభ్యులంద రాతనియుపన్యాసము నేకాగ్రతతో నిశ్శబ్దముగ నాలకించుచుండిరి. అతడిట్లుపన్యసించుచుండెను.

'ప్రపంచమున నందఱు సామాన్యముగ స్వకులవిద్యల పరిత్యజించి పరవిద్యల నాశ్రయించెడి యిట్టి దుష్కాలమునసైతము భగవానుని యనుగ్రహవిశేషమున ఇందరము వైదికవిద్యాపారంగతులము శేషించియుండుట మిగులసంతోషావహమే. కాని, మన మధ్య

సించిన వేదశాస్త్రముల సక్రమముగా నుపయోగించుకొనవలెను. మన విద్యల కేవలము స్వార్థమున కుపయోగించుకొనరాదు. వానివలన ప్రపంచమున కపారమగునుపకారము జరుపవలసినభారము మనపై గలదని యెన్నడును మఱవరాదు. స్వార్థత్యాగు లగుమన గురువర్యులు లోకోద్ధరణబుద్ధితో మనవిషయమున నెట్టియుపకార మొనర్చినదియు మనల ధార్మికులుగా నొనర్చుటకై వా రెంతశ్రమపడినదియు మనము మాటిమాటికి స్మరించుచుండవలెను. లోకోద్ధరణమునకై యుపయోగించుమనయద్భుతశక్తి నావిధముగ నుపయోగింపక కేవలము స్వార్థమునకే యుపయోగపరచినచో మన మొకగొప్పపాపము నొందుట నిశ్చయము. కాన నిప్పటికైన మనము స్వార్థత్యాగ మొనర్చి నేటి ధర్మవిప్లవమునకు ప్రతీకార మాలోచింపవలెను. ఆస్తిక్యబుద్ధియు, పాండిత్యము గలమనమే యీవిప్లవమునకు ప్రతీకార మొనర్పనిచో మరి యెవ రొనర్తురు? ఎవరి కేయేశక్తులు గలవో వా రంద రాశక్తుల నన్నిటిని విప్లవప్రతీకారమునకై వినియోగించితీరవలెను. అపుడే విప్లవము శాంతించి దేశక్షేమము గలుగగలదు.

మహాశయులారా! కనుగొనుడు!! మీయద్భుతశక్తి నిక కనుగొనుడు!!! ప్రపంచమున మరల ధర్మప్రతిష్ఠాపన మొనరింపగలసామర్థ్యము మీయందు గలదు.. హనుమంతునివలె స్వసామర్థ్యము నెరుంగనితాము నేటివిప్లవమునకు తమచే జేయదగినప్రతీకార మెయ్యదియు లేదని తలంచి నిర్విణ్ణులయియున్నారు. తమరే స్వార్థత్యాగ మొనర్చి ధర్మోద్ధరణదీక్షాపరతంత్రులై బయలుదేరిన మరల ధర్మము సుప్రతిష్ఠితము గాదనునది కల్ల. కాన నీవిప్లవమునకు కారణ మెద్దియోవిచారించి తత్ప్రతీకార మొనర్చుట మీవిధి. నేటివిప్లవమునకు కారణ మెద్దియని విచారించినచో నిందుల కాంగ్లభాషయే యని తేలకమానదు. వెనుకటికాలమున ప్రజలందరు ధర్మానుష్ఠానపరులై యుండుటకు బ్రాహ్మణులవేదశాస్త్రాభ్యాసమే యనునదియు నట్లే నిశ్చయముగా దేలును. కాన మరల ధర్మమును ప్రతిష్ఠింపదలంచిన ప్రతిబ్రాహ్మణవటువును యథావిధి వేదశాస్త్రాభ్యాసినిగా నొనర్పవలెను. అట్లొనర్చిన బ్రాహ్మ

ణులు ధర్మాభిమానవంతులై యుందురు. వారల ననుసరించి తక్కుం గలజాతులవా రందఱు ధర్మశ్రద్ధాళువు లగుదురు. ఈకృత్యము తమ చేతిలోనిదే. కాన, తా మంద రీకృత్యముసనే తమజీవితము నర్పింప గృతనిశ్చయులు కావలెను.

కాని, యిచట నెఱుంగవలసిన ముఖ్యవిషయ మొకటి గలదు' అది యేదన, వైదికవిద్యకు వేదభాగమును శిరముగను తక్కుంగల శాస్త్రముల నంగములుగను జెప్పవచ్చును. ఇట్టిశరీరమునకు స్వవిహితధర్మానుష్ఠానము ప్రాణముగను జెప్పవచ్చును. అట్టిచో శాస్త్రరహితమగువేద మంగవిహీనశీర్షమువలెను, వేదవిహీనము లగుశాస్త్రములు శిరము లేనికళేబరమువలెను, స్వధర్మానుష్ఠాన విహీనమగునేతదుభయమును ప్రాణవిహీన శరీరమువలెను నిస్తేజములై యుండును. కాన, మనము సిద్ధముచేయుబోవువార లట్టిలోపములు లేనివారై యుండవలెను. వారల ధర్మోద్ధారకు లగున ట్లొనర్చవలెను. ఇట్లొనర్చినచో మనము కొన్ని ధర్మబీజములనైన సంరక్షించిన వారల మగుదుము, లేక స్వార్థపరత నొంది కేవలము స్వదారపుత్రాదిపోషణాసక్తులమై యుండుచో పాపము నొందుదుము. తథ్యము. కాన, నోపండితప్రకాండులారా! లెండు!! ధర్మోద్ధరణదీక్షను వహింపుడు!!! పైన దెల్పినకర్తవ్యమును నెరవేర్చి మీపాండిత్యమును సఫలత నొందించుడు!"

ఇట్లుపన్యసించినతరువాత నాపండితు డావేదికనుండి దిగి క్రింద కూర్చుండెను. సభ్యులు కరతాళధ్వనులచే దిక్కులు పిక్కటిల్ల జేసి తమపూర్ణోత్సాహమును వెలిబుచ్చిరి. తరువాత సధ్యక్షు డగునమ్మ దుసలిపండితుడుగూడ లేచి చల్లనిమాటల నిట్లు పల్కి కూర్చుండెను.

"నాయకులారా! భాస్కరభట్టు దెల్పినది మిగుల ప్రశంసనీయము. నాయభిప్రాయముగూడ నయ్యదియే. మీ రెల్ల రాతనిచెప్పిన చొప్పున ధర్మోద్ధరణ మొనర్తురుగాక" యని యుపన్యాస మాపగనే సభ్యులంద రత్యుత్సాహముతో 'జై సనాతనధర్మదేవతకు' అని జయ జయధ్వానము లొనర్చిరి. ఇంతలో నాకు మెలకువ వచ్చినది.

ఈ విషయ మంతయు స్వాప్నికమని తెలిసినది. మనపండితు లెల్ల రిట్లొనర్చిన బాగుండునని తలంచితినిగాని, మనవార లంతస్వార్థ త్యాగ మొనర్తురా? యని నిరాశుడ నైతి. అప్పటికే తెల్ల వారెను. తెల్లవారుజామున వచ్చినకలలు త్వరలో ఫలము నిచ్చునని పెద్దలు చెప్పుదురు. ఇది యేమగునో? త్వరలో సఫలమైన మరియు సంతసమే గదా!

---

## —♦ 10. నిర్బంధవిద్యావిధానము ♦—

["విద్యా" పత్రికలో '20-1-39' 17 సం. వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము.]

ధర్మధ్వంససబద్ధకంకణు లగుకలిభృత్యులు చేతనైనన్నివిధముల నయమున ప్రచారాదులచేతను, భయమున శాసనాదులచేతను ప్రజల ధర్మదూరుల నొనర్ప ప్రయత్నించుచున్నవిషయము ధార్మిక లోక మంతయు నెరింగినదే. ప్రచారాదులచే వీరైనంతవఱకు ప్రయత్నించి, దాన విసివి, శాసనాయుధముల ప్రయోగింపసాగిరి. వానిలో శారదాశాసనము ప్రథమము. మరల నిన్న మొన్న ప్యాసైనది చండాలదేవాలయప్రవేశశాసనము. ఇంతటితో వీరిహృదయము తృప్తి నొందలేదు. వారింకను తమకృత్యము సంపూర్ణమైనదని తలంచుట లేదు. వారు చేయదలచినధర్మధ్వంసనమునకు చాలమంది ప్రతిఘటన మొనర్చుచున్నారు. ఇకముందు తా మొనర్పదలచిన కృత్యము లట్లే యనేకులు ప్రతిఘటించుచో నెగ్గవేమో యనుసంశయము వారలకు గల్గినది.

ఇకముందు తమకు ప్రతిఘటకులుకూడ లేకుండ చేసికొనజూచుచున్నారు. సామాన్యముగ వారలకృత్యముల ప్రతిఘటించువా రందఱు ప్రాచీనము లగు వేదశాస్త్రాదివిద్యల నభ్యసించినవారలే. ప్రాచీన విద్యాభ్యాసమువలననే వారలయం దింకను కొంతధర్మాభిమానము

వదలకయున్నవి. అయ్యది పరిత్యజించి కేవలాంగ్లభాషాదుల నభ్య సించినవారలే సామాన్యముగ (ధర్మద్రోహులలో) తమలో చేరుచు న్నారు. ఈవిషయము కలిభృత్యులహృదయమున బాగుగ నాటినది.

ఇట్టిధర్మవిశ్వాసజనక మగుప్రాచీనవిద్యనే యంతమొందించిన నందఱు ధర్మవిశ్వాసరహితు లగుదురు. అపుడు తమకు ప్రతిపక్షు లుండరు. కాన నాపనికి మున్ముందు బూనుకొనుచున్నారు. ఇందుల కేతెంచినట్టిదియే నిర్బంధవిద్యావిధానము. ఈ విద్యావిధానమును గురించి యెక్కుడుగ విమర్శింప నావశ్యకత లేదు. ఈవిద్య నభ్యసిం చుటయన స్వధర్మవిద్రోహపద్ధతిని క్రమముగ నేర్చుకొనుటయే యని చెప్పవచ్చును.

ఇదివఱకే యిట్టివిద్యావిధాన మన్నిస్కూళ్ళలోను సామాన్య ముగ ప్రవేశపెట్టబడియున్నది. కాని యియ్యది నిర్బంధరూపముగ లేదు. అందుచే నేకొందరైన ధార్మికులు తమపిల్లల స్వవైదిక విద్య నభ్యసింపజేయుట కవకాశ ముండెడిది. కాని, దీనితో దానికిగూడ నవకాశము పోగొట్టబడినది. సామాన్యముగ పిల్లలు వేదాదుల నభ్య సించుకాలమునే యియ్యదిగూడ నాక్రమించినది. ఏకొందరైన నియ్యది గడచినతరువాత తమపుత్రులకు వైదికవిద్య నేర్పింపదలచినను, అప్ప టికే వయస్సు గడచుటచే నయ్యది సంభవించుట కష్టమే. అయినంత వర కేకొంచెమైన చెప్పింత మనుకొన్నను, ఇట్టివిద్యావిధానమున తగు లొందినతమపుత్రులు మరల వైదికవిద్యనభ్యసించుట కంగీకరించుటయు కష్టమే.

ధర్మము నశించుచుండుటయట్లుండ తద్విశ్వాసముకూడ నశిం చునట్లు ప్రతిపక్షు లొనర్చుచున్నయీదుష్ప్రయత్నముల ధార్మికులు చేతనైనంతవరకు ప్రతిఘటింతురుగాక! భగవానుడు ధార్మికులకు చేయూత నిచ్చుగాక!

## — 11. జీవిక —

["విద్యా" పత్రికలో '22-10-39' 18 సం. వయస్సులో ము. జ. రా. శర్మచే గరికెపాటి కనకలక్ష్మీనరసింహసోమయాజి పేరుతో లిఖితము]

అహస్కరు డుదయించి మైదారుగడియ లైనది. ఋషికులమున శ్రుతిఘోష లెల్లెడల ప్రతిధ్వనించుచుండెను. అట్టితఱి నొకనూతన పురుషుడు ఋషికులముకడ కేగుచుండెను. అత డట్లు ఋషికులమున బ్రవేశించి, శిష్యులకు బాఠముల జెప్పుచున్నయధ్యాపకులకడ కేగి, నమస్కరించి, వారియానతిపై నచట నొకయాసనమున కూర్చుండెను. కొంతదనుక నూరక విద్యార్థుల జూచుచు తనలో తా నేదియో నవ్వుకొనెను. కొంతవర కట్లయుండి యధ్యాపకులతో మెల్లన నిట్లు సంభాషింప దొడంగెను.

వ్యక్తి:— ఆర్యా, వీర లిట నెంతదనుక నధ్యయన మొనర్చి విరమింతురు?

అధ్యాపకులు:— ఇంచుమించిరువదేండ్లవర కిచటనే యుందురు.

వ్య:— మంచిది. ఆపైన వీరలజీవన మెట్లు?

అ:— (నవ్వుతో) లోకమున కోట్లకొలదిగ జనులు జీవించుచుండ మాశిష్యులజీవనమువిషయమున మీ కీవిచార మేల? సృజించినపరమేశ్వరుడు పోషింపడా?

వ్య:— అయ్యా, అట్లనకుడు. మీ రీగురుకులమును దాటి యెరుగనివా రగుటచే ప్రపంచజ్ఞానము చాల తరుగు. కాననే మీ రిట్లను చుంటిరని తలచెద. నేడు ప్రపంచమున నెటు గన్గొనినను, నిరుద్యోగసమస్యయే పెనుభూతమువలె దృక్పథమున కేతెంచుచున్నది. ఏ దిక్కున వినబోయినను "అన్నమో రామచంద్ర" యనునార్తనాదములే యాలకింపబడుచున్నవి. ఏపత్రికను జూడబోయినను ఉద్యోగకాంక్షచే తాతముత్తాతలు కండనెత్తురుల నోడ్చి యార్జించిన మడిమాన్యముల దెగనమ్మి యెట్టకేలకు బట్టముల జేపట్టి యాపై జేయునది లేక భార్యాపుత్రులగూడ బోషింపజాలక నలుగురలో నగుబాట్లు

సైపలేక జీవితమే దుర్భరమగుటచే నాత్మహత్యల గావించుకొనిన యాంగ్లవిద్యాపట్టభద్రుల యతిదీనవిచిత్రచరిత్రలే కనుల కగుపట్టు చున్నయవి.

అః— ఆర్యా, ఈ వర్ణన మింక విరమింపుడు. భారతీయులు కేవలధనాశచే పరవిద్యాపరమతముల జేరి తుదకు ధర్మార్థముల రెంట జెడి, ఇట్టినికృష్టస్థితికి బాల్పడుచుండిరనుట యెంతయు హృదయ విదారకముగ నున్నది. ఇక పర్యవసానము దెల్పుడు.

వ్యః— వినుడు. పరిస్థితు లిట్లుండ పై పెచ్చు జాతిద్వేషములు, మతద్వేషములు మొదలగునవి యన్నియు నీ దుస్థితికి దోహద మొసం గుచున్నవి. అయ్యా, ఇట్టితటి ఏ.బీ.సీ.లగూడ నెరుగక కూవస్థ మండూకమువలె ప్రపంచజ్ఞానశూన్యుడై యిరువదవయేట నిటనుండి సమావృత్తు డగుమీశిష్యు డీనవ్యప్రపంచమున యథాశాస్త్రముగ జీవన మెట్లొనర్పగలడో యొకింత యాలోచించుకొనుడు. మరొక మాట. వీరలకు రాజకీయముగ నుద్యోగము దొరకదుగదా! ఇక మార్గ మేమి? యాజనమా? కలుపాతికలువ మగునికాలమున సద్యా జనమునకు తా వేడ? యజన మున్నగదా యాజనము! అదియే సున్న. ఇక దీనిసంగతి చెప్పవలసిన దేమి కలదు? ఇక అధ్యాపనమా? ఉపనీతు డగువటు వధ్యయనము నియమపూర్వకముగ నిర్వర్తించి గురుదక్షిణ నొసగి సమావృత్తు డగునాచారము వందలకొలది యేండ్లక్రిందనే యన్తర్హితమైనది. ఇక ప్రతిగ్రహమా వినుడు.

ఈ మధ్య నొకగ్రామమున యాచన కేతెంచినబ్రాహ్మణుని గ్రామస్థులు కఱ్ఱలతో నూరు వెడలనంపిరని వింటిని. దీనిని వినిన పరి స్థితి నెరుగగలరు. ఇక నిట్టియెడ సత్ప్రతిగ్రహమూలముగ జీవన మశక్య మని వేఱె చెప్ప నక్కఱలేదు. ఇట్టిచో శాస్త్రీయ జీవన మెట్లో తెల్పుడు.

అః— మీరు దెల్పినపరిస్థితు లన్నియు యథార్థములని యెఱుం గుదును. ఇట్టియాపత్సమయముల ధార్మికబ్రాహ్మణు డనుసరింపదగిన

మార్గముల గొన్నింటి ధర్మశాస్త్రము లెరింగించియున్నవి. ఆమార్గముల నవలంబించి యెట్లో ధర్మరక్షణ మొనర్చుకొనుటయే బ్రాహ్మణునివిధి. ఆతనిజీవితము ధర్మరక్షణమున కేగాని యన్యమునకు గాదు. ధర్మరక్షణమునకై యాత డనేకము లగుకష్టములనైతము లెక్కగొనడు. జీవనవిషయమున నాతడు సామాన్యదృష్టిని ధర్మవిషయమున విశేషదృష్టిని గలిగియుండును.

వ్యా:—ఆవృత్తు లేలేవి?

అ:— శిలోంఛము, అయాచితప్రతిగ్రహము, ఉపాదానము, కృషి, వాణిజ్యము—అను నైదుమార్గములు మనువు చెప్పియున్నాడు. అందు మొదటిది కేవల మన్నగతప్రాణు లగునేటివారల కశక్యము. రెండవది గూడ పరిస్థితులబట్టి చూచిన నంతే యనవలసి వచ్చుచున్నది. మూడవది యగు నుపాదానవృత్తితో నందందు నేడు కొందరు వైదికులు జీవించుచునే యున్నారు. కాని, వారిసంఖ్యగూడ నధికమగుచో, నికముందు దానికిగూడ ప్రతిబంధము సంభవింపవచ్చును. ఇక నాల్గవది కృషి. దేశకాలపరిస్థిత్యనుసారము ధార్మిక బ్రాహ్మణు లివు డీవృత్తి నవలంబించుటయే శ్రేష్ఠమని మాయాశయము. నేడు కొంద రీవృత్తి నవలంబించుచునే యున్నారు. కాని, వారలయుద్దేశ్యములు పైదెల్పినట్లు ధర్మరక్షణార్థకములుగ నున్నట్లు తోచదు. ఇక ననన్యగతికముగ కేవలజీవనముకొఱకే యవలంబించుచున్నారు. వారల కాయుద్దేశ్యములు మారి మే మెరింగించిన యాశయములు హృదయమున బాగుగ నాటుకొనవలయును. మున్నుం దిదియు నశక్యమైన వాణిజ్యము కలదు. దానినైన నవలంబించి జీవించవచ్చును. ఇంతకు మాయాశయముల ముఖ్యము ధర్మముగాన జీవన విషయమున వారల కుండునంతచింత మా కుండదు. పోనిండు. మీ యాశయముల ననుసరించి జీవనమార్గము లెవ్వియో తెల్పుడు.

వ్యా:—మాయాశయములలోగూడ నందరకు వ్యవసాయ మావశ్యకమే. ఇంతియేగాక అందరు వృత్తివిద్య లగుచెక్కుట, నేత, కుండల

జేయుట, మొదలగునవి నేర్చియుండవలెను. అట్లైనచో ప్రతివారు తమసంసారముల ననాయాసముగ బోషింపగలరు.

అ:- మంచిది. కాని మీ మాటలజూడ-పరమార్థము తత్సాధన మగుధర్మమునకు మీయాశయములలో తావున్నట్లు గన్పించదు. ముక్తిని గమనించనిభుక్తి పశ్వాదిసాధారణమని మాయాశయము.

వ్య:—ఆర్యా! త్వరగ బోవలసినకార్య మున్నది. సెలవిండు.

[అని లేచును]

అ:- మరొకసారి సావధానముగ మాటాడగోరెద.

వ్య:- చిత్తము. [వెళ్ళును.]

---

## 12. ప్రాయశ్చిత్తము

[నె 4 ర ఫైలు "దుందుభి" పత్రికలో 3-8-40 19 సం. వయస్సునను "విద్యా" పత్రికలో 10-10-40 న ము. జ. రా. శర్మచే లిఖితము. "కల్పవల్లి" పత్రికలో 1-7-41 ముద్రితము.]

కృష్ణశాస్త్రి శిష్టాచారపరులవంశపువాడు. అతనితాతతండ్రులు శ్రౌతకర్మలు చేసినవారలు. అతడుగూడ శ్రౌతకర్మ లొనర్పకపోయినను స్మార్తకర్మల పరిత్యజింపక యనుష్ఠించు చుండెడివాడు. నిత్యము స్నానసంధ్యాగ్నిహోత్రములు నిర్వర్తింపనిదే గడపదాటి యడుగు బయటవేయువాడు కాడు. నీరుకావిపోవతులు, రుద్రాక్షమాలిక, భస్మరేఖలు ధరించినపు డతని చూచువారు రుద్రావతార మనుకొనుచుందురు. ఆతనికి శ్రౌతస్మార్తములలో కొద్దిప్రవేశము కలదు. మంచి సాహిత్య మున్నది. అందువలన నాతని గ్రామమగు రామచంద్రపురములో నాతనికి తగిన గౌరవము కలదు. కృష్ణశాస్త్రికి పిత్రార్జితమైన మాగాణిభూమి పదునైదెకరములు కలదు. ఒకరిని దేహి యని యాచింప నవసరము లేదు. కృష్ణ రామ యనుకొనుచు పారమార్థికచింతతో కాలక్షేప మొనర్చుచుండెడివాడు.

ఆతని కేకైకపుత్రుడు ప్రసాదశాస్త్రి. ఆతని కిపుడు షుమారు 12 ఏండ్లు. కృష్ణశాస్త్రి పుత్రున కుపనయనము సంవత్సరముక్రింద చేసెను. అప్పటినుండియు శబ్దములను అమరమును చెప్పుచుండెను. అపుడు సామాన్యముగ నందరుపిల్లలింగ్లీషునే చదువుచుండిరి. అందు వలన వారిని వీరిని చూచి ప్రసాదశాస్త్రికిగూడ ఇంగ్లీషు చదువ నభిలాషకలిగినది. తన కింగ్లీషు చెప్పింపుమని తండ్రిని వేధింపమొదలిడెను. తండ్రి కింగ్లీషు చెప్పించుట యిష్టములేదు. ఒకసారిరెండుసార్లు మన మాచదువు చదువరాదని చెప్పెను. కాని ప్రసాద మంతటితో నాగక ఇంకను తండ్రిని వేధించుచునే యుండెను. కృష్ణశాస్త్రికి గూడ లోన మెత్తదన మేర్పడెను. అర్థాశ సైతము కొంచె మవకాశమును కల్పించుకొనెను. ఇరుగుపొరుగువారుగూడ మీపిల్లని కింగ్లీషు చెప్పించుడు, తెలివైనవాడు, వృద్ధిలోనికి రాగలడు అనిచెప్ప మొదలిడిరి. ఇల్లాలైన పార్వతమ్మగూడ ఒకరోజు "మీకెందుకండీ అంత పట్టుదల? నలుగురితో నారాయణాయని మనవానికికూడ నింగ్లీషు చెప్పించరాదా? మనకుమాత్రము డబ్బు చేదా? మాఅన్నకుమారుని చూడుడు-నెలకు వంద రూపాయీలు తెచ్చుచున్నాడు. వాళ్లు హాయిగ సుఖించుచున్నారు. మనవా డింగ్లీషు చదివినచో ఆలాగే సంపాదించడా?" అని భర్తను గోజసాగినది. మొదట మనకులవిద్య గాదు, మనకు పనికిరాదని సమాధాన మిచ్చెనుగాని, ఎట్టకేలకు వాదోపవాదముల మీద తానును అంగీకరింపక తప్పలేదు. ఎట్టిమనస్సైనను అసకృదావృత్తిగ ప్రతికూలవచనములు వినపడుచున్నచో మారితీరునుగదా!

కృష్ణశాస్త్రిబుద్ధిగూడ కొంచెముగ మారినది. ఇంగ్లీషు చెప్పించినమాత్రమున మనపిల్లలు మనయాచారములను వదలకుండ నుండ గూడదా అనియనుకొనెను. రాజమహేంద్రవరములో స్కూలులో కుమారుని చేర్పించెను. అతని కచటనే భోజనవసతి ఏర్పరచెను. నెలకు రు 8 లు చొప్పున ఇచ్చున ట్లొక హోటలులో నాతని చేర్పించెను.

* * *

౨

ప్రసాదశాస్త్రి ఇంగ్లీషు ఆరంభించి ఇప్పటికి ఆరేండ్లయినది.
ప్రస్తుతము స్కూలుఫైనలు చదువుచున్నాడు. ఇంగ్లీషు ఆరంభించిన
తరువాత ప్రసాదము చాలమారిపోయెను. అంతకుపూర్వ మింటియొద్ద
తండ్రిభయమువలన ప్రతిదినము తప్పక సంధ్యావందనము చేసెడి
వాడు, మడికట్టుకొనియే భోజనముచేసెడివాడు. ఊరిలో జరుగు భజ
నలు హరికథ మొదలైనవానికి తప్పక వెళ్ళుచుండెడివాడు. ఇపు డవి
యన్ని యంతరించినవి. ఇంగ్లీషారంభించినతరువాత రెండుమూడేండ్ల
వరకు అపుడపుడైన సంధ్యవార్చుచుండువాడు. తండ్రి చూచుట కెపు
డైన వచ్చినచో నానాడైన పట్టుబట్ట కట్టుకొని భోజనముచేసెడివాడు.
సెలవులలో నింటికి వచ్చినపు డతనికి కష్టముగ నుండెడిది. ప్రతిదినము
సంధ్య యేకొంచెమో తండ్రిభయమువల్ల అభినయించవలసివచ్చెడిది.
అపుడు మైలగుడ్డలతో భోజనమొనర్చుచుండెడివాడు. తండ్రి యేమని
అడిగిన నేదియో చెప్పి తప్పుకొనుచుండెడివాడు. తరువాత రెండు
మూడేండ్లలో నింకను మారిపోయెను. మడి పూర్తిగా మానివైచెను.
సంధ్యకు స్వస్తి చెప్పెను. మన మెక్కువగ పోరుచున్నచో మాట
పోవునేమోయని కృష్ణశాస్త్రి చూచిచూడకుండ నుండెడివాడు. అం
దుచేత నిపుడు ప్రసాదము మరియు మారిపోయినాడు. మడిమయిలలు
లేకపోగా పైపెచ్చు అడ్డదిడ్డపు భోజనములకు సైతము సాహసించు
పరిస్థితిలోనికి వచ్చెను. సినిమాలు హోటళ్లు మొదలగు బస్తీ అలవాట్ల
నన్నిటిని బాగుగనలవర్చుకొనెను. కట్టు జుట్టు బొట్టులను మార్చుకొ
నెను. ఏ సినిమాయొద్ద చూచినను ప్రసాదమే' ఏక్లబ్బునొద్ద కనుగొని
నను ప్రసాదమే. ఏ గానసభయొద్ద చూచినను బ్రసాదమే. ఈవిధ
ముగ స్వేచ్ఛగ తిరుగుచున్నను బుద్ధిశాలి యగుటవలన నెట్లో చదివి
పరీక్ష ప్యాసు ఆయెను. సెలవుల కింటికి వచ్చెను. ఈసారి ప్రసాదము
ప్రవర్తన కృష్ణశాస్త్రికి చురుకును గలిగించెను. గట్టిగ ప్రవర్తనను
మార్చుకొనుమని మందలించుటకు ధైర్యము చాలదు. మన కెందులకు
లెమ్మని మౌనము వహించుటకు మనసొప్పదు. ఇంటికడగూడ ఆ

నూటు బూటులతో తిరుగుట, మయలకూడు తినుట అతనికి కష్టమును గలిగించినది. ఎట్టకేల కొకరోజున నొంటరిగా కుమారునితో "అబ్బాయీ! ఒకగంటసేపు మాట్లాడవలెను. నీ కిపు డవకాశ ముండునా? ఇతరకార్యము లేవియు లేవుగద" యని యడిగెను. ప్రసాదము తన ప్రవర్తనను గూర్చి మాట్లాడుటకే తనతండ్రి పిలిచె నని తెలిసికొనెను. ఏదియోసాకు చెప్పి తప్పుకొందమని యనుకొనెను. కాని ఏమిచెప్పునో విందమనునభిప్రాయముతో, 'ఏమియు పనిలేదు' అని సమాధాన మిచ్చెను. తరువాత కృష్ణశాస్త్రి ఇట్లుచెప్ప మొదలిడెను- "నాయనా యిటు వినుము. మనము మొదటినుండియు శిష్టాచారపరులవంశపు వారము. నే నేకొంచెమో మనకులవిద్యనే అభ్యసించితిని. నేటివరకు యథాశక్తిగ సదాచారము నవలంబించుచున్నాను. మా అమ్మబల వంతమువల్లనేమి కారణాంతరములచేనేమి నిన్నింగ్లీషు జదువ బడివేశ పెట్టితిని. నీ వీచదు వారంభించినదాదిగ క్రమముగ నాచార వ్యవహారముల నన్నింటిని పరిత్యజించు చున్నావు. బస్తీ దురభ్యాసముల నన్నింటి నలవరచుకొంటివి, కట్టు మార్చితివి. జుట్టు మార్చితివి. బొట్టసలే మానివైచితివి. ఇవి యవి యననేల? అన్నింటను మార్పుచెందితివి. నిన్ను చూచినవారు నాకొమరుడవని గుర్తింప నవకాశము లేకుండ జేసికొంటివి. ఇప్పటి నీప్రవర్తనము నా కంతగ రుచించుట లేదు. ఇంగ్లీషు చదివినమాత్రాన ఈవిధముగ మారిపోవలెనని నియమము కలదా? ఇకముందైనను నామాట విని నీప్రవర్తనను మార్చుకొనుమని నా కోరిక. పెద్దవాడను నామాట వినుము. ఏమందువు"- అని విరమించెను.

ప్రసాదమున కీమాటలు కొంచెము కష్టమును కల్గించినవి. తన తండ్రికి ప్రతిసమాధాన మొసగుటకు మొదట కొంచెముగ జంకెను. కాని తనయభిప్రాయముల స్పష్టముగ తెలుపుట యావశ్యకమనునాశయముతో నీవిధముగ సమాధాన మొసంగెను. 'నాన్నా! ఎదురుచెప్పుచున్నానని కోపపడకు. నేనుగూడ మీవలెనే స్నాన సంధ్యాదుల నాచరించుచు సదాచారములను పాలించవలెనను కోరిక

యే ఉన్న యెడల నాకు మొదట ఇంగ్లీషు చెప్పించకుండనే ఉండవల సినది. ఆవాతావరణము నన్నువశు నొనర్చి యిట్టిప్రవర్తనలోనికి దించెను. ఇపుడు నాప్రవర్తన మార్చుకొనుట అత్యంతము కష్టతమము. ఇపుడు నన్నని ప్రయోజనము సున్న. ఏదో మొదట పొరపడి నన్నీవిద్యలో ప్రవేశపెట్టితివి. కావున నీవే నీయభిప్రాయము మార్చుకొనుట మంచిది. అట్లయినచో నిరువురకు ఆనుకూల్యము గల్గును. మరొకమాట నే నిపుడు దేవుడు దైవము వేదము శాస్త్రము ధర్మము అధర్మము పాపము పుణ్యము పరలోకములు మొదలగు వానిని విశ్వసించను. నా కావిశ్వాసము చాలకాలముక్రిందనే నశించినది. ఇట్టిస్థితిలో స్నానసంధ్యాదిసదాచారమును మనఃపూర్వకముగ ననుసరించుట ఎట్లు పొసగునో మీరే ఊహింపుడు. మీరు సదాచారము లనుకొనునని నూటికి ఎనుబది వంతులు మూఢవిశ్వాసప్రయుక్తములని నానమ్మిక. ఇక మీకోర్కెనెట్లు సఫలము కావింపజాలుదును?' కృష్ణశాస్త్రి యీ మాటలతో దిగ్భ్రాంతిని జెందెను. తన కొడు కిట్లు సమాధాన మిచ్చునని ఆతడు మొదట తలచియుండ లేదు. మరల కుమారునకు తా నేమి జెప్పవలెనో అతనికి తోచలేదు. ఎట్టకేలకు 'ప్రసాదం! కులక్రమాగతసదాచారములను సంపూర్తిగ పరిత్యజించుట ఆత్మవినాశకరమని నాయాశయము. అందువలన నీకిట్లు చెప్పితిని. తరువాత నీయిష్టము' అని శాస్త్రిచెప్పెను. ప్రసాదం మరచిపోతిని; నాస్నేహితులతో షేక్స్పియర్ నాటకము చదువుటకు వత్తునని చెప్పివచ్చితిని, ప్రొద్దైనది, వెళ్లివత్తును— అనుచు జారుకొనెను. కృష్ణశాస్త్రి యిక మించి పోయినట్లే అని లోలోపల ననుకొనుచు లేచి వెళ్లెను.

## 3

ప్రసాదాకిని హైస్కూల్ చదువు పూర్తిఐంది. ఇక కాలేజీ చదువు చెప్పింతమా వద్దా అనుసంశయమున కృష్ణశాస్త్రిహృదయము కొట్టుకొనుచున్నది. ఇంతదనుక చదివించినందులకు ఫలమగుపించినదిగదా? ఇక చాలదా? ఇంతటితో విరమించుట మంచిది అని

ఆతని హృదయమున ప్రాచీనసంప్రదాయానుసారిత్వము బోధింప సాగెను. ఆరంభించినపని అంతమగువఱకు కూరకొనకుండుట ధీరలక్షణము. మధ్య విరమించుట తగదు. ఏ బి. యే. వరకైన చెప్పింపక పోయిన నుద్యోగము లభించుట కష్టము. ఈసదాచారముల కేమి, తరువాత నేర్పవచ్చును. ఇపుడు చదు వాపి పిల్లనిఉభయభ్రష్టుని చేయవలదు_ అని మరొకవంక ధనవ్యామోహము పీడింప దొడగెను. ఒకరోజు తనభార్య పార్వతమ్మతో తనకును కుమారునకును జరిగిన సంభాషణమును వినిపించి, ఇకముం దీయింగ్లీషు మాన్పింతు ననియు, పిల్లడు చెడిపోవుననియు చెప్పెను. ఆమె "యేదో కుఱ్ఱతనమువలన తెలియక అట్లన్నాడు; ఇక రెండు రోజులకు మంచి చెడుగులు వాడే తెలుసుకొనగలుగును; ఈ కొద్ది విషయమునకు కోపపడి కుఱ్ఱని ఉభయభ్రష్టుని చేయకుడు; కష్టమో నిష్ఠురమో బి. ఏ. వరకైన చెప్పించండి" అని భర్తకు చెప్పినది. కృష్ణశాస్త్రి పోనిమ్మని నీ యిష్టము వచ్చిన ట్లట్లేచెప్పింతులెమ్మని తల యెగురవైచెను. కాని యిప్పటికే ప్రసాదముచదువుకుగాను రెండెకరము లమ్మవలసివచ్చినది. ముందు గూడ నిట్లే భూమి నమ్మినచో కొమరునిసంపాదన మెటున్నను, ఉన్న భూమి చాలవరకు సున్నయగునేమో యని శాస్త్రి సంశయించెను. పార్వతమ్మకు తనయు డుద్యోగ మొనర్పవలె ననుకోర్కి మిక్కుటముగ నుండెను. అందుచే ప్రసాదం కాలేజీచదువు కొఱకు తనసొమ్ములను వెచ్చింప నంగీకరించెను.

ఏమైననేమి మరల ప్రసాదశాస్త్రిని కాకినాడ కాలేజీలో విద్యాభ్యాసార్థము కృష్ణశాస్త్రి ప్రవేశపెట్టెను. ఏనెల కానెల డబ్బు పంపుచుండెను. ఒక సంవత్సరము గడచెను. ఎఫ్. ఏ. మొదటిసంవత్సరపు పరీక్షలు పూర్తి అయినవి. కాని ఈసారి ప్రసాదము సెలవుల కింటికి రాలేదు. కృష్ణశాస్త్రి ఒకటిరెండుత్తరములు వ్రాయగా తాను సెలవులలోగూడ స్వయముగ విద్యావ్యాసంగము చేయుచుంటి ననియు, అందుచే నింటికి రానని యు సమాధానము వ్రాసెను-ఇట్లేనాలుగేండ్లు బి. ఏ. పరీక్ష పూర్తియగువరకు ప్రసాద మింటికి రాలేదు. మధ్య పార్వ

తమ్మ రెండుమూడు పర్యాయములు కుమారుని చూచివచ్చినది. కాని కృష్ణశాస్త్రి వెళ్లిరాలేదు. అందులకు కారణ మతనిమనను స్తిమితముగ లేకపోవుటయే. కాకినాడనుండి వచ్చిన ప్రతి పరిచితవ్యక్తితోడను తనతనయుని ప్రవర్తన యెట్లున్నది యని ప్రశ్నించుచుండును. కాని ప్రతివారు 'మీకొమరుని నేను గుర్తించలేకపోతిని; ఆతని వేషభాషలు రోజురోజు నూతనత్వము నందుచున్నవి' అని చెప్పుచుండిరి. పార్వతమ్మగూడ తనకుమారుడు వెనుకటికన్న చాల మారిపోయె ననియు, తననుగూడ సరిగ జూడలేదనియు చెప్పియుండెను. ఇదియే కృష్ణశాస్త్రి మనోవైకల్యహేతువు. అపుడపుడు ఇక మాయిరువురకు కలయిక దుర్లభము అనుకొనుచుండెడివాడు. బి. ఏ. పూర్తి అయిన తరువాతగూడ కుమారు డింటికి రాకపోవుటచే పార్వతమ్మ భర్తచే నాలుగైదు ఉత్తరములు వ్రాయించినది. కాని ప్రసాదము నొద్దనుండి జవాబు రాలేదు. కృష్ణశాస్త్రికి ప్రాణము విసిగి వ్రాయుట మాని వైచెను. పార్వతమ్మగూడ కుమారునివిషయమున వెనుకటివలె నెక్కుడనురాగమును వహించుట లేదు. కొమరునిప్రవర్తన ఆమెకుగూడ నసహ్యభావమును గల్గించెను. అయిదారు నెలలవరకు ప్రసాద మింటికి గాలేదు. కృష్ణశాస్త్రి వచ్చిపోవు మనుష్యుల ద్వారమున ప్రసాద మేదియో చిన్న ఉద్యోగమును సంపాదించి కాకినాడలోనే కాలక్షేప మొనర్చుచున్నట్లు తెలిసికొనెను. ఈవిషయము తెలిసినతరువాత పార్వతమ్మ కొడుకుకడ కేగదలంచెను; గాని, మరల కృష్ణశాస్త్రినిరోధమువలన విరమించెను.

౪

ఒకరోజు కృష్ణశాస్త్రి మధ్యాహ్నము భోజనముజేసి ఇటునటు నింటిలో పచారు జేయుచుండెను. అప్పుడు ప్రక్కయింటి యజమాని చేత నేదియో పత్రిక నొకదానిని పట్టుకొని వచ్చి 'చూచితిరా శాస్త్రిగారూ! మన ప్రసాద మెంతపని యొనర్చినాడో!' అని పత్రికను కృష్ణశాస్త్రిచేతి కందించెను. ఆత డత్యంతాతురతతో నాపత్రము నాతనిచేతినుండి లాగుకొని కొంతసే పేదియో లోలోన చదివి

కొనెను. అది చదువునప్పు డాతనిముఖమున ఆశ్చర్యము, కోపము, దుఃఖము అను భావములు క్రమముగ గనుపట్టెను. అందలి విష యము నాతడు బిగ్గరగ చదువలేకపోయెను. అం దేమి కలదోయని పాఠకు లెరుంగ నభిలషించుచుండవచ్చును. ఆ పత్రికలో ఒక ఛాయా చిత్రము కలదు. అం దొకనూత్నదంపతులు పుష్పమాలాలంకృతులై పరస్పరము చేతులు గలిపికొని నిలువబడి యుండిరి. క్రింద ఈవిధ ముగ వ్రాయబడి యుండెను. "ఆదర్శభూత మగువివాహము. వరుడు సంస్కరణప్రియుడగు డి. ప్రసాదరావుగారు, బి. ఏ. (బ్రాహ్మణులు) వయస్సు షుమారు పాతికఏం డ్లుండును. వధువు డి. కనకమ్మగారు ఎఫ్. ఏ. (కమ్మ) వయసు షుమారు పాతిక. ఈవధూవరులకు వితంతు శరణాలయములో వివాహమహోత్సవము మాఘ శుక్లపంచమినాడు జరిగినది." ఇది చూచుటతోడనే కృష్ణశాస్త్రినయనము లశ్రుపూరి తములైనవి. అయ్యో పూర్వజన్మియపాపఫలితముగ నాకు పీడు కొమ రుడై నాడు, పాప మనుభవింపక తప్పదుగదా? అని వలవల విలపింప సాగెను. పార్వతమ్మగూడ వచ్చిసంగతి తెలిసికొనెను. ఏమొనర్చును? కొంతతడవు విలపించి ఊరకొనెను. అది మొదలు పార్వతమ్మ దిగులు చే మంచముపట్టెను. పరమపవిత్రవంశమున పుట్టి కులమున కపకీర్తి తెచ్చినాడు తన పుత్రుడని నిత్యము విలపించుచుండెను. క్రమముగ వ్యాధి బలవత్తర మైనది. పార్వతమ్మ జీవితమే సంశయాస్పద మాయెను. ఇరుగుపొరుగువారు కృష్ణశాస్త్రితో కొమరున కుత్తరము వ్రాయుమని చెప్పిరి. కాని ఆతని కది యంగీకారము గాదు. భార్య నేమందువని యడిగెను. ఆమె కనుల నీరునించి 'భార్యను వదలిరాడు గదా? ఇక నా జీవితాంతములో నాకొడలిచేతి నీరుగూడ త్రాగవ లెనా?' యని యేడ్చెను. కృష్ణశాస్త్రికి హృదయము వ్రక్కలైనట్లాయి నది. ముక్తకంఠముగ నొకపరి భోరుమని యేడ్చెను. పార్వతమ్మకు మరియు రోగ ముత్కటముగ నుండుటచేత నిరుగుపొరుగువారు ప్రసాదమునకు టెలిగ్రాము నిచ్చిరి. కాని యాతడు రాకమునుపే పార్వతమ్మ పరలోకమున కేగినది. కృష్ణశాస్త్రియే కర్మ నొనర్చెను

కన్నకొడుకుండిగూడ యాతడే కర్మ చేయవలసివచ్చినందుకు చూచువారందరుగూడ చింతనందిరి. పదియవరోజు ప్రసాదము ధర్మపత్నితోగూడ నింటికి వచ్చెను. జరిగినసంగతి తెలిసికొనెను. కారణాంతరములచే సమయమునకు రాజాలనందులకు చింతించుచుంటిననియు తన తల్లికి ఆత్మశాంతి గలుగుగాక యనియు నొక విషాదోపన్యాస మొనర్చెను. కృష్ణశాస్త్రికి కొడుకును, కోడలిని చూచినదిమొదలు దుఃఖమభివృద్ధి చెందెను. శ్రౌతస్మార్తకర్మలకు పుట్టిల్లయియున్న తనయింటిలో నిట్టిదంపతు లుండజూచి సైపజాలక పోయెను. 'ఇచటనుండ నీ వనర్హుడవు; నాయింట వద్దు; లేచిపొమ్ము' అని కొమరునితో కయ్యమాడ మొదలిడెను. ప్రసాదము మండిపడెను. 'లేచిపోవలసినది నేనా? నీవా?' అని మెడ పట్టి గెంటివైచెను. పాపము !

* * * *

ఇపుడు కృష్ణశాస్త్రి గ్రామములవెంట పిచ్చియెత్తి తిరుగుచున్నాడు. అతనికి పిచ్చెత్తినను, స్నానసంధ్యలు పోలేదు. ఎప్పుడును ఈవిధముగ కేకలు వైచుచుండును.

"కావలసినదే-మంచి ప్రాయశ్చిత్తము-కాదూ-కాక ఊరకొనునా?- కులవిద్యల కూలద్రోసి, కానివిద్యల కాశపడితే- ఫల మదియే- జాగ్రత్త- నే నాదర్శకుడను- భగవంతుడా-పాపము పండినది- పిచ్చిమాటలని అలక్ష్యము చేయవద్దు సుమా-జాగ్రత్త-జనులారా!- జాగ్రత్త- పిచ్చి ఆశలకు పోకుడు సుమా!"--

## ప్రాయశ్చిత్తవిపరీతలక్షణ.

విద్యాపత్రికలో మచ్చునకైన నెచటను గొలదిగనే నొకానొకపత్రముగూడ నలిఖితముగ విడిచియుండుట గానరాకున్నను, పైవ్యాసమును వ్రాసి, తదవ్యవహిత మగుపత్రముపై '30' అంకమును లిఖించియు శ్రీజయరామశర్మ దానినెల్ల నలిఖితముగనే యుంచుటచే నది నే డీక్రిందివిధముగ నాచే నీ "ప్రాయశ్చిత్త విపరీత లక్షణ" లిఖింపబడవలసియున్నదని యాతనిగూఢాభిసంధిని సూచించుచుండుటచే రెండుమాటలు లిఖించుచున్నాడ.

ప్రసాదము వైదేశికవిద్యామూలమున సర్వవిధముల పరమార్థభ్రష్టు డగుటచే కృష్ణశాస్త్రి పైవిధముగ పలవరించుచు పరిభ్రమించునట్టిగతి పట్టెను. కావున నన్య విద్యల కాసింపరాదనిగదా మనజయరామమూర్తిభావము? తాను యథావిధి వైదిక విద్య నభ్యసించియు నకాలమృత్యువువాత బడుటచే పితృపుత్రన్యాయవైపరీత్యమున తనపిత్రాదులకుమాత్ర మట్టిగతి పట్టలేదా? యనియు, యత్కించిద్ధర్మాభిమానము గలవారేని మున్ముందు తమపుత్రాదుల నిట్టిధార్మికవైదికవిద్యలో బ్రవేశ పెట్టుటకుగూడ తనచరిత్ర భయహేతువు కాలేదా? యనియు కొందఱు సంశయింప వచ్చును కాని, అది పొరపాటు.

కృష్ణశాస్త్రివలె నకార్యకరణముచే నేను పశ్చాత్తప్తుడ నగుటయు లేదు; పరిభ్రమించుటయు లేదు. ఇక "అనభ్యాసా చ్చ వేదానా మాచారస్య చ వర్జనాత్ । ఆలస్యా దన్నదోషా చ్చ మృత్యు ర్విప్రాన్ జిఘాంసతి" అనెడిసూక్తికి జయరామశర్మ లక్ష్యభూతు డగుటయు లేదు; ఏతన్నిమిత్తముగ నత డల్పాయు వైనదియు లేదు. ద్వాదశవర్షపరిమితజాతకుడయ్యు యథావిధి వేదవేదాంగాద్యధ్యయనపూర్వకసద్గురుసేవాభాగ్యమున ద్వావింశతివర్షపర్యంత మద్యతనకాలాపేక్షితాత్యావశ్యకధర్మజాతముల కెల్ల నధీతిబోధాచరణప్రచారణములచే నాదర్శజీవనుడై వెలింగి యఖండాత్మవిజ్ఞానముచే శ్రీసద్గురురూపుడై కృతకృత్యు డయ్యె. "అద్య వర్షశతాంతే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువమ్." దేహాత్మభావులకు నేడో, నూఱేండ్లకో మృత్యువు తప్పదు. కాని "ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి" "అథ మర్త్యోఽమృతో భవతి." దేహాత్మభ్రాంతియే మృత్యువు; తద్రహిత, తదధిష్ఠానాఖండదృగాత్మభావమే యమృతత్వము; గావున నట్టియఖండచిదానందామృతస్థితి నొందినయాతనికి మృత్యుశంకయే లేనపు డకాలమృత్యు వెక్కడిది? ఔపాధికదృష్టిలో విచారించినను "మా జీవ మునిపుత్రక" "ప్రేత్యానంతసుఖాయ చ" — ఆతడు కృతకృత్యుడే. శతాయుష్కులు, మూర్ఖులు నగుపుత్రు లనేకులకంటె నల్పాయుష్కుడైనను సర్వజ్ఞు డగుపుత్రు డొక్కడే చాలునని శివగురువు గోరినట్లును, "కులం పవిత్రం, జననీ కృతార్థా" యని శ్రీవిద్యారణ్యులు చెప్పినట్లును, పిత్రాదులెల్ల నాతనిచే సద్గతినే చెందిరి. దుర్గతిశంక కవకాశమే లేదు. మఱియు, నస్మద్బంధుమిత్రాదులలో నత్యంతసాధుస్వభావులుగ పేర్కొనబడినట్టి యస్మత్పితృచరణు లగు రామశాస్త్రులుగారు నా బాల్యముననే స్వర్గతు లగుటలో తటస్థించినమత్కర్తవ్యసంస్కారలోపమును స్వీయ విజ్ఞానపరాకాష్ఠాశేషమును పూర్తిచేసికొనుటకే తమస్వర్గమనదివసమగు చైత్ర శు ౧౨ దివసముననే యథోక్తసద్గుణసంపత్తితో శ్రీజయరామరూపముగ నవతరించి, పైలోపముల దీర్చియుండిరని యొకమహాత్ముడు చెప్పిన ట్లిచట పితృపుత్రన్యాయవైపరీత్యము గూడ గానరాదు. ఇదిగాక, ద్వాదశైకాదశస్థానస్థితికేతుజాతకుల మగుమాకు పైని [illegible]ోక్తరీతిగ శ్రీసద్గుర్వనుగ్రహమున కృతకృత్యతయేగాని సంశయలేశావకాశము గూడ గానరాదు.

కావున నోధార్మికమహాశయులారా! జయరామాగ్రహారవాసులగురుజనాదివృద్ధానుగ్రహములతో మీపుత్రులను విద్యారూపమను లౌకికవిద్యలపాలు సేయక, యథావిధి వైదిక విద్యల గరపి కృతకృత్యులు కాఁగోరెద ననుచునే, దేశ నియముల ప్రాధాన్యముఁ దెలుపుచు పదేపదే పిచ్చివానివలె కేకలు సేయుచుంటిని. సుధార్మికసజ్జనులారా! ఇవి పిచ్చిమాటలే యని తలచుచున్నారా? కాదు, కాదు— మఱియొక్కమాట, నిఖిలనిగమసారాత్మక శ్రీజయరామవిద్యావిలాసమును గమనించి గ్రహించి, సద్గతి నొందుఁడు. నాస్తితి కృష్ణశాస్త్రికి గలిగిన ప్రాయశ్చిత్తము గాదు; ప్రాయశ్చిత్తవిపరీతలక్షణ యగును జుడీ.



## — 13. ఇదానీంతనకాలే ధర్మపద్ధతిః కథం రక్షణీయా? —

[ఆంధ్రప్రభ] నె 2/17 వ సంచికలో (13–7–37) 16 సం॥ వయస్సుగల బాపట్ల సంస్కృత విద్యాలయ విద్యార్థి పరీక్షలయందు ము. శ్రీ. రా. శర్మచే వ్రాయబడినది.

ఏతదేవ హీదానీ మాస్తికజనహృదయాని సంశయాన్దోలితాని కరోతి—

ఇదానీంతనకాలే హి సర్వేపి జనాః ప్రాయశోఽతిక్రాన్తవేదశాస్త్రమర్యాదాః వర్ణాశ్రమాచారవిరహితాశ్చ వర్తన్తే. కరాళేఽస్మిన్ కలికాలే కథం సంరక్షణీయా సనాతనవర్ణాశ్రమధర్మపద్ధతిరిత్యస్మాభి రవశ్యం విచారణీయం. ప్రాయశః కారణస్యాభావే కార్యస్యాభావ; స్తత్సత్త్వే తత్సత్త్వం చ భవతి. యథాఽగ్నిం వినా ధూమో నభవతి, తత్సత్త్వే ఏవ భవతి. తస్మా దిదానీం తద్ధర్మవ్యత్యయస్య కో హేతురితి విచారే తదనంతరం తత్ప్రతిఘటనేన హి సిద్ధ్యేద్ధర్మపద్ధతిః.

అత ఏత ద్విచార్యతే. ఏతత్కాలిక ధర్మవ్యత్యయస్య భారతీయానా మాంగ్లభాషాభ్యసనం, తదనుకరణమేవ హేతురితి దృశ్యతే. కథమితిచేత్. తదాంగ్లవిద్యావిధాన మాస్తికతా నాశకం వర్తతే. ప్రాయశో బాల్యే య ద్విశ్వసిత మస్మాభిస్తదేవ సర్వదాపి మనసి

దృఢతరం వర్తేత. తస్మా ద్బాల్యే వయస్యేవ తాదృశనాస్తికవిద్యాప్రబోధా త్సర్వేపి తథైవ నాస్తికా భవిష్యంతి.

అస్మదీయానాం భారతీయానాం దేవః, అస్మచ్ఛాస్త్రరీత్యా, భగవా నఘటనాఘటనసమర్థ ఇతి; అచిన్త్యరచనాదక్ష ఇతి; తదాజ్ఞారూపో వేదో ఽపౌరుషేయోఽనాదిసిద్ధ స్స్వతఃప్రమాణభూతో యస్మా త్తస్మా దస్మాభిః ప్రమాణమూర్ధన్యత్వేన స్వీకర్తవ్య ఇతి, తదుక్తాతిక్రమణే మహాపాపం భవతీతి చ విశ్వాసోఽస్తి. ఇదానీంతనాంగ్లవిద్యాభ్యాసినాం తు తాదృశవిశ్వాసో నాస్తి; తాదృశవిశ్వాసరాహిత్యే తద్విద్యాయా ఆస్తికత్వనాశకత్వమేవ హేతుత్వేన గృహ్యతే.

తత ఏవేదానీం సనాతనధర్మవ్యత్యయో జాతః. తస్మా త్తత్ప్రతిఘటనం కర్తవ్యమ్. కారణభూతస్య తదాంగ్లవిద్యాప్రచారస్య ప్రతిఘటనేసతి తత్కార్యభూతస్య వర్ణాశ్రమాచారవిప్లవస్య నాశో భవేత్.

తత స్తత్ప్రతిఘటనమేవ కథం కర్తవ్య మిత్యత్రైవాస్మాభి స్సూక్ష్మబుద్ధ్యా విచారః కార్యః. యదా వేదశాస్త్రాధ్యేతారో బహుళసంఖ్యాకా వర్తేరన్ తదైవాంగ్లవిద్యాభ్యాసినోఽల్పసంఖ్యాకాస్స్యుః. ఇదానీం కియత్సంఖ్యాకా ఆంగ్లవిద్యాభ్యాసిన స్సన్తి; కియత్సంఖ్యాకా వేదశాస్త్రాధ్యేతార స్సన్తీతి విచారితే సతి, వేదశాస్త్రాధ్యేతృభ్య ఆంగ్లవిద్యావిశారదా (విద్యార్థినశ్చ) సహస్రగుణితా వర్తన్తే. తస్మా దిదానీ మస్మాభి ర్వేదశాస్త్రాధ్యేతౄణాం వృద్ధ్యై ప్రయత్నః కార్యః.

ఇదానీం సనాతనధర్మో నాన్యై రుపాయై స్సంరక్షణీయః. తస్మా దాస్తికై ర్గృహస్థై స్సర్వైర ప్యేవం కర్తవ్యమ్-స్వపుత్రాణాం నాంగ్లవిద్యాఽధ్యాపితవ్యా; ప్రయాసేనాపి వేదశాస్త్రాణ్యేవాధ్యాపితవ్యాని. స్వపుత్రవిద్యార్థం గురవః పణ్డితా యథాశక్తి సమభ్యర్చనీయాః, కుత ఇతిచే త్తే యది కేవలం స్వోదరపోషణప్రయత్నతత్పరా స్సర్వదా నహి ఛాత్రా విద్యాగ్రహణసమర్థా స్స్యుః. తల్లోకకల్యాణస్య భఞ్జకరం భవేత్. తస్మా త్పణ్డితా యథాశక్తి సమ్మాననీయా మర్హా న్యాస్తికాః.

పణ్డితై స్త్వేవం కర్తవ్యమ్—స్వవిద్యాం ఛాత్రేభ్యో దాతుమేవ సంపాదితాం మత్వా స్వకుటుమ్బపోషణే కేవల మదత్తచిత్తైః కథమపి ప్రపఞ్చే వేదశాస్త్రాధ్యేతౄ నధికసంఖ్యాకా న్కర్తు ముత్సుకై స్స్వశక్తిసర్వస్వేనాపి యతితవ్యమ్.

ఇదానీన్తనై రాస్తికై ర్లౌకికై రేవం కర్తవ్యమ్, సర్వదాపి రాజకీయశాసనై స్సనాతనధర్మస్య, తద్ధర్మానుయాయినాంచ యథా బాధా న భవే త్తథా కర్తుం రాజకీయపురుషై స్సంభాషణాదికం కృత్వా, కథమపి స్వశక్తిసర్వస్వ ముపయుజ్య తథాకర్తుం ప్రయతితవ్యమ్.

అన్యై రాస్తికజనై రేవంకర్తవ్యమ్. 'స్వధర్మే నిధనం శ్రేయః' "శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్" "న జాతు కామా న్న భయా న్న లోభా ద్ధర్మం జహ్యా జ్జీవితస్యాపి హేతోః" ఏవం మనసి నిధాయ స్వకులధర్మమేవ అనుసరన్తః అన్యధర్మప్రవేశ మకుర్వన్తః స్వస్వకులోచితధర్మేష్వేవ ప్రవర్తితవ్యమ్.

ఇత్థం గృహస్థా స్స్వపుత్రాణాం వేదశాస్త్రాధ్యయనోత్సుకాః, పణ్డితా స్స్వశిష్యాణాం సుతనిర్విశేషం విద్యాప్రదానోత్సుకాః ఛాత్రా అపి గురుభక్త్యా పారమార్థికవిద్యాగ్రహణేఽత్యన్తోత్సుకా భవిష్యన్తి చే త్తదా కతిపయై ర్వేదవిద్యాభ్యాసకానా మధికసంఖ్యతా భవిష్యతి.

ఏవం లౌకికా స్సర్వేపి రాజకీయప్రతిబంధనిరోధే యత్నం కుర్వన్తిచే త్తదాత్యన్తం నిరాటంకతయా స్వస్వధర్మానుష్ఠానం కర్తుం శక్యం భవతి. ఇతరజనా స్సర్వే ప్యన్యధర్మస్వీకార మకుర్వన్త స్స్వధర్మేష్వేవ ప్రచరన్తిచే త్తదా సర్వం స్వస్థం భవేత్.

ఏష ఏవోపాయ ఇదానీంతనకాలికధర్మపద్ధతే స్సంరక్షణే దక్షో భవతి. తస్మా త్సర్వైరప్యేవ మేవ కర్తవ్యమితి ముహు ర్ముహు రభ్యర్థయే.



—♦ 14. విద్యా స్వరూపము. ♦—

[నె 5 వ ఫైలులో ము. జ. రా. శర్మచే లిఖితమై యున్నది. లిపినిబట్టి చాల బాల్యమున లిఖితమని తెలియుచున్నది. లేఖనకాలము సరిగా నిర్ణయము కాలేదు.]

విద్య యనగా భగవంతుని దెలుపునది యని యర్థము.
"విద్య యొసఁగును వినయంబు, వినయమునను
బడయుఁ బాత్రత, పాత్రతవలన ధనము,
ధనమువలనను ధర్మంబు, దానివలన
నైహికాముష్మికసుఖంబు లందు నరుఁడు."

అనగా విద్యచే వినయమును, దాన పాత్రతయు, పాత్రతచే ధనమును దానిచే నైహికాముష్మికసుఖములు నొందదగునని తెలిపెడి పూర్వులసూక్తు లసత్యములు కావు. అయిన నెట్టివిధానముతో నభ్యసింపబడినవిద్యవలన పైనిజెప్పబడినలాభములు గలుగునో అట్టియార్ష విధానముతో నభ్యసించినవిద్య యిపుడు క్షీణించుటచేతనే మనభారత దేశము సమస్తదారిద్ర్యముల కాలవాల మగుచున్నది.

పూర్వులు బాలురకు విద్యతోపాటు భగవద్భక్తికూడ నలవడునట్లు చేసెడివారు. అందుచేతనే వారల కాధ్యాత్మికవిజ్ఞాన మెక్కుడుగ నుండెను. వారిప్రతికృత్యముగూడ ఆముష్మికము నిచ్చునదియై యుండెను. చూడుడు— పూర్వులు బాలుర కక్షరాభ్యాసముతోపాటు భగవద్భక్తి ఆస్తికత మొదలగునవి గలుటగుకొఱకు పంచాక్షరీమంత్రమును "ఓం నమః శివాయ సిద్ధం నమః" యనెడిరీతిని జెప్పెడివారు. రానురా నార్షమతవిజ్ఞానరహితు లగువార లాధునికు లగుటచే నందలి రహస్య మెఱుగమి, అ-ఆ-మొదలుగానో, ఏ-బి-సి-మొదలుగానో బాలురకు నేర్ప మొదలిడిరి.

పూర్వవిద్యార్థు లుపనీతు లయినతర్వాత గురుకులమందు వేద శాస్త్రాదులను, భగవదాస్తికత నుద్బోధించునితరగ్రంథములను ఆర్ష

మతరహస్యముల నెఱిగినగురువులసన్నిధిని చదివెడివారు. ఇపుడో యేహైస్కూలునందో యేకాలేజియందో సనాతనమతధర్మముల నెఱుగనివారును, పాశ్చాత్యనాగరకతావ్యామోహితులు నగుగురువులయొద్ద నాస్తికమతప్రచారకములును, వేదాప్రామాణ్యసూచకములును, హిందూమతనాశకములు నగు (హిస్టరి) హిందూదేశచరిత్ర మొదలగునవి పాశ్చాత్యనాగరకతానుకరణముతో చదువుచుండుట తటస్థమైనది. ఇక పరిశీలింపుడు - ఈవిధానప్రకార మభ్యసించునది విద్య యని యెట్లు చెప్పదగును? భగవానునివిషయము తెలుపని చదువు విద్య యనబడునా? అట్టిది చెప్పువారు గురువు లగుదురా? అట్టిచదువు తమబిడ్డలకు నేర్పించెడివారు తండ్రు లనదగుదురా?

"...చక్రహస్తునిఁ బ్రకటించుచదువు చదువు,
కుంభినీధవుఁ జెప్పెడిగురుఁడు గురుఁడు,
తండ్రి! హరిఁ జేరు మనియెడితండ్రి తండ్రి."

అనెడిప్రహ్లాదునివాక్యములను చూడుడు.

కాన నోభారతదేశసౌభాగ్యకాము లగుమహాశయులారా! మీమీబాలురకు భగవద్భక్తి, హిందూమతౌన్నత్యము, ఆర్షమత ప్రాశస్త్యము మొదలగునవి దెలుపనియవిద్యారూపకము లగుచదువుల జెప్పింపక, ఆర్షవిధానములతో ఆర్షము లగు వేదశాస్త్రాదుల నేర్పించి వారిని బాగుచేసికొనుడు.



## —♦ 15. సంస్కృతసాహిత్యము. ♦—

(మహాత్మ నారాయణ శాస్త్రిగారి సంస్కృతవ్యాసమున కనువాదము.)

[ఇది 5 వ ఫైలులో ము. జ. రా. శర్మచే లిఖితమై యున్నది. లేఖనకాలము స్ఫుటము కాలేదు. ఈయనువాదమునకు మూల మగుసంస్కృత వ్యాసముగూడ గనుపడలేదు. కాని లిపినిబట్టి 17-18 సం. వయస్సులో లిఖితమని తోచుచున్నది.]

సంస్కృతములోని ప్రాచీనగ్రంథములు చాల నశించిపోయినవి. ఆరునెలలవరకు తగులబెట్టబడి వానిచే స్నానవుగదులు సుష్ణమితము లైనవి. ఈఘటనలను స్వల్పవయస్కుఁడగువిద్యార్థిగూడ నెఱుంగును. ఈవిషయము నెరింగియు, కొందరు పాశ్చాత్యవిద్వాంసులు వారల ననుకరించుమనవారును తిరస్కారదృష్టితో నిట్లు పలుకుచున్నారు. "సంస్కృతవిద్వాంసులు చరిత్రలను వ్రాయుట నెరుగరు. ప్రజాపరిపాలనాతంత్రము నెరుగరు. అర్థశాస్త్రము నెఱుంగరు" అని._కాని యీమహానుభావులు నశించిపోగా మిగిలినసంస్కృతసాహిత్యమును తెరచిచూచుటకైన యత్నింపలేదు. అందే యేవిషయములు లభింపగల వనువిషయము నెఱుంగుటకైన యత్నింపలేదు. మేమిచట వేదములో వర్ణింపబడినప్రజాతంత్రశాసనవ్యవస్థవిషయమునుగాని కౌటిల్యునియర్థశాస్త్ర, రాజతరంగిణీ, విషయములనుగాని కాశ్మీరదేశమున నున్న ప్రసిద్ధసంస్కృతచరిత్రసంగతినిగాని దెలుప నుంకించుటలేదు. అయ్యవి యిదివరకే పాఠకలోకమునకు ముందుగ కనుపడుచునే యున్నవి. ఇక నేమన నిదివరకు ప్రకాశమునకు రానిగ్రంథములే లెక్కింపవలెను ఇంతదనుక నట్టియప్రకాశిత గ్రంథములవిషయసూచిక బైటికి వచ్చి యుండలేదు. అట్టిగ్రంథములనుగూర్చి యేదియో కొలదిగా దెలిసిన వివరణము నిచట నొసంగుచున్నాను. షుమారు పాతిక యేండ్లక్రింద దొరకినగ్రంథములసంఖ్య ననుసరించి హస్తలిఖితపుస్తకములపట్టిక, క్రింద నీయబడుచున్నది.

(1) బెర్లిననగరపుబృహత్పుస్తకాలయమున నలువదినాలుగు వేలు. లండనులోనిండియాకార్యాలయములో నిరువదివేలు. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయగ్రంథాలయములో పండ్రెండువేలు - లండనులోని అద్భుత మందిరములో నొక లక్షకంటె నెక్కుడు. మద్రాస్ రాజకీయ గ్రంథాలయములో ముప్పదివేలు. పూనాపట్టణములోని భాండార్కర్ పుస్తకాలయములో నిరువదిమూడువేలు. మద్రపురపు అడయార్‌స్థానీయగ్రంథాలయములో నిరువదిమూడువేలు. కలకత్తాలోని "ఏష్యాటిక్ సొసైటీ" గ్రంథాలయములో పదునైదువేలు. బరో

డానగర రాజకీయగ్రంథాలయములో పదునైదు వేలు. శ్రీసంస్కృత పత్రికాసంపాదకునియింటగూడ షుమారు రెండు వేలు లిఖితసంస్కృత గ్రంథములు గలవు. ఇట్లే తంజావూరు, మైసూరు, తిరవాన్కూరు బికనీర్, జయపురము, కాశ్మీరము మొదలగు చోట్ల నుండు గ్రంథాలయములలో సైతము వేలకొలదిగ్రంథములు గలవు. వానిసరియగు లెక్క తెలియనందున చెప్పబడలేదు—

(౭) పత్థర్ ఘాటీ (నైజాం) స్థానమున నుండుడాక్టరు సైయ్యద్ మహమద్ ఖాశీం సాహెబ్ గారియింట నొకప్రాచీనగ్రంథాలయము గలదు. అచట వేలకొలదిగా సంస్కృతలిఖితగ్రంథములు గలవు. వానిలో చాలతాటియాకులలో వ్రాయబడియున్నవి. అందు కొన్నింటిలోనివిషయములనిచట సూచించుచున్నాను. (౧) ఒకగ్రంథములో మనుజునిమృతకళేబరమును వేలకొలదివర్షములు నిలిపియుంచుటకు మందు చెప్పబడినది. (౨) ...... (౩) ...... (౪) భూగర్భమునకు సంబంధించిన విషయము (౫) నీటిలో నున్న వస్తువుల జూచుట కనువగునద్దమును జేయువిధి (౬) మంచును కురిపించుపద్ధతి. (ఈపద్ధతితో నెండకాలమున మంచును గురిపించుట, హేమంతములో కురవకుండ నాపుట కాగలదు) (౭) కొండలను నేలమట్టము చేయువిధానము (౮) పల్లమునుండి కొండలపైకి నీరు పంపు పద్ధతి. (౯) రత్నముల గరగించి తన కిష్టమగునాకృతి నొందించు పద్ధతి. (౧౦) లోహములు గరగించుపద్ధతి (౧౧) చాలకాలమువరకు నీటియందు వేడిని నిలువయుంచుట (౧౨) వేయేండ్లదనుక మనుజుని ఆయుష్యము వృద్ధినొందించుట (౧౩) చిరకాల మన్నము చెడిపోకుండ రక్షించుట (౧౪) ఆరు నెలలవర కన్నపానములు లేకపోయినను జబ్బు చేయకుండు పద్ధతి. వంగదేశపు సుప్రసిద్ధపండితు డగు రాజా రాజేంద్రలాల్ మిత్ర యనువారిచే సంస్కృతలిఖితపుస్తకముల అవతారిక లింగ్లీషుభాషలో ముద్రింపించబడినవి. ఆగ్రంథము పేరు "నోటిస్ అనాది సంస్కృత మైనుస్క్రిఫ్టీస్". ఈపుస్తకములోని యైదుభాగములు నేను చూచియుంటిని. ఒక్కొకపుస్తకమునుగూర్చి మూడు లేక నాలుగు

పేజీలలో సంక్షిప్తముగ వివరణము గలదు. ఒకపుస్తకములో కట్టెలకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర సంకేతభేదములు వర్ణింపబడియున్నవి. యానవిర్మాణప్రకరణములో నీస్థలములో బ్రాహ్మణకాష్ఠమును, నీస్థలమున క్షత్రియకాష్ఠము నుపయోగించవలె ననెడివిధముగ మాత్రమె సూచింపబడియున్నది-

ఆప్రకాశితపుస్తకసూచిని జూచుటవలన నిట్లు తోచుచున్నది. ఈగ్రంథముల నన్నింటిని వెదకినచో వీనిలో వేలకొలది గ్రంథములు దొరకగలవు. నేటిపండితసమాజముసైతము వీనిపేర్లనైన నెరుంగరు. అందుచే సంస్కృతసాహిత్యములోని లోటుపాటుల వెదకుటకుముందు నీసాహిత్యములో నున్నది లేదని తెలియగోరుచో నేడు చాలకాలము వరకు సంస్కృతసాహిత్యసమాలోచకులు కావలసియున్నారు. ఇందుకు సంస్కృతవిద్యార్థులు గావలెను. అప్పుడేదియో కొంచెము సంస్కృత సాహిత్యజ్ఞానము గలుగగలదు.



## —♦ 16. సంస్కృతభాష – వైదేశికవిద్వాంసులు. ♦—

(శ్రీమాన్ వింధ్యేశ్వరప్రసాదశాస్త్రివ్యాసమున కనువాదము)

"“దివ్యవాణి” విక్రమ-విజయసంచిక (10-10-40 లో 19 సం. వయసున ము. జ. రా. శర్మచే ప్రకటితమైనది."

“ఇద మంధం జగ త్కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే.”

భాష యన మనస్సునందలియభిప్రాయములను వ్యక్తపరచెడి వర్ణాత్మక మగుశబ్దము. ఆభాషయె ఎయ్యదియో దేవతవలె నుత్కృష్ట మగుదివ్యసందర్శన మొసంగును. అందువలన సరస్వతీదేవి యని పిలువబడుచున్నది. ఒకమణిదీపము మనోజ్ఞమును నిరంజనము నగునాలోకనశక్తిచే నింటిలోనివస్తువులనువలె నీదేవి మనోగతము లగుభావముల

నన్నింటిని ప్రకాశింపజేయును. లోకమున సరస్వతీదేవియె లేనిచో నపుడు మానవులుసైతముపశువులవలె మోహామహోదధిలో మునిగియె యుండెడివారు.

ఈప్రపంచమున బహుళము లగుభాషలు ప్రచారమున నున్నను, గీర్వాణభాషయే సర్వభాషలలో పురాతనమనియు నన్నింటికిగూడ మాతృభూతమనియును బక్షపాతరహితు లగుపండితప్రకాండు లందరు నంగీకరించియున్నారు.

మ్యాక్సుముల్లర్ మహోదయుడు తన "సైన్సు ఆఫ్ లాంగ్వేజి' అనెడిగ్రంథమున "ప్రపంచమున నన్నిభాషలలో సంస్కృతభాష సర్వోత్తమము" అని వ్రాసియున్నాడు. మాస్టర్ బోయిసాహెబ్ తన "ఎడింబరో రెవ్యూ" పత్రికలో నిట్లు వ్రాసియున్నాడు. "ఇప్పుడీభూఖండమునం దంతటను సంస్కృతభాషయే సభ్య (వ్యవహార) భాషయై యుండెను. గ్రీక్, లాటిన్, భాషలకన్న దేవభాషయే పరిపూర్ణము, బహుపదభూయిష్ఠమును, సమధికభావప్రకాశకమును, సుందరములు, పుష్కలము లగునవయవములచే నిండినది యనువిషయమున సంశయలేశమును లేదు." మరియు, జర్మనీవాసి యగు స్లేజేల్ మహోదయుడు"హిస్టరిఆఫ్ లిటరేచర్"అనుతనగ్రంథమున "పరిపూర్ణమును విశుద్ధము నగుటచే నద్దానికి సంస్కృత మనుపేరు కలిగినది" అని స్వీకరించిరయున్నాడు. మాస్టర్ టైలర్ మహోదయుడుసైతము, 'ది జర్నల్ ఆఫ్ రాయల్ ఏష్యాటిక్ సొసైటి" అనుమాసిక పత్రమున నీవిధముగా వ్రాసియున్నాడు, "సర్వవిధముల భావసంపూర్ణము, సర్వోత్తమము నగునీసంస్కృతవాణి భారతీయులసర్వోత్కృష్ట సభ్యతయొక్క పరిచయమును కలుగజేయునదియై యున్నది. ఈభాషలో నట్టిదర్శనశాస్త్రములు కలవు. వీనిసమీపమున పితాగోరస్ ప్లేటో మొదలగుదార్శనికపండితులయుద్గ్రంథములు సాధారణములుగా గనుపించగలవు" ఇంకనుమాస్టర్ హిరేన్ మహాశయుడు 'హిస్టారికల్ రిసర్చెస్" అనుతనగ్రంథమున నిట్లు తెలిపియున్నాడు. "సంస్కృతమును చదువుటవలన నిట్టిభాష యేదేశమున నుత్పన్నమైనదో అచటిమాన

వులు సభ్యతయొక్క సర్వోత్తమశిఖరము నధిష్ఠించియుండుటలో నిసు మంతయు సందేహము లేదనువిషయము స్పష్టముకాగలదు. పురాతన మగుజండ్ భాషగూడ సంస్కృతసంభవమే." పోకక్ పండితుడుకూడ "గ్రీస్ ఇన్ ఇండియా" అనుతనగ్రంథమున "గ్రీక్ భాష సంస్కృత భాషనుండియేప్రాదుర్భవించినది" అని వ్రాసియున్నాడు. మాననీయు డగు డుబోమహోదయుడు 'బైబిల్ ఇన్ ఇండియా' అనుగ్రంథములో యూరపునకు సంబంధించినసమర్థభాషలకు సంస్కృతమె మాతృభాష' యని యంగీకరించియున్నాడు.

భూతపూర్వభారతశాసకు డగువారన్ హేస్టింగ్స్ మహోద యుడు హిందూధర్మశాస్త్రముల ననుసరించి భారతవర్షముయొక్క పరిపాలన మొనర్చుటకై వారాణసీనివాసు లగువిద్వచ్ఛ్రేష్ఠుల రావించి వారిద్వారమున నొక గ్రంథమును రచింపజేసెను. ఆంగ్లభాషలోని కనువదింపబడిన యీగ్రంథమును గనుగొని పాశ్చాత్యపండితు లెల్లరు మిగుల ప్రసన్నత నందిరి.

1794 క్రీస్తుశతాబ్దమున మహాకవి కాళిదాసరచిత మగుశాకుం తలనాటకమున కాంగ్లభాషానువాదము ప్రకటింపబడగా నపు డచటి పండితులహృదయములలో సంస్కృతము స్థానమును సంపాదించు కొనినది. అదిమొదలు యూరోపీయులు దివ్యవాణి నాదరించుచు న్నారు. పరిశ్రమపూర్వకముగ నధ్యయనముగూడనొనర్చుచున్నారు. సంస్కృతమును పఠించుకాలమున పాశ్చాత్యపండితులహృదయము లలో పాణినిమునిప్రణీత మగునష్టాధ్యాయియొక్క ప్రభావము బల ముగా పాదుకొని పోయినది. సంస్కృతసాహిత్యమున ననేకము లగువ్యాకరణగ్రంథములు కలవు; కాని యష్టాధ్యాయిసూత్రపాఠ మన్నింటిని గూడ నతిక్రమించి వెలుగొందుచున్నది. అష్టాధ్యాయి నవలోకించియె పాశ్చాత్యపండితులు స్వభాషల సంస్కరించుకొనిరి. యూరోపీయ భాషావిజ్ఞానాభివృద్ధికి పాణినీయవ్యాకరణము పరమోప కార మొనర్చినదని ప్యారిస్ విశ్వవిద్యాలయ భాషావిజ్ఞాన ప్రధానా ధ్యాపకు డగుమస్యేమహోదయు డీవిధముగా వ్రాయుచు యున్నాడు.

"ప్రపంచమున నున్న భాషలలో సంస్కృతభాషయె సర్వవిధముల పరిపూర్ణమై యున్నది. ఇతరలౌకికభాష లన్నియు సంస్కృతమునుండి యుద్భవించినవియే. ఒకప్పుడు ప్రపంచమున సంస్కృతమేకైకభాషగా నున్నది. పరిపూర్ణభాషలని ప్రసిద్ధివడసిన లాటిన్, గ్రీక్ మొదలగు భాష లన్నియు సంస్కృతభాషద్వారా యసంపూర్ణములుగా నే యున్నవి. పాణినీయవ్యాకరణమువలె పరిపూర్ణ మగువ్యాకరణము లోకమునం దెచ్చటనుగూడ నవలోకింపబడదు. సంస్కృతలిపియే సర్వోత్తమము, సంపూర్ణమునై యున్నది. లౌకికము లగునితరలిపు లన్నియు సంస్కృతలిపినుండియే జనించినవి. సంస్కృతముయొక్క అలంకారశాస్త్రము ప్రపంచమున ననుపమము. ఈమొదలగువిషయములను మాననీయులును మహాధ్యాపకులునగు మ్యాక్సుముల్లర్, ఫ్రెడ్రిక్, సైగల్, సర్జన్ ఉడ్రిఫ్, ఒఫే మొదలగువిద్వాంసులు తమతమ గ్రంథములలో సప్రమాణములుగా నంగీకరించియున్నారు.

రేఖాగణితప్రాకట్యము సర్వప్రథమమున సంస్కృతభాష యందే యుండెనని సర్జన్ ఉడ్రఫ్ మహాశయు డభిప్రాయపడుచు న్నాడు. సంస్కృతమున భాషించెడి ఆర్యులే ప్రప్రథమమున బీజగణితమును కనిపెట్టిరని డాక్టర్ కె. జోరీ మహాశయు డంగీకరించెను. అంకగణితము మున్ముందుగా సంస్కృతముననే ప్రకటమాయెనని డాక్టర్ మార్గన్‌గా రభిప్రాయపడుచున్నారు. సంస్కృతభాషు లగు నార్యులె ఫలితగణితమును, జ్యోతిషమును ప్రకాశింపజేసిరని కోల్ బ్రుక్ మహోదయుడు బహుప్రమాణపురస్సరముగ నిర్ణయించెను. ఇట్లే పదార్థవిజ్ఞానశాస్త్రములనుగూడ మున్ముందుగా నార్యమహర్షులు సంస్కృతభాషలో ప్రకాశింపజేసిరని పలువురు పాశ్చాత్యపండితు లభిప్రాయపడిరి—

పాశ్చాత్యుడగు హిప్పోక్రటీస్ అను పేరుగల భిషగ్వరునిచే చరకాచార్యోక్తము లగువైద్యవిషయము లనువదింపబడినవి. నాస్టిక్ అనుక్రైస్తవమతము సాంఖ్యమతమూలకము. అక్స్ అని లాటిన్ భాష

యందు వ్యవహ్రియమాణము. భారతీయజ్యోతిశ్శాస్త్రప్రసిద్ధ మగు ఉచ్చ అనుపదమును బోధించుచున్నది.

వైదేశిక డగుమాననీయ మైగ్డోనల్ మహాశయు డొకచోట నిట్లు వ్యవహరించుచున్నాడు. "యూరపు దేశములోని మేధాశక్తి యంతయు సంస్కృతభాషకు చాలగొప్పగా ఋణపడియున్నదని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఇక మున్ముందా ఋణము విపరీతముగా పెరుగగల దనియు నమ్ముచున్నాను."

ఎంపిడాక్సల్; తెలస్ మొదలగుపాశ్చాత్యపండితులు తత్వ విజ్ఞానమునకై భారతదేశమునుగూర్చి పయనమైరని గ్రీస్ దేశీయు లగు వృద్ధులు తెల్పుచున్నారు. సర్ విలియం జాన్స్, హెన్రీ తామస్, కోల్‌బ్రూక్, అలగ్జాండర్ హామిల్‌టన్ ప్రభృతు లగుపండితు లిరువదివర్షములు భారతవర్షమున వాసమొనర్చి సంస్కృతాధ్యయన మొనర్చి స్వజన్మసాఫల్యము నొందిరి. ప్యారిస్‌నగరమున జైలులో నుంచబడినహామిల్‌టన్ నామకు డగువిద్వాంసుడు ఖైదీగా నుండియే అనేకు లగుపాశ్చాత్యపండితులకు సంస్కృతమును నేర్పెను.

షాజహాన్ అనురాజుయొక్క కుమారు డగుదారాశికోనామకుడు సంస్కృతసాహిత్యవిషయమున పరమప్రేమయి యని తెలియుచున్నది. అతనియాజ్ఞవలననె పారశీకభాషలోనికి ఉపనిషత్తు లనువదింపబడినవి. 19 శతాబ్దముయొక్క ప్రారంభకాలమున పారశీకభాషలోని కనువదింపబడిన ఉపనిషత్తులపుస్తక మొకటి ఫ్రెంచిదేశ ప్రధానపట్టణ మగుప్యారిస్‌నగరమునకు చేరినది. అచటనుండి డ్రాపరోనామకు డగుపండితు డొక డవ్వానిని లాటిన్‌భాషలోని కనువదించెను. ఉపనిషత్తులప్రభావమున నీతడు విలాసిని యగుజీవనసహచారిణిని పరిత్యజించి భోగవిలాసకేంద్ర మనదగుప్యారిస్‌లోనైతము భారతీయసన్న్యాసివలె వర్తించెను.

కాన భారతీయులు తమమాతృభాషనే సేవించి మహోన్నతాభ్యుదయనిశ్శ్రేయసపదముల నందుదురుగాత!





శ్రీసద్గురు శ్శరణమ్.

# శ్రీ జయరామ విద్యా విలాసము

( ప్రథమ భాగము. )

## ౮. వివిధవిమర్శములు

---

### —♦ 1. జగన్మిథ్యాత్వము. ♦—

[తనకౌముద్యుత్తరార్ధ పుస్తకపుటలో పెన్సిలుతో ము. జయరామ శర్మ లిఖించియుంచెను. శ్రీగురుకులాశ్రమవ్యాకరణాధ్యాపకులకు వినిపించెనట. కాని, 15-5-43 'కల్పవల్లి' విమర్శము గావున 22 సం. వయస్సులో వ్రాయబడినదే.]

"బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా ! జీవో బ్రహ్మైవ నాపరః" అనునది శాంకరాద్వైతసిద్ధాన్తపరాకాష్ఠ యనునది యాబాలగోప విదితము. పైసిద్ధాంతములోని ఏయంశమునైన వేదాంతసమ్మతమె గా దనుమతాంతరీయులు కొందరు కలరెగాని, శాంకరమతసమ్మతము గా దనువారుమాత్ర మిదివరలో గానుపించరు. కాని, "కల్పవల్లి" (1-5-43, 15-5-43) సంపాదకీయములవలన నిట్టివారు పండితులే కొందరు గలరని తెలిసికొంటిని— వారియభిప్రాయ మేమన, శాంకర మతములోసైతము స్వప్నమువలె జగత్తు మిథ్యగాదట (మరియెట్టిదో తెలుపలేదు). అందులకు కొన్ని భాష్యపఙ్క్తులను స్వవాదాధారము లుగ నుదాహరించిరి. నిజమునకు చక్కగ విచారించినచో నయ్యవి

వారి కనుకూలములు కావని తేలగలదు- కాని, యీవిచార మం తయు నొనర్చినచో నొకచిన్న గ్రంథ మగును. కాన ప్రకృత మావి చార మటుంచి, జగత్తువిషయములో శాంకరమతమును దెలుపుటకు గాను శ్రీశంకరకృతప్రకరణములలోని శ్లోకముల కొన్నింటిని స్థాలీ పులాకన్యాయముగ నిట నుదాహరించుచున్నాను- పాఠకు లీవచనము లచే శాంకరమతములో జగత్తు మిథ్యయె యని యెరుంగగలరు- ఒకగ్రంథకర్త యితరులగ్రంథములకు వ్యాఖ్యానము చేయుసమయ ములోకన్న తనస్వతంత్రగ్రంథములో తనమతమును నిరాఘాటముగ వెల్లడించుచుండుట లోకసిద్ధవిషయము. కావున శ్రీశంకరునియభిప్రా యము స్వతంత్రకృతులలో విస్పష్టముగ దెలియవచ్చునని యిచట ప్రకరణవచనములనె యుదాహరించుచున్నాను. పాఠకులు పరిశీ లింతురుగాత-

"యథైవ వ్యోమ్ని నీలత్వం । యథా నీరం మరుస్థలే
పురుషత్వం యథా స్థాణౌ । తద్వ ద్విశ్వం చిదాత్మని"
1) అపరోక్షానుభూతి

"కి మిదం? కి మస్య రూపం?
కథ మేత దభూ, దముష్య కో హేతుః ?
ఇతి న కదాపి విచిన్త్యం
చిన్త్యం మాయేతి ధీమతా విశ్వమ్."
2 స్వాత్మనిరూపణమ్

"వస్తు తావ త్పరం బ్రహ్మ । సత్యజ్ఞానాదిలక్షణమ్
ఇద మారోపితం యత్ర । భాతి ఖే నీలతాదివత్."
3 సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము

"సర్పాదౌ రజ్జుసత్తేవ । బ్రహ్మసత్తైవ కేవలమ్
ప్రపంచాధారరూపేణ । వర్తతే త జ్జగ న్నహి."
4) స్వాత్మప్రకాశిక

"బ్రహ్మై వాహ, మిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం
సర్వం చైత దవిద్యయా త్రిగుణయాఽశేషం మయా కల్పితమ్"
5 మనీషాపంచకమ్

"ఆభా తీదం విశ్వ మాత్మ న్యసత్యం,
సత్యజ్ఞానానందరూపే విమోహాత్ ।
నిద్రా మోహా త్స్వప్నవ త్త న్న సత్యం,
శుద్ధః పూర్ణో నిత్య ఏక శ్శివో౽హమ్."

(6) అద్వైతపంచరత్నమ్

"అధ్యస్తో రజ్జుసర్పో౽యం । సత్యేవ రజ్జుసత్తయా
తథా జగ దిదం భాతి । సత్యేవ త్వాత్మసత్తయా"

(7) అద్వైతానుభూతి

"యదజ్ఞానతో భాతి విశ్వం సమస్తం,
వినష్టం చ సద్యో యదాత్మప్రబోధే।
మనోవాగతీతం విశుద్ధం విముక్తం,
పరం బ్రహ్మ సత్యం తదే వాహ మస్మి."

(8) స్వరూపానుసంధానాష్టకమ్

"స్వాప్నద్వైతవదేవ జాగ్రతమపి ద్వైతం మనోమాత్రికం
మిథ్యేత్యేవ విహాయ సచ్చిదమలస్వాంతైకరూపోస్మ్యహమ్"

(9) ప్రౌఢానుభూతి

"మయి సుఖబోధపయోధౌ।మహతి బ్రహ్మాండబుద్బుదసహస్రమ్
మాయామయేన మరుతా । భూత్వాభూత్వా పునః స్తిరోధత్తే"

(10) స్వాత్మనిరూపణమ్

'చూడ మీశంకరుడు ప్రచ్ఛన్నబౌద్ధుడు, శూన్యవాది, మాయావాది' అని మతాంతరులు గావించు నాక్షేపములకు తగు సమాధానముల జెప్పుటకు సరిగా విషయములు స్ఫురించనిపండితు లెవరో ఏమియు తోచక "మాశంకరుడుగూడ జగన్మిథ్యాత్వమును చెప్పలేదు" అని తప్పుకొనుటకు సృష్టించిననూతనవాదముగా పైవం శితులవాదము గనుపించుచున్నది. భాష్యపంక్తులకు పైవారిసమన్వ యము ప్రామాణికము కాదని నిరూపించుటప్రకృతము గ్రంథవిస్తర భీతిచే విరమించుచున్నాను-పై వాదమువారీవ్యాకరణవచనముల నెట్లు సమన్వయపరతురో దెలియగోరుచున్నాను-

ఈవ్యాసమువలన "అత్ర వేద్యంతు నస్థిరం జాగరే స్థిరమ్" "జాగరితసంస్కారజః ప్రత్యయ స్స్వప్నః" ఇత్యాదిప్రమాణానురూపమును, జనసామాన్యసాధారణము నగువ్యావహారికజాగ్రత్స్వప్నవిభేద మీజయరామశర్మకు తెలియదని తలంచుటెట్లు? మరేమనిన "అన్యథా గృహ్ణత స్స్వప్నో నిద్రాతత్త్వ మజానతః" ఇత్యాది మాండూక్యకారికాతద్భాష్యాదులలోఁ దెలుపబడినట్టి యన్యథాగ్రహణాగ్రహణస్వభావమాత్రప్రయుక్తవిశ్వతైజసైక్యానుభూతిలోఁ నాత డారితేరియుండుటచే పైవిమర్శ మట్టితనపారమార్థికదృష్టితో గచించెననియె తెలియనగును. ఇట్టిదృష్టి గలవ్యక్తులగూర్చిదనమునుగురించియే "యే త్వధికారిణో బహువిధజ్ఞానకర్మానుష్ఠానసాధితనిరతిశయపరమేశ్వరప్రసాదమహిమ్నా నితాంతనిర్మలాంతఃకరణా స్సంతో జాగరేపి స్వప్నా ద్విశేషం న పశ్యంతి" – ఈవిధముగ దృష్టిసృష్టివాదాత్మకవేదాంతసిద్ధాంతపరాకాష్ఠానుభూతిప్రతిపాదక వేదాంతసిద్ధాంతలేశసంగ్రహవ్యాఖ్యాతృప్రభృతులు వివరించియుండిరి. కాన నీవిమర్శవ్యాసము వాదకుతూహలప్రయుక్తము గాదనియు, నిరతిశయస్వానుభూతిప్రఖ్యాపక మనియు విజ్ఞజనసంవేద్య మగును.

---

## —♦ 2. సంస్కృతము – మృతభాషయా?! ♦—

"విద్యా" పత్రికలో (19-2-39) 17 సం. వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము.

9-1-39 తేదీ దివ్యవాణిప్రతికలోని కురుగంటి సీతారామయ్యగారి "గ్రాన్థికమా? వ్యావహారికమా?" యనువ్యాసము జూచితిని. అందలి "తెలుగు శ్రీవిద్వచ్ఛ్రయనులువారి యభిమానభాష యగు సంస్కృతమువలె గాక జీవద్భాష" యనువాక్యమును గని విస్మయమందితిని.

జీవద్భాష యన నేమి? నేటికిని జీవముతో నున్నదనియే గదా! సంస్కృత మట్టిది కాదా? కానిచో విగతజీవము (అనగా నెచట వెదకినను గానరాక నశించిపోయినది) అనియేనా వీరియభిప్రాయము? నిజము గనుగొనినచో సంస్కృత మీవిధముగ నశించినదా? పాశ్చాత్యవ్యామోహము విజృంభించుచున్నయికాలమున పరస్సహస్రసంఖ్యాకు లగువిద్యార్థు లీభాష నధ్యయన మొనర్చుచునే యుండిరిగదా! నేటికిగూడ ననేకశాస్త్రపారంగతు లగుపండితప్రకాం

డులు వేలకొలదిగ విరాజిల్లుచున్నారుగదా! నేటికిగూడ వేదస్మృతి పురాణేతిహాసాద్యనంతసంస్కృతగ్రంథరాశి కనుపట్టుచున్నది గదా! అట్టిచో నిది మృతభాష యనిపల్కుట యజ్ఞానవిలసితముగాక పోవునా? అయ్యది తనకు కనుబడనంతమాత్రమున నే సూర్యుడు లేదని పల్కు ఘూకవచనమువలె హాస్యాస్పదము కాదా? ఈవిషయముల శ్రీసీతా రామయ్యగా రెరుగరా? ఎరిగియు నిట్లు వ్రాయుట యాత్మవంచనము, లోకవంచనము కాదా?

లేక-అనేకులు మాటలాడుభాష జీవద్భాష యనియు, అటు గానిచో మృతభాష యనియు వా రందురా? అట్లనుట యుక్తమా? పోనిండు! ఒకవేళ నట్లు తలంచినను నేటికిగూడ సంస్కృతమున మాట లాడనేర్చినవా రనేకులు కలరుగదా! ఈభాషలో ననర్గళముగ నుప న్యసించుపండితు లనేకులు కలరుగదా! అనేకసభలలో సర్వవ్యవహార ములు కేవలసంస్కృతముననే జరుగుచున్నవిగదా! చూడుడు-ఇటీ వల కాశిలో షుమారు పదివేలపండితులతో సమావిష్ట మగుమహా సమ్మేళనమునను, తదనుబంధములుగ యావద్భారతదేశమున ప్రతి వర్షము నడచుచున్నట్టి యఖిలభారతమహాపండిత సభలలోను, ఇంక ననేక పరిషత్తులలోగూడ కేవల సంస్కృతముననే సభ్యులు సంభా షించుచుండుట పలువు రెరింగినదియే కదా!

మఱియొక విషయము గనుడు. రాజకీయభాషతప్ప దీనివలె భారతదేశమునందంతటను సమమగువ్యాప్తిగలమరొకభాషగలదేమో సెలవిండు. తెలుగు, మనదేశమున మాత్రమే వ్యాప్తి గల్గియుండును తక్కినచోట్ల వ్యాప్తియుండదుగదా! సంస్కృత మట్లుగాక యించు మించుగ నన్నిప్రదేశములయందును సమ మగువ్యాప్తి గల్గియున్నది గదా! ఇట్టిచో సంస్కృతము మృతభాష యనజెల్లునా? మనప్రమా దముచే దేవవాణి పూర్వౌన్నత్యము నెడబాయుగాక! అంతమాత్ర మున దానిని నిరసించుట వివేకిలక్షణ మగునా? కాదు. పరమేశ్వర స్వరూపము లగువేదములు నిత్యములు. తత్స్వరూప మగునీభాషయు నిత్యమే యగునుగాని, తక్కుభాషలవలె పుట్టుచు చచ్చుచుండెడిది

కాదు. మిగిలినభాష లన్నియు చెదపురుగులవలె పుట్టుచు గిట్టుచున్నను, ఇయ్యది నశించక శాశ్వతమై యుండును. ఈవిషయ మెరుంగని కొంద రాంగ్లేయులు తన్మానస పుత్రిలు నద్దాని నిరసించినంత మాత్రమున దాని కేమాత్రము లోటు కలుగదనియు, జర్మనీప్రభృత్యన్య దేశస్థులు సైతము గౌరవించుచున్నయిట్టితరుణమున మాది యని గర్వించతగినమనమే, గీర్వాణవాణి నిట్లు దూషించుట తగదనియు, నేతన్నామమే యమరభాష యనియుండ దీనిని మృతభాష యని తలచుట పామరజనలక్షణ మగునుగాని విజ్ఞలక్షణము గాదు గావున నిట్టివ్రాతల నికముందు వ్రాయ వలదనియు శ్రీసీతారామయ్యగారికి విన్నవించుకొనుచు నింతటితో విరమించుచున్నాడ.

---

## 3. వింతపలుకులు.

["విద్యా" పత్రికలో (19-2-39) 17 సం. వయస్సులో ము. జ. రా. శర్మచే లిఖితము.]

ఈమధ్య సిద్ధాన్తిశిరోమణి గుప్తగారొకసభలో మాట్లాడుచు ఋగ్వేదమును రచించినది స్వవంశీయు లగువైశ్యు లనియు, యజుర్వేదమును క్షత్త్రియు లొనర్చి రనియు, సామవేదమును మాత్రమే బ్రాహ్మణు లొనర్చి రనియు, అందుచే ప్రథమవేదకర్త లగుతామే (వైశ్యులే) అగ్రవర్ణు లనియు బ్రాహ్మణులు మూడవవర్ణమువా రనియు నుపన్యసించిరట.

ఈవిషయము వినినప్పుడు మాకు కలిగినయాశ్చర్యమునకు మేర లేదు. ఈవిషయము వీ రెచటనుండి గ్రహించిరి? ఏదైనగ్రంథమునుండి యా? లేక, తమబుద్ధిప్రభావముచేతనే గ్రహించిరా? ఏదేనిగ్రంథము నుండియే యైనచో నాగ్రన్థనామ మెద్ది? అది రచించిన దెవరు? లేక, తమబుద్ధిప్రభావముచేతనే గ్రహించితి మనినచో న ట్లూహించుటకు కారణ మేమి? తగినకారణమును గుప్తగారు చెప్పియుండలేదే! పోనిం

డు; ఒకవేళ స్వజాతిగౌరవమునకై యట్లు చెప్పి రనుకొందమా? అట్లైనచో సామవేదమును బ్రాహ్మణులు రచించిరని చెప్ప వెందు లకు? యజుర్వేదమును రచించిరని చెప్పరాదా? అట్లు చెప్పినచో బ్రాహ్మణులు రెండవవర్గమువా రగుదురనిన భయమేనా? మరేదైన కలదా? తా మేమాత్ర మెరుగనియిట్టివిషయమును తాము కనులార చూచివచ్చినట్లు చెప్పుటకు వీరికి గలస్వకులాభిమానము, బ్రాహ్మణ ద్వేషమే కారణమని తోచుచున్నది. ఆంగ్లేయవాసనావాసితు లగు కొందఱు వేదము లన్నియు బ్రాహ్మణులే రచించిరని వా రొనర్చిన దేశచరిత్రలలో వ్రాసియున్నారు. కాని, అట్టిగౌరవము తమ కబ్బిన దని సంతసించినధార్మికబ్రాహ్మణు లెవరును లేరు. పైపెచ్చు నపౌరు షేయ మగుపవిత్రవేదరాశి కిట్టియప్రతిష్ఠ నంటకట్టినవారల విమర్శిం చుచున్నారు. ఇట్టిస్థితిలో నేదో గౌరవ మబ్బుననునాసతో తగుదునని వేదకర్తృత్వమును నెత్తిన వైచుకొనుశిరోమణిగారిని తలచుకొనిన నవ్వువచ్చుచున్నది.

---

## —♦ 4. హిందూశబ్దము. ♦—

[“కల్పవల్లి” పత్రికలో ‘1-9-41’ 20 సం. వయస్సులో ముద్రితము.]

శ్రీ దీనానాథశాస్త్రిగారు సంస్కృతపత్రిక 7 సంపుటము 16-17 సంచికలలో “హిందూశబ్దప్రాచీనత-వైదికత” అను శీర్షికతో నొక గొప్పవ్యాసమును వ్రాసియున్నారు. అందునుండియే కొన్నివిష యముల నిట నెత్తిచూపుచున్నాను. వీనిని గమనించి హిందూశబ్ద సాధుత్వాసాధుత్వమీమాంసకులు విమర్శింతురుగాత.

కాళికా పురాణమునందు ‘హిందవో వింధ్య మావిశ్య’ అను చోట హిందూశబ్దము లభించుచున్నది. భవిష్యత్పురాణములో ప్రతి సర్గపర్వము 3-5-26 నందు ప్రయోగింపబడిన సప్తసింధు పదములోని సింధుశబ్దమే హిందూశబ్దమునకు మూలభూతము. ఋగ్వేదములో

10-25 - 1-2-34) మొదలగు స్థలములలోను, ఇతరస్థలములలోను నీశబ్దము పలుమారులు కనుపించుచున్నది.

"నేతా సింధూనాం"-ఋగ్వేదము 7-5-2
"సింధుపతీ క్షత్రియా"-ఋగ్వేదము 7-6-3.
"పతి స్సింధూనాం"-ఋగ్వేదము. 6-15-5.
"రాజా సింధూనాం"-ఋగ్వేదము 6-63-33

మొదలగుస్థలములలోని సకారమే హకారముగా మారినది. ధకారము దకార మైనది.

సకారస్థానమున హకారము వచ్చుట కేవలము పారసీ, అరబ్బీ భాషలలోమాత్రమేగాక, వేదమున వ్యాకరణమునగూడ వచ్చును. "సరితః" (నిఘంటు 1_13) అను చోట వేదములో నదు లనెడి యర్థము గన్పించుచున్నది. అట్లే 'హరితః' అను పదమునకుగూడ వేదములో నదియే అర్థముగ జెప్పబడినది.

"హరితో సరహ్య" అథర్వణవేదము 20-30-4 "యం వహంతి హరితః" అథర్వణవేదము 23_2-25. ఇట్టిచోట సరితః, హరితః అనుపదముల కర్థభేదము లేదు. ఇట్లే 'సరస్వతీ' యను పదమునకు 'సిరా' యనుపదమునకు క్రమముగ 'హరస్వతీ' యనియు 'హిరా' యనియు ప్రయోగము గన్పించుచున్నది.

'తం మమర్తుదుచ్ఛునా హరస్వతీ' ఋగ్వేదము 2-23-6.
'ఇమాయారతే శతం హిరాః' అథర్వణవేదము 7-35-2
'అమూర్యాయన్తి యోషితో హిరాలోహితవాససః'(1-17-1)

ఇచట హరస్వతీశబ్దమునకు సరస్వతియని యర్థము. హిరా పదమున కథమని యర్థము. సిరా శబ్దమునకుగూడ నర్థ మిదియే. వ్యాకరణ శాస్త్రములో–

సే ర్హ్వాపి చ్ఛ (3-4-87.)

అనుసూత్రములో–సి–అనునక్షరమునకు –హి–చెప్పబడినది. సకార

హకారములకు మహాప్రాణత్వము, అభ్యంతరప్రయత్నము రెండు సమానములే.

'ఏవహా ఏతి' (7-4-52)

అనుచోట సకారమునకు హకారము కనుపించుచున్నది. సంస్కృతోత్పన్న మగుప్రాకృతభాషయే మూలముగా గల హిందీయందుగూడ "కేసరీ" యనుచోట "కేహరీ" యనుపాఠమున్నది. "కేహరికంధర బహువిశాలా" బాలకాండ 6-5.

మరియు మనజాతి గోభక్తి గల్గినదై యున్నది. గోవును వర్ణించెడి వేదమంత్ర మొకటి ఈవిధముగ గనుపించుచున్నది.

"హిం" కృణ్వతీ వసుపత్నీ వసూనాం వత్స మిచ్ఛన్తీ మన
సాభ్యాగాత్.
"దు" హా మశ్విభ్యాం పయోః ఘ్న్యేయం సావర్ధతాం
మహతే సౌభగాయ.

(ఋగ్వేదము 1-164-27. అ. 6-10-5)

గోవర్ణనపర మగు నీమంత్రముయొక్క పూర్వార్ధము మొదటి యక్షరము-హిం- అని, ఉత్తరార్ధము మొదటియక్షరము-దు- అని. ఈవర్ణములే గోభక్తు లగుమనజాతివారిచే గైకొనబడినవి. అందుచే 'హిందు' వనుపేరు వైదికమని సిద్ధించినది. వేదములో నిట్టిశబ్దములు దొరకుట కష్టముగాదు. గోపథబ్రాహ్మణములో భర్గః అను పదమునకు, 'భాసయతి, రంజయతి, గమయతి మాం లోకా నితి భర్గః'-అని భర్గపదమందలి భకార రకార గకారములకు క్రమముగ భాసన రంజన గమనార్థములు చెప్పబడియున్నవి. మఖ పదమునకు యజ్ఞమని యర్థము. ఛిద్రమును పోగొట్టునది గుటచే నిట్లయినది. ఎట్లన - ఖం - అనగా ఛిద్రము; దానికి మ యనగా ప్రతిషేధకము గనుక - మ ఖ-యని యైనది. "యో యజ్ఞే ఛిద్రం కరిష్యతీతి"

(గోపథబ్రాహ్మణము 2.2.25)

పైపదమునకువలెనే యీ హిందూపదమునకుగూడ మార్గాంతరములో సాధుత్వమును సాధించవచ్చును. ఎట్లనగా;- హినస్తీతి

(హింసించువాడుగాన) హింస్ అనబడును 'హింస్ ధాతువునకు క్విప్ప్రత్యయము సంయోగాంతలోపము) హింసం 'హింసించుస్వభావము గలవానిని' ద్యతి-ఖండయతీతి (ఖండించుచున్నాడుగాన) హిందుః 'ఉణాదయో బహులమ్ (3-3-1' అనుసూత్రము ననుసరించి బాహుళ్యమునందు దు (ప్రత్యయము) ఇట్లీ పదము రూఢ మైనది.

ఈ హిందూశబ్దము శార్ఙ్గధరపద్ధతియందు, మేరుతంత్రమునందు, పారిజాతాపహరణనాటకమునందు గూడ ప్రయోగింపబడియున్నది. ఇట్లీశబ్దము వైదికము ప్రాచీనమునై సిద్ధించినది. ఈపదము ముసల్మానులచే బయలుదేరదీయబడిన దనుమాట కేవలము ప్రమాదమూలకమే.

---

## ♦ 5. ఆయుర్వేదము – సనాతనధర్మము. ♦

సంస్కృతప్రతికలోని శ్రీదీనానాథసారస్వతశాస్త్రిగారి దయానందగ్రంథ విమర్శమున కనువాదము.

"కల్పవల్లి" పత్రికలో 15-5-42; 1-6-42 సం. వయస్సున ముద్రాపితము.

### ☞ సుశ్రుతములో నుత్తరతంత్రము.

ప్రస్తుతము చివరది యగుసుశ్రుతసంహితయొక్క ఉత్తరతంత్రములోని యుద్ధరణములు కొన్ని యిచట పాఠకులయెదుట నెత్తి చూపబడుచున్నవి. ఈయుత్తరతంత్రమున గ్రహములు, భూతములు, పిశాచములు మొదలగువానినిగూర్చి బాగుగ వర్ణింపబడినది. గ్రహభూతపిశాచాదుల సత్త, సామర్థ్యము అను విషయములు సనాతనధర్మమునందలియొకప్రసిద్ధాంగములు. ప్రతిపక్షులిచట విశ్వాసము లేకయున్నారు.

స్వామి దయానందునిచే సత్యార్థప్రకాశిక ద్వితీయ సముల్లాసములో నిట్లు చెప్పబడియున్నది.

" జో జో విద్యాధర్మ విరుద్ధభ్రాన్తిజాలమే గిరానేవాలే వ్యవహార హై, ఉన్కాభీ ఉపదేశకరదే జిన్ సే భూతప్రేతాది మిథ్యావార్తోంకా విశ్వాస నహో...ఔర్ జబ్ ఉస్ శరీరకా దాహ హోచుకా తబ్ ఉస్ కా సానుభూతిహోతా హై.....జితనే ఉత్పన్న హువా, వర్తమానమేం ఆకీనరహేం వే భూతస్థ హోనేసే ఉన్కానామ భూత హై. ఐసా బ్రహ్మసే లేకే ఆజ్ పర్యంతకే విద్వానోంకా సిద్ధాంత హై. పరన్తు జిసకో శంకారూప; భూత, ప్రేత, శాకిని, డాకినీ, ఆది అనేక భ్రమజాల దుఃఖదాయక హువాతే హై"- పేజీ 15-16.

దండిమూర్ఖన్యుడధన్యుడు. ఈ దయానందుని చేతనే సత్యార్థప్రకాశికయొక్క తృతీయసముల్లాసములో 41 పేజీలోను, సంస్కారవిధియొక్క వేదారంభమునందు 113 పేజీలోను, ఋగ్వేదప్రారంభభాష్యభూమికలో గ్రంథప్రామాణ్యాప్రామాణ్యవిషయమునందు 216 పేజీయందును, సుశ్రుతసంహితప్రమాణముగ నంగీకరింపబడినది. అట్టియెడ నా గ్రంథమునందే భూతప్రేతాదుల విషయము స్పష్టముగ దెలుపబడినపుడు స్వామివారికి స్వవచోవ్యాఘాతము సిద్ధించుటలేదా? భూతపదమున కాయనచే వేరర్థము చెప్పబడినది. అందుచే భూత మను యోనివిశేష మంగీకరింపనిచో నాత డిచట దెలియదగిన దొక విషయము గలదు. ఏమన_ ఒకపదము చాల నర్థములు గలదిగ గూడ నగును. ఆతనిచేతనే సత్యార్థప్రకాశికలో 110 పేజీలో నిట్లు తెలుపబడియున్నది. "క్యా ఏక అర్థకే అనేకనామ్ జేర్, ఏక నామకే అనేక అర్థ నహీ హువాకర్తేహై" ఇటులైనచో ఆతడు భూతశబ్దమున కేయర్థము నొనర్చెనో అయ్యది వేరు పదార్థములయందు చరితార్థమైనది. అట్టియెడ నాపదమునకు మరియొకయర్థముగూడ నుండుటచే నాయర్థమువలనను భూత మనుయోనివిశేషముగూడ సిద్ధించినది. అట్లుగాక తాను జెప్పిన యర్థముమాత్రమే భూతపదముచే దెలుపబడు ననుచో నాతనిమతములో పృథివ్యప్తేజోవాయ్వాకాశములకుగూడ భూతపదప్రతిపాద్యత్వము లేకపోవలసివచ్చును. మరియు దయానందస్వామిచేతనే యంగీకరింపబడిన మనుస్మృతియందే "యక్ష

రక్షః పిశాచాశ్చ ......" 1—37 అని భూతాదులయుత్పత్తి చెప్ప బడియున్నది. శ్రీ స్వామివారికి గౌరవనీయము లగుచరక సుశ్రుతసంహితలయందుగూడ నీవిషయము నిండియున్నది. ఇతరగ్రంథములలో గూడ నీవిషయము గలదు. మాచే రచింపబడి రెండువేలకన్న నెక్కుడు పేజీలుగల 'శ్రీసనాతనధర్మాలోక' గ్రంథముయొక్క సప్తమోద్ద్యోతమున 81 మయూఖములో నవియన్నియు నెత్తి చూపబడినవి. అట్టిచో "దేవవిద్వాంసోంకో, జౌర్ అవిద్వాంసోంకో అసుర, పాపియోంకో రాక్షస, అనాచారియోంకో పిశాచ, మానతాహూ" అని సత్యార్థప్రకాశిక 384 పేజీలో 20 వరుసనెంబరునందు కల్పిత మంతవ్యమును ప్రకటించినస్వామి దయానందుడు యథార్థవక్తయెట్లు కాగల్గును!

ఆతని సిద్ధాంత మచటనచట వ్యభిచరించునను విషయము మేము ముందు చూపగలము. పాఠకులు సావధానులై గనుగొందురుగాక. సమయములో నీవర్ణనము మీకనులయెదుట స్వయముగ స్ఫురింప గలదు.

"సిరాభి రభిసంప్రాప్య విగుణోఽభ్యంతరే భృశం
ప్రథమే పటలే దోషో యస్య దృష్టౌ వ్యవస్థితః
అవ్యక్తాని సరూపాణి సర్వాణ్యేవ ప్రపశ్యతి." 7-6
అని మందదృష్టిగల జనులు వర్ణింపబడిరి.

ప్రాప్తే తృతీయం పటలంతు దోషే దివా నపశ్యే న్నిశి వీక్షతేచ
రాత్రౌ, సశీతానుగృహీతదృష్టిః పిత్తాఽల్పభావా దపి తాని పశ్యేత్॥
(7–31)

ఇచట తృతీయపటలమునందు దెలుపబడినదోషము గల్గినచో పగలు మనుజుడు చూడజాలడు; రాత్రియందు మాత్రము చూడ జాలుచున్నాడు – అని సకారణముగ నిరూపింప బడినది.

ధాత్రీమాత్రోః ప్రాక్ప్రదిష్టాపచారా
చ్ఛౌచభ్రష్టా న్మంగళాచారహీనాన్

త్రిస్త్రీ న్స్వాత్ప్రసిద్ధాం న్సర్జితాం స్తాడితాన్వా
పూజాహేతో ర్హిన్స్యరేతే (గ్రహాః) కుమారాన్. (2-7-6

ఇది గ్రహపీడా కారణము.

ఐశ్వర్యస్థా స్తే న శక్యా విశన్తో
దేహం ద్రష్టుం మానుషై ర్విశ్వరూపాః ।
ఆప్తం వాక్యం తత్సమీక్ష్యాభిధాస్యే
లింగాన్యేషాం యాని దేహే భవన్తి॥ 27-7

ఆ గ్రహభూతాదులు దేహమును ప్రవేశించినచో కనబడ వేమి యనుప్రశ్నకు సమాధానమిది. దీనిచే నాప్తవాక్యములయందలి గౌరవము తెలుపబడెను.

త్రస్తాంగ స్స్వపితి సుఖం దివా న రాత్రౌ
విడ్భిన్నం సృజతి చ కాకతుల్యగంధి ।
ఛర్ద్యార్తో హృషితతనూరుహః కుమారః
తృష్ణాతు ర్భవతి చ పూతనాగృహీతః (27-12)

ఇచట పూతన యనురాక్షసిచే గ్రహింపబడినపిల్లల చిహ్నములు దెల్పబడినది.

గృహే పురాణహవిషాఽభ్యజ్య బాలం శుచౌ శుచిః
సర్షపా న్ప్రికిరే త్తేషాం తైలై ర్దీపంచ కారయేత్
సదా సన్నిహితం చాపి జుహుయా ద్ధవ్యవాహనమ్॥ (28-18-19

ఇచట గ్రహగ్రస్తులకు శాంతికై సనాతనధర్మసమ్మత మగుచికిత్స చెప్పబడెను.

నమః స్కందాయ దేవాయ గ్రహాధిపతయే నమః
శిరసా త్వాభివందేహం ప్రతిగృహ్ణీష్వ మే బలిం
నీరుజో నిర్వికారశ్చ శిశుర్మే జాయతాం ద్రుతం॥ 27-21

ఇట గ్రహాధిపతికి నమస్కరించి, బలి నొసంగియు, రోగము శాంతించుటకు ప్రార్థించియు, గ్రహముల సామర్థ్యము ప్రకటింపబడినది.

దీనిచే "క్యా యే గ్రహ) చేతనహై, జో క్రోధితహోకే దుఃఖ, ఔర్ శాంతహోకే సుఖ దేసకేం" సత్యార్థప్రకాశిక ద్వితీయ సముల్లాసము 16 పేజీలో నిట్లు చెప్పినదయానందుడు తా నంగీకరించినగ్రంథమందలి ప్రమాణములచేతనే పరాజితు డైనాడు.

రక్షా మతః ప్రవక్ష్యామి బాలానాం పాపనాశినీం
అహాన్యహాని కర్తవ్యా యా భిషగ్భి రతంద్రితైః॥ 28-10

ఇచ్చట పిల్లలకు రక్ష చెప్పబడినది.

తపసాం తేజసాం చైవ యశసాం వపుషాం తథా
నిధానం యోఽవ్యయో దేవః స తే స్కందః ప్రసీదతు॥ (28-11
గ్రహసేనాపతి ర్దేవో దేవసేనాపతి ర్విభుః
దేవసేనారిపుహరః పాతు త్వాం భగవా న్గుహః॥ 28-12
దేవదేవస్య మహతః పావకస్య చ య స్సుతః
గంగోమాకృత్తికానాం చ స తే శర్మ ప్రయచ్ఛతు॥ (28-13)
రక్తమాల్యాంబర శ్శ్రీమాన్ రక్తచందనభూషితః
రక్తదివ్యవపు ర్దేవః పాతు త్వాం క్రౌంచసూదనః॥ 28-14)

అని సనాతనధర్మసిద్ధాంతానుసారము ప్రార్థన దెలుపబడినది. ఇచట పురాణములందువలెనే కుమారస్వామికి తల్లు లార్గు రనువిషయము స్పష్టముగ గనుపించుచున్నది. ఉపవేదమునందు దెలుపబడుటచే నియ్యది యంతయు సమూలకమని సిద్ధించినది.

పక్వాఽపక్వాని మాంసాని ప్రసన్నా (సురా) రుధిరం పయః
భూతౌదనో నివేద్యశ్చ స్కందాపస్మారిణో వశే॥ (29-7

ఇచట బలిప్రదానము దెల్పబడినది. ఏప్రతిపక్షులు పురాణములయందు మాంసబలులు గనుపించుచుండుటచే భూనభోంతరాళముల నేకమొనర్చుచున్నారో, వార లీయుపవేదముపై చూపును ప్రసరింప జేయరేమి? రెండుస్థలములయందును (ఉపవేద-పురాణములయందు) సమానముగనే యుత్తరము లభించుచుండ వారు పురాణములనుమాత్రమే గర్హించుటలో హేతువేమి? నిజమునకు విచారించినచో నిచట నధికారభేదముచే పరిహార మెఱుంగనగును.

అంతరిక్షచరా దేవీ సర్వాలంకారభూషితా
అధోముఖీ తీక్ష్ణతుండా శకునీ తే ప్రసీదతు। 30-11
దుర్దర్శనా మహాకాయా పింగాక్షీ భైరవస్వరా
లంబోదరీ శంకుకర్ణీ శకునీ తే ప్రసీదతు॥ 30-12

ఇచట ఒక దేవీవిశేషముయొక్క ప్రార్థన గలదు. తాంత్రికగ్రంథములలోఁగూడ నిట్లనేకవిధము లగు దేవీవిశేషముల ప్రార్థనలు గనుపించుచున్నవి. అట్టియెడ నా తాంత్రికప్రార్థనలయెడ ప్రతిపక్షులచే తిరస్కారము జూపబడుట యేల?

శుక్లా స్సుమనసో లాజాః పయ శ్శాల్యోదనం తథా
బలి ర్నివేద్యో గోష్ఠే రేవత్యై ప్రియతాత్మనా॥ 31-8

ఇచట రేవతి యను దేవికై బలినివేదనము గలదు.

మత్స్యోదనం చ కుర్వీత కృశరాపలలం తథా
శరావసంపుటే కృత్వా బలిం శూన్యగృహే హరేత్। 32-8
మలినాంబరసంవీతా మలినా రూక్షమూర్ధజా
శూన్యాగారాశ్రితా దేవీ దారకం పాతు పూతనా॥ 32-10

ఇచట "యాదృశో యక్ష స్తాదృశో బలిః" అనున్యాయము ననుసరించి పూతన యను రాక్షసికి మాంసాదిబలి విధింపబడినది, ఇక్లే-

కరాళా పింగళా ముండా కషాయాంబరవాసినీ
దేవీ బాల మిమం ప్రీతా సంరక్ష త్వన్ధపూతనా। 33-6
జలాశయాలయా దేవీ పాతు త్వాం శీతపూతనా॥ 34-9

ఇట్లనేకవిధము లగుపూతనలవర్ణనము తామసత్వమువలన తదనురూపమగుబలిప్రదానము చెప్పబడినది.

పాయసం సపురోడాశం బల్యర్థ ముపసంహరేత్॥ 35-9
న్యగ్రోధవృక్షేషు...... నివేదయేత్॥ 36-10

ఇచట సాత్త్విక దేవతకు సాత్త్వికబలి చెప్పబడినది.

తతో గ్రహాం స్తానువాచ భగవా న్భగనేత్రహృత్
తిర్యగ్యోనిం మానుషంచ దైవంచ త్రితయం జగత్। 37-13

పరస్పరోపకారేణ వర్తతే ధార్యతేపి చ
దేవా మనుష్యా న్ప్రీణన్తి తైర్యగ్యోనీం స్తథైవచ॥ 37-14
వర్తమానై ర్యథాకాలం శీతవర్షోష్ణమారుతైః
ఇజ్యాంజలినమస్కారజపహోమవ్రతాదిభిః॥ 37-15
నరా స్సమ్యక్ప్రయుక్తాశ్చ ప్రీణన్తి త్రిదివేశ్వరాణ్
భాగధేయం విభక్తం చ శేషం కించి న్న విద్యతే॥ 37-16

ఇచట గ్రహపూజాద్వారమున గ్రహశాంతి, గ్రహశాంతిచే పురుషులకు లాభము చూపబడినది. దేవతలు మనుజుల కుపకారము నొనర్చుచుండుట, అట్లే మనుష్యులు దేవతలపూజన మవశ్యమొనర్చుచుండుట యిచట నుపన్యసింపబడినది. ప్రతిపత్తు లిద్దానిం జూతురుగాక!

తద్యుష్మాకం శుభావృత్తి ర్బాలేష్వేవ భవిష్యతి
కులేషు యేషు నేజ్యన్తే దేవాః పితరఏవచ॥ 3_17
బ్రాహ్మణా స్సాధవశ్చైవ గురవోఽతిథయ స్తథా
నివృత్తాచారశౌచేషు పరపాకోపజీవిషు॥ 37-18
ఉత్పన్నబలిభిక్షేషు భిన్నపాత్రోపభోజిషు
గృహేషు తేషు యే బాలా స్తా న్గృహ్ణీధ్వ మశంకితాః॥ 3-19
తత్ర వో విపులా వృత్తిః పూజాచైవ భవిష్యతి
ఏవం గ్రహా స్సముత్పన్నా బాలా న్గృహ్ణన్తి చావ్యతః॥ 37-20
గ్రహోపసృష్టా బాలాస్తు దుశ్చికిత్స్యతమా మతాః॥ 37-21

ఇచట బాలకులయందును వర్ణింపబడిన యితర పురుషులయందును గ్రహములప్రభావము చూపబడినది. గ్రహగ్రస్తుల చికిత్సయొక్క కాఠిన్యముగూడ చూపబడినది. గ్రహాది పూజాద్వారమున నాయాగ్రహశాంతిగూడ దెలుపబడినది. దీనిచే బ్రాహ్మణులు, సాధువులు, గురువులు, అతిథులు మొదలగువారి పూజనముగూడ నుపదేశింపఁబడినది. మరియు శుచిత్వము లేకుండుట, ఇతరుల వంటలపై నాధారపడియుండుట, బలులు భిక్షలు నొసంగకుండుట, పగిలినపాత్రలలో భోజనముచేయుట గూడ నిషేధింపబడినది. అట్లుగాక పైనిషిద్ధ

కర్మ లొనర్చినచో నాయింటియందుం దుండుబాలకు లెల్లప్పుడు గ్రహగృహీతు లగుదురనిగూడ దెలుపబడినది.

యేనామృత మపాం మధ్యా దుద్ధృతం పూర్వజన్మని
యతో౽మరత్వం సంప్రాప్తా స్త్రిదశా స్త్రిదివేశ్వరాత్ 39-3
శిష్యా స్తం దేవ మాసీనం పప్రచ్ఛుః సుశ్రుతాదయః॥ 39-4

పురాణములయందు ధన్వంతరియుత్పత్తి యెట్లుదెలుపబడినదో యుపవేద మగు నీయాయుర్వేదమునగూడ నట్లే చెప్పబడినది. దాన పురాణములకు సమూలకత్వము సిద్ధించినది. సముద్రమథనమునకు, దాని వలన నమృత ముద్భవించినదను కథకు సత్యతయు చేకూరినది.

రుద్రకోపాగ్నిసంభూత స్సర్వభూతప్రతాపనః॥ (జ్వరః) 39-9
ఇచట జ్వరోత్పత్తి కథ దెలుపబడినది.

ఋతే దేవమనుష్యేభ్యో నాన్యో విషహతే తు తం 'జ్వరం'
కర్మణా లభతే యస్మా ద్దేవత్వం మానుషాదపి॥ 36-11

పునశ్చైవ చ్యుత స్స్వర్గా న్మానుష్య మనువర్తతే
తస్మా త్తే దేవభావేన సహంతే మానుషా జ్వరం॥ 39-12

ఇచట జ్వరముయొక్క ప్రాబల్యము చెప్పబడినది. ఇచట "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి 9-21" అను భగవద్గీతా సిద్ధాంతము గూడ సాధింపబడినది.

తిథౌ ప్రశస్తే నక్షత్రే సాధక స్యాతురస్య చ
కృతే మనుష్యదేవాయ (రాజ్ఞే) బ్రాహ్మణై రభిమంత్రితం
దత్తం సర్వజ్వరాన్ హన్తి మహాకళ్యాణకం త్విదం॥
39-237, 39-238

ఇచట నక్షత్రములయొక్క ప్రాశస్త్యవిచార ముపవేదమూలకమని తేలినది. బ్రాహ్మణులచే మంత్రపూర్వకముగ నభిమంత్రింపబడిన యౌషధమునకు సాఫల్యము జూపబడినది.

అస్యాభ్యాసా ద్ఘృతస్యైవ జీవే ద్వర్షశతత్రయం. 3-239

దీనిచే ఒకవిధమగు నేతితో మూడువందలయేండ్లాయుష్యము దెలుపబడినది. అందువలననే "ఆయుర్వై ఘృతం" అని ప్రసిద్ధమై యున్నది. దీనిచే వందయేండ్లే పరమాయువని తలంచువారలు పరాజితులైనారు.

అభిశాపాభిచారోత్థౌ జ్వరౌ హోమాదినా జయేత్

దానస్వస్త్యయనాతిథ్యై రుత్పాతగ్రహపీడితం. 39-266

దీనిచే శాపమువలన అభిచారమువలనగూడ జ్వరమువచ్చుట సత్యమే యని సిద్ధించినది. ఆ గ్రహాది జ్వరములకు దానము స్వస్తివాచనము మొదలగునవి చెప్పబడినవి. మరియు గ్రహాదిపీడచేగూడ జ్వరప్రాప్తి సిద్ధించినది.

యావ న్న వికృతి స్సర్పి ర్మద్యంచ విషమే (జ్వరే) హితం

సంపూజయే ద్ద్విజా న్గాశ్చ దేవ మీశాన మంబికాం. 39-270

ఇచటవిషమజ్వరములో హితకారులగు పదార్థములు అధికారిభేదము ననుసరించి వ్రాయబడినవి. ఎచట లౌకిక చికిత్సలు చెప్ప బడెనో యచట గోబ్రాహ్మణాది పూజనము వ్రాయబడినది.

కర్మజా వ్యాధయః కేచి ద్దోషజా స్సన్తి చాపరే

కర్మదోషోద్భవా శ్చాన్యే ... ... ... 40-163

ఇవి వ్యాధుల నిమిత్తములు. ఇచట పూర్వకర్మ ననుసరించి వచ్చు వ్యాధులు సిద్ధించుచున్నవి.

... ... ... ...కర్మజా స్తేష్వహేతుకాః

నశ్య న్తి త్వక్రియాభి స్తే క్రియాభిః కర్మసంక్షయే. 40-164

ఇచట కర్మసమాప్తమైననే కర్మజన్యవ్యాధి నశించును. అపుడు లౌకికచికిత్స యున్నను సాఫల్య ముండదు.

రాజ్ఞశ్చంద్రమసో యస్మా దభూ దేష కిలామయః

తస్మా త్తం రాజయక్ష్మేతి కేచి దాహుః పున ర్జనాః. 41-5

ఇచట రాజయక్ష్మ యను పేరుగల్గుటకు కారణము చెప్పబడినది. ఈ శ్లోకవ్యాఖ్యానమున శ్రీ డల్హణాచార్యునిచే నీకథ విశదీకరింప బడినది.

పురాణములయందుగూడ చంద్రునకు వ్యాధి వినబడుచున్నది. కాన నచటగూడ నాకథకు సమూలకత్వము సిద్ధించినది.

అథాతోఽమానుషోపసర్గప్రతిషేధమధ్యాయం వ్యాఖ్యాస్యామః. ఈ యధ్యాయములో భూత ప్రేత పిశాచాదుల వర్ణనము చేయబడినది. దాన వారలు మనుష్యయోనిభిన్నులని సిద్ధించినది.

యథోవాచ భగవా న్ధన్వంతరిః 60–2

అనుటచే నీవిషయము ధన్వంతరి సంమతమని తేలినది. దీనిచే భూత ప్రేత పిశాచాదులను మనుజులుగ దలంచు దయానందస్వామి యపాస్తుడైనాడు.

గుహ్యానాగతవిజ్ఞాన మనవస్థా సహిష్ణుతా

క్రియా వాఽమానుషీ యస్మి న్స గ్రహః పరికీర్త్యతే 60–4

ఇవి గ్రహముచే గ్రహింపబడుటకు చిహ్నములు. దీనిచే గ్రహములకు మనుష్యభిన్నత్వము సిద్ధించినది. గ్రహముల ప్రభావముచే రహస్యవృత్తాంతమూ రాబోవువృత్తాంతముగూడ దెలియవచ్చు ననునది సిద్ధించినది. మనుజునియందు అమానుషక్రియ యెట్లుండునది తెలియుచున్నది. దీనిచే గ్రహములు లోకాధికప్రభావశాలులని తేలినది.

అసంఖ్యేయా గ్రహగణా గ్రహాధిపతయస్తు యే। 60–6

అనుటచే గ్రహముల బహువిధత్వము దెలియుచున్నది.

దేవా స్తథా శత్రుగణాశ్చ తేషాం గంధర్వయక్షాః పితరో భుజంగాః

రక్షాంసి యాచాపి పిశాచజాతి రేషోష్టకో దేవగణో గ్రహాఖ్యః

అనుటచే దేవతలకు గ్రహములకు భేదము నిరూపింపబడినది.

సస్వేదీ ద్విజగురుదేవదోషవక్తా జిహ్మాక్షో విగతభయో విమా ... ... దుష్టాత్మా భవతిచ దేవశత్రుజుష్టః॥ 30-9 గ్దదృష్టిః

ఇచట అసురగ్రహ గృహీతునిచిహ్నములు దెల్పబడినవి. ప్రతిపక్షులీలక్షణములను తమయందు పరిచూచుకొందురుగాక!





శ్రీసద్గురు శ్శరణమ్.

# శ్రీ జయరామ విద్యా విలాసము

(ప్రథమ భాగము.)

## కా. ఉన్నదున్నట్లు

---

### — 1. సత్యమూర్తికైనా సనాతనవాసన లుంటే కాంగ్రెసువారి అవాకులు చెవాకులు తప్పవు. —

"కల్పవల్లి" పత్రికలో 1-1-1940 18 సం. వయస్సున ముద్రాపితము.

నిజానికి సత్యమూర్తిగారు మద్రాసురాజధానిలో చెప్పుకో తగినకాంగ్రెసునాయకుల్లో ఒకడు. ఈమధ్య ఈయనకు మద్రాసు మే యరుపదవికూడా లభించింది. అదేంపాపమోగాని- కాంగ్రెసు పత్రి కలుగూడా చాలావరకు ఈయన కీపదవి లభించినప్పటినుండీ, ఈయన మీద కారాలూ మిరియాలూ నూరుతూవున్నై. తన యావచ్ఛక్తినీ కాంగ్రెసుకు ధారపోసిన ఈయనమీదగూడా ఈపత్రికల కటాక్షవీ క్షణం ప్రసరించకపోవటానికి కారణ మేమిటి? ... ...

ఇంకా చాలా కారణములుండవచ్చును; కాని మేం చెప్పేది కూడా హేతువే అని అంగీకరించక తప్పదు. ఏమిటంటారా? అసలు సత్యమూర్తి జన్మతః బ్రాహ్మణుడు. అంతేగాకుండా పిలకమనిషిగూ డా. ముఖముమీద మూడు విభూతిరేఖలు లేంది గడపదాటనిఛాంద సుడు. అదీగాక వెనక ఒకసారి కేంద్రశాసనసభ ఎన్నికల్లో మతవిష

యకచర్చలు వస్తే తాటస్థ్యం వహిస్తానని సనాతనుల కభయవాగ్దానం చేసినజాలిగుండెమనిషి_ఇట్లాటివానికి కాంగ్రెసులో కొంత పలుకుబడి కలగటమే కళ్ళమంట ఈపత్రికలకు. ఆపైన ఇల్లాంటిఉన్నతపదవి లభించిందంటే చెప్పాలి? ఇదేకారణం కారాలు మిరియాలు నూరటానికి.

పాపం ఈ ఆక్రోశం పట్టలేక పోయింది "ప్రజామిత్ర" పత్రిక. 'అవాకులు చెవాకులు' అనే శీర్షికతో ఆకాస్త ఆక్రోశం వెళ్ళగక్కుకుదుటపడ్డది.

---

## 2. భారతీయుల తలక్రిందుదృష్టి

["కల్పవల్లి" పత్రికలో 15-1-40 18 సం.వయస్సున ముద్రాపితము]

రానురాను భారతీయులదృష్టులన్నీ తలక్రిందు లౌతున్నట్లున్నది. మంచిని చెడు అనీ, చెడును మంచి అనీ వాడటం సహజం అయిపోయింది. చూడండీ-ఈమధ్య ఏపత్రిక చూచినా ఎవరో సీతారామయ్యగారట; పుయ్యూరు కాపురస్థులట; పరిస్తుతము రష్యాలో ఒకరష్యాస్త్రీని పెండ్లాడి యిద్దరు ముగ్గురు పిల్లల్ని కని సుఖంగా అక్కడనే వాసంచేస్తూఉన్నాడట. ఆయన్నుగురించి ప్రశంసలే. చివరకు ధార్మిక పత్రికఅనుకుండే "దివ్యవాణి"లోకూడా కాటికాయంత అక్షరాలతో ఆయన్నుగురించి ప్రశంసఉన్నది.నిజంగా ఈవిషయంలో మనంఆనంద బాష్పాలు రాల్చాలా? దుఃఖబాష్పాలు రాల్చాలా అనివిచారిస్తే,ఇంతకన్నా శోచనీయం లేదని తేలుతుంది. మనధర్మశాస్త్రాలప్రకారం ఆమానవుడికీజన్మలో కాదుగదా ఇంకా కొన్నిజన్మాలకైనా నిష్కృతి వున్నదో లేదో సందేహమే. తాను భారతీయత్వం పాడుచేసుకోటం అట్లాఉండగా, అటు రష్యనుజాతికి, ఇటు హైందవజాతికి కూడ సంబంధించని ఒకక్రొత్త సంకరజాతిని నిర్మించా డీమహానుభావుడు. ఇట్లాంటివాడి జన్మవల్ల మనఆంధ్రదేశం పవిత్రం ఐందని వ్రాస్తున్నై కొన్నిపత్రికలు. భగవంతుని అనుగ్రహంవల్ల కొంతకాలానికైనా మనవాళ్ళ తలక్రిందుదృష్టి నశిస్తుందా?

## —♦ 3. అర్హత లేనివారిధర్మోపన్యాసాలు. ♦—

[“కల్పవల్లి” పత్రికలో 15-1-40 18 సం. వయస్సున ముద్రాపితము.]

ఈమధ్య కె. రామసుబ్బమ్మగారు కడపలో తమఉపన్యాసంలో దేశముఖుగారి విడాకులబిల్లును విమర్శిస్తూ హైందవనారీమణులకు పాతివ్రత్యమే పరమధర్మమనీ, ఈబిల్లు పాతివ్రత్యభంజకంగా వున్నదనీ, అందువల్ల అంగీకరించగూడదనీ చెప్పినారు. విధవావివాహాలను నిరాటంకంగా అంగీకరించే ఈమెగూడా ఇట్లా పలకటం విచిత్రంగా ఉన్నది. ఈమె ఉద్దేశంలో పాతివ్రత్యమంటే ఏమిటో? ఇద్దరు భర్తల్ని వివాహమాడిన ఇల్లాలి పాతివ్రత్యం పదిభార్యల్ని పరిణయమైన పురుషుని ఏకపత్నీవ్రతంవంటి దని పెద్ద లంటారు. అట్లా ఒకని తరువాత ఇంకొకణ్ణి బహిరంగంగా పెళ్ళాడటమంటే వ్యభిచారాన్ని కొత్తపద్ధతిలో బాహాటంగా అమల్లోకి తేవటమే. ఈరకంలోవే విధవావివాహాలూ, విడాకులూనూ.

* * *

ఇక విడాకులకూ విధవావివాహాలకూ ఎక్కువతేడా ఏమిటీ? అక్కడ ఒకడిని వదిలి ఇంకొకడిని కట్టుకోవటం. ఇక్కడ ఒకడు గతించినతరువాత మరొకడిని పెళ్ళాడటం రెంటిలోనూ రెండోభర్త తప్పడు. మొద్దలై మొగుడు కనబడుతుంటే మరొకడిని కట్టుకోవటం కంటే వాడు గతించింతరువాత పెళ్ళాడటం మేలుగదా? అంటారేమో పాపం! చచ్చినవారికి ఆత్మశాంతి గలగాలని పత్రికలలో రాస్తూవుంటారే? ఆఆత్మ అపుడేమాతుంది? తనభార్యతో మరొకడు కాపురము చేస్తూవుంటే చూచి గోడుగోడుమని ఘోషించదూ? ఇందు కేమి చెపుతారో!

* * *

ఇంతకూ విడాకులబిల్లు మాకిష్టమైకాదు ఇట్లావ్రాయటం; ఇది వరకు యూరపులో వాడుకలో ఉన్న “నీపిల్లలూ, నాపిల్లలూ, మన పిల్లల్ని కొడుతూవున్నారు” అనే సామెతను మన భారతదేశానికి గూడా తీసుకరావాలెనని నేనేగాదు, మా సనాతను లెవ్వరుగూడ

ఎప్పుడూ అంగీకరించరు-నవనాగరికవనితాలోకంకన్నా దీన్ని ప్రతిఘటించటంలో మాదే ముందుచెయ్యి. కాని మే మంగీకరించటం లేకపోవటం శాస్త్రీయతమీద ఆధారపడివుంటై. అశాస్త్రీయకార్యాలు అనర్థదాయకాలని మాదృఢవిశ్వాసం. వీళ్ళకో అట్లాగాదు. వాళ్ళ బుద్ధులమీదనే ఆధారపడి వుంటై. అందువల్లనే పరస్పరభేదాభిప్రాయాలు వాళ్ళలోనే ఈలా బయలుదేరుతూ వున్నై. • •

ఇక్కడ చెప్పవలసినమాట ఒకటి వున్నది. ఈసందర్భంలోనే రామసుబ్బమ్మగారు మాట్లాడుతూ "హైందవమత సాంప్రదాయమున కీబిల్లు కేవలము విరుద్ధము" అన్నారు. ఈమాటే ఏసనాతనుడో అంటే బాగానే వుండేది. కాని యీమె అనటంతో దానివిలువ పోయింది. కారణం యేమిటంటే నిజంగా యీమెకు హైందవమత సాంప్రదాయాలమీద యేమాత్రం విశ్వాసం లేదు. అట్టివ్యక్తి కేలా అంటాని కధికారం యేలా వుంటుందీ? యీమెకు విశ్వాసం లేదనటానికి అస్పృశ్యతను సమూలంగా నశింపజేయాలనీ, బాల్యవివాహాలు, యిదివరకు జరిగినవిసహా చట్టంద్వారా రద్దుపరిపించాలనీ పలకటమే సాక్ష్యం. యీసాక్ష్యం చాలదూ?



—• 4. బ్రాహ్మణేతరపక్ష ప్రతిషేధము. •—

["కల్పవల్లి" పత్రికలో 1-2-40 18 సం. వయస్సున ముద్రాపితము.]

ఈ మధ్య రాజమండ్రిలో బ్రాహ్మణేతరపక్ష నాయకమహాసభ జరిగిందని ప్రకటించబడ్డది పత్రికల్లో. పాపం ఈ పార్టీలో బ్రాహ్మల్ని ఒకళ్ళనిమాత్రమే చేర్చుకోకుండా వెలివేయటంలోవాళ్ళే మపరాధం చేశారా అనిపించింది నాకు. యుగయుగాలనుంచీ ఎన్ని విపత్తులొచ్చినా తట్టుకొని నిలచివున్న బ్రాహ్మణ్యమీమాత్రానికే నశిస్తుందనే భయం లేదు; కాని ఇండియాజనసంఖ్యలో నూటికి ఒక

రిద్దరుగానున్న బ్రాహ్మణులమీదఅధికసంఖ్యాకులైన ఇతరజాతులవారందరూ కట్టుగట్టి దండెత్తటం చూస్తే మాత్రం బ్రాహ్మణ్యానికేదోవిధంగా కొంతనష్టం కలగటం తప్పదని తోస్తోంది. ఇందులో నాయకులు చాలవరకూ మా సనాతనుల్లోవారు కాకపోవటంవల్ల "బ్రాహ్మణేతరపార్టీ" అని పేరుపెట్టుకోటంలో అభిప్రాయం ఏదో నాకు బాగా అర్థం కావటంలేదు. ఆ విషయంలో నాసందేహాలు క్రింద వ్రాస్తూవున్నా. తెలిసినపెద్దలు సమాధాన మివ్వ ప్రార్థన. ...

జన్మతోనే జాతి ఏర్పడుతుందనీ, ఏతజ్జన్మీయ గుణకర్మలవల్ల కాదనీ వాదించేవాళ్ళు మా సనాతనులు. ఈ జన్మలోని గుణకర్మలవల్లనే జాతి ఏర్పడుతుం దంటారు అధునాతనులు. ఈపార్టీవారు చాలావరకు రెండవపార్టీలో వారే అని వింటా. అదే నిజమైతే మా ఆక్షేపణకొంచెం విచారించతగ్గదే. ఏదంటారా? అధునాతనుల మతాన్ననుసరించి దయ, సత్యం, శౌచం, ఇంద్రియనిగ్రహం, భక్తి మొదలైన శుద్ధ సాత్వికగుణాలు కలవారేకదా బ్రాహ్మణజాతిలో చేరేవారు. ఇక బ్రాహ్మణేతరపార్టీ అంటే అర్థమేమిటి? మాపార్టీలో దయా సత్యాది సాత్వికగుణాలు కలవాళ్ళు కంచుకాగడాలతో వెదకినా కానరారనేనా? మరోమాట. "ఇతర" పదానికి విరోధి అనే అర్థంగూడా రావచ్చు. ఆ అర్థమే గ్రహిస్తే మరీఅసహ్యం. ఈలాంటి పేరుపెట్టుకోటం ఏ పార్టీకైనా గౌరవప్రదం అవుతుందా? విచారించండి. ఏపార్టీవారైన మాపార్టీలో శుద్ధసాత్వికుడుకన్నుపొడుచుకున్నా కనపడడనీ పైగా ఎక్కడైనా అలాంటివా రుంటే వారిని మాపార్టీ ద్వేషిస్తుందనీ చెప్పాకుంటుందా? సిగ్గు సిగ్గు! ఎవరైనా విన్నా నవ్విపోతారు!

* * *

పాపం ఇంతమాత్రపు దూరదృష్టితోగూడా పెట్టుకున్నట్లు కనుపించ దీపేరు? ఏలాగో తమకు జన్మతః పాదుకొనివున్న బ్రహ్మద్వేషం వెళ్ళగక్కటమే ప్రధానంగా పెట్టుకున్నారు. లేకపోతే మేము కమ్మబ్రాహ్మలం, మేము మంగలిబ్రాహ్మలం, అంటూ నిన్న మొన్నటివరకూ ఊరూర ఊరేగిన మహానుభావు లంతా ఈరోజున మళ్ళీ

బ్రాహ్మణేతర పార్టీలో నాయకులు కావటం ఎలా తటస్థించుతుంది? "ఎప్పటి కెయ్యది ప్రస్తుతము" అన్నట్లు అప్పుడు తాత్కాలికంగా తోచిన నాలుగుమాటలు విడిచి, మేమూ బ్రాహ్మలమే అని దబాయించారు—మళ్ళీ బ్రాహ్మద్వేషం తీర్చుకోటాని కింకోమార్గం దొరక టంతోటే ఈ పార్టీలో చేరేరు. కాని చేసినపని అసందర్భం కావటం వల్ల నాబోటివాళ్ళ కలాలనుంచి తప్పించుక తిరగటం కుదుర లేదు.

చెట్టు చెడేకాలానికల్లా కుక్కమూతిపిందెలు పుడతై అని పెద్ద లంటారు. అలాగే ఉంది ఇదీను. పాపిష్ఠి కలికాలం వచ్చేటప్పటికల్లా అందరకూ బ్రహ్మద్వేషం, ధర్మద్వేషం ప్రభుద్వేషం— ఓ! కావలసిన దౌర్భాగ్యద్వేషాలన్నీ కలుగుతూవున్నాయి. సర్వకర్త ఐన భగవంతుని అనుగ్రహం ఏవిధంగా ఉన్నదో, ముందుక్షణంలో ఏమి కానున్నదో ఎవ రెరుగుదురు? "సర్వే జనా స్సుఖినో భవంతు" ఇదే ముఖ్యమైన కోరిక.



## —◆ 5. నేటిసూక్తులలోని సంస్కృతము. ◆—

["కల్పవల్లి" పత్రికలో 15-3-40 18 సం. వయస్సున ముద్రాపితము.]

ఈ మధ్య నే నొక చిన్నపుస్తకం చూడటం తటస్థించింది. ఆ పుస్తకం గుంటూరుజిల్లాబోర్డు స్కూళ్ళలో పిల్లలకు చెప్పదగినదిగా నిర్ణయించారట బోర్డువారు దానిపేరు "వినయాశ్రమభజనావళి." దీనిలో మొదట్లో చాలావరకూ శంకరాచార్యులు మొదలైన పెద్దలు వ్రాసిన శ్లోకాలు చేర్చబడివున్నై. ఆ శ్లోకాలలో వ్రికాశకుల కభిలషితాలైన భావాలు పూర్తిగా రాలేదు కాబోలు కొన్ని స్వంత కవిత్వపు శ్లోకాలుకూడా చేర్చారు మధ్య. శ్లోకం కొంతవరకు చదివేసరికే తెలిసిపోతూవచ్చింది, ఇవి కాళిదాసుని కవిత్వం కొంత, నా పైత్యం కొంత అనేరకంలోవని. ఆశ్లోకాల్లో నాకు కొన్ని అన్వయించ లేదు. చాలావరకూ శ్లోకాలకు క్రింద తాత్పర్యం వ్రాసివున్నారు;

కాని అలాంటి తాత్పర్యం రాదగినపదాలు మూలంలో ఉన్నట్లూ కనుపించదు. ప్రకాశకులు శాస్త్రిపేరటివారూ, ప్రసిద్ధులూ కావటం వల్ల ఇది తప్పని అనుకోటానికి కొంతజంకు గలిగింది. కాని రామ శబ్దం రాని శాస్త్రుల్లూ, సన్ధ్యామంత్రాలు రాని అవధానులూ అంతు లేకుండా వున్న ఈకాలంలో పేరు చూచి జంకటం అనవసరం అని పించింది మళ్ళీ. ఏదేలా వున్నా మంచి చెడుగు తెరిగిన పాఠకమహా శయులముందీవిషయం వుంచుతే తప్పొప్పులు తేలగలవని నాకు గలి గిన అభిప్రాయం నీ్న క్రింద వ్రాస్తూవున్నా.

మూలం శ్లోకం చూడండి-

"సర్వధర్మే సమానత్వే స్వదేశీ స్పర్శభావనా
హీ యేకాదశసేవా మే నమ్రత్వే వ్రతనిశ్చయే"

ఇక దీని తాత్పర్యం "......(౯) అన్ని ధర్మములయందు సమానబుద్ధి (౧౦) స్వదేశీవ్రతము (౧౧) అస్పృశ్యతా నివారణ- ఈ పదకొండును సేవించుటయందు నమ్రతతో వ్రతము నిశ్చయించు చున్నాము.

పై శ్లోకంలో కొన్ని సంస్కృతపదాలు లేకపోలేదు. కాని ఆరెండుమూడు సంస్కృతపదాలకైనా వారభిప్రాయపడ్డఅర్థం రాదని నాకు తోస్తోంది. చిన్నపిల్లలు 'తా' అంటే తాటికాయ, 'ఈ' అంటే ఈతకాయ అంటూ ఏవేవో సంకేతాలు పెట్టుకొని, ఆ సంకేతాలతో వ్యవహరిస్తూ వుంటారు. అలాగే వీరుగూడా 'స్వదేశీ' అంటే స్వదేశ వస్త్రధారణమనీ, 'స్పర్శభావనా' అంటే అస్పృశ్యతా నివారణం అనీ ఈ విధంగా ఏవైనా సంకేతాలు ఏర్పరుచుకొని ఆ గుర్తుల ప్రకా రం ప్రయోగించి ఉంటేమాత్రం వారనుకొనే అర్థం వస్తే రావచ్చు. కాని అలాగే వాడివుంటే పుస్తకంలో సంకేతపదసూచిక నొకదానిని ప్రకటించి ఉండవలసింది. లేకపోతే సంస్కృతభాషాపరిచయం కలవా ళ్ళైవరైనా చూస్తే విషయనిగరణశ్లోకాలమోస్త రన్వయించక అవస్థ పడవలసి వస్తుంది. నాకు చూడ విచారిస్తే ఈలాంటి శ్లోకాలు ప్రక

టించటం అసామర్థ్యంవల్లనే అని తోచదు. ఇక ఏమంటారా? అసలు వీరు సంస్కర్తలు. అందువల్ల సంస్కృతాన్నిగూడా కొత్త పద్ధతులతో సంస్కరించి తమ సంస్కర్తృత్వం స్థిరపర్చుకోవాలి అని ఈలా చేసేరేమో అనిపిస్తోంది. ♦ ♦ ♦ ♦

ఇంకో విశేషం వుంది. ఇదులో మంత్రపుష్పం, సూర్యనమస్కార మంత్రాలు, రకరకాల కీర్తనలు కొన్ని, ఖురానులో వాక్యాలు కొన్ని చేర్చబడివున్నై. తురకలూ, దూదేకులూ, మాదుగలూ, బ్రాహ్మలూ, శూద్రులూ అందరూ కలసి చదువుకొనే స్కూళ్ళలో పారాయణ యోగ్యంగా నిర్ణయించా రీపుస్తకాన్ని కూర్చినవారు. ఇది చూస్తే మా తాతగారు వెనక నవ్వుతూ అంటూవుండే 'షేక్ మస్తాన్ సాహెబ్ గారింట్లో సప్తపిండ ప్రదానపద్ధతితో శ్రాద్ధం పెట్టించినట్లుంది' అనేమాట గుర్తుకు వస్తోంది.



## ♦ 6. మహావాదిరాక్షసపక్ష ప్రతిక్షేపము ♦

(“కల్పవల్లి” పత్రికలో 1–7–40 19 సం. వయస్సున ముద్రాపితము)

కలికాలం చాలా పాపిష్ఠికాలం. అందువల్లనే యీ కాలంలో అన్నిరకాల విపరీతాలూ జరుగుతున్నై. కని విని ఎరుగని కొత్తకొత్త విపరీతవాదనలన్నీ చెలరేగుతున్నై. చూడండి. ఈ మధ్య ఒకవాదన మరీ విజృంభించ మొదలెట్టింది. కొంచెం తెలివికలవాళ్ళనుకొనేవారు గూడా చాలామంది యీవాదనలో చేరిపోయారు. ఏమిటావాద మంటారేమో? సంగ్రహంగా చెపుతా వినండి. అసలు రాక్షసులు చాలా ధర్మాత్ములట. వారిలోగూడా ముఖ్యంగా రావణుడు, హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు, కుంభకర్ణుడు మొదలైనవారు అత్యంతధర్మాత్ములట. దేవతలంతా కపటస్వభావం కలవాళ్ళట, మాయావులట. దయాశూన్యులట. వారిలో గూడా పాపాలకల్లా భైరవుడు విష్ణుమూర్తిట.

కుతంత్రాలు పన్ని ఎలాగో దుర్మార్గులైన దేవతలు ధర్మాత్ములైన దానవుల్ని అనేక పర్యాయాలు జయించారట. ఇంత కపటం చేసినా దానవులు పరాక్రమవంతు లవటంచేతనూ ధార్మికు లవటంవల్లను కొన్నిసార్లు విజయంపొందినారుకాని దేవతల మాయలవల్ల అమాయికులైన రాక్షసు లపజయాన్ని పొందవలసివచ్చిందట. అంతేకాదట. పురాణాలలో అనేక స్థలాల్లో వర్ణించబడే మానవుల యుద్ధాల్లోనైతం దేవతాపక్షపాతులు చాలవరకు జయించటానికి కూడా వారి మాయలే కారణమట. ముఖ్యంగా భారత యుద్ధంలో పాండవుల యుద్ధం కేవలం ధర్మవిరుద్ధమైందట. దుర్యోధనుడు కేవలం ధర్మపక్షపాతి. ధర్మరాజు నేతిబీరకాయ అన్నట్లు పేరులోమాత్రమే ధర్మపదం గలవాడట. దేవతాపక్షపాతులైనమహర్షులు తమగ్రంథాలలో దేవతలనూ, తత్పక్షపాతులనూ మంచివారుగా కల్పించి వ్రాశారట.

ఈ వాదనను బలపరచటానికి ఏవో కొన్ని యుక్తులు చూపిస్తారు ఈలా వాదించేవారు. నేను ప్రస్తుతం ఆయుక్తి ప్రయుక్తుల నన్నింటిని ఇక్కడ విమర్శించటానికి పూనుకోను. కావాలి అనుకుంటే ఆలాంటి విమర్శనగ్రంథా లిదివరకే చాలా వ్రాయబడివున్నై; చదువుకోవచ్చు అవసరమైనవాళ్ళు. ఒక చిన్న గమనించాల్సిన విషయం మాత్రం చూపించి అవతల కెళ్తా. ఈరాక్షసపక్షీయు లంగీకరించినా అంగీకరించకపోయినా దేవదానవయుద్ధాలను కాని, కౌరవ పాండవ సంగ్రామాలను కాని, ప్రాచీనచారిత్రికవిషయాలనుగాని తెలియాలి అంటే ముఖ్యంగా పురాణేతిహాసాలే శరణ్యాలు. వాటిని తెలుసుకోటానికి వీరి భూగర్భశాస్త్రాలుగాని అస్థికపాలశాస్త్రాలుగాని ఉపయోగించవు. పై వాదనను నిలపెట్టటానికైనా అవ్వే ఆధారాలుగా చెపుతున్నారు ఈ వాదనచేసేవారు. ఇక విచారించవలసినవిషయం ఒకటి వుంది. పురాణేతిహాసాదులను రచించినమహర్షులు దేవపక్షపాతులనీఅసత్యవిషయాలనువ్రాశారనీ వీ రేచెపుతారు. నిజంగామహర్షులే దేవపక్ష పాతులైతే అన్ని గ్రంథాలు దేవతల కనుకూలంగానే వ్రాసి వుంటారు. తమ కభిమతులైనవారిని గొప్పవార్నిగా వ్రాయ

టం చేతకాకపోదు మహర్షులకు. ఇక అట్టి గ్రంథాలలో రాక్షసులూ తత్పక్షపాతులూ మంచివారని నిరూపించటానికి ఆధారాలెట్లా దొరుకుతై? చాలా వరకూ తమ కనుకూలంగానే వ్రాసుకున్నారనీ, కొన్ని స్థలాల్లోమాత్రం పొరపడి ఔచిత్యం తేలేక యథార్థమే వ్రాయడం వల్ల ఈ స్థితి వచ్చిందనీ అంటారేమో? అబ్బా యింతమాత్రం తెలివి తేటలు వారికి లేవనేకామోల్సు వీరి అభిప్రాయం! శాంతం పాపం.

ఈలాంటివిపరీతవాదనకు పూనుకోవటంలో హేతువేదని విచారిస్తే నాకొకటి స్ఫురిస్తుంది. "యేన కేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవ" అన్నారు పెద్దలు. ఏదో ఒక దగ్ధావాదం లేవదీస్తే దానిమూలకంగా తమపేరు నలుగురినోళ్ళలో పడుతుంది. అదే కావాల్సింది. లేకపోతే వీరికి జన్మాంతరీయంగా రాక్షసులతోటీ తదనుయాయులతోటీ ఒకవిధమైన దృఢసంబంధమైనా వుండితీరాలి. ఆ సంస్కారమున్నా హేతువై యుండాలి ఈలా రాక్షసవాదం చేయటానికి. వీరిలో ఒక మహావాదిగా రగ్రస్థానంవహిస్తున్నారనివింటా. అలాగైతే వీరికి 'అభినవసోమక" అనో "అపరహిరణ్యాక్ష" అనో ఏదో ఒకబిరుదును సమర్పించటం అవసరమని తోస్తుంది నాకు. ఈ పని చేస్తే ఆ మహానుభావుడి కృషికి తగినంత కృతజ్ఞతను చూపించిం దౌతుంది విజ్ఞలోకం.



## — 7. చౌదరిగారిబ్రాహ్మణనిందానిరాసము. —

("కల్పవల్లి పత్రికలో 1-8-40 19 సం. వయస్సున ముద్రాపితము.")

వర్ణవ్యవస్థ నొకస్కూలుతో పోల్చి చూపవచ్చు; చూడండి. స్కూలులో అనేక కక్ష్య లుంటై, అవి ఒక దానికన్న మరొకటి గొప్పదిగావుంటై. ఒకకక్ష్యలో సక్రమంగా శ్రద్ధాభక్తులతో చదివిన విద్యార్థి మరుసటిసంవత్సరం పైపై కక్ష్యలకు వెళ్తూవుంటాడు, కొంత కాలానికి పట్టభద్రుడు డౌతాడు. అలాగే వర్ణవ్యవస్థకూడా. వేరువేరు

కక్ష్యాభేదాలవంటివి వర్ణభేదాలు. సరిగా చదివినవిద్యార్థి పైసంవత్సరం ఉన్నతకక్ష్యలో జేరునట్లు ఈ జన్మలో స్వవర్ణోచిత ధర్మాల ననుష్ఠించినవాడు వచ్చే జన్మలో తనకన్న పైవర్ణంలో జేరగల్గుతాడు. ఇచట ఒక్కో సంవత్సరం ఒక్కో జన్మగా చూచుకోవాలి. పైవిధంగా స్వధర్మానుష్ఠానపరుడైనవాడు క్రమశః మోక్షసామ్రాజ్య పట్టభద్రుడు కాగలడు. ఉపాధ్యాయులమాట వినక శ్రద్ధగా చదువని విద్యార్థి పైకక్ష్యలో చేరలేనట్లే గురువచన ధిక్కారంచేసి శ్రద్ధారహితుడై స్వధర్మముల ననుసరించని మానవు డుత్తమగతి చెందలేడు. పైగా అధఃపతనం చెందుతాడు. ఈలాగే స్కూళ్ళలో కొంతమంది విద్యార్థులకు డివ్రిమోషన్ జరుగుతూ వుంటుంది. ♦ ♦

మరోవిషయం. స్కూలులో క్రిందకక్ష్యలో విద్యార్థి పైకక్ష్య వారితోపాటు తానుగూడా పాఠాలు చదవడాని కవకాశ ముండదు. పైకక్ష్యవాడు క్రిందికక్ష్యవాడితో చదువటానికీ రూల్సువప్పవు. ఆలాగే అధమవర్ణస్థు డీజన్మలోనే ఉత్తమవర్ణీయుడను కావాలనీ వారిధర్మాల ననుసరించాలనీ మోజుపడితే దాన్ని శాస్త్రం వప్పదు. ఉత్తమవర్ణస్థుడు స్వధర్మాల ననుష్ఠించ లేక అధమవర్ణధర్మాల ననుష్ఠిస్తే పతితుడై పోతాడు. ఇదీగాక, విద్యార్థులకక్ష్యానిర్ణయం పాఠశాలాధికారుల అధికారాలవల్ల గానీ, ఉపాధ్యాయుల ప్రేమవల్లగానీ జరుగదు. వారివారి విద్యావైభవాల ననుసరించి మాత్రమే. ఆలాగే వర్ణవ్యవస్థకు కూడా వారివారి పూర్వజన్మ కర్మలే హేతువులుకాని భగవంతుని పక్షపాతం కాదు. భగవంతుడు నిష్పక్షపాతి ♦ ♦

ఈ విషయం తెలియక చాలామంది అనవసరమైన ఆక్రోశం పడుతుంటారు. ఒకరి ఎక్కువ ఏం? ఒకరితక్కువ ఏం? ఇద్దరిలో నెత్తురే గదా? ఒకరిలో పాలున్నవా? అంటారు. నెత్తురు మనుష్యులలోనే గాదు, పశుపక్ష్యాదులలో గూడా వుంటుందని వీరు తెలుసుకోలేరా అనిపిస్తుంది. ఒక చౌదరిగా రుపన్యసిస్తూ మన దేశంలో బ్రాహ్మలంతా తిండిలేక రైలుస్టేషనులవద్ద కూలీకూలీ అని తిరిగేరోజులు వస్తేనేగాని మన దేశం బాగుపడదని సింహనాదం చేసేడు. ఎందుకో

ఈయనకింత ఆక్రోశం? బ్రాహ్మలవద్దనున్న ఔన్నత్యం చూడలేకనేగా ఈన కెంత కళ్ళమంట! అలాగైతే తానుగూడా అట్టిఔన్నత్యం కలగాలిఅని దానికి ప్రియత్నించవచ్చు. అది మొగతనం. అంతేగాని వారు చెడిపోవాలి అని కోరుకోవటం కుళ్ళుబోతుతనంగాదూ! ఆడవాళ్ళు చేయాల్సినపని! ♦ ♦ ♦ ♦

ఈనకు నాదో సలహా- "అయ్యా! తమకు బ్రాహ్మణులకున్న గౌరవం కావాలిఅని కోరికవుంటే వార్ని తిట్టుకుంటే ఏమీలాభము లేదు, నోటితీట వదలటంతప్ప. నిజంగా మీ కాకోరికే వుంటే చేయవలసినపని యిది. మీవర్ణానికి శాస్త్రంవల్ల విహిత మైనధర్మాన్ని అనుసరిస్తూవుండండి. కొంతకాలానికి (కొన్నిజన్మలకు) ఉన్నతస్థానం పొందగల్గుతారు. మనువు మీధర్మాన్నిలా చెప్పేడు- "ఏకమేవతు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్ । ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషా మనసూయయా." ఏదో మీ పూర్వజన్మకర్మకు ఫలంగా మీజాతి వచ్చింది. ఇప్పుడుగూడా అనవసరంగా బ్రాహ్మణదూషణ చేస్తూ వుంటే ముందు మరేమౌతుందో!? మరోమాట. ఇప్పటి బ్రాహ్మలు శాస్త్రవిరుద్ధంగా వర్తిస్తున్నారనీ, అందుకని నేను నోరుచేసుకున్నాననీ అంటారేమో? సరే బ్రాహ్మణు లగ్రవర్ణంవారు. ఆచరణం, ప్రచారణం రెండూ వారిధర్మాలు. అట్టివారే పాపాలకు పాలుపడితే పోనీ వారిపాపాన వారే పోతారు. మీ కెందుకు లేనిపోనిశ్రమ?" అని.

చివరి కొకమాట చెప్పి విరమిస్తున్నా. నావ్రాతలు చూచి కొంతమంది నేను కేవలం బ్రాహ్మణమాత్ర పక్షపాతినని భ్రమ పడతారేమో! అదిచాలా పొరపాటు. జాతిగతంగా ఒకబ్రాహ్మలనే గాక ఇంకెవర్ని తిట్టినా నేను సహించేవాణ్ణి గాను. చాతుర్వర్ణ్య ప్రజలూ పరస్పరసౌహార్దంతో మెలగటం నాముఖ్యాశయం. కలి ప్రాబల్యంవల్లఅన్ని జాతుల్లోగూడా ధర్మ మడుగంటిపోతూంది దాన్ని రక్షించటాని కంతా ప్రయత్నించాలి.

---

## 8. వితంతూద్వాహ ప్రకటనపరామర్శము.

["కల్పవల్లి" పత్రికలో (1–9–40) 19 సం. వయస్సున ముద్రాపితము]

ఇటీవల ఒకరోజున "ఆంధ్రప్రభ" పత్రిక మడత విప్పేసరికి రెండోపుటలో ఒక ప్రకటన కండ్లకు కనుపించింది. "లోకో భిన్న రుచిః" అన్నారు. ఇంకా ఎన్నెన్నో వార్తలూ ప్రకటనలూ వున్నా "6 గురు వరులు కావలెను" అనేశీర్షకను చూడటంతోటే నాదృష్టి ఆ ప్రకటనపైకే ఆకర్షింపబడ్డది. ఒక్కగుక్కలో చదివేశాను ఏంవిశేషమో అని. అందులో సారాంశం ఇది. ఒక బ్రాహ్మణ తెలగాణ్యపు వితంతువు, ఇద్దరు బ్రాహ్మణ వెల్నాటివితంతువులూ, ఇద్దరు వైశ్య బాలవితంతువులూ ఒక గొల్లవితంతువూ, మొత్తం ఆరుగురు వితంతువులు వివాహానికి సిద్ధంగా వున్నారట. వీరి కందరకూ సవర్ణులూ, సశాఖీయులూ, సంస్కరణ ప్రియులూ, ఐనవరులు కావాలి అట! అందుకు సిద్ధపడేవరులు గడువులోపల దరఖాస్తులు పంపుకోవాలట. "భలే మంచి చౌకబేరము!" ఏమంటారు? ♦ ♦

డాక్టర్ వి. కే. రావు (సెక్రటరి, స్త్రీ పునర్వివాహసహాయక సంఘం, నరసాపురం) గా రీప్రకటన చేసేరట. కాని వీ రనుకున్న విధంగా సరియైన వరులు దొరకరని తోస్తోంది. కారణాలు చెపుతా వినండి. వీరు సవర్ణులూ, సశాఖీయులూ, కావాలి అని కోరిఉన్నారు. నిజంగా వర్ణమనేది ఒకటి వుంటుందనీ, వారివారికి విహితాలైన కర్మల నాయావర్ణాలవా రనుష్ఠించుతూ వుండాలి అనీ, ఈ వర్ణాలవారు తమవర్ణీయులతో మాత్రమే సంబంధ బాంధవ్యాలు కలిగివుండవలెనని, అలావుండకపోతే వర్ణసాంకర్యం, తన్మూలకంగా లోకవిప్లవం కలుగుతుందనే దూరదృష్టి, వివేకం, కలిగిన మానవు డెవడూ ఈలాంటి విధవా వివాహాలకు అంగీకారం చూపించడు. పైగా ద్వేషిస్తాడు. అలాంటివాడు వీ రనుకొనేవిధంగా సంస్కర్త కావటం అసలే అసంభవవిషయం. పోనీ, ఎవడైనా ఏదోకారణంవల్ల అంగీకరించి వివాహం

చేసుకుంటాడనే అనుకుందాం. అయితే అపుడు వాడు వర్ణభ్రష్టుడే పోతాడు. ఏవర్ణంగూడా లేనివాడు వీరి కేలా ఉపయోగించుతాడు? ఇక ఈలాంటి ప్రకటనలకోసం చంద్రచకోరన్యాయంగా నోరు తెరుచుకొని ఎదురుచూచే రకంవా రొకరుంటారు. కాని వారు వర్ణవిభేదాన్ని అంగీకరించనే అంగీకరించరు. ఇక ఇది కుదిరే దేలా? ... ...

ఒకమాట. శాస్త్రవిరుద్ధమైన వితంతూద్వాహంకోసం ప్రకటన చేస్తూగూడా వర్ణవిభేదాన్ని పోకుండా పట్టుకున్నారే! ఈప్రకటన చేసినవారి అభిప్రాయం ఏమైయుంటుంది? అసవర్ణ వివాహంమాత్రం అశాస్త్రీయమనీ విధవావివాహం శాస్త్రీయమే అనేనా? నిజంగా వీరు సంస్కర్తలైతేమాత్రం ఈలాంటి దురభిప్రాయం పడటాని కవకాశ ముండదు. అసవర్ణవివాహం, వితంతూద్వాహం, వివాహవిచ్ఛేదం మొదలైనసంస్కరణలలో కొన్నిటిని మాత్రమే శాస్త్రీయాలని మిగిలిన వశాస్త్రీయాలు కావున ఆచరణానర్హాలనీ తలంచటం ఆధునికుల సంస్కరణ దృష్టిలో మహాద్రోహం. ఆలా తలంచే వారికి సంస్కర్తృ సమాజంలో సభ్యత్వం వూడిపోతుంది. వీరిమీద సంస్కర్తలు డిసిప్లినరీచర్య తీసుకుంటా రింక. ఎవరో చాదస్తపు బ్రాహ్మణుడు కాఫీహోటలులో ఇడ్డెన్లు ప్రాణాహుతులు వేసుకున్నాడట! ఆలాగే వుంది ఈవిషయం. మూలభాగవతంలో బ్రాహ్మణవేషంవంటి దిది- కాదూ? ♦ ♦ ♦ ♦ ♦

“చెరకుతుద వెన్నుపుట్టిన” అన్నా డెవరో మహానుభావుడు. ఏనాడు మనభారతీయులు పాశ్చాత్య నాగరకతను తమకు పరమాదర్శంగా ఏర్పరుచుకున్నారో అదిమొదలు అన్నిరకాల దౌర్భాగ్య లక్షణాలు దిగుమతి పోతున్నా సీమస్టీమర్లమీాదనుంచి. పాశ్చాత్య నాగరకత భారతసౌభాగ్యానికి వెన్నువంటిది. ఈవెన్నువల్ల చెరుకు చాలావరకు చెడ్డది. ఇకనైనా మేలుకొని వెన్ను నరికి సరియైనరక్షణం చేయకపోతే ఇదీ చెడుతుంది. మనవా రెవ్వరైన ఎరుగుదురా ఈలాంటి ప్రకటనలను! ఇది వ్యాపారవస్తువులను ప్రకటించడమా? మనుష్య

లనుగూడా బేరం జేయటమా? ఘోరం ఘోరం. ఈలాంటి పాపిష్ఠి పనులకోసం ప్రత్యేకంగా కొన్ని సంఘాలుగూడా స్థాపింపబడుతూ వున్నై. ఇది మంచికా? చెడుకా? నేను చెప్పటం ఎందుకు? పెద్దవాడు మనువు అన్నమాట చూడండి—

"కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేన చ।
కులా న్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ."

---

## —♦ 9. ధర్మారావుగారి మానవపశుత్వవాదనిరాసము ♦—

["కల్పవల్లి" పత్రికలో 15—9—40 19 సం. వయస్సున ముద్రాపితము.]

ఈ మధ్య "కాగడా" పత్రికను చూడటం తటస్థించింది- సంపాదకీయానికి ఎదురుగా వున్న పేజీలో "తోడి పెండ్లికొడుకు తంతు" అనే శీర్షిక కనుపించింది. వ్యాసకర్త పత్రికాసంపాదకుడే! ఏమిటో చూదామని మొదలెట్టేను. మొదటనే "కటువుగా వుంటుంది—అసహ్యం వేస్తుంది- ఇంకా తిన్నా అనిగూడా బుద్ధి వుడుతుంది" అనే మాటలున్నై. ఐనా చూదామని ఓపికతో కొసంటా చదివేసేను. విషయంలో నాకు చాలా భేదాభిప్రాయం ఉన్నది. కాని వ్యాసకర్త సామర్థ్యం చాలాగొప్పదనీ ప్రశంసనీయమనీ గ్రహించాను. కారణం చెవుతా వినండి. మహానుభావుడు! ప్రతిజ్ఞాపూర్వకంగా ప్రారంభించి ఆవిధంగానే పూర్తిచేసి అవితథప్రతిజ్ఞుడైనాడు. ఇదే కారణం. వ్యాసం పూర్తిగా చదివినప్రతిమానవునకు మొదటి మూడుమాటలూ అనుభవంలోకి వచ్చితీరుతై. ఒకవేళ ఆలా అనుభవం కలగకపోతే అందుకు హేతు వాపాఠకునిబుద్ధిలోపం అనేచెప్పవలసి వుంటుంది గాని, వ్యాసకర్త సామర్థ్యలోపం అనటాని కవకాశం లేదు. ...

ఇక విషయంలోకి దిగుదాం. "ఆరోజుల్లో ఆడది అంటే అందరకీ పనికివచ్చేది. అంటే జత కలవటానికి,.. ఆరంభంలో మనిషికీ

జంతువుకీ అట్టే వ్యత్యాసం లేదు...జంతువులలో ఇది తగును, ఇది తగదు, అన్న నిషేధం-జతకట్టడంలో కనబడదు. అలాగే మనుష్యులలోగూడా;" అంటూ విమయా న్నారంభించారు. ఇక్కడ నా మాటలు రెండున్నై. సృష్ట్యారంభంలో ఎప్పుడో మానవులు పశుతుల్యులుగా వుండేవారని చెప్పడం ఎందుకు? "ఆహారనిద్రా భయ మైధునాని సామాన్య మేత త్పశుభి ర్నరాణాం" అని శంకరులవారు సెలవిచ్చి నట్లు ధర్మం, అధర్మం. యుక్తం, అయుక్తం, తల్లి, పెండ్లాము-అనే భేదజ్ఞానం లేకుండా లోకాయతికులై వుండే వారంతా (ఇవుడు గూడా ఆరకంలో చేరదగినవారు) చాలామంది వున్నారు గదా? నాఅభిప్రాయంలో ఆరకంవారు ఇప్పటివారికన్నా ఆరంభంలో చాలా తరుగుగా వుండేవారని. సమయాని కక్కుర కలగటంవల్ల కాబోలు "మన బ్రహ్మ కూతురిని పెళ్ళిచేసుకున్నాడు" అని తా మున్నాడనే నమ్మని బ్రహ్మదేవుణ్ణి ఉదాహరణంగా తీసుకోవచ్చారు. పాపం అవసరాని కడ్డమైన......తినవలసివచ్చింది.

ఇంకొంచెం చూడండి "జంతుకోటిలో తల్లీపిల్లా జతకట్టుతునే వున్నాయి, తండ్రీ కూతురు జతకట్టుతునే వున్నాయి. అక్కా తమ్ముడూ జతకట్టుతునే వున్నాయి." నా కిక్క డొకవిషయం జ్ఞప్తికొస్తోంది. 5-6 ఏండ్లక్రింద ఏదో గ్రామంలో ఆంబో తొకటి తన తల్లితో తనను మాయోపాయాలతో కలిపేదన్న కసివల్ల అప్పటి కప్పుడే ఒక ఆసామిని పొడిచి చంపిందని వార్త పత్రికల్లో ప్రకటింపబడ్డది. ఆవార్తను వ్యాసకర్త చూచి వుండ దనుకుంటా. విద్యా వివేకాలు లేని జంతువులుసైతం కొన్నిధర్మాధర్మాల విషయంలో జాగ్రత్తగా పరివర్తించడం నేర్చుకుంటూ వున్నై. అన్ని అవకాశాలు గల ఈలాంటిమానవులో పశువులవలె వుండటం తటస్థించలేదే అని దిగులుపడుతూ వున్నారు. భలే బాగుంది! ... ...

డార్వినుపండితుడు పరిణామసిద్ధాంతాన్ని లేవదీసేను. ఈ సిద్ధాంతంలో మానవజాతి పశుపక్ష్యాదులలోనుంచి ఏర్పడ్డదే. ఈ

వ్యాసకర్తగారి కాసిద్ధాన్తంమీద విశ్వాసం వుండివుండొచ్చు. మన మసలు జంతువుల్లోనుంచి ఏర్పడ్డవాళ్ళమే కావటంవల్ల అధర్మాలనే అనుసరించడం ముఖ్యం అనే అభిప్రాయంతో ఈలా వ్రాసివుండ వచ్చు. అయితే ఇక, మాసనాతనులంతా ఈయనకు "నమోస్త్వనం తాయ" చెప్పవలసివుంటుంది. ఏమంటారా? ఈయన అత్యంతపురా తన ధర్మాల నుద్ధరించడానికి పూనుకుంటున్నాడు కదూ! అందుకు- కాని ఇంతకూ పర్యవసానంలో ఈయన సంస్కరణాభిప్రాయాలు ఫలిస్తాయని నాకు విశ్వాసం లేదు. స్త్రీస్వాతంత్ర్యోపన్యాసకులైన ధీరాగ్రేసరులుకూడా ఇంటివద్ద భార్య తనమాటలో వుండాలి అని అఘోరిస్తునే వుంటారు. స్వేచ్ఛాప్రేమ అంటూ కథలు వ్రాసేవారు సహా స్వంతందగ్గరకు వచ్చేసరికి అమ్మా నే నొప్పుకోనని పేచీ పెడు తున్నారు. అందువల్ల ఇప్పుడిప్పుడే వీరి కంతగా ఆనుకూల్యం కలగదని తోస్తుంది. కలిపురుషుని అనుగ్రహంవల్ల ఇంకా కొంతకాలాని కేమైనా ఆలాంటి అవకాశం వస్తుందేమో నిరీక్షించమని నా సలహా.

మరిచిపోయినా ఒకచిన్నమాట. అసలీవ్యాసకర్త పేరు "ధర్మా రావు" సుమాండీ! 'ఇంటిపేరు కస్తూరివారు, దగ్గిర గబ్బిలాల కంపు' అన్నట్లు లేదా? ఏమంటారు?—సెలవు.



## —♦ 10. బెంగాలులోని విధురవిధవావివాహపు బిల్లువిమర్శము. ♦—

"కల్పవల్లి" పత్రికలో 1-10-40 19 సం. వయస్సున ముద్రాపితము.

బెంగాలు శాసనసభలో ఒకబిల్లు ప్రవేశపెట్టేరట. ఈ బిల్లు ప్యాసుఅయితే ఆలి చచ్చిన మగవాడు, మగడు చచ్చిన ఆడదాన్నే కాని ఇంకో ఆడదాన్ని పెళ్ళాడటాని కవకాశం ఉండదట. పర్యవ సానంలో ఈ బిల్లు ముఖ్యోద్దేశం అనాథలై అల్లాడుతూవున్న బాల విధవల కందరకూ పెళ్ళిళ్ళు కావటం. కాని నా కొకసందేహం

వుంది. సంస్కర్త లందరూ ఈ బిల్లు విషయంలో మనఃపూర్వకంగా అనుకూల్యం చూపించరేమో అని— ... ...

ఇప్పటికే కొంతమంది సంస్కర్తలు ఈ బిల్లు తృప్తికరంగా లేదని పెదవులు విరుస్తున్నట్లు తెలుస్తోంది. ఈబిల్లువల్ల కొంతమందికి మాత్రం విధవలకు వివాహం జరగటాని కవకాశం వుంటుందని గాని అసలు బాలవైధవ్యం అనేది లేకుండా పోదనీ, అందువల్ల ఈ బిల్లు అంతగా ఉపయోగంగా లేదనీ అంటూన్నారట. కొంతమంది ఇది డైవోర్సు సిద్ధాన్తానికి అనుకూలంగా లేదు. అందువల్ల బాగాలేదనీ అంటున్నారట. ఇక ఫ్రీ లౌ సొసైటీవారు తమ సిద్ధాంతానికి కేవలం విరుద్ధంగా వుందనీ, ఒక పురుషుడు తన కిష్టమైన స్త్రీని ప్రేమించి వివాహంచేసుకోటాని కీబిల్లు అవకాశం లేకుండా జేస్తోంది కావున ఇది ఘోరంగా వుందనీ పవిత్రప్రేమను శాసనాలద్వారా అడ్డగించకూడదనీ ఘోష పెడుతున్నారట. ఇక మా ధర్మారావుగారిమతం దీనికి అనుకూల్యాన్ని చూపించటము లేదు. వారిమతంలో విధవ ఏమిటి ముత్తైదు వేమిటి, భార్య ఏమిటి, భర్త ఏమిటి, లేనిపోని నియమాలు— పశుపక్ష్యాదుల్లో లేని నియమాలు మన కెందుకు? ఈశాసనా లెందుకు? అంతా అనవసరం అని "గజం మిథ్య పలాయనం మిథ్య" అనేస్థితిలో వుంటుంది వారిదృష్టి-ఇలా వుంది సంస్కర్తలదృష్టి.

ఇక మా సనాతనధర్మపరులను అడగాలసిన అవసరం లేదు. విధవావివాహం అంటే పనికిరాదని వేయి ప్రమాణాలు చూపిస్తారు. శ్రుతి స్మృతి సదాచారముల కీబిల్లు కేవలం విరుద్ధంఅని నిరూపిస్తారు. కావాలి అంటే ఇంకా లౌకిక యుక్తులతోగూడా ఈబిల్లు సర్వవిధానర్థ సంపాదకమని నిరూపిస్తారు. కాని వారిమాటలు వినిపించుకొనేవారు చాలా తరుగు. పైత్యరోగికి మాస్తరు పీరిపలుకు లధునాతనుల చెవి కెక్కవు. పోనీయండి మామాటలు వినిపించుకొనకపోతే పోయేరు; మీలో మీరైనా అంతా వకమాట అనుకొని ఏపనైనా చేయుండని నాప్రార్థన. ♦ ♦ ♦ ♦ ♦ ♦

ఏదీ ఒక్కపనైనా మీఅందరకూ తృప్తిని కలిగించిందా? అని నా ప్రశ్న. శారదాగారిబిల్లుతో గాంధీగారికి తృప్తి కలుగలేదు. ఆయన ఇంకా గునుస్తున్నాడు-18 ఏండ్లని పెట్టలేదని. దేవాలయ ప్రవేశ చట్టం కాంగ్రెసువారు ప్యాసుచేసినా సోషలిష్టువారి కిష్టంగా లేదట. లేనిపోంది దేశంలో ఇంకా దేముడు దైవం అనే పిచ్చి కింకాంత పాడుచేస్తున్నారని కాంగ్రెసువారిమీద కొరకొరలాడుతున్నారట. కాంగ్రెసువారు లోపాయికారీగా మేముమాత్రం అలాంటివని చేస్తామా? దేముడు దైవం అనే విశ్వాసం నశింపజేయటాని కిదో ఉపాయం; ఇదీ ఇందులో రహస్యం అని చెపుతున్నా సోషలిష్టులు సంతృప్తులు కాలేదు? ఇలా తమలో తమకుగూడా మనసులు కుదర కుండా ఏ సేవచేసినా దానివల్ల వారికిగూడా లాభముండదు. వ్రతం చెడ్డా ఫలం దక్కవద్దూ? ♦ ♦ ♦

'కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభం' అన్నట్లు ఉంటే ఏలా? ఇక ప్రస్తుతానికి సంబంధించినమాట వకటి వ్రాసి విర మిస్తా, చూడండి-ఒక వేళ ఆలి చచ్చినవాడు మగడు చచ్చినదానినే పెండ్లాడినా, వాళ్ళిద్దరికీ 'ఆలి చచ్చినవాడు, మగడు చచ్చినది' అనే పేరు పోదేమో పాపం!

---

## ——♦ 11. సినీమా పరిశ్రమములు కామ ప్రచారకములే ♦——

["కల్పవల్లి" పత్రికలో 15-10-40 19సం. వయస్సున ముద్రితము.]

నానాటికి సినీమా పరిశ్రమ అభివృద్ధి చెందుతోంది. రోజు రోజుకూ క్రొత్తక్రొత్త సినీమాలు తయారౌతున్నై. ఒక్కో ఫిలిం లక్షలకొద్ది డబ్బు తింటూవున్నది. వేలకొద్ది భారతీయ యువతులు కళోద్ధరణ అనే వంకతో నాట్యరంగాలమీద కెక్కి నలుగురుజను లనూ ఆకర్షించుకుంటూ వున్నారు. ఇంతకూ పెద్దపెద్దలు సహా చాలా మంది ఈ సినిమాలమూలకంగా ప్రపంచాని కేదో గొప్ప ఉపకారం

జరుగుతుందనే నమ్మకంలో వుండటం ఈ పరిశ్రమ ఇంతగా అభివృద్ధి చెందటానికి కారణం—ముఖ్యంగా పత్రికలు సినీమా పరిశ్రమవిషయం లో చూపించే సానుభూతి అపరిమిత మని చెప్పొచ్చు. ప్రతి పత్రిక గూడా సినీమా విషయాల కొక ముఖ్యస్థానాన్ని ఇస్తూవుంది సామాన్యంగా. నిజంగా వీరందరకూ గూడా సినీమాలవల్ల దేశానికి గొప్ప ఉపకారం కలుగుతుం దనేవిశ్వాసము లేకపోతే ఇంత సానుభూతి చూపరు. నాకుమాత్రం విచారిస్తే సినీమావల్ల లాభమేదీ కనుపించడం లేదు. పైగా చాలా అనర్థాలే కనుపించుతాయి—

ఈ మధ్య నేను రైలులో ప్రయాణం చేస్తూవున్నాను. స్టేషన్ లో ఒక కుర్రాడు పత్రిక లమ్ముతూవున్నాడు. ముఖపత్రం మీాద ఒక సినీమాతార చిత్రింపబడ్డ పత్రికను చేత్తో పట్టుకొని అందులో చిత్రాన్ని చూపెడుతూ పేరుచెపుతూ (నేను పేరు వ్రాయడం ఎందుకులెండి) 'చూచేరా? దీన్ని బేడా కిచ్చేస్తా! ఆలస్యంచేస్తారేం, భలే ఛాన్స్; కొనండి' అని కేక వేస్తున్నాడు— భారతయువతికీ నలుగురిలో ఈలాంటి గౌరవం జరిగిందంటే దీనికి కారణం సినిమా పరిశ్రమ కాదూ? ఎక్కడెక్కడ వుండే భారతమానినీమణుల చిత్రాలు సైతం ప్రతికాలేజీ విద్యార్థి నోటుబుక్ లోకి ఎక్కుతున్నై అంటే ఇది సినీమా పరిశ్రమఫలితం కాదూ? మొన్న మొన్నటిదాకా గడపదాటి కాలు పెట్టకుండా కాలక్షేపం చేసిన మనభారతీయ కులవనితలు నేడు వేల కొలదిగ సినీమారంగమెక్కి నెలకు నలుగురికి భార్యలుగ అభినయం చేస్తూ వున్నారంటే ఇదంతా సినీమా పరిశ్రమ ఫలితం గాదా?

ఇదివరలో ఎన్నో పౌరాణిక చిత్రాలు వచ్చి వెళ్ళినై. వేల కొద్ది జనం చూచి సంతోషించారు. కాని, ఆ చిత్రం మూలకంగా ఏదో కొంచెమైనా నీతిని గ్రహించినవా ళ్ళెంతమంది వుంటారు? నూటికి ఒకడైనా వుంటాడో లేడో? అందాకా ఎందుకు! నటీనటుల పేర్లేగాని కథలోని పాత్రల పేర్లైనా గుర్తుంచుకున్నవారూ చాలా తక్కువే. సినిమా చూచినస్త్రీలలో కథలోనిపాత్రలను సీత,సావిత్రి

మొదలైనవాళ్ళను) అనుకరించాలని అనుకుండేవాళ్ళు వేయికి ఒకరుం టారో లేదో కాని ఆపాత్రను ధరించిననటిని అనుకరించాలి అనుకుం డేవారు చాలామంది వుంటారు. ఈలాగే పురుషుల్లోగూడా వుంటుంది. ఈమధ్య సాంఘికవిషయకసినిమా లెక్కువైనై. వీటిలో కథలోనైనా నీతి దొరుకదు. ఇక మంచితనానికి కవకాశం ఎక్కడ?

కొంతమంది ఏమైనా అంటే కళ, కళ, కళ నశించిపోతుంది అని కళాభిమానమంతా కాలిపోతున్నట్లు లబ్బున మొత్తుకుంటారు. కాని నాదో ప్రశ్న. ఇదంతా కళాభిమానమేనా? ఐతే వక మాట. కళ అనేది ఆడవాళ్ళవద్దనేగాని మొగవాళ్ళవద్ద వుండదా? ఐతే ప్రతి పత్రికముఖపత్రంమీద నూటికి ఎనభై వంతులు స్త్రీ చిత్రమే వుం టుందే కారణం ఏమిటీ? ఇదభిమానమా? లేక వ్యామోహమా?

ఈమధ్య వకచిత్రంలో ఒకజమీందారున్నట్లు, ఆయన రైతుల మీద అధికం-పన్ను వేసి వాళ్ళని పీడించుతూవున్నట్లూ వుంది. నాకు చూడ ఈ సినీమాలు తయారుచేసే వారికన్నా ఆ జమీందారే నయ మనిపిస్తుంది. ఏమంటారా? ఆయన వసూలుచేసేదంతా చాలా వరకు బహిరంగంగానే వసూలుచేస్తాడు; కాని ఈసినీమావాళ్ళో మెల్లగా జనాన్ని మోసగించి, ఎరను చూపి చేపను పట్టినట్లు వాళ్ళనుంచి లక్షలకొద్ది సొమ్ము వసూలుచేస్తున్నారు. వీరికన్నా జమీందారునయం కాదా? ప్రజలకు పన్ను తగ్గించాలి అని ప్రయత్నించే మహానుభావులు ఈ పన్నుగూడా తప్పించే ఉపాయం చూస్తే పుణ్యం వుంటుంది.



## 12. నేటిశాస్త్రిగార్లకుగూడా సంధ్య నామోషీగా నున్నది.

"కల్పవల్లి" పత్రికలో 1-11-40 19 సం. వయస్సున ముద్రాపితము

ఎవరో శాస్త్రిగారట. ఈమధ్య ఆంధ్రపత్రికలో సంపాదక లేఖల్లో "భరతవర్షే భరతఖండే" అనే శీర్షికతో తన సందేహానికి

సమాధానం ఈయవలసినదని పార్థించి ఉన్నారు. పశ్న మంచిదే. విచారణీయమే కావచ్చు. కాని అందులో అనవసరమైనపైత్యం కొంత చూపించాడు. చూడండి. "చిన్నప్పుడు సంధ్యావందనం చేసేరోజుల్లో పూట పూటా ' జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణ దిగ్భాగే" అనేచోట సందేహం కలిగేది. సంధ్యావందనాదులతో సంబంధము లేని యీరోజుల్లోగూడా నాకు ఆనాటి సందేహం సందేహంగావుంది' అని అవతరణిక పట్టేడు. ప్రస్తుతవిషయానికీ సంధ్యావందనానికీ ఏదోసంబంధం వున్నదనే అనుకోండి; ఐతేమాత్రం అంతమాత్రాన "నేను చిన్నతనాన సంధ్య వార్చేవాడినికాని ఇవుడు మానేశాను" అని తనయోగ్యత కాస్త బయట పెట్టుకోవలసిన ఆవశ్యకత ఏమి వుంది? ఈలా తనతోంటచేయి బయట పెట్టుకోవటం ఎందుకు?

శీర్షికను చూడడంతోటే సామాన్యంగా ప్రతివారికి సంధ్యావందనసంకల్పంలో యీమాట వున్నసంగతి గుర్తుకురావచ్చు. అందువల్ల ఒకవేళ పొరపాటున ఆశీర్షిక చూచినవారు తనను సంధ్యవార్చేచేదస్తుల్లో లెక్కించేస్తారేమో అనేభయమా? ఈలాంటి అనుమానమే పత్రికాధిపతులకుగూడా కలుగుతే తనలేఖను పత్రికలో ప్రకటించనే ప్రకటించరేమో అనే సందేహమా? ఒకవేళ ప్రకటించినా సమాధానం వ్రాయతగినవారెవరైనా చూచి "అరే వీడు సంధ్యవార్చే చేదస్తుడులాగా వున్నాడే; అయితే ప్రతికాముఖంగా ప్రశ్నించడానికి అర్హతే లేదు" అని వషట్కరిస్తారేమో అనే అనుమానమా? లేక చచ్చిచెడి శాస్త్రినైనా నన్నట్లు పేరుగూడా లేకుండా కేవలం శాస్త్రి అనిమాత్రమే ఉటంకించుకున్నతన నెవరైనా ఏమయ్యా ఏది నీశాస్త్రిత్వం? అని ప్రశ్నిస్తే, నేను చిన్నతనంలో కొన్నాళ్లు సంధ్యవార్చే వాడిని లేండి, అని సమాధానంచెప్పటానికా? లేక తన రిఫార్మరుస్నేహితు లెవరైనా ఏమోయి! భరతవర్షే భరతఖండే అని ఏదో వ్రాసేవు. ఏం! ఇంకా సంధ్య వారుస్తున్నావా ఏమిటి? అని హేళనచేస్తే, అది చిన్నప్పటి అజ్ఞానదశలోని మాట, చాలించి చాలా

కాల మైందిగదా? ఆవిషయం ఆపత్రికలోనే వ్రాసేను చూచుకోండి అనిసమాధానం ఈయటానికా? ఎందు కీవిషయం వ్రాయటం. ...

సంధ్య అనేది నిత్యకర్మ అంటే చేసితీరవలసినపని. చేయక పోతే ప్రత్యవాయం కలుగుతుంది. ఈలాంటి సంధ్యావందనాన్ని ఇప్పుడు సక్రమంగా అనుష్ఠించేవారు నూటి కొకరైనా వున్నారా అంటే, లేరనే సమాధానం చెప్పవలసివస్తుంది. కాని బుద్ధిమంతుడైనవాడు తాన శ్రద్ధవల్ల అనుష్ఠించకపోయినా తా ననుష్ఠించలేక పోయినందుకు లజ్జపడవలసివుంటుంది. అంతేగాని యీవిధంగా పత్రికలో సాటించుకోవడం బుద్ధిమంతుడిలక్షణం కాదు. స్వధర్మపరిత్యాగానికి లజ్జించడానికి బదులు తన నెవరైనా పొరపాటున స్వధర్మపరుడని భ్రమపడుతారేమో అని నేటి బుద్ధిమంతులు భయపడుతున్నా రంటే ఇంతకన్నా భారతీయులం, హిందువులం అని గుండెలు చరచుకొనే వారు లజ్జించవలసినవిషయం మరొకటి వుండబోదు. ... ...

ఇది వ్రాస్తూవుంటే మా శర్మ చూచి "పర్యవసానంలో ఈయన కింతవరకూ సంధ్యాసంకల్పం గుర్తుండడంఅనేది ప్రశంసనీయం సుమా" అన్నాడు. ఎట్లా వుంది వాడిమాట?

---

## 13. సనాతనసభలకు వచ్చేడివారంతా నిజమైనసనాతను లేనా?

"కల్పవల్లి" పత్రికలో 15-11-1940 19 సం. వయస్సున ముద్రాపితము

నా మధ్య ఒకజాతీయవాదితో వాదన వచ్చింది. మాటమీద మాటగా సంభాషణ చాలావరకూ పెరిగిపోయింది. ఆయన నన్నాక్షేపిస్తూ యీలా అన్నాడు—"ఏదీ చూపించండి మీలో నిజమైన సనాతను లెంతమంది వున్నారో? సంతకాలకూ సభలకూ వేలకొద్ది సనాతనులు తయారౌతారు. కాని తీరా విచారిస్తే, అందులో నికరమైన సనాతను డొకడో యిద్దరో వుంటారో వుండరో! సక్రమంగా వేద

శాస్త్రవిహిత కర్మల నన్నింటినీ అనుష్ఠిస్తూవుండే నికరమైన సనాతనులు ఈ భరతఖండం మొత్తం వెతుకుతే వకళ్ళిద్దరు దొరుకుతారేమో” అని. నాకు నవ్వొచ్చింది. ఈయన అభిప్రాయంలో 44 లక్షల కాంగ్రెసు సభ్యులూ పదహారువన్నె బంగారంవంటివారే కాబోలు! నే నీలా సమాధానం చెప్పేను. ♦ ♦ ♦ ♦

అయ్యో! మా సనాతనుల సంఘంలోనే కాదు,- మరేసంఘంలోనైనా అనుష్ఠాతలు స్వల్పంగా వుంటారన్న విషయం తా మెఱుగరేమో! మీ కాంగ్రెసులోనే చూడండి. 44 లక్షల సభ్యుల్లో అందరూ ఖద్దరు కడుతున్నారూ? ఇంతమందిలో కేవలం దేశభక్తితో కాంగ్రెసులో చేరినవా రెంతమంది వుంటారు? అందరూ దేశభక్తి కలవాళ్లేనా? అందరూ సత్యాహింసలను పాటించే వారేనా? నిజంగా విచారిస్తే దేశభక్తితో కాంగ్రెసులో చేరేవారి సంఖ్యకంటే అధికారవాంఛ, స్వార్థలాభం, గౌరవం మొదలైన కారణాలతో కాంగ్రెసులో చేరేవారిసంఖ్యే అధికంగా వుంటుందని మీరే తెలుసుకోవచ్చు. గాంధీగా రెంత నెత్తిన నోరుపెట్టుకొని మొత్తుకుంటున్నా అహింస నవలంబించేవారు కాంగ్రెసులో ఇప్పటికి నూటికి పదిమందిగూడా వుండరు. * * *

ఈమధ్య ఎక్కడనో జిల్లాబోర్డుకు మెంబరుగా కాంగ్రెసుతరఫున నిలువబడి గెలచిన ఒకాయన పైకి ఖద్దరుచొక్కా వేసి లోపల విదేశవస్త్రపు బాడీ వేసుకొని వుండంగా ఎవరో ఆరహస్యం బయటవేసి అవమాన పరిచారట. ఈలాంటి కాంగ్రెసు సభ్యులతో నిండివున్న కాంగ్రెసు మేకపోతుగాంభీర్యంతో ఇతరుల్ని ఆక్షేపిస్తే ఎవ రూరుకుంటారు? ఎంత మద్యనిషేధం చేసినా ప్రతిదినం బ్రాందీసీసాలు ఖాళీచేస్తుండేమహానుభావులు పేరుచెందిన పెద్దపెద్ద దేశనాయకుల్లోనే కొంతమంది వున్నారు. (ఇంకా పైతరగతిగూడా వుందని వినికిడి) ఈలాంటివారికి మాలో ఆచరణశూన్యు లెక్కువ అని ఆక్షేపించడాని కర్హత ఎలా వుంటుంది? మీరే చెప్పండి.

మరోమాట. సనాతనధర్మాన్ని సంపూర్తిగా అనుష్ఠించేవాడు ఈకలికాలంలో వుండటం సందేహాగ్రస్త విషయమే. కాని సంపూర్తిగా సనాతనధర్మాన్ననుసరించేవాడే సనాతనుడంటే కుదురదు. ఇక నేమంటే సనాతన ధర్మంమీద సరియైన విశ్వాసముతో యథాశక్తి తదనుష్ఠానం చేసేవారంతా సనాతనులే. ఈలక్షణం మాలో అందరకూ చాలావరకు అన్వయిస్తుంది. అందువల్ల మేమంతా సనాతనులమే అనే సరికి మళ్లీ సమాధానం చెప్పకుండా "మీదో సోది" అని విసుక్కుంటూ లేచిపోయినా డాయన.



## —♦ 14. మళయాళస్వామి కిందరు బ్రహ్మరథం పట్టడాని కుండేకేటుకు ♦—

"కల్పవల్లి" పత్రికలో 15—6—41 20 సం. వయస్సున ముద్రాపితము

షుమారు నాల్గునెలలనుంచీ కల్పవల్లిలో 'ఉన్నదున్నట్లు' కనుపించకపోవడం చాలామంది పాఠకుల కసంతృప్తిని కలుగజేసింది. చాలామంది అడుగుతున్నారు. నేను ఈమధ్య ఉపసంహరించుకోటానికి హేతువు లేకపోలేదు. నా వ్రాతవల్ల కొంతమందికి మనోవ్యథ కల్గిన మాట నిజం. కాని ఆమనోవ్యథను కొంతమంది లోలోపల దిగమింగగలిగేరు. కొందరు గుసగుసలాడేరు. ఎం. జి. కృష్ణారావుగారు మాత్రం అలా సహించి వూరుకోలేక నాకు లేఖ వ్రాసేరు. పత్రికలో ఏదోసమాధానంగా వ్రాసేను. నిజానికి యథార్థవాదీ లోకవిరోధి అన్నట్లు నాబోటివాడు లోకాగ్రహానికి గురికావలసి వస్తూవుండడం సహజం. ఎందు కిందరకు ఆగ్రహం కల్గించడమనే ఆశయంతో ఈ మధ్య నావ్రాత ఉపసంహరించేను. కాని పాఠకులబలవంతంవల్ల మళ్లీ కలం చేపట్ట వలసివచ్చింది. ♦ ♦ ♦ ♦

ఈమధ్య గుంటూరుకు మళయాళస్వామివారు వచ్చారు. వారికి పురప్రజ లఖండస్వాగత మిచ్చి గౌరవించారు. ఏబజారు చూచినా

సద్గురుస్వామివారికి స్వాగతమనే తడికలే. ఎచట చూచినా రంగు రంగుల తోరణాలే. ఎచట చూచినా శ్రీవారి వేదాంతోపన్యాస ప్రకటనలే. ఆహా ఇప్పటికీ ఇంతగా ప్రజలలో గురుభక్తి పాదుకొని వుంది గామోల్సని ప్రతివాడూ సామాన్యంగా భ్రమపడదగినంత హడావుడి జరిగింది. విచారిస్తేమాత్రం విపరీతంగా వుంటుంది. ఇదివరకు గుంటూరుకు గురుస్థానీయు లగుసన్యాసు లెవరూ రాకపోలేదు. ఇంతమాత్రం వక్తలుగాని పండితులుగాని రాకపోలేదు. ఇంతేగాదు పెద్దపెద్ద పీఠాధిపతులుసహా అనేకులు వచ్చి వెళ్ళేరు. శ్రీ శివగంగస్వామివారు, కామకోటిస్వామివారు వచ్చివెళ్ళి ఎక్కువకాలం గాలేదు. అప్పుడుగూడా ఇంతహడావుడీ స్వాగతాలు జరిగినట్లు తోచదు. అప్పుడు లేని గురుభక్తి ఇప్పు డెక్కడనుంచి వూడిపడ్డది? మరోమాట. వెనుక జగద్గురువులను ధర్మాభిమాను లేకొద్దిమందో గౌరవించారు. ప్రస్తుతం మళయాళంవారిని గౌరవిస్తున్నవారిలో దేవుడు, దైవం, శాస్త్రం, గురువు మతం-అనేమాట వింటేనే భగ్గుమని మండి భస్మమయ్యే రకంవారు చాలామంది వున్నారు. బ్రహ్మనుకూడా లక్ష్యపెట్టని ఇలాంటిసుమాను భావు లంతాకూడా ఈయన్ను బ్రహ్మరథం పడుతున్నారంటే దీనికి హేతు వేమిటి? మతాభిమానమా? వేదాంతజిజ్ఞాసా? గురుభక్తా? ఇంకేదన్నా కిటు కుందా? లేకేమి? ఉంది. వినండి. ఈయ న్నింతగా గౌరవించడానికి హేతువు మతాభిమానం కాదు, గురుభక్తి కాదు, జిజ్ఞాసా కాదు. కారణాలు వేరే వున్నై. చెప్తే కొందరకు కోపంవస్తుంది. ఐనా అందుకు తలఒగ్గే కలం చేతబట్టినందువల్ల నాకు భయంలేదు. తెలిసింది చెప్పక తప్పదు. ఈయనను కేవలం సన్యాసి అనిగాని, వక్తృత్వాన్ని చూచిగాని, పాండిత్యాన్ని చూచి గాని గౌరవించడం లేదు. ఇకనేమంటే ఇందుకు కారణాలు మూడు. ఈయన సన్యాసిగా వుంటూగూడా సనాతనం గొడవలో పడకుండా వుండట మొకటి. వర్ణాశ్రమధర్మాలను ఏలా తల్లక్రిందు చేస్తామన్నా అందు కేమాత్రం అడ్డం చెప్పే స్వభావం కాకపోవటం ఒకటి. ముఖ్యంగా ఈయన సన్యాసం సనాతనసన్యాసం వలె వేదశాస్త్రాలకు కట్టుబడింది

కాకపోవడం వకటి. ఇవీ పరమ నాస్తికగణంలో కూడా ఈయనకు గౌరవాన్ని కలిగించడానికి కారణాలు. అసలీయన బ్రాహ్మణుడు (జన్మతః) కాదని చాలామంది అనుకుంటూ వుండగా విన్నా. ఇదికూడా ఒకకారణం కావచ్చనుకుంటా ఈగౌరవానికి. వర్ణాశ్రమధర్మాలూ, నిత్యనైమిత్తిక కర్మలూ, ఈరకంమాటలు చెవిని వేయకుండా ఎంత వేదాంతం చెప్పినా ఈకాలంవారికి వినటానికట్టే అభ్యంతరం వుండదు. శ్రీవారివేదాంతోపన్యాసాలలో అలాంటి పిచ్చిమాట లేవీ సామాన్యంగా వుండవు. ఇక అధునాతను లంతా ఈయనకు బ్రాహ్మరథం పడుతున్నారంటే అంతగా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు.

---

## 15. ఆబాలగోపవిదితమైనను బ్రాహ్మణ్యము అష్టాదశమహాపాపమెట్లు తెలియును ?

[‘కల్పవల్లి’ పత్రికలో ‘1-8-41’ 20 సం. వయస్సున ముద్రాపితము]

నే డేపట్టణంలో చూచినా సామాన్యంగా వీధుల్లో కొంచెం శ్రోత్రియంగా శిఖాయజ్ఞోపవీతాలూ, విభూతిరేఖలూ ధరించి యెవరైనా బ్రాహ్మణుడు వెళ్ళుతుంటే ప్రతిపిల్లవాడూ, అడుగో బ్రాహ్మడు అడుగో బ్రాహ్మడని వింతమృగాన్ని చూచినట్లు చూడటం, ఓ బ్రాహ్మడా అని వెక్కిరిస్తూ పిలవటం జరుగుతూనే వుంటుంది. కొద్దికాలం క్రిందవరకూ గౌరవంయొక్క అగ్రస్థానా న్నధిష్ఠించి ఉండగలిగినబ్రాహ్మణుడు నిజంగా నే డీలాంటి హేళనకు దుస్థితికి, పాత్రుడౌతున్నాడనేవిషయం, వివేకి ఐన ప్రతివాడికీ కంట తడిపెట్టవలసిన విషయమే; కాని, ఇందులో ఒకవిశేషం వుంది. కొంచెం ఓపికతో వింటే చెపుతా, వినండి.

కాలం బండిచక్రంవలె క్రిందికి పైకి తిరుగుచున్నది. ఆపరిభ్రమణంవల్ల అనేకం విపరీతాలు జరుగుతూ వుంటై. ప్రస్తుతంకూడా ఆలాగే కాలం తలక్రిందులైంది. చూడిండి- నిత్యంగా యజ్ఞోపవీతం

ధరించవలసిన బ్రాహ్మణులు కొంతమంది మా కెందు కీపీడ అంటూ బుజాలు క్రుంగిపోతున్నట్లు ఉన్న జంధ్యాలు తీసిపారేస్తున్నారు. అసలు యజ్ఞోపవీతాధికారంగానీ, అవసరంగానీ, ఏమాత్రం లేనిశూద్రులేమో మేమేం తక్కువ తిన్నామా అంటూ పట్టుమని పట్టుడేసి జంధ్యాలను తగిలించుకుంటున్నారు. వేదాధ్యయనం అసలు నిత్యంగా జేసితీరవలసినబ్రాహ్మణులు కాల బట్టి నేల రాసేస్తున్నారు. అసలందులో అధికారం లేనివాళ్ళేమో ఉసిచేసి వేదశాస్త్రాలు దిగమింగాలనే ఆశతో చదువుతున్నారు. సంధ్యాదికర్మలూ ఈలాగే వున్నై. ఈలా వుంది కాలవైపరీత్యం ! ♦ ♦ ♦ ♦ ♦

నేటి ప్రజానీకాన్ని రెండు రకాలుగా విభజించవచ్చు. ఒకటి సనాతనపక్షం, రెండోది సంస్కర్తృపక్షం. మొదటిరకంవారు పూర్వపు వర్ణాశ్రమభేదాలు శాశ్వతంగావుండాలని కోర్తారు; రెండోవారు వర్ణాశ్రమభేదాలు నశించాలని వాదిస్తారు. మొదటి వారే యథాశక్తిగా ఏకొంచెమైనా స్వస్వవిహితధర్మాల ననుష్ఠిస్తుంటారు. రెండోవారి కీధర్మభేదాలే అనిష్టం కావటంవల్ల వా రనుష్ఠించరు. ఒకవేళ ఏకొంచెమైనా అనుష్ఠించినా దానికి సబబు లేదు. మరోమాట. ఒక వ్యక్తి తన దీవర్ణము అని ధ్రువపరచుకోవాలి అంటే ఆవ్యక్తి మొదటి కక్ష్యకు చేరే వుండాలి. రెండోకక్ష్యవారి కాలా పోట్లాడటాని కధికారం లేదు. ఏమంటారా? అసలె వర్ణాలు లేవు, ఆశ్రమాలు లేవు, ఇవన్నీ ఝూటా అని ప్రచారంచేసేవారికి నే నొకవర్ణంవాడినని వాదించడాని కేలా అధికారం వుంటుంది? పర్యవసానంలో ఒక బ్రాహ్మణుడియందు బ్రాహ్మణ్యంగాని, ఒక వైశ్యుని యందు వైశ్యత్వంగాని, ఉన్నట్లు వాదింపదలుస్తే ఆవ్యక్తి సనాతనుడై వుండాలిగాని, రెండోకక్ష్యవాని కాఅధికారం లేదు. ఇది న్యాయసిద్ధం.

ఈమధ్య ఒక «అష్టాదశ మహాపాపి» గారు తమ గ్రంథంలో నేటిసనాతన బ్రాహ్మణులలో బ్రాహ్మణత్వం లేదనీ, వీరు నిజమైన బ్రాహ్మణులు కారనీ వ్రాస్తూ నిజమైన బ్రాహ్మణులంటూ మచ్చుకు

కొందరిపే ర్లుదాహరించాడు. చూచారు. ఆ ఉదాహృతు లందరూ చాలవరకు వర్ణాశ్రమ ధర్మవినాశనబద్ధకంకణులే. వారు నిజానికి తమకు బ్రాహ్మణత్వం కావాలని కోరేవారే కాదు. మీరు బ్రాహ్మలయ్యా? అంటే వారికి సంతోషానికి బదులు, అయ్యో మన కోజాతి నంటకట్టుతున్నాడు ఈ మహాపాపి అని దుఃఖమే పొందేవారు. స్వవర్ణ విహితకర్మల ననుష్ఠించటంగానీ వాటిమీద విశ్వాసంగానీ లేనివారు. చూడండి-ఎంత విపరీతమో!- యథాశక్తి స్వధర్మముల ననుష్ఠిస్తూ వుండి తమ బ్రాహ్మణత్వరక్షణంకోసం యథాశక్తి పాటుబడేవారిని మీ రసలే బ్రాహ్మలు కారనీ, వద్దో కుయ్యో, మొర్రో అనేవారికి బ్రాహ్మణత్వ మంటకట్టా డీచొదరిగారు. ఎంత బాగావుంది?

ఈలాంటి విషమ వాదాలకు సమాధానంగా ఉపయోగించ వచ్చు శ్రోత్రియబ్రాహ్మలను పిల్లలు చేసేహేళన. ఏలాగంటారా! బ్రాహ్మణత్వమనేది యథాశక్తి స్వధర్మాల ననుష్ఠించే శ్రోత్రియ బ్రాహ్మలవద్దనే వుంటుందనే విషయం ఏమీ తెలియని పిల్లలకుగూడ తెలుసునే? శ్రోత్రియబ్రాహ్మణ్ణి చూచిగాని బ్రాహ్మడా అని కేక వేయటం లేదే? నాటకాల్లో సినిమాల్లోకూడా బ్రాహ్మణవేష మట్లుం టేనేగాని జనసామాన్యానికి నచ్చదే? ఇంతమాత్రం తెలేదా యీనకు బ్రాహ్మణు డెవరో! ఏమంటారు? ♦ ♦

## 16. రవ్వలు.

### నిర్గుణ సగుణ భగవత్స్వరూపములు ప్రతిపక్షులకు గూడ తప్పవు.

["కల్పవల్లి" పత్రికలో 1-3-41 19 సం. వయస్సున ముద్రితము.]

భగవంతుడు విజ్ఞానస్వరూపి, సర్వవ్యాపి, ఆత్మస్వరూపి, ఇదే వైదికమతసిద్ధాంతపరాకాష్ఠ. ఈలా వుండగా నేడు విజ్ఞాననిధు లని పించుకొంటున్న మహామహులునహా ఏమని వ్రాస్తున్నారో చూచారూ? భగవంతు డసలే లేడట. ఒకవేళ వున్నా, తమ మనస్సుల్లో

అతనికి స్థానం లేదట. ఆహా! ఎంత బాగా వుంది! ఈమాటల కర్థ మేమిటి? విజ్ఞానస్వరూపి ఐనభగవంతుడికి తమమనస్సుల్లో స్థానం లేదంటే మేము విజ్ఞానవిహీనులం అని నోరార చెప్పకోట మేనా? కాదా? ఇక ఆత్మస్వరూపి ఐనభగవంతుడి నసలే లేడంటే, నేను లేనని దబాయించడ మేనా? మరేమన్నా నా? నాకు నాలుక లేదని పోట్లా డినవిధంగా వుం దిది. ఈలాంటి అసందర్భపు మాటలకు పత్రికల్లో అగ్రస్థానాలిస్తున్నారు. ఇదెంతబాగా వుందో చూడండి. పాపం, ఇంత గడ్డి కరిచినా వారిమతం నెగ్గిందా? ఊహూ-తమరే జ్ఞానశూన్యులైతే పత్రికల్లో ఈ విధంగా పేజీ లెల్లా నింపగల్గుతారు? వాక్కుకు పూర్వ రూపం జ్ఞానమే సుమా. ఇక నేను లేనంటే ఎవరైనా విన్నా నవ్వి పోతారు. పోనియ్యండి ఈవేదాంతం పాఠకులకూ వారి కూడా రుచిం పక పోవచ్చు. సగుణభగవద్విషయాన్నే చూడండి. ఇప్పటికీ తిరుపతి వేంకటేశ్వరస్వామి ముచ్చటలో కొట్టి మొక్కులు వసూలు చేస్తునే ఉన్నాడు. బ్రహ్మసామాజికుడు (కలియుగ) బ్రహ్మర్షిగారి స్నేహి తుడూ ఐన పిఠాపురం వారికిసైతం ఒకసారి తిరుపతి చెల్లుబడి తప్పక పోయిందని పుకా రుంది. ఏదో గప్ చిప్‌గా సరిపుచ్చారట లెండి. ఐతే ఏం, తప్పలేదుగదా? మహామహులకుసహా తప్పని దేవుడు వీరికి తప్పు తాడా? నేనే దేవుణ్ణన్న హిరణ్యకశిపుడు సహా చివర కంగీకరింప వలసి వచ్చింది. అంతకన్నా గొప్పవారా వీరు? కాదా అని కోపిస్తా రేమో? ఒక వేళ ఐనా తప్పదు అంగీకరించటం. ఒకమాట, దేవుణ్నే ఎగరకొడితే మనకు పాపభయం, నరకభీతి తప్పతుందని ఆశ ఏమైనా వుందేమోకాని అది సాగదు. పైగా ఇదో పాపం.

ఈ శ్లోకం అర్థంచేసుకొని, ఇలాంటి పిచ్చివ్రాతలు వ్రాసేవారు తమవ్రాత లుపసంహరించుకోవాలి అని నాకోరిక.

"సందిగ్ధేపి పరే లోకే కర్తవ్యః ధర్మ ఏవహి
నాస్తిచే న్నాస్తి నో హాని రస్తిచే న్నాస్తికో హతః"

దేవుడు, పరలోకములు సందిగ్ధములుగ నున్నను. ధర్మమా ర్గమే యనుసరింపదగినది. కారణ మేమన, మరణానంతరము దేవుడు,

పరలోకములు లేనిచో ఆస్తికున కపుడు నష్టి లేదు. కాని యవి నిజములైయున్నచోనిచట స్వేచ్ఛాచారి యైననాస్తికునకచట మహాఘోర నరకబాధలచే నిహతి తప్పదు-కావున కేవల మైహికమాత్రదృక్కులగునర్థకామపరిధానులుగూడ ధర్మమార్గమునే యనుసరించవలెను-ఇట్లనుసరించి సర్వులు శ్రేయము నందుదురుగాత!

> స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం । న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
> గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం । లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.

ఓమ్-తత్-సత్

శ్రీ

నవ (౯ ఖండ మండితమై, అశీతిద్వయ 82) వ్యాసభాసురమై, ప్రవృత్తి నివృత్త్యాత్మకధర్మరహస్యప్రకాశకమై, నిఖిలాభ్యుదయనిశ్శ్రేయసనిదానమై, వేదకల్పమై, శ్రీశంకరజగద్గుర్వాశీర్వాదమాత్రప్రవృత్త శ్రీమదోంకారభారతీనిలయ

ప్రథమభూమికాత్మకమగు

## శ్రీజయరామవిద్యావిలాస

## స్వరూపస్వభావాదిసంగ్రహవృత్తము.

ఏతద్గ్రంథనామముతో శ్రీజయరామస్మారకముగ చతుర్వేదవేదాంగస్మృతీతిహాసపురాణధర్మశాస్త్రశాంకరవిద్యారణ్యభాష్యాదిగ్రంథజాతము నెల్ల శ్రీమదోంకారమందిరమున సాక్షాద్వేదపురుషాత్మక సద్గురుస్వరూప తత్తద్వేదాంగాదిప్రణేతృదివ్యపురుషోపాధిభావనాపూర్వకతత్తత్పూజాపఠనరూపకార్యక్రమము శ్రీజయరామవిద్యావిలాసనామక అకారభూమిక యనియు,

శ్రీశాంకరవేదాంతప్రస్థానత్రయభాష్యగంభీరమహార్ణవగతైకైకసంశయనివారకవివిధసమాధిప్రదసిద్ధాంతమహావాక్యనవరత్నధారణపూర్వకముగ శ్రీశాంకరపంచాయతనమువలె స్వాంతేవాసిచతుష్టయమునకు శ్రీమజ్జగద్గురుశృంగగిరిశాంకరపీఠాధీశ్వరానుజ్ఞానుసారము స్వస్వధర్మానుష్ఠానానుష్ఠాపనపురస్సరముగ నిరంతరసద్గురుప్రచాల్యమానసాంప్రదాయికప్రస్థానత్రయభాష్యపాఠప్రవచనాత్మకకార్యక్రమము శ్రీమద్భగవత్పాదపదవాక్యవిలాసనామక ఉకారభూమిక యనియు,

శ్రోత్రియవైదికస్మార్తసాంప్రదాయికపరమహంసచాతుర్మాస్యదీక్షావందనాది సాక్షాత్సద్గురుసేవారూపకార్యక్రమము పరమహంసమానసవిలాసనామక మకారభూమిక యనియు—

ఏతద్భూమికాత్రియసంసేవనముచే విశిష్టబ్రాహ్మణజన్మసాఫల్యము ఘటించుననుసద్భావముతో శ్రీమదోంకారమందిరమున బ్రాహ్మణగురుకులాశ్రమోత్తమాంగస్థానీయముగ నిరుక్తభూమికాత్రయాత్మక శ్రీమదోంకారభారతీనిలయము స్థాపితమైనది.

ఇందు సహజోదారస్వభావముతో (1) శ్రీ లంకా వేంకటనారాయణశర్మగారు 27–7–1942 మొదలు శ్రీజయరామస్థితికాలముననే పరమహంసచాతుర్మాస్యసపర్యలకు రు. 5,500 లును, అధ్యాత్మశాస్త్రప్రవచనమునకు రు. 10,000 లును, సమర్పించియుండిరి. శ్రీజయరామనిర్యాణానంతరము 16–5–1945 శ్రీజయరామస్మారకనిరుక్తప్రథమభూమికాలంకృతముగ శ్రీమదోంకారభారతీనిలయమును సర్వులు నిర్ణయించగా తద్ద్వితీయభూమికార్థమై (2) శ్రీ వినపాముల సీతారామశర్మగారు, (3) శ్రీ పులుపుల సత్యనారాయణశర్మగారు ఒక్కొక్కరు పదివేలరూప్యముల ధనవాగ్దాన మొనర్చి తదాదాయము వార్షికముగ నర్పించుచుండిరి.

ప్రథమభూమికకు శ్రీజయరామవిద్యావిలాసగ్రంథముద్రణపర్యాప్తధనమును (4) శ్రీ చందా కాంతయ్యశ్రేష్ఠిగా రొసంగుటేగాక శ్రీమదోంకారమందిరమున శ్రీజయరామవైజ్ఞానికజీవితాదర్శముగ నడిచెడియాధ్యాత్మికకార్యక్రమములకు వరంగల్లులోని స్వసంస్థాపితాంధ్రాభ్యుదయసమితిమూలధనాత్మిక మగు ఫ్యాక్టరినికరాదాయమునుండి రూప్యమున $\frac{1}{32}$ అంశధనమును ప్రతివత్సరము పంపుచుందుమని శ్రీకాశీవిద్వత్పరిషత్తులో సహజోదారస్వభావముతో నయాచితవాగ్దాన మొనర్చిరి. అవశిష్టకార్యక్రమ మంతయు నేతద్గ్రంథసారజ్ఞభక్తజనాయత్తమై యున్నది.

ఇదియే శ్రీమదోంకారభారతీనిలయప్రథమభూమికాసంగ్రహవృత్తము.

—ప్రకాశకుడు.



# శ్రీ జయరామవిద్యావిలాసములోని తప్పొప్పులపట్టిక.

| పేజీ-పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 2-3 | పత్రపై | పత్రముపై |
| 2-22 | సుతారిం | సురారిం |
| 3-13 | భర్త్రార్తి | భక్తార్తి |
| 6-5 | యతార్థ | యథార్థ |
| 7-3 | జల్మనా | జన్మనా |
| 7-11 | ర్కృతోస్త | కృతోత్త |
| 7-17 | ఘూ॥తే | ఘూపితే |
| 7-21 | భస్త | భక్త |
| 8-15 | నిరవ | నిరత |
| 11-4 | జగతాసి | జగతామసి |
| 14-12 | పముస్థిత | ముపస్థిత |
| 15-1 | దస్య | దరస్య |
| 15-23 | దుత్పనస్తః | దుత్పతన్తః |
| 16-10 | విజగీషు | విజిగీషు |
| 16-13 | కీర్న్ద్రోపై | క్రిశ్రేష్ఠో |
| 16-15 | కృత్యం | కృత్యం |
| 16-23 | గాగ్ర | శాగ్ర |
| 18-16 | ప్రవితి | ప్రవిశతి |
| 19-7 | నీడేవత | నీడేతవ |
| 20-3 | సపరిహాం | సపరిహాసం |
| 20-20 | బృ | బ్ర |
| 22-6 | యిష్టే | ఝష్టే |
| 21-1 | మాంమాంమ్నా | మామ్నా |
| 24-20 | [illegible] | దయ్యై |
| 25-19 | మచిత్త | మచ్చిత్త |
| 26-1 | త్రిథమా | ప్రథమా |
| 27-2 | శితి | క్షితి |
| 30-4 | శాత్రి | శాస్త్రి |
| 30-13 | క్రమః | క్రమశః |
| 50-15 | స్వకక్తౌ | స్వశక్తౌ |
| 31-4 | అకష్టి | ఆకష్టి |
| 32-16 | అష్టా | అష్టావ |
| 39-5 | గ్రహం | గ్రహణా |
| 39-9 | భాయా | భియా |

| పేజీ-పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 40-16 | హేవం | ఏవం |
| 60-2 | రార్గచర్యా | రాశ్చర్యా |
| 70-5 | తరమూ? | తరమాం? |
| 73-15 | ధర్మ | ధర్మి |
| 75-16 | ధర్మ | ధర్మి |
| 76-18 | విహిత | విదిత |
| 83-21 | "దుందుభి" ...వయస్సులో | నెరిరెండ్లైలులో నసమగ్రముగ |
| 91-12 | తజ్ఞాత | తజ్జాత |
| 91-16 | స్సర్వం | న్సర్వం |
| 91-17 | మనువు | స్మార్తపద్ధతిలో మనువు |
| 94-14 | ఊనప | ఊపన |
| 98-18 | డయు | డనియు |
| 93-23 | యోచా | యశ్చా |
| 99-7 | మత | మంత్ర |
| 100-4 | అభి | ఆభి |
| 100-15 | పితృవ | పితృస |
| 101-3 | నోమాఖ్యా | నుముఖ్యా |
| 101-11 | వేదాం | వేదాంగ |
| 101-21 | యాన | యానల |
| 101-24 | పరిమా | పరిసమా |
| 104-1 | పత్యపర్థంత్రి | పత్త్యర్థంత్రి |
| 104-25 | బ్రిహ్మ | బ్రాహ్మ |
| 105-2 | పత్తవ్య | పత్త్య |
| 106-12 | ర్యంక | ర్యకం |
| 107-3 | స్నాన | సన్న |
| 107-15 | వద్ధి | వృద్ధి |
| 108-16 | ముర్ష్లలో | ములో |
| 109-28 | ద్రాన్యవ | ద్యాన్రవ |
| 110-14 | గాస్త్రోక్త | శాస్త్రోక్త |
| 110-14 | సనిరి | నిసరి |
| 111-4 | సకలసా | సకలసంసా |
| 112-1 | ఇంతర | ఇంతే |

